# "తొలి గా"

"నిరంతర జాగరణే స్వాతంత్ర్యానికి రక్ష'' అని అంటారు. దీనికి నిదర్శనంగా గడచిన రెండేళ్ళ భారత చరిత్ర ప్రపంచ చరిత్రలో నిలిచిపోతుంది.

ప్రజాస్వామ్య విధానాన్నే ఆయుధంగా ఉపయోగించుకొని, ప్రజాస్వామ్య వ్యవస్థను హత్య చేయడానికి ప్రయత్నించాడు జర్మన్ నియంత హిట్లరు. అతని అడుగుజాడల్లో ఇందిరాగాంధీ ప్రారంభించిన ఎత్తుగడలను భారతప్రజ ఎదిరించింది. అదీ అహింసాత్మకంగా ఎదిరించి, చరిత్ర పునరావృతం కావడానికి వీలులేనంత గొప్పగా వమ్ము చేసింది. ప్రపంచ ప్రజాస్వామ్యాలకే కాక, ఇనుప తెరల మరుగున, నియంతల ఉక్కు పాదాలక్రింద నలుగుతూ, మూల్గుతూ, నిరాశతో అలమటిస్తున్న జాతులకు కూడా ఒక దివ్యమైన హెచ్చరికను, వ్యూహాన్ని ఈ ప్రజా పోరాటం కానుకగా ఇచ్చింది. అహింసాయుత పోరాటానికి ఈ గత రెండేళ్ళ చరిత్ర ఒక క్రొత్త అధ్యాయాన్ని, ఒక క్రొత్త మలుపునూ కూడా ఇచ్చింది.

ఈ పోరాటపు చరిత్రను - దీని తీరు తెన్నులను గురించి పరిశీలించే టప్పుడు కొన్ని వాస్తవాలను స్మరించుకోవాలి.

''కొద్దిమంది మనవాళ్ళు ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకున్నంత మాత్రాన స్వరాజ్యం లభించినట్లు కాదు. అధికార దుర్వినియోగం జరిగినప్పుడు ఎదిరించగల శక్తి సామర్థ్యాలను ప్రజలందరూ పొందగలిగి నప్పుడే అసలైన స్వరాజ్యం లభించినట్లు'' అని గాంధీజీ అన్నారు.

ఈ చైతన్యాన్ని కలుగచేయడానికి సాగిన ప్రయత్నం పూర్తిగా ఏనాడూ వెలుగులోకి రాకపోవచ్చు. కాని "ప్రజా చైతన్యం" అనేది ప్రజా స్వామ్యంలో అవసరమైన - చాలా ప్రధానమైన - భాగం కనుక రానున్న తరాలకు స్మరణికగా సాధ్యమైనంత మేరకు అందీయడం అవసరం.

అత్యవసర పరిస్థితిలో నిండిన జైళ్ళ జీవితాలు -

దాదాపు ఆ రెండేళ్ళు ప్రవహించిన రక్తమూ, కన్నీళ్ళూ -

ఆ రెండేళ్ళు మూగవోయిన గళాల గాథలూ -

ఆరిపోయిన కలాల తాపాలు -

అన్నీ ఒకేరకం అనుభూతిని దేశానికి కల్గింప చేశాయి. అంతే కాదు. ప్రజాస్వామ్య వ్యవస్థలో క్రియాశీల పౌరుల నిర్మాణానికి గల ప్రాముఖ్యాన్ని గుర్తింప చేయడమే కాక - ఈ వ్యవస్థలో తటస్థపడే దోషాలను ఎత్తి చూపాయి. వాటిని నివారించడానికి - పొడచూపితే నిర్మూలించడానికి - అవసరమైన, అనుసరించ తగిన హంగులను గుర్తింప చేశాయి.

అందుకే నవభారతానికి "అత్యయికస్థితి విధింపు - తొలగింపు" మరో స్వాతంత్ర్య ఉద్యమంగా - ప్రజాస్వామ్య ప్రతిష్ఠకు విజయ పర్వంగా మేధావులు శ్లాఘిస్తున్నారు.

అయితే ఈ 'మలుపు' కు ఇందిరా గాంధీలో కేవలం ఈ గడచిన రెండేళ్ళ క్రితమే పుట్టుకువచ్చిన అధికార దాహ మొక్కటే కారణమా ?

మాతృ సహజంగా అనండి, నెహ్రూ కుటుంబ వారసత్వంగా అనండి - తన తరువాత తన కుమారుడు సంజయ్ గాంధీని ఈ దేశానికి ప్రధానిగా తీర్చిదిద్దే ప్రయత్నం కారణమా ?

1947 లో స్వరాజ్యం లభించిన దర్మిలా క్రమంగా చీలిపోయి, ప్రజల వ్యతిరేకాన్ని ఎదుర్కొంటూ వచ్చిన సి. పి. ఐ., కాంగ్రెసులోకి పరకాయ ప్రవేశం చేసి తన విధానాలను సాధింప చూచుకోడంతో వచ్చిన మార్పుల విష ఫలితాలు కారణమా ?

కాంగ్రెసు గొడుగు నీడన గుమికూడిన ఉదర జీవులు-నెహ్రూ కుటుంబాన్ని దిష్టిబొమ్మలుగా చేసుకొని, దేశాన్ని కొల్లగొడుతూ వచ్చిన కారణంగా ప్రజలలో పేరుకున్న అగ్ని పర్వతం ఈ విధంగా బ్రద్దలు కావడం కారణమా ?

కారణాలు ఏవైనా, ఈ నియంతృత్వపు పోకడలను ఎదిరించ డానికి నడచిన ప్రయత్నంలో ఎవరు పాత్రధారులు ? ఎవరెన్ని సమి ధలు ఈ ప్రజాస్వామ్య పరిరక్షణకై సాగిన యజ్ఞంలో వ్రేల్చారు ? ఇవి సమాధానాలను కోరే ప్రశ్నలు.

1971 లో జరిగిన ఎన్నికల తరువాత ఇందిరా గాంధీకి పార్ల మెంటులో పూర్తి మెజారిటీ లభించింది. కాంగ్రెసులో ఆమెకు విరోధం లేని విధేయత లభించింది. తన పూర్వుల కీర్తి గంధం లభించింది. భారత సైన్యం, ప్రజలు, తన నిశ్చయమూ సాధించిన 'బంగ్లా విజయ' కీర్తి కిరీటం లభించింది. ఆంగ్లేయులు దిద్దిపెట్టిన పరవడిలో, ప్రభు త్వంలోఉన్న వ్యక్తులనే అంటిపెట్టుకొని బ్రతికే మన స్తత్వాన్ని పెంచు కున్న ఉద్యోగుల యంత్రాంగం ఉన్నది. సామ్రాజ్యవాదుల ప్రభుతను కాపాడి ఉంచడానికి తర్ఫీదు పొందిన-మధ్యయుగపు మన స్తత్వంగల - పోలీసు బలగం ఉన్నది. చదువులేక, ఎదుగులేక, చలించని కొండ చిలువలా పడిఉన్న పేద ప్రజల ఉదాసీన వైఖరి ఉన్నది. ఇవన్నీ ఆమెకు అనుకూలాలే.

ఈ పునాదుల మీద, 'వ్యక్తిపూజ' కు అలవడ్డ - ''ఇందిరాయే ఇండియా - ఇండియాయే ఇందిర'' అన్న - నాటి కాంగ్రెసు

అధ్యక్షుడు - బారువా లాంటి వందిమాగధుల బృందం ఉన్నది. దాన్ని చెవులలోకి ధారాపాతంగా పోయడానికి 'ఆలిండియా రేడియో', టెలివిజన్, ప్రభుత్వ సమాచార, ప్రచార విభాగాలు ఉన్నవి. తమకోసం మాత్రమే బ్రతికే జనాన్ని కొనడానికి - ప్రజలను పిండి ప్రోగుచేసిన ధనం ఉన్నది. మిగతా కావలసిన వనరులన్నీ ఉన్నవి.

అలా సమస్త శక్తులను, బలాలను, బలగాలను గుప్పిట పెట్టుకొని, తన వ్యక్తిత్వం చుట్టూ ఈగలు - దోమలూ చొరరాని దుర్గాన్ని కట్టుకున్న ఇందిరను - ఆమె తనకై ప్రత్యేకంగా రూపించుకున్న 'రిసెర్చి అండ్ అనాలిసిస్ వింగ్' మొదలగు రహస్యచార సంస్థలని - ఆమెకు జోహుకుంలు, బరాబరులు తీర్చి పై కెగబ్రాకగల మనుకున్న పోలీసు వలయాన్ని - ఇంటిదొంగ సి. పి. ఐ. ని - ఆత్మ నమ్మకుని సంస్థనూ, ఆదర్శాన్ని మరచి వ్యక్తి ఆరాధనకు దిగిన క్రింది తరగతి నాయకులను - మేధావులుగా చెలామణీ అవుతూ వచ్చిన కొందరు వందిమాగధులను - ఏకంగా ఎదిరించి, ప్రజలను సమీకరించడానికి - అలా సమీకరించిన ప్రజలను ఉద్యమింప చేయడానికి - ఆ ఉద్యమించిన ప్రజల కొక వ్యూహాన్ని ఆలోచించి - ఇచ్చి - దాన్ని చివరి మనిషిదాకా ఆచరించేట్లు చేయడానికి సాగిన ఈ పోరాటం - నిజంగానే అద్వితీయమైనది. ఈ చరిత్రను దాని వెనుక మసలిన శక్తులను, తత్వాలను, వాటి విధానాలను, అవి సాధించిన విజయాలను వాస్తవంగా ప్రజలు గ్రహించని పక్షంలో - చరిత్రను గ్రహించే అవకాశాన్ని కోల్పోయిన వాళ్ళవుతారు - భవిష్యత్తును గురించి అలవరచుకోవలసిన అవగాహనను తిరస్కరించిన వారవుతారు.

అందుకే ఉద్యమ చరిత్ర రూపంలో ఈ పుస్తకంలో ఎన్నో విషయాల మౌలిక చర్చకూడా వచ్చింది. దాని అవగాహన భవిష్యత్తు

కొరకు ఆశను - ధైర్యాన్ని ఇవ్వడంలో కొంతైనా తోడ్పడితే - ఈ రచనకు జరిగిన కృషి సార్థకం అవుతుంది.

పుస్తకానికి సామాగ్రి చేగూర్చడంలో నాకు సహకరించిన పెద్దలు మిత్రులు ఎందరో ఉన్నారు. ఢిల్లీ వెళ్ళి శ్రీయుతులు మాధవ రావ్ మూలే (ఆర్. యస్. యస్. ప్రధాన కార్యదర్శి), బాపూరావ్ మోఘే, జగన్నాథరావ్ జోషీ (జనతా నాయకులు), దత్తోపంత్ ఠేంగ్డీ (భారతీయ మజ్దూరుసంఘ నాయకులు) మరి కొందరిని కలిసే అవకాశం లభింప చేశారు - ఆర్. యస్. యస్. ప్రాంత ప్రచారకులు శ్రీ సోమయ్యగారు. వారు స్వయంగా సుదీర్ఘంగా ముచ్చటించారు.

శ్రీ తేన్నేటి విశ్వనాథం, శ్రీ బి. సత్యనారాయణరెడ్డి, శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు తమ భావాలు తెలిపి నాకు సహకరించారు. హైదరాబాదు వచ్చినపుడు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి సమయమిచ్చి విలువైన సామాగ్రిని ఇచ్చారు. ఆర్. యస్. యస్. కేంద్ర కార్యాచరణ దళంలో సభ్యులు - అఖిల భారత సహాయ కార్యదర్శి భావురావ్ దేవరస్ హైదరాబాదులో సుదీర్ఘంగా సమయమిచ్చారు. వీరందరూ అజ్ఞాత నాయకులు. ఉద్యమ కర్ణధారులు.

చిత్తూరు జిల్లా సంఘ కార్యదర్శి శ్రీ దొమ్మిరాజు రామకృష్ణరాజు, శ్రీ వెలగపూడి కృష్ణారావు ఎంతో సమయమిచ్చి, చిత్తును సరిచూచి వ్రాసి, వ్రాయించి, సలహాలిచ్చి - వ్రాతప్రతిని అచ్చుకు సిద్ధం చేయించారు.

ఎందరో మహానుభావులు వా రందరికి వందనాలు.

హిందీ వారపత్రిక పాంచజన్య, మాస పత్రిక జాహ్నవి, న్యూయార్క్‌లో ప్రచురింప బడుతూండిన సత్యవాణి (ఆంగ్ల పత్రిక)

ఇంకా ఎన్నో పుస్తకాలు - విషయ సేకరణకు ఉపయోగ పడ్డాయి. వాటి ప్రచురణ కర్తలకు - గ్రంథ కర్తలకు నమస్సులు.

'75 జులై 5వ తేదీనుండి, '77 మార్చి 22 దాకా వరంగల్ జైల్లోనే నేను ఉండడాన, ప్రత్యక్షంగా బైట జరిగిన అజ్ఞాత ఉద్యమం నాకు పఠనీయమైంది. మననీయమైంది. అందుచేత తేదీలలో, ఘటనల వరుస క్రమంలో కొద్దిగా అటో ఇటో అయిఉండవచ్చు. విషయం తెలిసినదే కనుక ఇది అంత బాధకం కాదనుకుంటాను.

గ్రంథంలో పూజ్యులు, మహానుభావులు - అనేకులను పేర్కొన్నాను. వారి పేర్లకు ముందు 'శ్రీ' చేర్చలేదు. పెద్దలు పరమేశ్వర రూపులు. వారు సహజంగా 'శ్రీ' మంతులు. కనుక వారి పేర్లతో 'శ్రీ' ని చేర్చి పాఠకులు చదువుకుంటారని నాకు నమ్మకమే.

'నవభారతి' వారు నాకీపని - అవకాశం అనండి - ఇచ్చినందుకు ధన్యవాదా లివ్వాలి. ఈ కృషికి తోడ్పడ్డ మిగతా మిత్రు లందరికీ నమస్సులు.

మీ

స దా శి వ రా వు.

# వరుసగా

# అ ను బ ం ధ ం



అజ్ఞాత ఉద్యమ రథసారథి
మాధవరావ్‌జీ మూలే
ఆర్. ఎస్. ఎస్. ప్రధాన కార్యదర్శి



ఉద్యమ స్ఫూర్తిదాత
లోక్‌నాయక్
జయప్రకాశ్ నారాయణ్

ఢిల్లీ రామలీలా మైదానంలో జనత నుద్దేశించి ప్రసంగిస్తున్న జె. పి.





అధ్యక్షులు మురార్జీ దేశాయ్



ఆంధ్రప్రాంత అధ్యక్షులు
తెన్నేటి విశ్వనాథం

లోక సంఘర్ష సమితి నాయకులు

ప్రధాన కార్యదర్శి
నానాజీ దేశముఖ్



నానాజీ అరెస్టు పిదప కార్యదర్శి
రవీంద్రవర్మ





విదేశాలలో ఉద్యమ నిర్వాహకులు
ప్రొ॥ సుబ్రహ్మణ్యస్వామి



అమెరికాలో ఉద్యమ కార్యకర్త
డా॥ మనోహర్ సిందే

## విదేశాలలో

ఉద్యమానికి సమర్థనగా విదేశాలలో వెలువడిన కొన్ని పత్రికలు





సత్యాగ్రహంచేస్తే అత్యాచారానికి
గురిచేయబడిన
అల్లాయి తాలూకా మహిళలు



బళ్ళారి జైలులో దమనకాండకు
గురైన వి. వి. యస్. జట్
నేటికీ అంగవికలుడె



గోదావరిఖనికి చెందిన
ఆంజనేయులు వీపును
క్రొవ్వొత్తులతో కాల్చారు



అజ్ఞాత ఉద్యమ ప్రముఖులు
బాపూరావ్‌జీ మోఘే

---

ఆంధ్ర ప్రాంత అజ్ఞాత ఉద్యమ నిర్వాహకులు

సోంపల్లి సోమయ్య



గోపాలరావ్ ఠాకూర్



# 1

# వేకువలో

'వ్యక్తి ఎంత గొప్పవాడైనా
జాతికంటె గొప్పకాదు.'

"దేశం రెండుగా చీలినా - భారత జాతీయ కాంగ్రెసు సూచించిన విధంగా - రాజకీయ స్వపరిపాలన లభించింది. కనుక ఇప్పటిలా - ఈ రూపంలో - ఈ ధోరణితో - ప్రచార సాధనంగాను, వైధానిక యంత్రాంగం (Parliamentary Machinary) గాను కాంగ్రెసు జీవించి ఉండడం అనవసరం. పట్టణాలకు దూరాన, ఏడు లక్షల పల్లెల్లో నివసిస్తూన్న భారతీయులకు ఇంకా సాంఘిక, నైతిక, ఆర్థిక స్వాతంత్ర్యం లభించాల్సి ఉన్నది. ప్రజాస్వామ్య పథంలో దేశం సాధిస్తూన్న ప్రగతిమార్గాన, సైనిక శాసనానికి బదులు ప్రజాభిప్రాయానికి ప్రాబల్యం సంపాదించుకోడానికి పోరాటం మరొకటి తప్పక వస్తుంది. ఆ వచ్చే పోరాటాన్ని, రాజకీయ పార్టీలవల్ల - సంప్రదాయ వర్గాలవల్ల రాగల అవాంఛనీయమైన పోటీనుండి తప్పించాలి. ఈ కారణాలవల్ల ఇలాంటివే అనేక కారణాలవల్ల, నేడున్న 'కాంగ్రెసు సంస్థ'ను రద్దుచేసి, ఈ క్రింది నియమాలతో - అవసరమైన మార్పులు చేసుకొనే హక్కులతో "లోక సేవక సంఘ"గా వికసింప చేయాలని ఈ అఖిల భారత కాంగ్రెసు

కమెటీ తీర్మానిస్తున్నది''* అని గాంధీజీ తమ మనస్సులోని భావాన్ని 29-1-48 నాడు వ్రాసి ఉంచారు.

15 ఆగస్టు 1947న దేశానికి స్వపరిపాలన లభించింది. ఆ తరువాత అయిదు మాసాల్లో నడచిన వ్యవహారాలను చూచి గాంధీజీలో బహుశా ఒక సముద్ర మథనం జరిగి ఉంటుంది.

స్వరాజ్యం కొరకు ఎవరి మార్గాన వారుగా ఎందరో కృషిచేశారు. సాయుధ విప్లవాన్ని అనుసరించిన వారు కొందరు. ఆజాద్ హింద్ ఫౌజ్‌ను స్థాపించి, స్వదేశ సైన్యముతో దేశముక్తికి ప్రయత్నించినవారు కొందరు. సమాజ సంఘటనతో సమయానికి ముందురికే జాగృతిని కలిగించిన వారు మరికొందరు. వీరుగాక దేశంలో ఆధ్యాత్మరంగంలో ఒక పెను తుఫానులా వచ్చిన వివేకానంద, దయానంద, తిలక్, అరవిందుల అవగాహనతో కృషిచేసినవారు మరికొందరు. స్వరాజ్య ప్రాప్తికి అన్ని ప్రయత్నాలు ఉపకరించినవే.''

'హిందూ జాతికి స్వరాజ్యం కొరకు పోరాడడం తప్ప మరో రాజకీయం ఉండదు' అని ఆర్. యస్. యస్. నిర్మాత డా॥ హెడ్గేవార్ అన్నట్లు, ఆనాడు అందరూ స్వరాజ్యం కొరకు ఒకటైనవారే. చట్టబద్ధంగా సాగిన పోరాటానికి కాంగ్రెసు నాయకత్వం వహించింది. కాంగ్రెసు 1920 నుండి గాంధీజీని అనుసరించింది. ఆ నాడు బ్రిటిష్‌వారితో జరుగుతున్న పోరాటంలో రణరంగంలో నిల్చున్న జాతిమనది. యుద్ధభూమిలో ఏక నాయకత్వం అవసరం కనుక, వేర్వేరు సిద్ధాంతాలున్న వారైనా, పోరాటం నిరాయుధంగా, సహాయ నిరాకరణతో జరగాలని కోరిన వారందరూ గాంధీజీ నాయకత్వాన్ని ఆమోదించి కాంగ్రెసులో చేరి పనిచేశారు.

---

*ఇండియా ఆఫ్ మై డ్రీమ్స్ - 290వ పేజి.

కానీ పదవీ రాజకీయాలు మనస్సులను కల్మషంచేయ నారంభించ గానే కేవలం కాంగ్రెస్సే స్వరాజ్యం తెచ్చిందనీ, మిగతా ప్రయత్నాలు - సాంఘిక ధార్మిక పునర్జాగరణ విప్లవ కార్యక్రమాల వల్ల - స్వరాజ్యసాధనకు దోహదం జరగలేదని - ఒక తప్పుడు అవగాహనను స్వార్థం కొరకు ఇస్తూవచ్చారు. దీనివలన చరిత్రను సరిగా అర్థంచేసుకొని సాధించవలసిన వికాసానికి, అపార్థాలు కల్పించబడ్డాయి.

స్వరాజ్యం లభించిన తర్వాత - పరిపాలన ఎలా కొనసాగాలి అనే విషయంలో - అనుసరించతగ్గ ఆర్థిక, సాంఘిక, పద్ధతులలో - అందరూ ఏకీభవించాలని ఎక్కడా లేదు. వారివారి విశ్వాసాలు - వారివారి మార్గాలను బట్టి సమాన వేదికలను వేర్వేరుగా నిర్మించుకోవచ్చు. పోరాటకాలంలో కలిసి పనిచేసినవాళ్ళు, ఆ తరువాత తాము సూచించే మార్గమే మంచిదని పట్టుబడుతూపోతే కాంగ్రెసులో చీలికలు రాకతప్పదని గాంధీజీకి తెలుసు. ఈ చీలికలవల్ల కాంగ్రెసులో బలమైన ముఠా అధికారాన్ని చలాయిస్తే మిగతావాళ్ళు మనసు చంపుకొని అక్కడేపడి అయినా ఉండాలి లేదా కాంగ్రెసును విడిచిపెట్టాలి.

అలాంటి పరిసితే గనే, అనేకులు కలసి స్వరాజ్యం కొరకు స్థాపించుకున్న కాంగ్రెసు సంస్థను -ఆ సంస్థద్వారా జరిగిన కృషిని ఏ కొందరో తమ అధికారంకొరకు పిత్రార్జితంలా ఉపయోగించుకోడం జరుగుతుంది. ఇది గాంధీజీకి ఇష్టంలేదు. ఇది నైతికంకాదు. ప్రజాస్వామ్య పదతి అసలే కాదు.

అదీగాక పోరాట కాలంలో ఏకవ్యక్తి నాయకత్వం అవసరమనేది కొంతవరకు సమర్థనీయం కావచ్చు. కాని స్వరాజ్యం వచ్చిన తర్వాతకూడా ఏకవ్యక్తి నాయకత్వం ఉండాలని కోరడం ప్రజాస్వామ్య వ్యతిరేకమే.

సమష్టి నాయకత్వము, అభిప్రాయ విభిన్నత – ఈరెండూ ప్రజాస్వామ్యా నికి జీవ లక్షణాలు.

కాంగ్రెసు రద్దయి ఉంటే దేశ స్వరూపం మరోవిధంగా నేటికే ఏర్పడి ఉండేది. ఒకే వ్యక్తి చెప్పుచేతల్లోకి ఈ సంస్థ చిక్కిపోయిన కారణంగా వచ్చిన ఈ విపరీతాలు వచ్చి ఉండేవికావు. ఆదర్శాలనుబట్టి పార్టీలు ఏర్పడేవి. అందరూ సమాన స్థితిలో ఉండేవారు. పూర్వం అందరూ కలిసి పనిచేసినప్పుడు కాంగ్రెసుకు లభించిన కీర్తిని కొందరు దోచుకోడం, మరి కొందరు – స్వరాజ్యంకొరకు కాంగ్రెసులో పనిచేసినా – ఆ తరువాత వైదొలగిన కారణంగా "స్వరాజ్యాన్ని సాధించిన కాంగ్రెసును వ్యతిరేకించే ద్రోహులు"గా చిత్రీకరింపబడడం జరిగి ఉండేదికాదు. ప్రతి పార్టీ తన ఆదర్శంతో – కార్యప్రణాళికతో ప్రజలలోకి చొచ్చుకొని పోగలిగేది. ప్రజలకు ఎన్నుకునేందుకు ప్రత్యామ్నాయం (alternative) లభించేది. అలా యోగ్యతకు, సామర్థ్యానికి పనికి, నీతికి రాజకీయాలలో చోటు ఏర్పడేది.

స్వపరిపాలన లభించగానే, దేశానికి ప్రధానిగా ఎవరిని ఎన్నుకోవాలి అనే ప్రశ్న వచ్చింది. కాంగ్రెసు పార్టీకి సర్దార్ పటేల్‌ను ప్రధానిగా ఎన్నుకోవాలని ఉన్నా గాంధీజీ పట్టుబట్టి నెహ్రూ ప్రధాని అవడానికి తోడ్పడ్డారు.

ప్రజాస్వామ్యం వేకువలోనే జరిగిన తప్పిదం ఇది.

దీనివల్ల నెహ్రూ గాంధీజీకి రాజకీయ వారసుడైనాడు. కాని వీరిద్దరి మనోభూమికలు వేరు. గాంధీజీ మీద భారతీయ సంస్కృతి ప్రభావం ఉన్నది. అందుకే రాజకీయాలలో నైతిక విలువలకు, ఆధ్యాత్మిక మూల్యాలకు సమానమైన స్థానం ఆయన ఇచ్చాడు. నెహ్రూ పూర్తిగా పాశ్చాత్య

విద్యా సంస్కారాలతో ఎదిగినవ్యక్తి. గాంధీజీ ధర్మ కర్తృత్వ భావనని, అహింసా విధానాన్ని సాధ్య సాధనాలుగా గ్రహించారు. ఆయన జీవన సరళిలో వర్గకలహానికి తావులేదు.

నెహ్రూకు వీటిపట్ల సిద్ధాంత రీత్యా విశ్వాసంలేదు. వీటిని సాయుధులైన భారతీయులు పోరాటం జరుపడానికి గ్రహించిన పరికరాలుగా భావిస్తుండేవాడు.

అందుకే గాంధీజీ స్వప్నాలు ఫలించలేదు. జాతికి నైతిక మార్గాన్ని ప్రసాదించిన గాంధీజీ కంటే ఆయన బ్రతికి ఉండగానే అధికారాన్ని చేబట్టిన కాంగ్రెసుమీద ప్రజలకు మోజు ఎక్కువ అయింది. తన మాటను ఎవరూ వినడంలేదని ఆయన గుర్తించారు. తన కండ్లముందే – నెహ్రూ నాయకత్వాన నడుస్తుండిన కాంగ్రెసు ప్రజాస్వామ్య మూల్యాలకు దూరమవుతూ వచ్చిందనే ఊహ ఏర్పడే–బహుశా–కాంగ్రెసును రద్దు చేయాలని ఆయన తన నిశ్చయాన్ని ప్రకటించి ఉంటారు. కాని ఆయన అనుచరులమని చెప్పుకునేవారే ఆయన సలహాను తృణీకరించి, కాంగ్రెసును ఒక పార్టీగా అధికార ప్రాప్తి కోసం బ్రతికించి ఉంచడానికే నిశ్చయించు కున్నారు.

బ్రిటిష్‌వాళ్ళు పోతూ మనకొక ప్రభుత్వ యంత్రాంగాన్ని ఇచ్చారు. ఆ యంత్రాంగం ప్రజాస్వామ్య వ్యవస్థలోంచి వికసించిందికాదు. జాతి ముందుకు నడుస్తూ, అనుభవాల ద్వారా వికసింపచేసుకున్నది కాదు. నాటి ప్రభువులు – ఈ దేశానికి ఈ ప్రజా జీవన సంస్కృతులకు విరోధులు. వీటిని నిర్మూలించటంలోనే వారికి మేలు ఉండడాన, తమ పాలక యంత్రాంగాన్ని – ఈ ప్రజలను, వీరి జీవన సంస్కృతులను వ్యతిరేకించి, అణచి ఉంచే – ఒక 'టూల్' (పరికరం)గా ఏర్పర్చారు.

ఈ పాలక యంత్రం '**mini imperialist**'ల మనస్తత్వాన్ని పెంచుకున్నది. స్వరాజ్యం రాగానే ఒక్కనాడు వీరి మనస్తత్వం మారదుకదా!

నిహిత స్వార్థాల (vested interests) వల్ల ఈ వర్గం ప్రజలకు దూరంగా, తమ ప్రత్యేక స్వార్థాల కోసం, పైవారికి "జీ" అంటూ, క్రిందివారిని చీదరించుకుంటూ - నేటికీ 'పరాయి యంత్రాంగం'గానే, - ప్రజా సేవకులుగా గాక, నెత్తికెక్కి పరిపాలించే ప్రభువుల్లా - కొనసాగి నందున, ఏ పని చేసినా, ఏ ప్రణాళిక చేబట్టినా, అది ప్రభుత్వంలో ఉన్న రాజకీయ పార్టీకి - ఎన్నికల ప్రచారం కొరకు - ఉపయోగపడటానికే కొనసాగాయి. ఏ కొంచెం అభివృద్ధి అయినా జరిగిందంటే అది రెసిడ్యూ - శేషాంశ - గా జరిగింది.

స్వాతంత్ర్యపు వెలుగుజాడల్లో ప్రజల జీవనంలో సత్యాన్వేషణ కొరకు ప్రయాణించటం కాక-దగా, మోసం, అవినీతి పైకి ప్రాకటానికి అక్కరకువచ్చే గుణాలైనాయి. ప్రజలలో క్రియాశీల పౌరసత్వం, ప్రజా స్వామ్య విలువల పట పటుదలలేదు. జీవనంలో వానిని మలచు కోవటానికి ప్రయత్నమే జరగలేదు.

కాంగ్రెసు - ఒక పార్టీగా - అనుసరించిన ఈ పంథా నచ్చనివాళ్ళు క్రమంగా దూరమగుతూ వచ్చారు. కొందరు వేరే రాజకీయ పార్టీలుగా ఏర్పడినా, కాంగ్రెసులోనే రెండు వర్గాలు ప్రారంభమైనాయి. ఒక వర్గం నెహ్రూ-అతని భావాలతో ఏకీభవించిన వారిది. రెండవది గాంధేయమార్గాన్ని నమ్మిన బాబూ రాజేంద్ర ప్రసాద్, ఆచార్య కృపలాని, మురార్జీ ప్రభృతులది.

పోరాట కాలంలో త్యాగాలు చేసిన మహారథులు నెహ్రూ పంథాను అంగీకరించక పోయినా సంఘర్షణకు దిగక, నెమ్మదిగా తప్పుకోనారంభించారు. కాంగ్రెసులో నెహ్రూ వ్యక్తిత్వానికి దీటైన నాయకులు లేకుండా పోయినారు. డా॥ లోహియా, జయప్రకాశ్‌నారాయణ మొదలగు జాతీయ సమాజవాదులు, బాబూ పురుషోత్తందాస్ టాండన్, కృపలాని వంటి మహా రథులు కాంగ్రెసుకు దూరమై ప్రత్యామ్నాయ మార్గాన్ని, ప్రజాస్వామ్యం

మనుగడకు ఆలోచించ నారంభించారు. ఈ తొలగి పోయిన వారందరూ గాంధీజీ రాజకీయాల్లోకి ప్రవేశింప చేసిన నైతిక విలువల్ని విశ్వసించిన వారు. రాజకీయ చదరంగంలో-విశ్వాసాలను పావులుగా బలిపెట్టి.-పైకి రావడమనేది జీవితంలో ఎరుగని వ్యక్తులు. వ్యక్తిపూజను, ఏక వ్యక్తి నియంతృత్వాన్ని అంగీకరించని ఆదర్శ వాదులు.

ఈ ఆదర్శ వాదులు కాంగ్రెసు నుండి వరుసగా తప్పుకోడంతో క్రమంగా రాజకీయాలను లాభసాటి బేరంగా గుర్తించిన స్వార్థులు, అప్పటి వరకు బ్రిటిషు హయాంలో విదేశీ ప్రభువులను పోషించిన పెట్టుబడిదారులు, ఆంగ్లేయ విద్యావిధానంలో ఎదిగి అప్పటి వరకు స్వదేశీ ఆలోచనల్ని ఈసడించిన మేధావులు కాంగ్రెసును ఆశ్రయించారు. ఈ క్రొత్తరకం జనం దేశంగాని, ప్రజల బాగోగులు గాని ఎన్నడూ పట్టని రకం. 'గాంధీ - నెహ్రూ జిందాబాద్' అనే నినాదంతో తమ స్వార్థాలకు ప్రాకులాడిన వర్గమిది. 'నెహ్రూగారి అండన-కాంగ్రెసు గొడుగు నీడన' పైకిప్రాకిన ఈ వర్గం ఒకవైపు ప్రభుత్వ యంత్రాంగాన్ని క్రిందినుండి ఆక్రమించుకుంటూ వచ్చింది. జాతి ఆకాంక్షలను సాధించే పరికరంగా కాంగ్రెసు సంస్థను నిర్మించాలన్నే ఆకాంక్షగాని, లక్ష్యంగాని లేని వారందరు కాంగ్రెసు వాదులైనారు. కాంగ్రెసును ప్రజల క్రియాశీల సహకారంతో ఉద్యమించే ఒకపార్టీగా రూపొందించే ప్రయత్నం పూర్తిగా పోయింది. కాంగ్రెసు కమిటీలను 'అడహాక్ బ్రతుకు' ఆవేశించింది. పదవికి, అధికారానికి - త్యాగం, సేవ పనికిమాలిన గుణాలై - కులం, ధనం ముఖ్యమైనాయి. పూర్వం కాంగ్రెసు సంపాదించిన ప్రతిష్ఠతో, గాంధీజీ పేరుతో- ఆయన వారసుడైన నెహ్రూ గారిని, ఆయన నాయకత్వాన నడిచే కాంగ్రెసును గెలిపించమంటూ నినాదాలతో కడుపులు నింపే ధోరణి ప్రారంభమైంది. వ్యక్తిత్వం లేని మేధావులతో పాటు, ప్రభుత్వపు అంద

మనకు లేనిదే బ్రతకలేని పాత్రికేయులు, ప్రభుత్వ—ప్రభుత్వేతర ప్రసార సాధనాలను నిర్వహించే సిబ్బంది–దేశంలో జాగరూక జీవనాన్ని కాపాడి ఉంచవలసిన తమ పాత్రను మరచి, నెహ్రూను వ్యక్తిగతంగా కీర్తిస్తూ పైకెత్తి - కాంగ్రెసు కంటే, ప్రతిపక్షాల కంటే, దేశంకంటే నెహ్రూ వ్యక్తిత్వం గొప్పదని భజన చేయడం ప్రారంభించారు. 'నెహ్రూ గతిస్తే ఎవరుగతి' అనే నినాదాన్ని సృష్టించింది - ఈ ప్రజాస్వామ్య దుస్థితే.

అలా అని నెహ్రూ వ్యక్తిత్వం సామాన్యమైంది కాదు. స్వర్గీయ పండిట్ దీనదయాల్ ఉపాధ్యాయ చికిత్స నిమిత్తం వరంగల్‌కు లోగడ వచ్చినప్పుడు. వారిని కలియడానికి ఒక కాంగ్రెస్ యం. పి. వచ్చారు. ప్రభుత్వ విధానాలను గురించిన సంభాషణలో ఆ యం. పి. నెహ్రూజీనే 'బేహద్ బేహూదగీకీ బాత్ కహీహై' (నెహ్రూ గారు చెప్పరాని బుద్ధితక్కువగా మాట్లాడాడు) అన్నారు. దీనదయాల్ జీ షాక్ తిన్న మనిషివలె వెంటనే సహజమైన వినయంతో లేచి 'అచ్ఛాజీ అబ్ స్నాన్ కరూంగా, వైద్యరాజ్ ఆతేహీ హోంగే '(సరేనండి. ఇక స్నానం చేస్తాను. వైద్యులు వస్తూ ఉండాలి) అని అంటూ సెలవు తీసుకొని లోనికివెళ్ళి, ఆ యం. పి. గారు వెళ్ళిన తరువాత ఈ రచయితతో నెహ్రూగారి వ్యక్తిత్వాన్ని గురించి ఆత్మీయంగా పది నిమిషాలు చెప్పి 'ఇలాంటి వాళ్ళు ఆయన ఎదుట పొగిడి, చాటున విమర్శిస్తూ ఆత్మవంచనతో పాటు దేశాన్ని వంచిస్తున్నారు' అన్నారు. దీనదయాల్‌జీ నెహ్రూ విధానాలను తీవ్రంగా విమర్శించిన వ్యక్తి. అయినా రాజకీయాలలో అంతర్బాహ్య శుచిత్వాన్ని నమ్మిన భారతీయ విచార సాధకుడు. అందుకే ఇలాంటి వంచనను సహించలేకపోయారు.

నెహ్రూ ఇలా చుట్టూ చేరిన వంచకుల ముఖస్తుతికి పొంగిపోతుండే వారు. ఎడతెరిపి లేకుండా ఈ ప్రచారం సాగింది. 'నెహ్రూ తప్పనిసరి

తనాన్ని' ఒక పథకంగా ప్రచారం చేస్తూ, వీరంతా తమ వలయాన్ని కాంగ్రెసులో బలపరుచు కున్నారు.

కాంగ్రెసులో రెండవ, మూడవ శ్రేణిలో గుమిగూడిన ఈ వర్గాన్ని గమనించిన కమ్యూనిస్టులు కూడా కాంగ్రెసు వెంటబడ్డారు. నెహ్రూకు సోషలిజం-అభ్యుదయం - వగైరా కొన్ని ఊహలు న్నాయి. ఆ ఊహల పట్ల ఆయనకు భావనా ప్రధానమైన అసక్తి ఉన్నది. ఆయన దృష్టిలో గాంధేయ విధానం కాలం చెల్లిన విధానం. వికేంద్రీకృతమైన ఆర్థిక విధానం ప్రగతికి పనికి రాదని ఆయన అంచనా. అలా అని తెగింపు లక్షణంకూడా లేదు. సాధారణంగా సోషలిస్టులను గురించి ఒకమాట అంటుంటారు. 'కమ్యూనిష్టులం మేము - అని అనడానికి ధైర్యంచాలక - పెట్టుబడి విధానాన్ని అంగీకరించ లేక - జాతీయ స్వాతంత్ర్య ముత్యాలను ఆశ్రయిస్తే ఎక్కడ సంకుచిత వాదులని అంటారో అని భయపడే మధ్య రకం మెతక మనుషులు సోషలిస్టులు' అని. ఎవరో చేసిన ఈ నిర్వచనం నెహ్రూగారిపట్ల కొంతమేరకు అన్వయమవుతుంది. గాంధీజీ రాజకీయ వారసుడైన నెహ్రూకు గాంధీజీ ప్రతిపాదించిన ఆర్థిక విధానంతో ఏకీభావం లేదు. ఆయన దృష్టి పారిశ్రామికంగా ప్రగతి సాధించిన రష్యా, అమెరికాల వైపు ఉండేది. కమ్యూనిష్టులు నెహ్రూ లోని ఈ బలహీనతను గ్రహించి క్రమంగా తమ పార్టీలోని కొందరిని కాంగ్రెసులోకి ప్రవేశింప చేయడం ప్రారంభించారు.

భారత చరిత్రలో కమ్యూనిష్టుల దొక దురదృష్టకరమైన జాతకం. వాళ్ళెప్పుడూ రైలుతప్పిన ప్రయాణీకులే. ఊరంత ఒకదారి ; ఉలిపికట్టె దొకదారి అంటారే - ఆ మోస్తరు.

స్వరాజ్యానికి సాగిన పోరాటంలో దేశనాయకులను అరెస్టు చేయించి, బ్రిటిషు సర్కారుకు బానిస చాకిరి చేశారు. స్వరాజ్య ఉద్య

వారికి వెన్నుపోటు పొడిచి బ్రిటిషు సామ్రాజ్యవాదం గెలుపే ప్రజా విజయం అన్నారు. నేతాజీ సుభాస్ లాంటి దేశభక్తులను 'పెంపుడు కుక్కలని' ప్రచారం చేశారు. స్వరాజ్యం వచ్చాక ఏర్పడ్డ ప్రజా ప్రభుత్వం బూర్జువా ప్రభుత్వమని - దానిని తొలగించి కార్మిక, కర్షక నియంతృత్వం సాధించడానికి సాయుధ విప్లవమంటూ-తెలంగాణ వగైరా ప్రాంతాలలో అలజడి ప్రారంభించారు. కాని ప్రభుత్వం చేతులలో చావు దెబ్బతిని క్షేత్రసన్యాసం చేసి హఠాత్తుగా ప్రజాస్వామ్య వాదులైనారు. బ్యాలెట్టు పేటికలలో కమ్యూనిష్టు పార్టీకి ప్రజామోదం లభించడం ఈ దేశంలో ఇప్పటిలో జరగని పని అని తేల్చుకుని-కాంగ్రెసులో దూరి - నెహ్రూగారిని తమ వలయంలో బంధించాలని 'స్ట్రాటజీ' ప్రారంభించారు. 'నెహ్రూ అభ్యుదయవాది - ప్రపంచంలోకల్లా గొప్ప ప్రజాస్వామ్య వాది- శాంతిదూత, కార్మిక కర్షక స్నేహితుడు. మిగతావాళ్ళే దుర్మార్గులు. కాంగ్రెసును నాశనం చేయాలి.' అని లోపల దూరిన కమ్యూనిష్టులు - 'అభ్యుదయవాది నెహ్రూను మేం సమర్థిస్తాం. కాంగ్రెసునుకాదు' అని బైటి కమ్యూనిష్టులు - నెహ్రూను పార్టీ నుండి వేరుచేసి-నెహ్రూను అభ్యుదయ వాదిగాను, కాంగ్రెసును బూర్జువా పక్షంగాను చూపే స్ట్రాటజీకి పూనుకున్నారు.

ఈ విధంగా "నెహ్రూబ్రెండు"ను నెలకొల్పడానికి ఒకవైపు స్వార్థపరులు - రెండోవైపు కమ్యూనిష్టులు, వారి తోటి ప్రయాణీకులు తమ తమ ప్రయోజనాలను సాధించుకోడానికి ప్రయత్నించారు. అనేకరకాల - అర్థం ఉండనక్కరలేని నినాదాలతో - దేశంలో జాతీయ శక్తులను - ఒక్కొక్కరికి కొక్కొక్క 'బిరుదు' తగిలిస్తూ, దుమ్మెత్తి పోయడానికి - నెహ్రూను ముఖపీఠగా - కాంగ్రెసును వేదికగా - ఈ వర్గాలు వినియోగించు కున్నాయి. నైతిక విలువలకు రాజకీయంగా ప్రాధాన్య మివ్వని ఈ

వర్గాలు నవీన ప్రచార సాధనాల సహాయంతో, దేశంలో వ్యక్తి వాదాన్ని పెంచి, ప్రజాస్వామ్యాన్ని మట్టుపెట్టాలని ప్రయత్నించాయి. జాతీయ శక్తుల ప్రాబల్యాన్ని తగ్గించాయి.

రాజకీయాలలో నైతిక మూల్యాలకు అలా క్రమంగా తిలోదకాలు ఇచ్చి ఏదోవిధంగా అధికారాన్ని పొందడమే పరమ ధర్మంగా కాంగ్రెసు భావించింది. ప్రజాస్వామ్యపు తొలిరోజులవి. అప్పటి నుంచే ప్రధాని నెహ్రూ వెంట - నీడలా - ఇందిర ఉంటుండేది. కాంగ్రెసులో నెహ్రూ ఏకాధిపత్యం కలిగి ఉండడాన, నెహ్రూ కుమార్తెగా - అంతరంగ సలహాదారుగా - అలా ఆమె తన వ్యక్తిత్వాన్ని, పలుకుబడినీ మౌనంగా పెంచుకుంటూ వచ్చింది. 'నెహ్రూ ట్రెండు'ను ఆమె గ్రహించి, వ్యక్తిత్వపు అహంతను కూడా పెంచుకుంటూ వచ్చింది. కాంగ్రెసు మునుపటి కాంగ్రెసు కాదు. కనుక నెహ్రూ బ్రతికి ఉండగానే ఇందిరాగాంధీకి పట్టంకట్టే ప్రయత్నం కూడా ప్రారంభమైంది. వయోవృద్ధ నాయకులను కాదని, న్యాయంగా కాంగ్రెసు ఎన్నుకోదలచిన నిజలింగప్పను కాదని, ఆమెను కాంగ్రెసుకు ప్రెసిడెంటుగా చేసాడు నెహ్రూ. 1959 లో చైనా దాడిచేసి నప్పుడు దేశానికి అనుకోని అపజయం, పరాభవం కలిగాయి. ప్రజా స్వామ్య సంప్రదాయం ప్రకారం నెహ్రూ రాజీనామా చేయాల్సి ఉంది. కాని చేయలేదు. భువనేశ్వర్ కాంగ్రెసులో నెహ్రూకు పక్షవాతం వచ్చి నప్పుడు ఆమెకు ఏ అధికారమూ లేకపోయినా బినామీ ప్రధానమంత్రిగా పనిచేయడంతో ప్రజాస్వామ్య మరియాద పూర్తిగా సమాధి కట్టబడింది.

కాంగ్రెసులో పాత తరానికి చెందినవాడు మురార్జీ. చరిత్ర, శీలమూ కలిగిన వ్యక్తి. పనికటుకొని వామపక్ష పార్టీలు లేవదీసిన దుమారాలను లెక్కచేయని ధైర్యం గలవాడు. నెహ్రూ తరువాత సహజంగా ప్రధాని

కావలసినవాడు—. కాని ఆతణ్ణి ఉపప్రధానిగా, ఇందిరా గాంధీని ప్రధానిగా చేయడానికి-నెహ్రూచేత రాజీనామా ఇప్పించడానికి-నెహ్రూ కుటుంబ శక్తులద్వారా ప్రయత్నాలు సాగాయి. అప్పుడే మురార్జీకి ఒక సందేశం పంపబడింది. ప్రజాస్వామ్య విలువలు గుర్తెరిగిన మురార్జీ ఆ ప్రతిపాదనను కాదనడం, తరువాత నెహ్రూ మరణం-లాల్ బహదూర్ ప్రధాని కావడం చరిత్ర ఎరిగిన సత్యం. లాల్ బహదూర్ మంత్రివర్గంలో ఇందిరా గాంధీ మిగతా మంత్రులలో ఒక మంత్రిగా కొనసాగింది. తాష్కెంటులో లాల్ బహదూర్ మరణం అనుమానాస్పద కారణాలతో జరిగినది. తరువాత 'నెహ్రూ ఫ్రెండు' సమర్థకులు, కామరాజు వర్గీయులు కలిసి ఇందిరా గాంధీని ప్రధానిగా చేశారు.

# 2
# ఇందిరా ప్రవేశం

'అధికారం భ్రష్టుల్ని చేస్తుంది
సంపూర్ణ అధికారం
సంపూర్ణంగా భ్రష్టుల్ని చేస్తుంది.'
—లార్డ్ ఆక్టన్

ఇందిరా గాంధీని ప్రధానిగా చేయడమూ, మురార్జీ న్యాయంగా ప్రధాని కావలసిన వాడైనా - అతణ్ణి క్రిందికి లాగడమూ నాటి కాంగ్రెసు నాయకుల మనస్తత్వానికి నిదర్శనం. నెహ్రూ కాలంలో 'అ ఆ - లు నేర్చుకునే బుద్ధిగల విద్యార్థులు'గా గడిపి, లాల్‌బహదూర్ హఠాత్తుగా మరణించడంతో ఆ స్థానంలో మురార్జీ లాంటి గట్టివాణ్ణి మళ్ళీ కూచోపెట్టడం - సిండికేటు[1] అని - పిలువబడ్డ కాంగ్రెసు అగ్ర నాయకులకే కాక, పరకాయ ప్రవేశం చేసిన సి. పి. ఐ. భక్తులకు కూడా ఇష్టం లేదు. సిండికేటు నాయకులు "నామమాత్రంగా ఒక రాణీగారిని గద్దెమీద కూర్చోబెట్టి తెరవెనుక తతంగం తాము నడపాలని ఒక

---

1. అతుల్యఘోష్ (బెంగాలు), యస్. కె. పాటిల్ (బొంబాయి), యస్. నిజలింగప్ప (కర్ణాటక), యన్. సంజీవరెడ్డి (ఆంధ్ర), కామరాజు (మద్రాసు) - వీళ్ళను వామపక్ష పార్టీలు, పత్రికలు పనికట్టుకొని 'సిండికేటు' అని పేరుపెట్టి అపకీర్తిపాలు చేశాయి. అలాగే మురార్జీని కూడా నిందలపాలు చేయడానికి ఈ పార్టీలు, పత్రికలు చేయని పనిలేదు.

పథకం వేసుకున్నారు." (They now schemed of having a reigning queen while they would actually rule from behind the scenes.)

ఇందిరా గాంధీ ప్రధాని కావడానికి, ప్రజా స్వామ్యాన్ని తప్పు మార్గాన నడిపించడానికి మరో దురదృష్ట కరమైన ప్రమాదం అలా ఏర్పడింది. ఇందిరా గాంధీ తన తండ్రి దర్బారులో ఉంటూ వ్యక్తుల స్వభావం తెలిసిన పరిశీలకురాలు. చదరంగంలో పావులను మార్చినట్లు మారుస్తూ, ఎత్తివేస్తూ సిండికేటును పూర్తిగా – 1969 బెంగుళూరు సభలో – ఓడించ గలిగింది. కాంగ్రెసు సంస్థకన్నా, తన వ్యక్తిగత ప్రాబల్యం ఎక్కువగా చూపడానికి, సంస్థ సంజీవరెడ్డిని అధ్యక్ష స్థానానికి పోటీ నిలిపితే, సంస్థా నిర్ణయాన్ని 'అంతరాత్మ పిలుపు' అనే నెపాన్ని పురస్కరించుకొని తిరస్కరించింది. స్వతంత్రుడుగా నామినేషను దాఖలు చేసిన వి. వి. గిరిని సమర్థించి గెలిపించింది. తరువాత పార్లమెంటునే రద్దుచేసి 'గరీబీ హటావ్' నినాదంతో 1971 లోనే ఎన్నికలు ప్రకటించి పూర్తి మెజారిటీ సంపాదించింది.

ఇందిర పార్లమెంటుకు రాయబరేలీ నుండి ఎన్నికైంది. ఆ ఎన్నిక చెల్లనేరదని ఆమె ప్రత్యర్థి రాజనారాయణ్ అప్పుడే ఎన్నికల పిటీషను ఒకటి దాఖలు చేశాడు.

ఇందిరా గాంధీ ప్రధానిగా పదవీ స్వీకారం చేసింది. పదవిని చేపట్టిన ఏడు రోజుల్లోనే పాకిస్తాన్‌తో – బంగ్లాదేశ్ సమస్యపై – పోరాటం తటస్థమైంది. పద్నాలుగు రోజులు సాగిన ఆ యుద్ధంలో తూర్పున బంగ్లాదేశ్ విముక్తితో పాటు పశ్చిమాన పాకిస్తాన్ గర్వభంగాన్ని చేయ

1. ఎండ్ ఆఫ్ ఎన్ ఎరా (సి. యన్. పండిట్)– 20 వ పేజీ 18-20 లైన్లు.

గలిగింది మన సైన్యం. పాకిస్తాన్‌తో పోరాటం తప్పనిసరి అని తేల గానే, ప్రపంచ రాజ్యాల బెదిరింపుల నుండి తప్పుకునేందుకు విదేశాంగ శాఖలో విధాన నిర్ణాయక సంఘానికి అధ్యక్షుడైన డి. పి. ధర్, ప్రధానికి ప్రధాన కార్యదర్శియైన పి. యన్. హస్కర్, విదేశాంగ కార్యదర్శి టి. యన్. కౌలు - ఈ ముగ్గురూ రష్యాతో ఇరవై ఏండ్ల ఒప్పందం చేసుకోడానికి ప్రధానిని ప్రేరేపించారు. ఈ ముగ్గురూ వామపక్ష ధోరణికి అంకితులు.

పాకిస్తాన్ మీద సాధించిన విజయంతోను, బంగ్లాదేశ్ విముక్తితోను ఇందిరా గాంధీ "ఇంతటి గొప్ప ప్రధాని - స్వరాజ్యం వచ్చింతర్వాత - ఈవిడే" అన్నంత పేరు సంపాదించుకున్నది. ఈ పేరు ప్రతిష్ఠలతో ఆ తరువాత నాలుగు కేంద్ర పాలిత ప్రాంతాలలో, 13 రాష్ట్రాలలో వచ్చిన ఎన్నికలలో నిరాఘాటంగా, బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది.

"ఇందిర - విజయేందిర" అని అమాయకులు కొందరు, కిరాయి కవులు మరికొందరు కీర్తించారు. అటు అమెరికా బెదిరింపులకు ఆమె చేసిన సవాలు, పాకిస్తాన్‌పై సాధించిన విజయం, ఇటు - ఇంట - ఆమె ఇచ్చిన ''గరీబీ హటావో'' నినాదం ఆ ఎన్నికలను కేవలం ''ఇందిరా ఎన్నిక''గా మార్చాయి. అప్పటినుంచి ఇందిరా భక్తులే ముఖ్యమంత్రులవుతూ వచ్చారు. కాంగ్రెసు పార్టీ విలువలేనిదైంది. ప్రజాస్వామ్యం - ఎన్నికలు మంట కలిసాయి. డి. పి. ధర్, మోహన కుమార మంగళం, హస్కర్ లాంటి కమ్యూనిస్టు తాత్వికులు డి. పి. మిశ్రా, ఉమాశంకర్ దీక్షిత్ లాంటి రాజకీయ కూటనీతి పరాయణులు ఆమెకు సలహాదారులైనారు. దేశంలో ఒకే నాయకత్వం, ఒకే కేంద్రం, ఒకే పార్టీ అనే మన స్తత్వాన్ని ఈ వర్గం విషవృక్షాన్ని పెంచినట్లు పెంచడానికి

తోడ్పడ్డది. వీరికి తోడుగా యశపాల్ కపూర్, మహమ్మద్ యూనస్, బన్సీలాల్ ఆమెకు ఆంతరంగ భక్తులైనారు.

దేశంలో ఇలా ఒక వ్యక్తిచుట్టూ అధికార వలయం ఏర్పడడం వల్ల కాంగ్రెసు లోనే అసంతృప్తి ఏర్పడ్డది.

మోహన్ ధారియా, చంద్రశేఖర్ మొదలగువారు కాంగ్రెసు తప్పుదారిన పోతూన్నదని నిర్భయంగా విమర్శించ నారంభించారు. ప్రజాస్వామ్యం పార్టీలో పునరుద్ధరింప బడాలని బహిరంగంగా 'డిమాండు' చేయ నారంభించారు. కాని ఇందిరా గాంధీకి చీమ కుట్టలేదు.

దేశంలో ప్రభుత్వం ప్రజల సమస్యలను పూర్తిగా విస్మరించి అధికార రాజకీయాల కుమ్ములాటలో మునిగి పోవడాన ప్రజలలో అసంతృప్తి నిప్పులా క్రమంగా రాజుకుంటూ వచ్చింది. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ - 6 మే 1972 న భాగల్పూర్ జనసంఘ సమావేశాలలో ప్రసంగిస్తూ - అటల్ బిహారీ వాజ్‌పేయి "ఇందిరా గాంధీ వ్యక్తివాదాన్ని పోషిస్తున్నది. ఈమారు ఎన్నికల్లో ప్రతిచోటా ఒకే అభ్యర్థి - 'ఇందిరా గాంధీ' నిల్చున్నది. తనను బలపరచడానికి కాంగ్రెసును గెలిపించం డనేదే నినాదమైంది" - అని రానున్న ప్రమాదాన్ని సూచించి, "అవినీతితో సంపాదించిన టన్నులకొలది అక్రమ ధనాన్ని - గవర్నమెంటు యంత్రాంగాన్ని బాహాటంగా పెద్దపెట్టున ఉపయోగించుకోడం - బంగ్లాదేశ్ విజయానికి తానొక్కర్తే కారణం అని ప్రభుత్వ, ప్రభుత్వేతర ప్రచార సాధనాలతో ప్రచారం చేయించుకోడం - కాంగ్రెసు విజయానికి కారణ మైనా"యని అతి తీవ్రమైన ధోరణిలో ఆరోపించి దీనిని అరికట్టడానికి ప్రజాస్వామ్య శక్తుల సమీకరణ జరగాలని హెచ్చరించాడు.

ఒక్క బంగ్లాదేశ్ యుద్ధంలో 200 కోట్ల రూపాయలు ఖర్చైనాయి. అసలే పెరుగుతూన్న ధరలు ఆ ఏడు ఆకాశాన్నంటాయి. ఒక ఏడాదికి పూర్వం ఇందిరా గాంధీని, కాంగ్రెసును సమర్థించిన ప్రజలు విసిగిపోయి ఆక్రోశించ నారంభించారు. ఆమె 'గరీబీ హటావ్' నినాదం బూటకపు నినాదమని ప్రజలు గ్రహించారు. ప్రతిపక్షాల విమర్శలతో ఇందిరా గాంధీ నిజ స్వరూపం బైటపడింది.

ప్రజలలో మార్పు రావాలనే తీవ్రమైన ఆవేదన – తపన – అప్పుడే మొదలైంది. కాని మార్పు రావాలంటే కొన్ని హంగులు సిద్ధమై ఉండాలి. ఎన్నాళ్ళు రాజుకుంటున్న మంట ఫ్రెంచి విప్లవంగా భగ్గుమన్నది ! జారు ప్రభువుల అణచివేతకు గురి అయిన రష్యా ప్రజలు ఎన్నాళ్ళు తపించగా అక్టోబరు విప్లవం వచ్చింది ! ఉప్పు సత్యాగ్రహం ఆరంభించినప్పుడు 'కణికెడు ఉప్పు' స్వరాజ్యం తెస్తుందా అని అన్న వారు లేకపోలేదు. కాని ఆ దండియాత్ర జనంలో స్వరాజ్యాకాంక్షా విత్తనాలు జల్లింది. అలాంటి కదలిక జనంలో రావాలి. అలాంటి కారణాలు ఏర్పడాలి.

ఇందిరా గాంధీ రాజకీయ జీవనంలో స్వీకరించిన ఏకైక లక్ష్యం 'పదవి'. సోషలిజం, సెక్యులరిజం, ప్రజాస్వామ్యం ఎప్పటి కప్పుడు ఆమె ధరిస్తూవచ్చిన కొత్త కొత్త ఫ్యాషన్ దుస్తులు.

ఇందిరా గాంధీకి మొదట్లో అమెరికాపట్ల మోజు ఉండేది. ఒకసారి అమెరికా పర్యటనలో ఆమె ఉండగా 'భారత్ అమెరికా విద్యా ప్రణాళిక' నొకటి అమెరికా సిద్ధం చేసింది. ఇందిరా గాంధీ దాన్ని మొదట ఆమోదించింది. కాని విమర్శల హిమపాతం జరిగేటప్పటికి చల్లబడి పోయింది.

సమాచార మంత్రిగా ఉండగా అమెరికా సహకారంతో ప్రతి జిల్లాలో ఒక ట్రాన్స్‌మీటర్ నిర్మించాలనీ - దానిని అమెరికాకు చెందిన "పీస్‌కోరు వలంటీర్లు" నిర్వహించేట్లు పథకం తయారు చేసింది. కాని కామరాజు తీవ్రంగా వ్యతిరేకించాడు. దాంతో ఆ ప్రణాళిక పురిటి సంధి కొట్టింది.

వరుసగా ఇలా ఎన్నో ప్రయత్నించి, అమెరికాపట్ల ప్రజల సౌముఖ్యం లేదని గ్రహించి, అవతారం మార్చింది. అంతేకాదు. తన వ్యతిరేకులను అణగద్రొక్కడానికి, అనుకూలురను తొత్తులుగా చేసుకోడానికి "రిసెర్చి అండ్ అనాలిసిస్ వింగ్" - (రా) రూపాన్ని మార్చి, తన గుప్పిట్లో పెట్టుకొని ఏడాదికి 100 కోట్ల రూపాయిల ఖర్చుతో, దానిని తన స్వంత గూఢచారి సంస్థగా రూపొందించు కున్నది. 'రా' కేవలం గూఢచారి సంస్థేకాదు. ఏ చర్యకైనా కావలసిన హంగులు ఇందిరా గాంధీకి సమకూర్చే వ్యక్తిగత యంత్రాంగంగా మారిపోయింది. దేశంలో పేరుగల ప్రతి వ్యక్తి జాతకాన్ని త్రవ్వితీసి - నిద్రాన్వేషణలు చేసి - ప్రతి ప్రముఖుని "జీవన వ్యవహారాల సంపుటి"ని తయారు చేసింది - ఈ 'రా' రహస్య చార సంస్థ. కామరాజు వ్యతిరేకిస్తున్నాడని ఇందిరా గాంధీకి తెలిపింది ఈ సంస్థే అంటారు. సంజీవరెడ్డి రాష్ట్రపతి ఐతే 'మీకు ఉద్వాసన పట్టించడానికి కుట్ర జరుగుతున్న'దని ఇందిరా గాంధీకి తెలిపిందీ ఈ సంస్థే అంటారు.

ప్రతిపక్షాలకు ఆర్థిక సహాయం రాకుండా చేయడానికి 'కంపెనీ విరాళాలను' నిషేధించింది. ఎందుకు చేసిందీ పని ?

కంపెనీలు చెక్కుల ద్వారా రాజకీయ పార్టీలకు విరాళాలు ఇస్తాయి. అలా 62 నుండి 1968 వరకు 47 పార్టీలకు 260 లక్షల రూపాయల విరాళాలు ఇస్తే అందులో ఒక్క కాంగ్రెసుకు 205 లక్షలు

లభించాయి. కాని ఈ ధనం బ్యాంకులో జమ అవుతుంది. జమా ఖర్చుల ప్రమేయం ఉంటుంది. పార్టీ ఫండు - తనకు - కేవలం తన వరకే - ఉపయోగించుకో వీలులేదు కదా ! కనుక విరాళాలు రద్దుచేస్తే బ్లాకు ధనం కొల్లలుగా దోచుకోవచ్చు - ఎన్నికల్లో ధనాన్ని ఆయుధంగా ఉపయోగించు కోవచ్చు - రాజకీయ ప్రాబల్యాన్ని సంపాదించి తన మిరాసు గట్టిపరచు కోవచ్చు.

అదే పథకంతో - ఒక్క 72 లోనే నిధి అంటూ - ఇరవైకోట్ల రూపాయలు, ఆమె సేకరించుకున్న దంటారు.

1972 లో ప్రభుత్వ బ్యాంకునుండి ఇందిరా గాంధీ పేరుచెప్పి 80 లక్షల ధనానికి కైంకర్యం పట్టించారు. అది బైట పడింది. హడావిడి లేకుండా ఆచూకీకి అందకుండా చేయడానికి ప్రయత్నం సాగింది. నగర్‌వాలా హత్య కావింప బడ్డాడు. సాక్ష్యాధారాలు దొరక్కుండా చేసేందుకు అనేకమైన అమానుషాలు జరిగాయి.

సంజయ్ శ్రీమతి గాంధీకి ముద్దుల కొడుకు. అతని మారుతీ కంపెనీకి లైసెన్సు లభించింది. ఏడాదికి 1000 కార్ల ఉత్పత్తికి లైసెన్సు నిచ్చారు - ఆ లైసెన్సుల కమిటీ సమావేశానికి ఆనాడు స్వయంగా ఇందిరా గాంధీ అధ్యక్షత వహించింది. అనుభవమున్న పోటీదారులకు ఆ అవకాశం లభించలేదు.

తరువాత బన్సీలాల్ హర్యానాలో ప్రైవేటు ఆస్తులను స్వాధీనం చేసికొని, మారుతీ ఫ్యాక్టరీకి స్థలదానం చేశాడు. బన్సీకాకాకు సంజయ్ బేటాటీ అంటే అబ్బురమైన ప్రేమ, గౌరవం, అభిమానంపుట్టి - అతని ముఖ్యమంత్రిత్వం 'ఎదురులేని రాజ్యం' అయింది.

ఇందిరాగాంధీ అలా తన నిరంకుశత్వాన్ని ప్రారంభించింది. రాజకీయాలలో 'అంతో ఇంతో' కైంకర్యం చేసిన బాపతు నాయకులే

కాంగ్రెసులో దాదాపు ఎక్కువమంది. 'రా' సంస్థ వారిపై కన్నువేసి ఉంచింది. అలా తమపై ఒక కన్ను తెరిచే ఉంచినట్లు వాళ్ళకు తెలిసి ఉండేలా 'రా' సంస్థ "ఒత్తిడి రాజకీయాలకు" పూనుకున్నది.

ఆర్థికంగా ప్రగతి పథాన నడుస్తున్నామని అంకెల గారడీ చేస్తున్నా, పేదరికం పెచ్చుపెరగడం, ధనికులు మరింత ధనాఢ్యులు కావడం నిరాటంకంగా నడుస్తూనే ఉన్నది. టాటాలు, బిర్లాలు కోట్లపై కోట్లకు పడగెత్తుతూనే ఉన్నారు. వారందరూ ఇందిరా గాంధీ తలపెట్టిన సోషలిజానికి ఉద్ధారకులవుతున్నారు. ఉత్పత్తి పెరుగుతున్నదని అంకెలు తెలుపుతున్నా, మార్కెటులో వస్తువులు కరువవుతూ సామాన్యుని బ్రతుకు బజారు కెక్కింది. అయిదో పంచవర్ష ప్రణాళిక సమాధి పాలైంది. విద్యావంతుల శాతం పెరుగుతూన్నా ఉద్యోగాలు దొరకవు. చదువుకొని వారి సంఖ్యకూడా పెరుగుతూనే వచ్చింది. బ్లాకు మార్కెట్టు, లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం నిత్యజీవనంలో పెనవేసుకొని సమాజం - ఒక కృత్రిమమైన దోపిడీదార్ల గుంపుగా - ఏర్పడేట్లు జీవితం కలుషితమై పోయింది.

సాంఘిక మర్యాదలు భగ్నమైనాయి. కులతత్వాలు నినాదాల పల్లకీల్లో ఊరేగుతున్నాయి. అస్పృశ్యత ఊరిబైట కొత్తగా వెలసిన వాడల్లోకి శాశ్వతంగా-అరికట్టబడి - సమాజంలో కలవనంత దూరాన నెట్టివేయబడ్డది. పెంపుడు కుక్కలలాంటి నకిలీ బుద్ధిజీవుల ఆర్భాటం దేశాన్ని [illegible] మనిపిస్తూ ఆత్మ విశ్వాసాన్ని అణగ ద్రొక్కింది.

దేశం దివాలా తీసి, అగాధంలో పడిపోవడానికి సిద్ధమైంది.

# 3

# బలాబలాలు

బలహీన ప్రతిపక్షాలు
నియంతృత్వాలకు సోపానాలు.

ఈ దుర్గతినుంచి దేశాన్ని రక్షించేది ఎవరు?

ఇందిరా గాంధీని, ఆమెను అంటిపెట్టుకొని అధికారమును చెలా యించుతున్న కాంగ్రెసును ఎదురించి క్రిందినుంచి ప్రత్యామ్నాయంగా నిల బడగల సామర్థ్యంఉన్న పార్టీ మరొకటి ఏది? సామాన్యుడు లోలోపల దహించుకు పోతూన్న కాలం అది. అసంతృప్తి సర్వత్రా చీకటిలా వ్యాపిస్తున్న కాలం అది ఒక మహా విప్లవం రావడానికి పూర్వరంగం దాదాపు సిద్ధంగా యున్న రోజులు అవి. కాని ప్రజలలో వ్యాపించి యున్న అసంతృప్తిని గుర్తించి, ప్రజలను సమీకరించి, ఒక గట్టి ఊపు-కుదుపు – వ్రేళ్ళతోసహా 'కదిలించే' – ప్రజాశక్తికి ఒక క్రొత్త బాటను – ఒక ఆశను-ఒక క్రొత్త పంథాని వూహించి యివ్వగలశక్తి సమాజములో లేదు. ప్రతిపక్ష రాజకీయ పార్టీలవారు ఎవరి దారిన వారు ప్రయత్నిస్తూనే ఉన్నారు. మోర్చాలు, ధర్నాలు, ప్రదర్శనలు జరుపు తూనే ఉన్నారు. నినాదాలు వినిపించుతూనే ఉన్నాయి. కాని విడివిడిగా పోరాడే శక్తి ఏ ఒక్క పార్టీకి లేదు. వాటిని వాస్తవానికి పార్టీలనడం న్యాయం కాదు. క్రిందినుండి మీది దాకా సభ్యత్వం ద్వారా పార్టీ యం

త్రాంగాన్ని నిర్మించుకొని, ప్రతిష్ఠ మొనరించుకుంటూ, సైద్ధాంతికంగా శాశ్వత మూల్యాలకూ, తాత్కాలిక అవసరాలకూ – సమస్యలకూ సమన్వయం సాధించి, పార్టీలోని వివిధస్థాయి కార్యకర్తలకు, సహచరులకు నచ్చ చెప్పుకుంటూ, వారి అవగాహన పెంచుతూ, ప్రజాస్వామ్యంలో ప్రహరీలా ఉండగల పాత్రను ఏ పార్టీ పూర్తిగా నిర్వహించలేదు. పార్టీ బలంమీద, పార్టీ సంఘటనమీద కాక, ప్రభుత్వపు ప్రాపకంతో అధికారుల మంచితనాన్ని సంపాదించుకొని, ధనాన్ని ఒక సాధనగా గ్రహించి నడిచే రాజకీయాలు దేశంలో ఏర్పడ్డాయి. ప్రతిపక్షాలు ప్రభుత్వ పక్షాన్ని నకలు చేయడంలో–అన్నిటా–పోటీ పడుతూండేవి. సహజంగా పార్టీల నిత్యకృత్యాలతో ప్రజలకు అర్థవంతమైన సంబంధం లేకుండా పోయింది. రాజకీయ శిక్షణ–క్రియాశీల పౌరుల పాత్ర మొదలగు విషయాలపై ఏ రాజకీయ పార్టీ ప్రయత్నించే పరిస్థితి లేకుండా పోయింది. ఒక నిత్య నిర్మాణ కార్యక్రమమిచ్చి గాంధీజీ అనుచర బృందాన్ని స్వరాజ్య పోరాట కాలంలో నిర్మాణం చేసుకున్నట్లు చేసుకున్న పార్టీయే లేదు.

సంస్థా కాంగ్రెసు 1969 తో వ్యక్తిత్వాన్ని కోల్పోయింది. కలకత్తాలో సంస్థా కాంగ్రెసు సమావేశాలలో ఇంధిరాగాంధీని తొలగించటం మీ తరంగాదు' అని కామరాజు నీరుగార్చాడు. సంస్థా కాంగ్రెసు కంచుకోటలు బదాబదలై బలహీనమై పోయాయి. నాయకులు మిగిలారు. పార్టీ సంఘటన లేదు. నిర్ణయాలను క్రింది స్థాయిదాకా ఆచరణలో పెట్టగలిగే కార్యకర్తల వలయము లేదు.

సోషలిస్టులు కొంతవరకు ప్రయత్నించారు. కాని అదికూడ ఒకదరికి చేరలేక పోయింది. మొదట సోషలిస్టు పార్టీ, కాంగ్రెసు నుంచి చీలివచ్చి ఏర్పడిన కిసాన్ మజ్దూర్ పార్టీ కలిసి-పి. యస్. పి. – ప్రజా సోషలిస్టు పార్టీగా ఏర్పడినది. అప్పుడు కేరళలో ప్రజా సోషలిస్టు పార్టీ ప్రభుత్వంలో ఉన్నది. వారి హయాములో పోలీసు కాల్పులు

జరిగాయి. డాక్టర్ లోహియా అప్పుడు పార్టీ కార్యదర్శి. పోలీసు కాల్పులపై విచారణ జరగాలని తన పార్టీ రాజీనామా చేయాలని ప్రజా స్వామ్యంలో నైతిక విలువలను కాపాడాలని అతడు పట్టుబట్టాడు. మానవ జీవితాలను అంత విలువ లేనివిగా భావించే అధికారం పోలీసు లకు యివ్వరాదు అని అన్నాడు. దీనిని సహిస్తే దేశంలో ప్రివెంటివ్ డిటెన్షన్ కంటె అధ్వాన్న పరిస్థితి తారసిల్లుతుంది అని అన్నాడు. అప్పుడు పార్టీ అధ్యక్షుడు ఆచార్య కృపలానీ. ఈ సమస్యపై ఆచార్య కృపలానీ, జయప్రకాశ్ నారాయణ్‌లు లోహియాతో ఏకీభవించలేదు. పి. యస్. పి. రెండుగా చీలి పి. యస్. పి సోషలిస్టు పార్టీ వేరు వేరుగా ఏర్పడినవి. తరువాత కొన్ని వర్గాలు తిరిగి కూడి సంయుక్త సోషలిస్టు పార్టీగా అవతరించాయి. అయినా ఒకభాగం పి.యస్.పి. గా ఉంటూనే వచ్చింది. కొంత కాలానికి మళ్ళీ యస్. యస్. పి., పి. యస్. పి. లు కలిసి సోషలిస్టు పార్టీగా ఏర్పడ్డాయి. ఈ ఐక్యత కూడా ఎక్కువ కాలం నిలువలేదు. కొంతమంది వేరై యస్.యస్.పి.గా ఏర్పడ్డారు. తరువాత ఈ వర్గం భారతీయ లోక దళ్‌లో కలిసి పోయింది. "ఐక్యమైన సోషలిస్టు పార్టీ–ఎమర్జెన్సీ తరువాత భారతీయ లోక్ దళ్, సంస్థా కాంగ్రెస్, జనసంఘాలతో కలిసి జనతా పార్టీగా ఏర్పడేదాక – తన విస్పష్టమైన రూపాన్ని నిలుపుకుంటూ వచ్చింది"[1] అంటాడు పూర్వపు పార్టీ సెంట్రల్ కమిటీ సభ్యుడైన సచ్చిదానంద సింహా. సైద్ధాంతికంగా కూడా నెహ్రూ ఆవడి కాంగ్రెస్‌లో సమాజ వాద సరళిని స్వీకరించడంతో, సోషలిస్టు పార్టీ పునాది కదలిపోయింది. అనేకసార్లు జరిగిన విచ్ఛిత్తి, కలయికలతో పార్టీ కార్యకర్తల బృందం గందరగోళపడి, విశ్వాసం పోయి చెల్లాచెదరై పోయింది.

---

1. Emergency in Perspective (Page 37):
by Sachidanand Sinha.

...ఎస్. డి. కి ఒకటి రెండు ప్రాంతాలలో తప్పితే జాతీయ ...ఒకసించే ప్రచారం లభించలేదు.

...ప్రసాద్ ముఖర్జి 1952 లో స్థాపించిన జనసంఘ్ ఆయన ...తో కొంత దెబ్బతిన్నా దీనదయాళ్ ఉపాధ్యాయ నాయకత్వాన ...బలాన్ని, ఒక సంపూర్ణ అవగాహనను సంతరించు... క్యాలికట్ మహా సభలలో జనసంఘ వ్యక్తిత్వం ... ప్రపంచాన్ని ఒక విధంగా ఆకర్షించింది. కాంగ్రెసుకు ...ప్రజల ముందు ప్రత్యామ్నాయంగా నాయకత్వాన్ని, ... పార్టీ వ్యవస్థను నిర్మాణంచేసి చూపగల స్థితికి వస్తూఉన్న ...ఉత్తరాన అనేక ప్రాంతాలలో, దక్షిణాన అనేక భాగాలలో ...పార్టీ జనసంఘమే' అనే స్థాయిని చేరుకుంటూ ఉన్న సమ... దీనదయాళ్‌జీ హత్య జనసంఘ వేగానికి, వ్యాప్తికి కొంత ... జనసంఘ. కార్యకర్తల పార్టీ గనుక ప్రభు... చేసి ప్రజలముందు ప్రత్యామ్నాయ పార్టీగా నిలుచోవ ... కాంగ్రెసును తొలగించి ఆ స్థానంలో నిలువగల ...సిన వేగాన్ని చేకూర్చుకోలేక పోయింది. అప్పటికి ఉన్న ... అంకితులైన కార్యకర్తలు గల పార్టీ జనసంఘమే ... వచ్చింది. కాని ప్రజల దృష్టిని నిర్వివాదంగా ఆకర్షించ... వాస్తవం.

...స్టులు జాతీయ పక్షాలతో కలియడానికి సిద్ధంగాలేరు. ...లలో తిన్న గాయాలు మానక పెనుగులాడుతున్నారు.

...వేరువేరుగా శక్తి లేకపోగా-కలసి పనిచేసే అవసరం ...వాదాల పట్టుదలలతో ఒకే పార్టీగా అవతరించే ... చేసుకోలేక పోయాయి. ప్రజా సమస్యలపట్ల దేశ

భవిష్యత్తుపట్ల వీరికి భావసమైక్యత ఏర్పడడానికి అవకాశం లేకపోలేదు. ఏకాభిప్రాయం ఏర్పడ్డంత మేరకు కలసి పనిచేయవలసిన తరుణం ఆసన్నం కాలేదని కాదు. కాని పూర్వాగ్రహాలు (Prejudices), వ్యక్తిత్వాలు, మొండి పట్టుదలలు కాలం చెల్లిన నినాదాలు, వివాదాలు-వీరిని కలవ నివ్వలేదు.

దేశంలో నియంతృత్వం ముంచుకు వస్తున్నా "నా పొయ్యినాది, నీ పొయ్యి నీవి" అనే సంకుచిత భావాలకు గురిఅయినవారు-అందులో జనసంఘం అంటే ముక్కు విరుపులు, మూతి విరుపులు కొందరికి-నకిలీ కమ్యూనిస్టు భావ దాసులని సోషలిస్టుల పట్ల కొందరికి - చేతులు కలిపితే అస్పృశ్యులం అవుతామేమోనని తొలగిపోయి గిరిగీసుకున్న వారు కొందరు - దారితప్పిన బాటసారులు అందరు.

కనీసం పరస్పర అవగాహన తెచ్చుకోవడానికి ప్రయత్నమూ జరుగలేదు. దేశం పిలుస్తూన్నది. అవసరం ఎదురు చూస్తున్నది. జాతీయ శక్తుల కలయికకై - ఆ క్షణాన - ప్రజలు పడుతూన్న బాధలలోంచి వినిపిస్తూన్న పిలుపు—

ఈ స్తబ్ధతకు తుది ఎక్కడ? కదలికకు మొదటి అడుగు ముందుకు వేసేది ఎవరు? ...

దేశంలో ఒక 'ఖాళీ' వచ్చిపడింది. ప్రజలలో - ముఖ్యంగా యువకుల్లో-నిరాశ విజృంభించింది. ఈ స్తబ్ధత - ఈ నీరసం వారికి భరింపరానిదైంది. వారి హృదయాలు ఎదురు తిరిగాయి. మార్పుకు తొలి గంట యువకుల హృదయ మందిరాల్లో మ్రోగింది. అలా ఆ ధ్వని ఒక మహాశక్తి వలయమై దిశలను ఆవరించింది. ఆ శక్తి వలయంలోకి 'జాతీయావసరం'గా జె. పి. కదిలాడు. విభిన్న రాజకీయ పార్టీలు - వర్గాలు - చివరకు సమాజమే కదిలి ఆ వలయంలో ప్రవేశించాయి.

# 4

# యువజ్వాల

జనతా ఆరహా హై
ఖాళీ కరో సింహాసన్ — దినకర్.

గాంధీజీ పుట్టిన గుజరాత్‌లోనే ఈ స్తబ్ధతను నిరాశను పటాపంచలు చేసే మహా నినాదంతో చైతన్య మహారథం మళ్ళీ కదిలింది.

ప్రతి ఉద్యమం మొదట 'వామన రూపం'లోనే ప్రారంభ మవుతుంది. గుజరాత్ విశ్వవిద్యాలయాల అనుబంధ వసతి గృహాలలో హాస్టలు రేట్లను పెంచారు. అప్పటికే ధరలు పెరిగి అలమటిస్తున్నారు తల్లిదండ్రులు. వారిమీద ఈ అదనపు భారం పడడం విద్యార్థులకు కంటకమైంది. విద్యార్థులు ఈ రేట్ల పెరుగుదలకు నిరసన తెలిపారు. మొదట దక్షిణ గుజరాత్‌లో ప్రారంభమైన ఈ విద్యార్థుల నిరసన ప్రాంతమంతటా ప్రాకింది.

గుజరాత్‌కు ముఖ్యమంత్రి చిమన్‌భాయి పటేల్. అతని ప్రభుత్వం వాస్తవాలను గుర్తించలేదు. సమస్యకు పరిష్కారం వెదక లేదు. దీన్ని తన ప్రతిష్ఠకు సవాలుగా తీసుకున్నది. ప్రభుత్వం వాస్తవాలను గమనించక నిష్కారణంగా మొండితనానికి దిగడాన, ఈ 'నిరసన' ఉద్యమానికి ప్రజల అండ లభించింది.

ఉపాధ్యాయ సంఘం పరిస్థితిని గుర్తించి, విద్యార్థుల న్యాయమైన కోర్కెలను సమర్థించింది. ఉపాధ్యాయులు సమర్థించడంతో ఉద్యమానికి బలం, గౌరవం చేకూరాయి. ప్రాంత స్థాయిలో ఒక కార్యాచరణ సంఘం ఏర్పడింది. దానితో సమస్యలకు విస్తృతమైన పథకం కూడా ఏర్పడింది

అధిక ధరలకు, అవసర వస్తువుల కొరతకు, నిరుద్యోగ సమస్యకు, అధికార పక్షంలో వేయితలల ప్రాకిన అవినీతికి నిరసనగా ప్రదర్శనలు ప్రారంభమైనాయి.

ఆ యేడు పంటలుకూడా పుష్కలంగానే పండాయి. అయినా తిండి గింజలు దుకాణాలలో కన్పించవు. మూగగా చావలేని జనం కూడా విద్యార్థుల ఉద్యమానికి అండగా నిల్చున్నారు. ప్రభుత్వాన్ని బలమైన గొంతుకతో అభ్యర్థించారు. ''భాషణ్ నహీ - రేషన్ చాహియే" అని మంత్రులను నిలవదీసారు. విద్యార్థులు ''నవ నిర్మాణ సమితి'' పేర ఉద్యమానికి ఒక సంఘటనను ఏర్పరచు కున్నారు.

గుజరాత్ ముఖ్యమంత్రి చిమన్‌భాయి పటేల్ - ఇందిరా గాంధీ స్వంత మనిషి అయిన ఘనశ్యాం ఓఝాను దించి పదవికి వచ్చినవాడు, ఇందిరా గాంధీని వ్యతిరేకించినవాడు - అలాంటివాడు ముఖ్యమంత్రిగా ఉండగలడా? కేంద్రం గుజరాత్‌పట్ల పెడముఖం పెట్టింది.

కాంగ్రెసులోని - ముఖ్యమంత్రికి వ్యతిరేకులైన - ఇందిరా గాంధీ విధేయులైన - వర్గంవారు, సి. పి. ఐ. వారు కలసి, విద్యార్థులను మొదట ఎగదోశారు. వారికి సమస్య పట్ల శ్రద్ధ కాదు; కావాల్సింది చిమన్ భాయి పతనం.

గుజరాత్‌లో తిండి గింజల కరువును తొలగించడానికి చిమన్ భాయి కేంద్రాన్ని తిండి గింజలు పంపమని కోరితే, కేంద్రం సి. ఆర్. పి. ని, సైన్యాన్ని, తుపాకి గుండ్లను పంపింది. చిమన్‌భాయి ఆకలితో మాడుతూన్న కడుపులను తుపాకి గుండ్లతో నింపాడు. ఫైజ్ పూర్, వాణి, రాజకోట్, అహ్మదాబాద్, బరోడా నగరాలలో ప్రభుత్వం నరమేధానికి తలపడ్డది.

ప్రజలు కదలి పోయినారు. సత్యాగ్రహాలు ప్రారంభమైనాయి. యువకులు, వృద్ధులు స్త్రీలు, పురుషులు - బైట ఆకలికి నీల్గి చావడం కంటే జైళ్ళలో మ్రగ్గడమే మేలనుకున్నారు. విద్యార్థులకు రాజకీయ పక్షాల బలం కూడా లభించింది. విద్యార్థి పరిషత్ ఉద్యమానికి ఒక వ్యూహాన్ని చేకూర్చింది. "ఇదంతా జనసంఘం, ప్రతిపక్షాలు కలిసి చేసిన కుట్ర" అని ఇందిరా గాంధీ - నాటి కేంద్ర గృహమంత్రి ఉమాశంకర దీక్షిత్-తమ ఆక్రోశాన్ని వెళ్ళగ్రక్కారు.

ఈ అసత్య ప్రచారం ప్రజల నింకా రెచ్చగొట్టింది. మేధావులు, విద్యార్థులు, కార్మికులు, కర్షకులు - ఏకమైనారు. జనతా మహారథం కదిలింది. గుజరాత్ విశ్వవిద్యాలయం మాజీఉప కులపతి - ప్రముఖ సాహితీవేత్త జోషీ 'అనుమానం కల్గించే పద్ధతుల నవలంభించి అధికారాన్ని చేజిక్కించుకున్న గుజరాత్ మంత్రివర్గంపై పోరాటాన్ని ప్రారంభించిన విద్యార్థుల' నభినందించాడు. ఈ పోరాటం ఏనాడో రావలసిన సాంఘిక విప్లవానికై తొలి వెలుగని ప్రస్తుతించాడు.

ప్రభుత్వం స్తంభించి పోయింది. కాంగ్రెసు లుకలుకలతో గుజరాత్ ప్రజలకు - ప్రధాని ఇందిరా గాంధీ సహాయం చేయ నిరాకరించింది. అలా-తన ప్రత్యర్థి వర్గంలోని వాడైన - చిమన్ భాయి పతనాన్ని ప్రోత్సహించింది.

పరిస్థితిని అదుపులో పెట్టలేక, చిమన్ భాయి అనేక స్థలాలలో శాంతి భద్రతల బాధ్యతను సైన్యానికి అప్పగించాడు. "పరిస్థితి ఏ క్షణ మైనా బ్రద్దలయేందుకు సిద్ధంగా ఉన్న అగ్ని పర్వతంలా ఉన్న"దని విద్యార్థి పరిషత్ ఆధ్వర్యాన జరిగిన సభలో అటల్ బిహారీ వాజ్‌పేయి 6 ఫిబ్రవరి 1974 న హెచ్చరించాడు.

ఒకవైపు-ప్రజా ఉద్యమాన్ని-మరోవైపు - ఇందిరాగాంధీ విప రీతపు కుటిల పద్ధతిని-ఎదిరించలేక, చిమన్‌భాయి పటేల్ తన ముఖ్య మంత్రి పదవికి రాజీనామా చేశాడు.

అంతవరకూ ప్రజా ఉద్యమాన్ని బలపరచిన కాంగ్రెసు, సి. పి. ఐ. వ్యక్తులు ఒక్కసారిగా ఉద్యమాన్నుండి తప్పుకోడమే కాక, తెలంగాణా, ఆంధ్ర ఉద్యమాలలో చేసినట్లు వెన్నుపోటు పొడవాలని నిశ్చయించుకున్నారు. కాని విద్యార్థులు మెలకువతో ప్రవర్తించి, ఇత రుల ప్రమేయాన్ని లెక్క చేయకుండా అసెంబ్లీ రద్దు కావాలన్నారు. కేంద్ర ప్రభుత్వం అసెంబ్లీని రద్దు చేయడానికి ఇష్టపడక, మహా క్రూరంగా హింసాకాండకు తలపడ్డది. (ఈ నరమేధాన్ని ఆపడానికి మరో గత్యంతరం లేక మురార్జీ అసెంబ్లీ రద్దు కోసం నిరశన వ్రతం చేస్తానని హెచ్చరించాడు). ప్రభుత్వం జరిపిన కాల్పులకు శాసన సభ్యులు కూడా చలించి పోయినారు. ప్రజల కోర్కెలను మన్నించి రాజీనామా లివ్వడం మొదలు పెట్టారు.

చిమన్ భాయి పటేల్ ఎంత కోరినా వినిపించుకోని కేంద్రం అప్పుడు ఆహార ధాన్యాలను హడావిడిగా గుజరాత్‌కు తరలించింది. ఈ అసహ్యపు పక్షపాత ధోరణికి ప్రజలలో మరీ అసహ్యం పుట్టింది. పార్టీ కలహాలకు ప్రజలను చంపే వ్యక్తి చేతుల్లో దేశం ఉండడమా? అప్పుడే బ్లిట్జ్ పత్రిక ఒక ప్రశ్నావళి తయారు చేసి ఈ ఉద్యమం వెనుక

'మార్క్సిజం' ప్రభావం ఎంత ఉన్నదో రాబట్టుకొని దీన్నొక వర్గ సంఘర్షణగా, వామతత్వ విప్లవంగా సిద్ధాంతీకరించాలని తంటాలు పడ్డది. ఉద్యమ సారధ్యం వహిస్తున్న విద్యార్థులను కలిసి - కదిపి చూసింది. కాని విద్యార్థి నాయకులు 'మార్క్స్ పెట్టిన భిక్ష కాదిది. స్పష్టంగా కాదన్నారు దాంతో ఇది విప్లవం కాదు. ఇది విప్లవ వ్యతిరేక పంథా - రైటిస్టుల కుట్ర' అని కాంగీ, కమ్మీల కూటమి పత్రికలు - ''లొల్లి''- ప్రారంభించాయి.

చిమన్ భాయిని దింపి, మరొకణ్ణి ఆ స్థానంలో నిలపాలని ఇందిరాగాంధీ పన్నిన వ్యూహాన్ని గుజరాత్ ప్రజలు ఆమోదించ లేదు. ఉద్యమం మళ్ళీ తీవ్ర రూపాన్ని ధరించడంతో ప్రభుత్వం మళ్ళీ రాక్షస హింసకు తలబడుతుందేమోనని మురార్జీ భావించాడు.

ఇందిరాగాంధీకి ఒక తంతి నిస్తూ "గుజరాత్ పరిస్థితి అగ్ని పర్వతంలా ఉన్నది. ప్రజలు ఏకమై-న్యాయంగా, ఏక కంఠంతో, ప్రజావాణిగా-కోరినా అసెంబ్లీని రద్దు చేయక కేంద్రం మొండితనం చూపడాన తాను విధిలేక నిరవధిక నిరసన వ్రతానికి పూను కుంటున్నట్లు హెచ్చరించి - సత్యాగ్రహానికి పూనుకున్నాడు. ప్రజలు అంతవరకూ ప్రభుత్వం ఎంత క్రూరంగా కాల్పులు జరిపినా, పోలీసులు ఎన్ని అమానుషాలు చేసినా హింసా పద్ధతులను అవలంభించ లేదు. అంతటి అహింసా ఉద్యమాన్ని నడిపిన యువతరపు వీరవృత్తికి నా సహకారాన్ని ఇవ్వకుండా ఉండలే నన్నాడు.

ఉద్యమానికి అలా ఒక మహనీయమైన నైతిక శక్తి లభించడంతో ఇందిరాగాంధీ విధిలేక శాసన సభను రద్దు చేయవలసి వచ్చింది.

దాదాపు సంవత్సరం గడచినా పరిస్థితులలో మార్పు లేదు. రాష్ట్ర పతి పాలనలో ప్రభుత్వాధికారులు, ఇందిరా వర్గపు కాంగ్రెసు వారు ఇష్టా

రాజ్యానికి పూనుకున్నారు. అవినీతి విలయ తాండవం ప్రారంభించింది. క్రమంగా కేంద్రం దురంతాలను ఎక్కువచేస్తూ పోలీసు రాజ్యాన్ని నెల కొల్పు చూడడంతో ప్రజలలో ప్రారంభమైన ఆక్రోశాన్ని గుర్తించి "తక్షణం ఎన్నికలు జరపాలి" అని డిమాండు చేస్తూ మురార్జీ నిరశనం ప్రారంభించాడు.

ఇందిరా గాంధీ అంగీకరించక తప్పలేదు. ఎన్నికలు ప్రకటించడం తోటే మురార్జీ ఉపవాస విరమణ చేశాడు. విద్యార్థులను ఉద్బోధిస్తూ, "ఈ మార్పు మీ ద్వారానే రావాలి. సమగ్రమైన మార్పు వచ్చిందాకా విశ్రమించకండి. పోరాడుతూ ముందుకు సాగండి. కాని అహింసా పథాన్ని మాత్రం విడవకండి. ఆ మార్గమే మీకు జయాన్నిస్తుంది" అన్నాడు.

అలా గుజరాత్ ఉద్యమం ఒక కొత్త బాటను దేశానికి చూపింది.

"చీకటిలో కాంతి రేఖలు కన్పిస్తున్నాయి" అన్నాడు జయ ప్రకాశ్ నారాయణ్. దేశంలో వ్యాపిస్తున్న అరాచకాన్ని ఆపడానికి "గుజరాత్ నవ నిర్మాణ సమితి ఉద్యమాన్ని అధ్యయనం చేయండి" అని పిలుపు నిచ్చాడు.

అప్పుడే బీహారులో ఉద్యమం ప్రారంభమైంది. "బీహార్‌లో ఏదైనా ప్రభుత్వం అవినీతిలో తారాస్థాయికి చేరుకున్నదంటే అది గఫూర్ ప్రభుత్వమే." ఇది - ఆర్. యస్. యస్. ఆనాటి తూర్పు విభాగపు ఆర్గనైజర్ భావూరావ్ దేవరస్ వాఖ్య.

1974 జనవరిలో ఢిల్లీలో దేశమంతటి లోని విశ్వవిద్యాలయాల విద్యార్థి సంఘాల నాయకుల సమావేశాన్ని విద్యార్థిపరిషత్ ఆధ్వర్యంలోని ఢిల్లీ విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘం ఏర్పాటు చేసింది.

పాత తరానికి చెందిన నాయకులు అస్త్ర సన్యాసం చేశారనే భావ నను యువకులు ఆ సమావేశంలో వ్యక్తం చేశారు.

సాంఘికంగా, ఆర్థికంగా మార్పులు రావాలి. దానికై యువతరమే కదలాలని నిశ్చయించుకున్నారు.

ప్రభుత్వం మారనిదే ఈ మహత్తర వ్యూహం సాధ్యం కాదు. నిరుద్యోగ సమస్య నిర్మూలనం కాదు అనుకున్నారు.

భవిష్యత్తు తరాలకు సుఖాన్ని-శాంతిని సమాన అవకాశాలను ఇచ్చి ఉజ్వల భవిషత్తులోకి యువ తరాన్ని నడిపించే ఉద్యమం దేశ వ్యాప్తంగా రావాలని యువకులు కోరారు.

బీహారులో వ్యాపించిన అక్రమాలకు, అవినీతికీ వ్యతిరేకంగా ఉద్యమించాలని నిర్ణయించు కున్నారు యువ విద్యార్థులు.

ఆ సమావేశానికి పాట్నా విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘ నాయ కుడు సుశీల్ మోడీ, విద్యార్థి పరిషత్ నాయకుడు రాంబహదూర్‌రాయ్ హాజరైనారు

బీహార్ మన దేశంలో అన్ని ప్రాంతాల కంటే సహజ సంపదలు ఎక్కువగా ఉన్న ప్రాంతం-విలువ గల ఖనిజ సంపదలు, అమృతాలు ప్రవహించే నదులు బీహార్‌ను ఆవరించి ఉన్నాయి. అయినా అన్ని ప్రాంతాలలో అదే వెనుకబడిన ప్రాంతం. వెట్టిచాకిరీ, బానిసలలా మనుషులను అమ్ముకోడం అక్కడే మిగిలింది. అదీ బీహారు జీవనం !

లంచగొండితనం అక్కడ నిత్యజీవనమైంది. ఒక ఉద్యోగిని వేరే పోలీసుస్టేషనుకు (ముజఫర్‌పూర్) ట్రాన్స్ఫరు చేయడానికి లక్ష రూపా యల లంచం! ఎందుకు ? అదే మార్గాన అక్రమకాన్ని దొంగతనంగా

రవాణా చేస్తారట! ఈ రహస్యాన్ని బయట పెట్టినందుకు ఒక జర్నలిస్టును హత్య చేశారు. "హత్య జరిగిందని" మొరపెట్టుకుంటే వినే నాధుడు లేడు.

ప్రస్తుత వ్యవస్థలో ప్రజలకు సమానావకాశాలు లభించవు. హరిజనులపై అత్యాచారాలు మితిమీరుతున్నాయి. రైతు దిక్కులేని వాడైనాడు. వ్యవసాయ పరిశోధనల కొత్త కొత్త లాభాలు అతనికి అందడం లేదు. రైతుకూలీల బ్రతుకు మరీ దయనీయమై పోయింది. కార్మికులు అధికధరలకు తట్టుకోలేక అణగారి పోతున్నారు. కాలేజీలనుండి, విశ్వవిద్యాలయాల నుండి చదువులు పూర్తి చేసుకొని బైటకువచ్చే విద్యార్థులకు రాజకీయపు ప్రాపకం లేందే ఉద్యోగం దొరకదు. తాము చదువుకున్న చదువు ఉపాధికి పనికి వస్తుందనే విశ్వాసం చచ్చిపోయింది" అని నాటి పరిస్థితిని నానాజీ దేశ్ ముఖ్ వివరించారు.

మనిషికి మనిషిగా బ్రతికే కనీసపు అవకాశం లేని బీహారును అక్కడి తుచ్ఛ కాంగ్రెసు రాజకీయాల కారణంగా ఎప్పటికప్పుడు అణగద్రొక్కి ఆర్థాకలితో మిగల్చడమే జరుగుతుంటే యువతరం చలించింది.

ఆ ఆవేదన తోటే ఢిల్లీనుండి తిరిగివచ్చిన విద్యార్థి నాయకులు ఫిబ్రవరి 17-18 తేదీలలో ప్రాంత విద్యార్థి నాయకుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు.

అదొక చారిత్ర్యాత్మకమైన సమావేశమైంది.

ఆ సమావేశం లోనే "బీహారు ప్రాంత ఛాత్ర సంఘర్ష సమితి" ఏర్పడింది.

నిరుద్యోగాన్ని నిర్మూలించాలి —
ధరలను అదుపులో పెట్టాలి—
అవినీతిని తుదముట్టించాలి —

విద్యా విధానం పూర్తిగా మారి, ఉపాధికి ఉపకరించే విద్యా పద్ధతి ప్రవేశ పెట్టబడాలి—

ఈ నాల్గు కోరికలతో విద్యార్థులు ఉద్యమించారు. సుదీర్ఘంగా, శాంతియుతంగా ఈ ఉద్యమాన్ని నడపాలని కూడా తీర్మానించుకున్నారు.

కాని ప్రభుత్వం వెంటనే విద్యార్థి నాయకులను ''మీసా'' క్రింద అరెస్టు చేసి, నిర్బంధించింది.

సుమారు 500 మంది విద్యార్థులు ప్రభుత్వ చర్యకు నిరసన తెలుపుతూ ఫిబ్రవరి 26 న ముఖ్యమంత్రి ఇంటి ముందు ధర్నా జరిపారు. కాని ముఖ్యమంత్రి విద్యార్థి ప్రతినిధులను కలవలేదు. ''మొరలు ఆలకించ లేదు''.

తరువాత విద్యార్థులు తమ ఉద్యమాన్ని జిల్లా స్థాయిలకు వ్యాపింప చేశారు.

మార్చి మొదటి వారంలో అయిదు రోజులు బీహారులో అన్ని జిల్లాల కలెక్టర్ల కార్యాలయాల ముందు యువకులు ప్రదర్శనలు జరిపారు. ప్రభుత్వం కదలలేదు. పాట్నాలో విద్యామంత్రి నివాసం ఎదుటే ప్రదర్శన జరిపినా సభ్యతకైనా బైటికి రాలేదు ఆ మంత్రి పుంగవుడు.

ప్రభుత్వం మొండితనానికి దిగింది. గుజరాత్‌లో విద్యార్థి ఉద్యమం జయప్రదం కావడంతో అలాంటిది పునరావృతం కాకూడదని, బీహారు ప్రభుత్వంతో పాటు కేంద్రం కూడా కసాయి తనానికి పూనుకున్నది. విద్యార్థులను కలిసి, చర్చించి సామరస్యంగా సమస్యను పరిశీలించాలనే సాధారణమైన ఇంగితం కూడా మంత్రులలో కన్పించలేదు. అలా విసిగిపోయి - తిరస్కరింపబడి విద్యార్థులు విధిలేక శాసన సభా ద్వారాన్ని తట్టారు.

మార్చి 18 న విద్యార్థుల ఉద్యమం ఒక కొత్త మలుపు తిరిగింది. ఆ రోజు వేలకొలంది విద్యార్థులు అసెంబ్లీని ఘెరావ్ చేశారు. వారి 'చతుస్సూత్ర ప్రణాళిక'ను ప్రభుత్వానికి అందచేసి పరిశీలించమని ప్రాధేయ పడ్డారు.

కాని ప్రభుత్వం నరమేధానికి పూనుకున్నది.

ఈ నరమేధానికి తొలి మెట్టుగా కమ్యూనిష్టులు అదే రోజు కాంగ్రెసు వారితో కలిసి వీధుల కెక్కారు. "సెర్చిలైటు" అనే పత్రిక ఆఫీసును విధ్వంసం చేశారు.

సెర్చిలైటు చేసిన ఘాతుకం ఏమిటి? విద్యార్థుల కోరికలను సానుభూతిగా పరిశీలించడమే!

అంతవరకు జె. పి. రంగం లోకి దిగలేదు. ఆయన పదవీ రాజకీయాల నుండి విరమించుకొని నాటికి 27 ఏండ్లు.

నీతికి, శీలానికి నీరాజనాలిచ్చే జాతి మనది. స్వాతంత్ర్య పోరాటంలో మేరువంత ధైర్యంతో నిలిచి, స్వరాజ్యం లభించిన తరువాత పదవుల నాశించకుండా - ఆడంబరం లేకుండా-సాదాగా జీవిస్తూ, మహోన్నతంగా ఆలోచిస్తూ "బహుజన సుఖాయ-బహుజన హితాయ" గా జీవించే ఋషి లాంటి వాడు జె. పి. అందుకే సహజంగా సమాజంలో ఉన్నతమైన గౌరవస్థానాన్ని పొందాడు.

క్లిష్ట సమయాల్లో దేశం స్వాగతించేవి అలాంటి వారి నాయకత్వాన్నే. ప్రభువులకూ-ప్రజలకు, దుర్మార్గానికి-మంచికి, పశుబలానికి, సాత్విక స్థైర్యానికి పోరాటం వచ్చినప్పుడల్లా, భారతీయ సంస్కృతీ పరంపరల అమృత ప్రాశనం చేసిన ప్రజ ప్రభువుల పశు బలాన్ని నిగ్రహించడానికి - ఋషుల్లాంటి నాయకులనే సమర్థిస్తారు. ఇది మన పరంపర.

# 5

# జె. పి. కదిలాడు

'అన్యాయాన్ని అవినీతిని
దమన కాండను సహించటం
పిరికితనం.'

—*గాంధీ*

జె. పి. ది ఒక ప్రయోగాత్మక జీవితం. జీవితంలో పెనుగులాడుతూ పైకెదిగినవాడు కావడాన, తొలి రోజుల్లో మార్క్సిజంతో ప్రభావితుడైనా – ఆవేశం చల్లారి అనుభవం వికసించిన మలి రోజుల్లో సర్వోదయాన్ని స్వీకరించాడు. ఆ సర్వోదయం నడిచే తీరులోకూడా ఆయనకు పూర్తి తృప్తి కలిగిందనలేము.

మన దేశపు మౌలిక సమస్యను గురించిన అవగాహన అంత తేలికగా లభించేదికాదు. ఆ అవగాహన కొరకు నేటి వరకూ అన్వేషిస్తూ నిరంతరం నడుస్తున్నవాడు జె. పి.

బీహార్‌లో ఉద్యమానికి పూర్వం కరువుతో, వరదల బాధతో బీహారు ప్రజలు పడిన బాధలకు జె. పి. కదలి పోయినాడు. సహాయ కార్యక్రమాలలో, పునరావాస కార్యక్రమాలలో తపనతో పాల్గొన్నాడు. తనలా పాల్గొన్న ఇతర సేవా సంస్థల్నికూడా జె. పి. పరిశీలించి చూచాడు. అప్పుడే రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ (ఆర్. యస్. యస్.) తో ఆయనకు సంబంధ మేర్పడింది. బీహారులో గోవిందాచార్

పాట్నా నగరానికి సంఘ ప్రచారకుడు. జె. పి. స్వీకరించిన సహాయ కార్యక్రమాలలో గోవిందాచార్ నాయకత్వాన స్వయంసేవకులు పని చేశారు. సంఘ సభ్యుల పట్టుదల, క్రమశిక్షణ, ఆదర్శవాద జీవనం, తపన, నిస్వార్థ సేవా స్వభావం జ్వలంతంగా జె. పి. కి కన్పించాయి.

ఛాత్ర సంఘర్ష సమితిలో విద్యార్థి పరిషత్ ఒక భాగస్వామి. యువశక్తుల సమీకరణలో, ఒకటై నిలిచిన జాతీయ యువజన ప్రతినిధిగా ఛాత్ర సంఘర్ష సమితిని జె. పి. గుర్తించాడు. అప్పటికే ఆయనకు పార్టీలు, మిగతా సంస్థలు ఈ దేశపు సమస్యలకు మౌలికమైన పరిష్కారాన్ని ఇవ్వగలవనే నమ్మకం తగ్గుతూ వచ్చింది. గుజరాత్ నవనిర్మాణ సమితి వెనుక పనిచేసిన బలాబలాల పరిశీలన చేశాడు. ఆయనకు అదొక ఆశారేఖగా కన్పించింది. యువశక్తితోటే మార్పు వస్తుందని నమ్మకం కలిగింది.

కొన్ని నెలలకు పూర్వమే దేశంలో పెరుగుతూన్న అవినీతిని గురించి ఇందిరా గాంధీకి ఆయన వ్యథతో ఒక లేఖ వ్రాశాడు. పైనుండి క్షాళన కార్యక్రమం మొదలవాలని ఒక వ్యాసం "First Things First"-వ్రాశాడు. జస్టిస్ 'రే' నియామకం అనుచితంగా జరిగిందని, అది రాజ్యాంగ విరుద్ధమని, అది పునరాలోచింప బడాలని వ్రాశాడు. ఇందిరా గాంధీ కదల లేదు. మెదల లేదు.

ముందుగా విద్యార్థి నాయకులతో సంప్రదించాడు. వారి ఉద్యమ రీతిని, అహింసాయుతంగా సమాజంలో సంపూర్ణమైన మార్పును తెచ్చుకునేందుకు విద్యార్థులు - యువజనం తీసుకున్న నిశ్చయాన్ని హర్షించాడు. ఈ యువజనతా ప్రభంజనానికి ఒక దిశాసూచి కావాలి అని అనిపించింది. ఆ పాత్రను జె. పి. తానై నిర్వహించడానికి సిద్ధ

పడ్డాడు. అవినీతికి విరుద్ధంగా పోరాటం ప్రారంభించాడు. విద్యార్థులకు అధికార రాజకీయాల జోలికి పోని, నైతిక విలువలు-గౌరవ ప్రతిష్ఠలు గల వ్యక్తి దేశంలో పెద్ద తరానికి చెందినవాడు – సలహా సంప్రదింపులకు కావాలి.

అప్పుడే మార్చి 18 న అసెంబ్లీ సమావేశం కానున్నది. ఆ నాడు గవర్నర్ ప్రసంగిస్తాడు. ''గవర్నరును, అసెంబ్లీ సభ్యుల్ని పాట్నా శాసన సభా భవనానికి వెళ్ళనీయకండి.'' అని పిలుపు ఇచ్చాడు – జె. పి ప్రభుత్వము పోలీసు బలగాన్ని ఉసికొల్పింది. ఆ తర్వాత రెండు రోజులు అమానుషమైన కాల్పులు జరిగాయి. ఆ కాల్పుల్లో ఎందరు మరణించారో, ఎందరికి గాయాలు తగిలినవో నేటికీ లెక్కలు తేలలేదు. కాంగ్రెస్ ప్రెసిడెంటు ఉమాశంకర్ దీక్షిత్ ఆ కాండ కంతటికీ ఆర్. యస్. యస్. వామపక్ష దుందుడుకు శక్తులూ కారణమన్నాడు. బీహార్‌లో ఈ శక్తులు హింసను ప్రేరేపిస్తున్నా యన్నాడు.

జె. పి. ప్రతిపక్షాలకు కూడా పిలుపు ఇచ్చాడు. జనసంఘం అంతకు ముందు నుంచే మద్దతు ఇస్తూన్నది. సోషలిస్టుల్లో ఒక గ్రూపు మాత్రం బి. యల్. డి. తో చేరి సహకారంతో ముందుకు వచ్చింది. జార్జి ఫెర్నాండజ్‌కు మాత్రం ఈ ఉద్యమం సఫలం అవుతుందనే నమ్మకం అప్పట్లో లేదు. అప్పటికే ప్రతిపక్షాలు రైల్వే స్ట్రైకుకై పిలుపు ఇచ్చాయి. యూనియన్లు సిద్ధపడ్డాయి. కాని ఆ స్ట్రైకును ఇందిరా ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. స్ట్రైకులో వేలకొలది కార్మికులు బలి అయినారు. కోట్ల రూపాయలు నష్టమైనాయి. ఎందరో మిగతా నాయకులను మీసా క్రింద నిర్బంధించారు. అప్పటి వరకు ఫెర్నాండెజుకు వామపక్ష శక్తుల ఐక్య పోరాటంమీద విశ్వాసం ఉండేది. మేలో జరిగిన స్ట్రైకులో సి. పి. ఐ. కూడా చేరింది. కాని దాని స్వభావంలోనే ప్రజా

పోరాటాల విచ్ఛిత్తిచేసే లక్షణం ఉన్నది. చివరికి ప్రభుత్వంతో మిలాఖత్ అయి స్ట్రైకును వెన్నుపోటు పొడిచి, చప్పగా జారుకున్నది. స్ట్రైకును మే 28న వాపసు తీసుకోవాల్సి వచ్చింది. జాతీయ శక్తుల సమీకరణే ప్రత్యామ్నాయం అనేది నిష్కర్షగా తేలిన సత్యమైంది.

జె. పి. అధ్వర్యాన 1974 ఏప్రిల్ 4వ తేదీన పాట్నా ఒక అద్భుతాన్ని దర్శించింది. "మా హృదయాలు క్షోభిల్లి పోతున్నాయి. మా నోళ్ళు కట్టివేయ బడ్డాయి" అని వ్రాసిన అట్టలను పట్టుకొని 72 ఏండ్ల జె. పి. నేతృత్వంలో ప్రజల మౌన యాత్ర పాట్నా నగర వీధుల్లో బయలు దేరింది. చేతులకు నల్ల బాడ్జీలు, నోళ్ళకు కాషాయపు గుడ్డలు కట్టుకొన్నారు యువకులు - ప్రజలు. తమ అసహాయ స్థితికి నిదర్శనంగా "ఈ మౌనం మా దృఢ నిశ్చయానికి సంకేతం" అని కొన్ని అట్టల మీద వ్రాసి పట్టుకున్నారు. అది తొలి సంకేతమైంది. అదే తొలి కదలిక ఐంది.

ఇందిరా బ్రిగేడ్ వారు ఆనాడు జె. పి. ని హత్య చేయాలనే సంకల్పించారు. ఊరేగింపు సాగుతూడంగా జె. పి.మీద కాల్పులు జరిగాయి. కాని అదృష్టవశాత్తు అవి ఎవరి ప్రాణాలు తీయలేదు. కాల్పులు జరుగుతున్నా చలించకుండా సాగింది ఆ మౌన యాత్ర.

ఇందిరాగాంధీకి మొదటి నుండీ గుజరాత్, బీహార్ ఉద్యమాల వెనుక ఒకే శక్తి కన్పించింది. అది ఆర్. యస్. యస్. కాంగ్రెస్ నాయకులు, నాటి ప్రధాని గాంధీ ఈ ఉద్యమాలను ఆర్. యస్. యస్. హింసాకాండగా దుయ్యబట్ట నారంభించారు. ఆర్. యస్. యస్., జనసంఘ, విద్యార్థి పరిషత్‌లను వెలివేయించే ధోరణి తీవ్రరూపం దాల్చింది. జె. పి. కి "ఆర్. యస్. యస్; జనసంఘ కబంధ హస్తాల పాలు కావద్దని" ఢిల్లీ ఏ. ఐ. సి. సి. సమావేశాలలో ఉపన్యసిస్తూ

ఇందిరాగాంధీ విజ్ఞప్తి చేసింది. అఖిల భారత కాంగ్రెసు సమావేశంలో తీర్మానాలు చేయించి ఆర్. యస్. యస్. మీద దాడి చేయ బూనింది.

ఇలా బాధ్యత నుండి తప్పుకోవడమే కాని, ప్రజల సమస్యలను పరిష్కరించే సిద్ధత ప్రభుత్వం కనబరచలేదు. 7 నెలలు బీహార్ అసెంబ్లీ సమావేశాలు జరగలేదు. ఈలోగా 176 ఆర్డినెన్సులు ప్రకటింప బడ్డాయి. ప్రజాస్వామ్యాన్ని పరిహసించడానికి ఈ విధంగా ప్రయత్నిస్తుంటే జూన్ 5 న పాట్నాలో మూడు లక్షల మంది ప్రజలతో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది; శాసన సభ రద్దు చేయాలని లక్షలాది ప్రజలు సంతకాలు చేసిన మహజర్లు వాహనాల మీద మోసుకెళ్ళి గవర్నరుకు సమర్పించారు. "ఒక ఏడాది చదువులు మానండి-కదలిరండి" అని జె. పి. పిలుపు ఇచ్చాడు. "అసెంబ్లీ రద్దు కావాలి. ప్రజాస్వామ్యం నిజంగా ప్రజల కొరకు ప్రజల చేత, ప్రజల నుండి ఏర్పడ్డ స్వామ్యం కావాలి" అని ప్రజలు కోరారు. ఆనాటి బహిరంగ సభలో జె. పి. "సమగ్ర విప్లవం" కావాలని నినాద మిచ్చాడు.

ప్రభుత్వం దీనికి దమన నీతితో జవాబిచ్చింది.

కాని యువత కదిలింది.

యువత వెంట జె. పి. కదిలాడు.

అతని వెంట దేశం కదిలింది.

తత్ఫలితంగా 5 అక్టోబరు నుండి 3 రోజుల పాటు బీహార్ బంద్‌కు పిలుపు లభించింది. 5 వ తేదీన బందును రాబందుల పరం చేయడానికి ఇందిరాగాంధీ సామంతులు ప్రయత్నించారు. కాల్పులు అమానుషంగా సాగాయి. చచ్చినవారి సంఖ్య దొరక్కుండా, శవాలను రైలు ఇంజన్ల నిప్పుల్లోవేసి మాడ్చారని చూచిన ప్రజ గగ్గోలు పెట్టింది. మీసా

నిర్బంధాలు లెక్కలేదు. ప్రభుత్వం ప్రజలతో యుద్ధానికి దిగింది. విదేశీ దండయాత్ర లప్పుడు జరిపిన యుద్ధంలాంటిదది !

జె. పి. మరో అడుగు వేశాడు. అక్టోబరు 14 న ఒక చతుస్సూత్ర కార్యక్రమాన్ని ప్రకటించాడు. బీహారులో ప్రజా ప్రభుత్వాలను నెలకొల్పడానికి వ్యూహం ప్రకటించాడు. నవంబరు 3 లోగా అసెంబ్లీ రద్దవకపోతే, బీహారు శాసన సభను, మంత్రుల ఇండ్లను ఘెరావ్‌చేస్తా మన్నాడు.

ఈలోగా ఇందిరా గాంధీ—జె. పి. ల మధ్య సంధికి కొందరు తంటాలు పడ్డారు. ఒకరికి తాత్కాలికంగా బెడద తప్పాలి. మరొకరికి సమస్యకు పరిష్కారం లభించాలి. ఇందిరాగాంధీ ఈ ఉద్యమాన్ని ఇతర ప్రాంతాలకు ప్రాకనీయవద్దని కోరింది. ఆర్. యస్. యస్. వగైరాల ప్రమేయాన్ని నిరసించింది. సంధి పొసగలేదు.

జె. పి. మరుచరణం నవంబరు 27 న హరియానాకు నడిచింది. అక్కడ ఛాత్ర సంఘర్ష సమితి ప్రారంభిస్తూ ప్రభుత్వ అవినీతిని తీవ్రంగా విమర్శించి నల్లధనంలో పల్లవించే దొంగ ప్రభుత్వాలు దిగిపోవడానికి దేశంలో ఉద్యమాలే శరణ్యమన్నారు. ఇలాగే ఆంధ్రలో పర్యటించారు. మిగతా రాష్ట్రాలను కూడా ఈ ఉద్యమం గాడ్పు వీయడం మొదలైంది.

జె. పి. కోరినట్లు నవంబరు 3 లోగా ప్రభుత్వం ఏ చర్యా తీసుకోలేదు. పాట్నాలో ఈ ధోరణి నిరసిస్తూ చారిత్ర్యకమైన ప్రదర్శన జరిగింది. ప్రభుత్వం పాట్నా నగరాన్ని నలువైపులా 'సీలు' చేసింది. ఎక్కడి వాహనాల నక్కడ ఆపింది. రష్యా బృందాలను అసెంబ్లీలోకి అనుమతించింది కాని - పత్రికా ప్రతినిధులను రానీయలేదు. రోడ్డు

రవాణా, రైళ్ళు బందయినాయి. నగరంలో బారికేడులు నిర్మించారు. అసెంబ్లీ చుట్టూ, మంత్రుల ఇండ్ల చుట్టూ సశస్త్ర పోలీసు కాపలా.

ప్రజాశక్తిని ఈ పశుబలం ఆపగల్గుతుందా ! కొందరు శవాలను దహనానికి తెస్తున్నట్లు, కొందరు పెండ్లి ఊరేగింపులు తీసుకొని వస్తున్నట్లు పొలాలకు అడ్డుగా కొందరు, మారు దారులలో కొందరు, చాటుగా మరికొందరు రకరకాల దారుల లక్షకు పైగా జనం పాట్నా చేరుకున్నారు.

శాంతియుతంగా సాగిన ఈ ఉద్యమాన్ని పోలీసులు చెల్లాచెదురు చేయాలని విఫల ప్రయత్నం చేశారు. లాఠీఛార్జీ చేశారు. బాష్పవాయువును ప్రయోగించారు. సాయుధ పోలీసులు పిల్లలను, పెద్దలను, స్త్రీలను, వృద్ధులను వెంటబడి పశువులను కొట్టినట్లు కొట్టి తరిమారు. జయప్రకాశ్ మీద కూడా పోలీసు విరుచుకపడింది. అప్పుడే నానాజీ దేశ్‌ముఖ్ - జనసంఘ ప్రముఖనాయకుడు - అడ్డుపడి జయప్రకాశ్‌ను తనలో పొదవుకొని కాపాడాడు. ఆ దెబ్బకు నానాజీ చేయి విరిగింది. లేనిచో జె. పి. పని ఏమై ఉండేదో ! జె. పి. ప్రాణాలను ఆనాడు కాపాడిన కీర్తి నానాజీకి దక్కింది. బీహారు ప్రాంతం ఒక పెద్ద కారాగారమైంది. నడివీధులు జలియన్‌వాలా బాగ్ లైనాయి.

ఈ ఊరేగింపు ప్రభావాన్ని తగ్గించడానికి నవంబరు 11,16 లలో కాంగ్రెసు, కమ్యూనిస్టులు విపరీతంగా ధనవ్యయం చేసి అట్టహాసంగా ఉరేగింపులు జరిపారు. ఉద్యమం, ఊరేగింపు ఒక సమస్య కోసం బయలు దేరుతాయి. పరిష్కారాన్ని వెదుకుతాయి. కౌంటర్‌గాచేసే ఊరేగింపులు నకిలీ నగల్లానే ఉంటాయి. కమ్యూనిస్టులు సాయుధులై ఊరేగారు. 'ఎర్రకోటపై ఎర్రజెండా' ఎగురవేస్తా మన్నారు. అడ్డు తగిలితే చంపేస్తామన్నారు. జె. పి. ని, విద్యార్థి ఉద్యమాన్ని, ఆర్. యస్. యస్. ను విపరీతంగా దూషించారు, జనం బెదిరారనుకున్నారు.

నవంబరు 18 న ప్రజా వెల్లువ జవాబిచ్చింది. జె. పి. ముందుగా అనుకోకుండా పిలిచిన సభ అది. క్షణాల మీద వార్త ప్రసరించింది. వేల ప్రజలు గుమి కూడారు. ప్రజల సమాయత్తత ఒక స్థాయికి చేరు కొన్నది. అన్ని స్థాయిలలో జాతీయ నాయకత్వం కావాలి. దానిపై నవంబరు 26 న రెండు రోజుల పాటు ప్రతిపక్ష పార్టీల సమావేశాలు జె. పి. పిలుపుపై జరిగాయి. అంగీకారం కుదుర లేదు. జె. పి. 'నల్ల ధనం-చెల్లని రాజకీయాలు' మరచిపొండని మొండివారిని కోరాడు. కొంతమేరకు ఒడంబడిక కుదిరింది.

ఇంతలో అనుకోకుండా సమస్తిపూర్‌లో యల్. యన్. మిశ్రా బాంబు ప్రేలి చనిపోయినాడు. ఈ ఉదంతాన్ని పురస్కరించుకొని 90 మంది నాయకులను మీసా క్రింద అరెస్టు చేసింది ప్రభుత్వం. గఫూర్‌ను బీహార్ ముఖ్యమంత్రి పదవినుండి తొలగించమని బీహార్ రివెన్యూ మంత్రి కేదార్ పాండేతో సహా అనేకులు అగ్రనాయకులను కోరారు. అయినా కేంద్రంలో చలనం కలగ లేదు. బీహార్ ప్రజలు "జనతా సర్కార్" స్థాపనకు ఆయత్త మవుతూ వచ్చారు.

ఇందిరాగాంధీకి మిశ్రా హత్య ఒక భయాన్ని కలిగించింది. ప్రజలు ఆమె వైపు అనుమానంగా చూడ నారంభించారు. అందుకే పార్టీని తనకు మరింత సన్నిహితంగా చేసుకునేందుకు బారువాను కాంగ్రెసు ప్రెసిడెంటుగా చేసుకున్నది.

పరిస్థితులు విషమిస్తున్నాయి. ధరలు విపరీతంగా పెరిగి పోతున్నాయి. పరిస్థితి స్తబ్ధమై పోయింది. ఇందిగాంధీ నియంతృత్వపు -ధోరణిలో సడలింపు చేసుకొకపోగా ప్రతిపక్షాలను అణచి వేయాలని నిశ్చయించుకున్నది. ఆ కార్యక్రమానికి తొలుతగా యువశక్తికి ప్రతి నిధి ఐన ఆర్. యస్. యస్. ను అణచివేయాలని వ్యూహం రచించింది.

ఈ చర్యను గర్హిస్తూ ఫిబ్రవరి 16 న ఢిల్లీలో "చట్ట విరుద్ధ చర్యలు చేస్తున్నట్టు ఏమాత్రం ఋజువులు లేకుండా ప్రభుత్వం ఆర్. యస్. యస్. ను నిషేధిస్తే మనడం అత్యవసర అధికారాలను దుర్వినియోగం చేయడమే. సంఘం జాతీయ స్వచ్ఛంద సేవకుల సంఘటన" అని ప్రకటించారు జె. పి.

ప్రతిపక్షాలు ఢిల్లీలో సమావేశమయ్యాయి. జనసంఘ, సంస్థా కాంగ్రెసు, సోషలిస్టు, రివెల్యూషనరీ సోషలిస్టు, బి. యల్. డి., ద్రవిడ మున్నేట్ర కజగం వగైరాలు కలిసి 75 మార్చి 6 న పది లక్షల మందితో ప్రదర్శనాన్ని ఢిల్లీలో జె. పి. నాయకత్వాన నడిపి, 1971 లో పెట్టిన ఎమర్జెన్సీని ఎత్తివేయాలని తొలి డిమాండుగా జన వాణిని 'ఛార్టర్ ఆఫ్ డిమాండ్స్' రూపంలో ప్రధానమంత్రికి అంద జేయాలని నిశ్చయించాయి.

ఢిల్లీ ప్రదర్శనం కాగానే ఏప్రిల్ 6 వ తేదీలోగా వివిధ ప్రాంత రాజధానులలో ప్రదర్శనలు 'చార్టర్ ఆఫ్ డిమాండ్స్' ఇవ్వడం జర గాలని నిర్ణయించుకున్నాయి.

కాంగ్రెస్‌లో కూడా ముసలం పుట్టింది. ఇందిరాగాంధీకి చవాన్, జగజ్జీవన్‌లమీద మొదటి నుండీ అనుమానమే. బారువాను పంపి తనను సమర్థిస్తారా లేదా అని తేల్చుకోమని కోరితే చవాన్ తప్పుకున్నాడు. జగజ్జీవన్‌రాం 'చవాన్ సమర్థిస్తే నేనూ సమర్థిస్తా' నన్నాడు. కమ్యూ నిస్టులు వీరిపై విరుచుకపడ్డారు. వత్తిడికి లోనై అలా ఇద్దరూ చివరికి సమర్థిస్తూ ప్రకటనచేశారు.

మార్చి 6 న ఢిల్లీలో అపూర్వ జనయాత్ర జె. పి. నాయకత్వాన నడిచింది. ప్రభుత్వం దాన్ని ఆపడానికి పూర్తిగా ప్రయత్నించింది. కాని విఫలమైంది. మార్చి 4, 5 వ తేదీలలో ఢిల్లీలో జనసంఘ సమా

వేశాలు జరిగాయి. ఆ సమావేశాలకు ప్రతినిధులే 40 వేల మంది వచ్చారు. వారంతా మరునాటి జనయాత్రలో నడిచారు.

7 లక్షల మందితో సాగినయాత్ర అది.

జె. పి. ముందునడువగా - ఎల్. కె. అద్వానీ, జగన్నాథ్‌రావ్ జోషి, చరణ్‌సింగ్, పిలూ మోడి, అశోక్ మెహతా, మహావీర్ త్యాగి, జార్జి ఫెర్నాండజ్, మధు లిమయే, మధు దండావతే, త్రిదిబ్ చౌదరి, ఎరా సెజియాన్, ప్రకాశ్ సింగ్ బాదల్, సమర్ ముఖర్జీ, జ్యోతిర్మయ బసు-దేశమే కదలినట్లు కదిలారు.

ఆ చార్టర్ ఆఫ్ డిమాండ్సులో ప్రజలు అవినీతిపై యుద్ధం ప్రకటించారు. బీహారు అసెంబ్లీని రద్దు చేయాలన్నారు. ధరలు స్థిర పడాలని కోరారు. ఆదాయ పరిమితి 10:1 నిష్పత్తిలో నియమించాలన్నారు. అధికార వికేంద్రీకరణం జరగాలన్నారు. వృత్తి విద్యను ప్రవేశపెట్టాలి. ఉద్యోగావకాశాలు అందరికీ లభించే ఆర్థిక విధానం ఏర్పడాలి. 1971 ఎమర్జెన్సీ వెంటనే రద్దుచేసి, మీసాలాంటి చట్టాలను తుడిచి వేయాలి. అవినీతి నిర్మూలనం కొరకు సంతానం కమిటీ సిఫార్సులు అమలు జరగాలి - అని నివేదించారు.

అది జాతి ప్రభుత్వానికి సమర్పించిన ''ఆశయ పత్రం.''

కాని ఇందిరాగాంధీ ప్రజలకు దూరమైన మనిషి. పోలీసు పహారాలో, సైనిక సంరక్షణలో, అవినీతి వలయంలో జీవిస్తూన్న నియంత. ప్రజలు ఇందిరా గాంధీకి వ్యతిరేకంగా హెచ్చరిక నిచ్చారు. హెచ్చరికను ఇందిరాగాంధీ లెక్క చేయలేదు. జాతి హృదయాన్ని గాయ పరచింది.

# 6

# ఎమర్జన్సీ

'రాజ్యాంగాన్ని ఆధారం చేసుకునే
రాజ్యాంగాన్ని మట్టుబెట్టాడు నియంత హిట్లర్.'

12 జూన్ 1975 మరపురాని దినం.

1971 పార్లమెంటు ఎన్నికలలో ఇందిరాగాంధీ ఉత్తర ప్రదేశ్ లోని రాయబరేలి నియోజక వర్గం నుంచి పోటీ చేసి, ప్రత్యర్థి శ్రీ రాజ నారాయణ మీద లక్షకు పైగా ఓట్ల ఆధిక్యతతో గెలుపొందింది.

ఇందిరా గాంధీ అక్రమాలు చేసి గెలుపొందిందని రాజనారాయణ్ ఆరోపించాడు. నియమానికి మించి ధనాన్ని వెదజల్లిందనీ, ప్రధాన మంత్రిగా తన అధికారాన్ని దుర్వినియోగం చేసుకున్నదనీ, ప్రభుత్వ యంత్రాంగాన్ని తన జేబుసంస్థగా ఉపయోగించుకున్నదనీ ఆరోపించాడు.

ఈ ఆరోపణలతో ఇందిరాగాంధీ ఎన్నికను సవాలుచేస్తూ అలహాబాదు హైకోర్టులో పిటీషను దాఖలుచేశాడు.

పిటీషను మీద నాలుగేండ్లు విచారణ నడిచింది.

నాలుగేండ్లు నడిచిన ఆ విచారణ 1975 జూన్‌లో తీర్పుకు సిద్ధమైంది. ఎన్నికల పిటీషన్‌ని విచారణ చేస్తున్న అలహాబాదు హైకోర్టు

జడ్జి జస్టిస్ జగ్‌మోహన్‌లాల్ సిన్హా తీర్పుకు తేదీ నిశ్చయించాడు. గుజరాత్‌లో శాసన సభకు ఎన్నికలు జరుగుతున్న రోజులవి. తీర్పు ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా వస్తే దాని ప్రభావం ఎన్నికల మీద పడ వచ్చునని కోరగా, తీర్పు తేదీని వాయిదా వేశాడు జస్టిస్ సిన్హా.

తీర్పు ఇందిరాగాంధీకి అనుకూలంగా వచ్చేటట్టు అన్ని విధాల ప్రయత్నాలు జరిగాయి. ఒక పార్లమెంటు సభ్యుడు జస్టిస్ సిన్హాకు 50 వేల రూపాయల ఆశ చూపాడట. ఒక తోటి జడ్జిద్వారా 'తీర్పు తరువాత సుప్రీంకోర్టు జడ్జిగా ప్రమోషన్ పొందే అవకాశాన్ని పొంద వచ్చ'ని జస్టిస్ సిన్హాకు సంకేతింప చేశారట.

జస్టిస్ సిన్హాలో ఉన్న ఆస్తిక్య భావానికి ఆహుతులిచ్చి తమవైపు మళ్ళించు కోవాలని ఒక సాధు పుంగవుణ్ణి పురమాయించారట !

గృహ మంత్రిత్వ శాఖకు చెందిన ప్రేమ ప్రకాశ్ సయ్యర్ యు. పి. ఛీఫ్ జస్టిస్‌ను కలుసుకొని ఇందిరా గాంధీ తలపెట్టుకున్న విదేశీ పర్యటన లోగా తీర్పు వస్తే – అది ఆమెకు వ్యతిరేకమైతే–ఆమెకు ఇబ్బంది కలుగ చేస్తుందనీ, కనుక అప్పట్లో తీర్పు రాకుండా వాయిదా వేయించమని చెప్పించడానికి తంటాలు పడ్డాడట.

జస్టిస్ సిన్హాకు ఈ వత్తిడి చికాకు కలిగించి ఉండవచ్చు. 12 జూన్‌న తీర్పు అని ప్రకటించాడు.

తీర్పు సారాంశాన్ని రాబట్టు కోవాలని సి.ఐ.డి.లు, గూఢచారులు ఇంకా ఎందరో ప్రయత్నించారు. బగ్గింగ్ చేశారు.

నేగీరామ్ నిగమ్ జస్టిస్ సిన్హాకు స్టెనోగ్రాఫరు. సి. ఐ. డి. లు అతడి వెంట కూడా పడి వేధించారట! కాని స్టెనోకు కూడా తన నిర్ణయం

అంతు పట్టకుండా చివరి రోజున తన తుది నిర్ణయాలను టైపు చేయించి తీర్పు ప్రకటించే వరకు ఎవరి కండ్లకూ కనబడకుండా పొమ్మన్నాడు నిగమ్‌ను - జస్టిస్ సిన్హా.

258 పేజీల జడ్జిమెంట్ అది.

ప్రజా ప్రాతినిధ్య చట్టంలో సెక్షన్ 123 (7) ప్రకారం ఇందిరా గాంధీ రెండు కారణాలుగా అక్రమాలకు పాల్పడిందని, కనుక ఆమె ఎన్నిక చెల్లనేరదని సిన్హా తీర్పు చెప్పాడు.

అందులో ఒకటి - యశపాల్ కపూర్ అనే గెజిటెడ్ ఉద్యోగి ఉదంతం. యశపాల్ కపూర్ ఇందిరాగాంధీ వైతాళిక బృందంలో ప్రముఖ పాత్రధారి. మామూలు ఉద్యోగిగా ఉంటూ ఒక్కసారిగా పై మెట్టుకు ఎగిరిన మనిషి. ఇందిరాగాంధీకి సంబంధించిన రాజకీయ మడత పేచీలను పర్యవేక్షించి నడిపించే కీలక పాత్ర వహించిన వాడు.

ఇందిరాగాంధీ 29 డిసెంబరు 1970 న తాను ఎన్నికల్లో పోటీ చేస్తున్నట్టు ప్రకటించింది. 7 జనవరి 1971 నాడు యశపాల్ కపూర్ ఆమెపక్షాన ఎన్నికల ప్రచారం ప్రారంభించాడు. జనవరి 19 న అతడు రాజీనామా చేశాడు. ప్రభుత్వం అతని రాజీనామాను ఆ తరువాత ఆమోదించింది. 71 జనవరి 24 దాకా యశపాల్ కపూర్ ప్రభుత్వ ఉద్యోగిగా ఉంటూనే ఇందిరాగాంధీ పక్షాన ఎన్నికల ప్రచారం చేసినట్లు ఋజువైందని జస్టిస్ సిన్హా నిర్ణయించాడు. ప్రధాని సెక్రటేరియట్‌లో ప్రత్యేక ఉద్యోగిగా గెజిటెడ్ ఆఫీసరుగా వేతనం పొందుతున్న ఒక వ్యక్తిచేత ఒక అభ్యర్థి తన తరఫున ఎన్నికల ప్రచారం చేయించు కోవడం ఎన్నికల చట్ట ప్రకారం నేరం కనుక ఇందిరాగాంధి ఎన్నిక చెల్లదన్నాడు జడ్జి.

రెండవది యు.పి. ప్రభుత్వం చూపిన పక్షపాతం. యు. పి. ప్రభుత్వ సిబ్బంది చేత ఇందిరాగాంధీ రాయబరెలీ నియోజకవర్గంలో ఎన్నికల ప్రచార సభలకు వేదికలు నిర్మించారు. దానికి ప్రభుత్వ ధనాన్ని వినియోగించారు.

ఇందిరాగాంధీ ఎన్నికల సభలన్నింటికీ దూర శ్రవణ యంత్రాలను ప్రభుత్వ సిబ్బంది ఏర్పాటు చేసింది. విద్యుత్ సరఫరా చేసింది కూడా ప్రభుత్వమే. దానికయ్యే ఖర్చు ప్రభుత్వమే భరించింది.

ప్రభుత్వ యంత్రాంగాన్ని ఈ విధంగా తన కొరకు దుర్వినియోగం చేసుకోవడం ఎన్నికల చట్ట ప్రకారం నేరాలని, ఈ రెండు నేరాలు నిర్వివాదంగా ఋజువైనాయని, ఈ కారణంగా ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లనేరదని, వచ్చే ఆరు సంవత్సరాల వరకు ఎన్నికలలో పోటీచేసే అధికారం ఆమెకు ఉండదని జస్టిస్ సిన్హా తీర్పుచెప్పాడు. అంతేకాదు. 27 అబద్ధాలు ఇందిరాగాంధీ తన సాక్ష్యంలో చెప్పిందని ప్రకటించాడు.

ఎన్నికల చట్టంలో ఈ రెండూ-నేరాల జాబితాలోకి వచ్చేవే. మినహాయింపులు లేనివి. ప్రస్తుత చట్టాలనుబట్టి ఇంతకంటే వేరుగా తీర్పు ఇవ్వడానికి వీలులేదన్నాడు జస్టిస్ సిన్హా. ఈ రెండు నేరాలూ నేడున్న కలుషిత వాతావరణంలో చాలా చిన్నవిగా కన్పించవచ్చు. కాని చట్టాల అనుశాసనాన్ని, ఆదేశ సూత్రాలను, పరిధులను దాటవీలు లేదు.

ఈ రెండు అక్రమాల తోటే ఇందిరాగాంధీకి గెలుపు వచ్చి ఉండక పోవచ్చు. కాని మనిషినిబట్టి చట్టం దుస్తులు మార్చుకోరాదు. అలా మార్చుకుంటే అది చట్టం కాదు.

4)

ఈ వార్త దేశం అంతటా క్షణంలో గుప్పున వ్యాపించింది.

అప్పుడే గుజరాత్ ఎన్నికల ఫలితాలు కూడా తెలిసాయి.

గుజరాత్ ఎన్నికలలో కాంగ్రెసును గెలిపించడానికి ఇందిరా గాంధీ తన తెలివితేటలన్నిటినీ గుప్పించింది. 'నేను మీ కోడల్ని' అని ప్రాధేయ పడ్డది. 'ఆడదాన్ని నన్న న్ని విధాల అపనిందల పాలు చేస్తున్నారు. చుట్టుముడుతున్నారు' అన్నది. తన కుటుంబం దేశం కోసమే అంకితమయిందని, తమ సర్వస్వమూ దేశం కోసమే త్యాగం చేశామనీ ప్రకటించింది. తనమీద కసిపూని వ్యక్తిగత కక్షతో తనను తుద ముట్టించాలని ప్రతిపక్షాలు ప్రయత్నిస్తున్నాయని అన్నది. జనసంఘ, ఆర్. యస్. యస్. లు ఫాసిస్టు సంస్థలనీ, అవి దేశంలో శాంతి భద్రతలను రూపుమాపడానికి ప్రయత్నిస్తున్నాయని; ఈ వర్గాల ప్రాబల్యం జనతా ఫ్రంటులో ఉన్నదనీ; జనతా ఫ్రంట్ గెలిస్తే, ఈ వర్గాలు మైనారిటీలను కబళిస్తాయని, దేశం నాశనమవుతుందని బెదిరింపులపై బెదిరింపులు చేసింది. నిందలు మోపింది. అసత్యాల తుఫానును నిర్మాణం చేసింది.

కాని ఇందిరా ధూమధామాలు ఏవీ పని చేయలేదు. ఫలితం దక్క లేదు.

రాయబరేలీ ఎన్నికలలో అవినీతికి పాల్పడ్డందుకు, అక్రమాలు చేసినందుకు ఇందిరాగాంధీ అలహాబాదు హైకోర్టు తీర్పుతో ఓడిపోయింది. రానున్న ఆరేండ్లకు ఏస్థానానికైనా పోటీచేసే అర్హతను కోల్పోయింది.

గుజరాతు ఎన్నికలలో ప్రజల తీర్పుతో కాంగ్రెసు ఓడిపోయింది. ఈ ఓటమి రానున్న మార్పులకు సంకేతమయింది.

అలహాబాదు హైకోర్టు ఇందిరాగాంధీని అభిశంసించినా ఆమె సుప్రీం కోర్టులో అప్పీలు చేసుకున్నది. అప్పీలులో ఆమె మధ్యంతరంగా కోరింది- తాను ప్రధాని గనుక, ప్రత్యామ్నాయమైన ఏర్పాట్లు చేయడం కొరకు కొంత వ్యవధి కావాలి-అని, ఆమె వకీలు సుప్రసిద్ధ న్యాయవాది పాల్కీవాలా ఆ కారణాలతో ఆమె ప్రమాణ వాఙ్మూలాన్ని కోర్టులో దాఖలు చేశాడు.

నైతికంగా 1975 జూలై 12 నుండే ఆమె పార్లమెంటు సభ్యత్వాన్ని కోల్పోయిన వ్యక్తి. ప్రజాస్వామ్య సంప్రదాయాన్ని, ప్రతిష్ఠను కాపాడ వలసిన-ప్రధానిగా ఉన్న వ్యక్తి వెంటనే రాజీనామా చేయడం అలాంటి విషమ పరిస్థితిలో న్యాయంగా ఉండేది. దేశ గౌరవం నిలబడేది. ఆమె వ్యక్తిత్వానికి కూడా హుందాతనాన్ని చేకూర్చేది. కాని రాజకీయాల నుండి నీతిని, నిజాయితీని బహిష్కరించి - 'అబద్ధంవా-సుబద్ధంవా' - పదవికి అంటుకొని కూర్చోడమే జీవితానికి పరమావధి ఐన రోజులలో ఆమెకు అలాంటి సున్నితమైన ఆలోచన నచ్చలేదు. అంతే కాదు. ఒకసారి పదవిని చేతి నుండి వదలితే మళ్ళీ దక్కుతుందనే ఆశ కూడా లేదు. పదవి చుట్టూ పరుగులు పెట్టే రాజకీయాలలో ఆ పదవి పోతే దీపం ఆరినట్లే. నియంతల మనోలక్షణానికి పదవి వదలుకోడం అసలే గిట్టదు.

రాజీనామా ససేమిరా చేయనని నిశ్చయించు కున్నది. 'దేశానికంటే ఇందిర గొప్ప' నినాదానికి పాదులు కట్టడం ప్రారంభమైంది. సంజయ్, యశపాల్ కపూర్, అర్జున దాస్ - కలిసి 12వ తేదీ సాయంత్రం నుండే కిరాయి సభలు జరిపి 'జేజేలు' ప్రారంభించారు. 12 న సాయంత్రం అలాంటి సభలోనే కోర్టు ఇచ్చిన 20 రోజుల స్టే ఆధారంగా ప్రధానిగా తానే ఉంటానని ప్రకటించింది. తన అవసరం దేశానికి

ఈ వార్త దేశం అంతటా క్షణంలో గుప్పున వ్యాపించింది.

అప్పుడే గుజరాత్ ఎన్నికల ఫలితాలు కూడా తెలిసాయి.

గుజరాత్ ఎన్నికలలో కాంగ్రెసును గెలిపించడానికి ఇందిరా గాంధీ తన తెలివితేటలన్నిటినీ గుప్పించింది. 'నేను మీ కోడల్ని' అని ప్రాధేయ పడ్డది. 'ఆడదాన్ని నన్నన్ని విధాల అపనిందల పాలు చేస్తున్నారు. చుట్టుముడుతున్నారు' అన్నది. తన కుటుంబం దేశం కోసమే అంకితమయిందని, తమ సర్వస్వమూ దేశం కోసమే త్యాగం చేశామనీ ప్రకటించింది. తనమీద కసిపూని వ్యక్తిగత కక్షతో తనను తుద ముట్టించాలని ప్రతిపక్షాలు ప్రయత్నిస్తున్నాయని అన్నది. జనసంఘ, ఆర్. యస్. యస్. లు ఫాసిస్టు సంస్థలనీ, అవి దేశంలో శాంతి భద్రతలను రూపుమాపడానికి ప్రయత్నిస్తున్నాయని; ఈ వర్గాల ప్రాబల్యం జనతా ఫ్రంటులో ఉన్నదనీ; జనతా ఫ్రంట్ గెలిస్తే. ఈ వర్గాలు మైనారిటీలను కబళిస్తాయని, దేశం నాశనమవుతుందని బెదిరింపులపై బెదిరింపులు చేసింది. నిందలు మోపింది. అసత్యాల తుఫానును నిర్మాణం చేసింది.

కాని ఇందిరా ధూమధామాలు ఏవీ పని చేయలేదు. ఫలితం దక్కలేదు.

రాయబరేలీ ఎన్నికలలో అవినీతికి పాల్పడ్డందుకు, అక్రమాలు చేసినందుకు ఇందిరాగాంధీ అలహాబాదు హైకోర్టు తీర్పుతో ఓడిపోయింది. రానున్న ఆరేండ్లకు ఏస్థానానికైనా పోటీచేసే అర్హతను కోల్పోయింది.

గుజరాతు ఎన్నికలలో ప్రజల తీర్పుతో కాంగ్రెసు ఓడిపోయింది. ఈ ఓటమి రానున్న మార్పులకు సంకేతమయింది.

అలహాబాదు హైకోర్టు ఇందిరాగాంధీని అభిశంసించినా ఆమె సుప్రీం కోర్టులో అప్పీలు చేసుకున్నది. అప్పీలులో ఆమె మధ్యంతరంగా కోరింది- తాను ప్రధాని గనుక, ప్రత్యామ్నాయమైన ఏర్పాట్లు చేయడం కొరకు కొంత వ్యవధి కావాలి-అని, ఆమె వకీలు సుప్రసిద్ధ న్యాయవాది పాల్కీవాలా ఆ కారణాలతో ఆమె ప్రమాణ వాఙ్మూలాన్ని కోర్టులో దాఖలు చేశాడు.

నైతికంగా 1975 జూలై 12 నుండే ఆమె పార్లమెంటు సభ్యత్వాన్ని కోల్పోయిన వ్యక్తి. ప్రజాస్వామ్య సంప్రదాయాన్ని, ప్రతిష్ఠను కాపాడ వలసిన-ప్రధానిగా ఉన్న వ్యక్తి వెంటనే రాజీనామా చేయడం అలాంటి విషమ పరిస్థితిలో న్యాయంగా ఉండేది. దేశ గౌరవం నిలబడేది. ఆమె వ్యక్తిత్వానికి కూడా హుందా తనాన్ని చేకూర్చేది. కాని రాజకీయాల నుండి నీతిని, నిజాయితీని బహిష్కరించి - 'అబద్ధంవా-సుబద్ధంవా' - పదవికి అంటుకొని కూర్చోడమే జీవితానికి పరమావధి ఐన రోజులలో ఆమెకు అలాంటి సున్నితమైన ఆలోచన నచ్చలేదు. అంతే కాదు. ఒకసారి పదవిని చేతి నుండి వదలితే మళ్ళీ దక్కుతుందనే ఆశ కూడా లేదు. పదవి చుట్టూ పరుగులు పెట్టే రాజకీయాలలో ఆ పదవి పోతే దీపం ఆరినట్లే. నియంతల మనోలక్షణానికి పదవి వదలుకోడం అసలే గిట్టదు.

రాజీనామా ససేమిరా చేయనని నిశ్చయించు కున్నది. 'దేశానికంటే ఇందిర గొప్ప' నినాదానికి పాదులు కట్టడం ప్రారంభమైంది. సంజయ్, యశపాల్ కపూర్, అర్జున దాస్ - కలిసి 12వ తేదీ సాయంత్రం నుండే కిరాయి సభలు జరిపి 'జేజేలు' ప్రారంభించారు. 12 న సాయంత్రం అలాంటి సభలోనే కోర్టు ఇచ్చిన 20 రోజుల స్టే ఆధారంగా ప్రధానిగా తానే ఉంటానని ప్రకటించింది. తన అవసరం దేశానికి

ఉన్నదని ప్రజలు గుర్తించారన్నది. 14 జూన్ నాడు తన ఇంటి ముంగిట కూడిన జనాభాతో మాట్లాడుతూ 'ఈ సవాళ్ళకు నేను చలించకుండా ఎదిరించ గలననేది మరచి పోకండి' అన్నది. తన మీద వర్షించే అవమానాలు, తనను రెచ్చకొట్టే విధానాలు 'తనను తుదముట్టించడానికి, ప్రతిపక్షాలు చేస్తున్న కుట్ర అని అన్నది. 'అయినా నేను లక్ష్యపెట్టను. నాకు అండ ప్రజలు. వారే నాకు బలం ఇస్తారు' అన్నది.

పత్రికలన్నీ ఇచ్చిన సలహాను, పెద్దల మందలింపును, ప్రజల ఆగ్రహాన్నీ, కోర్టుల తీర్పును నిర్లక్ష్యం చేసి అలా పదవిలో కొనసాగడానికి నిశ్చయించుకున్నది.

ఈ ఉద్దేశ్య పూర్తికిగాను తన సర్వ శక్తులూ ధారవోసి 18 జూన్ నాడు జరిగిన పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీ సమావేశంలో తిరిగి నాయకురాలుగా ఎన్నుకోబడేట్లు ఏర్పాట్లు చేసుకున్నది. ఇందిరాగాంధీ నాయకత్వం దేశానికి తప్పనిసరి. ఇందిరాయే ఇండియా-ఇండియాయే ఇందిరా అన్నాడు పంచ రత్నాలకవి, విదూషకుడని పేరు పొందిన కాంగ్రెసు ప్రెసిడెంటు బారువా. బెంగాల్ నుంచి సిద్ధార్థ శంకర రే, బొంబాయి నుండి రజినీ పటేల్ దిగారు. ప్రతిపక్షాలను రూపుమాపడానికి వ్యూహం ఆలోచించారు. ఎమర్జెన్సీ విధించాలని నిశ్చయించుకున్నారు. న్యాయశాఖామంత్రి గోఖలేకు గూడా ఈ విషయం తెలియదు. ఈ ఎమర్జెన్సీ వ్యూహంలో ఇందిరాగాంధీకి సహకరించింది లెఫ్టిస్టు ఆలోచనలున్న కాంగ్రెసు వారు; లెఫ్టిస్టు బ్లిట్జు, కరెంటు లాంటి పత్రికలు.

అసలు ఇలాంటి చర్యకు ఎప్పుడో అంకురార్పణం జరిగి ఉన్నది. కాని అమలు చేయడంలో జాగు జరిగింది. కాంగ్రెసులో దూరి, సి.పి.ఐ. వర్గం పని చేయదలచిన వ్యూహం మోహన్ కుమారమంగళం 1973లో

మరణించడంతో చెడిపోయింది. 1973 నవంబరులో బ్రెజ్నేవ్ ఈ దేశానికి వచ్చినప్పుడు 'భారతదేశంలో ప్రతిపక్షాల అవసరం లేదు' అని అంటే కాంగ్రెసు నాయకుల్లో ఏ ఒక్కరూ ప్రతిఘటించలేదు. మోహన్ కుమార మంగళమే రాజ్యాంగంలో 352 నియమం ప్రకారం ఆంతరంగికంగా అత్యయిక పరిస్థితి విధించేందుకు, దాన్ని అమలు పరచేందుకు అవసరమైన వ్యూహాన్ని రచించి ఉంటాడంటారు.

ప్రతిపక్షాలు 15 జూన్‌నుండి 22 వరకు 'ఇందిరాగాంధీ రాజీనామా సప్తాహం' జరపాలని నిశ్చయించారు. అప్పుడే 20వ తేదీన ఇందిరాగాంధీ ఒక గొప్ప ర్యాలీ-ఒక కోటి రూపాయల ఖర్చుతో-చేయించింది. ఆ సభలో 'నేను తప్ప మరో దిక్కు లేదు మీకు' అని బెదిరింపు - కవ్వింపు - ధోరణులతో ఉపన్యసించింది.

ఒక మూల పార్టీలో కూడా వత్తిడి ప్రారంభమైంది. సంతకాల సేకరణ కూడా ప్రారంభమైందని, జగజ్జీవన్‌రాం తన అభ్యర్థిత్వాన్ని ప్రధాని పదవికి ప్రతిపాదింప చేసుకున్నారని కూడా కింవదంతులు ప్రారంభమైనాయి.

సుప్రీం కోర్టు అప్పీలు తనకు అనుకూలంగా వస్తుందని ఆమెకు ఆశ లేదు. ఆమెకు కావలసిందల్లా వ్యవధి. అందుకే ఆమె ప్రధాని పదవికి ప్రత్యామ్నాయమైన ఏర్పాటు జరిగిందాకా అలహాబాద్ తీర్పును నిలుప వలసిందిగా సుప్రీం కోర్టును కోరింది.

తీరా సుప్రీం కోర్టు తనకు వ్యతిరేకంగా తీర్మానిస్తే ! ఆమె సన్నిహితులు అధికారాన్ని విడవడం ససేమిరా పనికి రాదని సలహా నిచ్చారు. ఆమె కూడా పెంకి ఘటమే. తాను తలపెట్టిన అభ్యుదయకరమైన పనులకు కోర్టులు అడ్డుతగులుతున్నాయని అంతకు క్రితం

నుంచే న్యాయాధీశుల మీద దాడి ప్రారంభమయ్యే ఉన్నది. దానికి తోడు ఆమె మరో మూడు చర్యలు వెంటనే తీసుకున్నది.

24వ తేదీన సుప్రీం కోర్టులో శ్రీకృష్ణ అయ్యర్ తీర్పు యిచ్చాడు. 'ఇందిరాగాంధి దాఖలు చేసుకున్న ఎన్నికల అప్పీలు తుది తీర్పు వచ్చిందాకా ఆమె ప్రధాని పదవిలో కొనసాగవచ్చు. కాని పార్లమెంటు సభ్యురాలుగా వ్యవహరించడానికి, జీతం తీసుకోడానికి, ఓటు వేయడానికి అధికారాలు లేవు' అని. అంటే దిష్టిబొమ్మలా ఆమె దేశానికి ప్రధాని స్థానంలో ఉండవచ్చునన్నమాట !

అల్హాబాద్ హైకోర్టు తీర్పు, సుప్రీంకోర్టు తీర్పు - రెండూ నైతికంగా ఆమె ఎన్నికను ప్రశ్నించినట్లే - అయింది. అయినా మొండితనం విడనాడకుండా ప్రతిపక్షాలు ప్రారంభించిన ఉద్యమాన్ని అణచి, తన ప్రధాని పదవిని శాశ్వతంగా కాపాడుకునేందుకే ఆమె నిశ్చయించుకున్నది.

దేశంలో ప్రజలకు దగ్గరగా ఉంటూ, రాజకీయాలను వృత్తిగా పెట్టుకొని, కులపు బలంతో, పైరవీలతో జీవించే ముఠా నాయకులు అధికారం ఎటు ఉంటే అటు జేజేలు పలుకుతూ తిరుగుతూంటారనే నమ్మకం ఇందిరాగాంధికి ఉన్నది. అలాంటి వాళ్ళను ఆకట్టుకోడానికి వసతులు కూడా ఆమె హక్కు భుక్తాలలో చాలా ఉన్నాయి.

అలాంటి స్థితిలో-ఏ ఒక్క పార్టీ ప్రజలను కదలించే పరిస్థితిలో లేనప్పుడు, ఉన్న వ్యతిరేకాన్ని గొంతునొక్కి చంపి వేస్తే తన పదవికి అడ్డేమిటి ? అలస్యాత్ అమృతం విషమ్.

అప్పుడప్పుడే ప్రజలలో ప్రబలుతూన్న అసంతృప్తికి ఒక నాయకత్వం దొరుకు తున్నది. ప్రజల అసంతృప్తిని ఒక ప్రబలమైన

ఉద్యమంగా - ఒక కార్యక్రమాన్ని యిచ్చి - ఒక వ్యూహాన్ని నిర్మించ డానికి కూడా ప్రయత్నం ప్రారంభమైంది.

24 న సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు నైతికంగా ఇందిరాగాంధీ నాయకత్వానికి చావుదెబ్బ. ఆమె ప్రధానిగా ఉండే నైతిక అధికారం కోల్పోయింది. అవినీతికి పాల్పడ్డ వ్యక్తి ప్రధానిగా ఉండవీల్లేదు అనే భావనకు ఊపు లభించింది.

జూన్ 25 ఉదయం జనతా మోర్చా కార్యవర్గ సమావేశం జరి గింది. ఆ సమావేశంలో ఇందిరాగాంధీ రాజీనామాను కోరుతూ 'సత్యా గ్రహం' ప్రారంభించాలని నిశ్చయించారు.

అప్పటికే లోక సంఘర్ష సమితి మొరార్జీ అధ్యక్షతన ఏర్ప డింది. నానాజీ దేశ్‌ముఖ్ కార్యదర్శి, అశోక్ మెహతా కోశాధ్యక్షుడు.

25 సాయంత్రం రాంలీలా మైదానంలో బ్రహ్మాండమైన సభ జరిగింది. మురార్జీ సభకు అధ్యక్షులు. జె. పి. ప్రముఖ ఉపన్యాసకులు. గడచిన 13 రోజుల ఘటనలు దేశంలో ఒక కదలికను తెచ్చాయి. అతి తక్కువ వ్యవధితో సభ నేర్పాటు చేసినా ప్రజలు రానున్న మార్పులను గురించి జె. పి., మురార్జీ, అటల్‌జీలాంటి వారి పిలుపునందుకొని, వారి సందేశాన్ని వినడానికి విరుచుకుపడ్డారు.

యల్. యస్. యస్. కార్యదర్శి నానాజీ దేశ్‌ముఖ్ ఆ ఉదయం జనతా మోర్చా నిర్ణయించిన సత్యాగ్రహ పథకాన్ని ప్రకటించాడు. ప్రజలను ప్రజాస్వామ్య విలువలను కాపాడేందుకు పురోగమించవల సిందిగా ప్రబోధించారు. స్వాతంత్ర్యాన్ని కాపాడుకునేందుకు సత్యా గ్రహాలలో పాల్గొన రమ్మని ప్రజలకు 'పిలుపు' నిచ్చాడు. నానాజీ ఉప

దేశపు స్వాభిమానాన్ని తట్టి లేపేదిగా ఉన్నదన్నాడు. ఒక
ి.

మొదట ఢిల్లీలో ఒకవారం ఈ కార్యక్రమం శాంతియుతంగా
ంది. ఆ తర్వాతనే అవసరమైతే దేశవ్యాప్తంగా-ఇందిరాగాంధీ
మాను కోరుతూ - జరుగుతుంది. అప్పటికీ ఆమెలోని పదవీ
శమించక పోతే, దళాల వారీ ఆమె నివాసం ముందు సత్యా
జరుగుతుంది.

ప్రజలకు ఇదొక సాహస చర్య అనిపించి ఉండవచ్చు. 1974
సమ్మెను విఫలం చేయడానికి ప్రభుత్వం అవలంభించిన
వేత' చర్యను, నిర్దయగా అనేక మంది పొట్టలు కొట్టి తన
తీర్చుకోవడాన్ని దేశం మరచి పోలేదు. ప్రజల సమస్యల పట్ల
ాతితో కూడిన అవగాహన' లేనిచోట 'శాంతి సమరం' ఎంత
ిజయాన్ని సాధించగలదోననే భయంకూడా కలిగి ఉండవచ్చు.
కమైన నైతిక విలువలను కూడా లెక్కచేయని చోట, శాంతి
క ప్రజాఉద్యమాన్ని నియంత వ్యూహం వమ్ముచేయ వచ్చుననే
ూడా కలిగిఉండ వచ్చు.

జయప్రకాశ్ తమ అద్భుతమైన వాణితో ఈ భయాలను నిరాక
. ఆనాటి జె. పి. ఉపన్యాసం హృదయాలను ఆర్ద్రమొన
. అల్హాబాదు హైకోర్టు వ్యతిరేకంగా తీర్పునిచ్చిన తరువాత
ప్రధాని పదవికి ఇందిరాగాంధీ రాజీనామా ఇవ్వక పోవడం, ఇవ్వ
నిరాకరించడంతో, భారతదేశపు పరంపరాగతమైన స్వేచ్ఛా
స్వామ్య సిద్ధాంతాలను నవ్వులపాలు చేసిందని విచారం వ్యక్తం
అంతకంటే ఎక్కువగా జగజ్జీవన్‌రామ్‌లాంటి అగ్రశేణికి
కాంగ్రెసు నాయకులు ఇందిరాగాంధీ నాయకత్వం పట్ల విశ్వాసం

ప్రకటించడము, కోర్టు తీర్పును గౌరవించాలని గట్టి సలహా ఇవ్వక పోవడం తనకు మరీ విచారాన్ని కలుగ చేసిందని అన్నారు జె. పి. ఈ నాయకుల చర్య కాంగ్రెసు పార్టీకిగాని, దేశానికి గాని మేలు చేకూర్చదని ఆవేదన పడ్డారు.

'కేంద్రంలో కాంగ్రెసు ప్రభుత్వానికి ఇదే ఆఖరు అవకాశం. వచ్చే ఎన్నికల్లో కాంగ్రెసు టిక్కట్టు లాభం చేకూర్చడమటుంచి, అదొక మోత బరువవుతుంది. సుప్రీం కోర్టు స్టే ఇందిరాగాంధీకి ఇంకా అవమానాన్ని తెచ్చి పెట్టింది. ఓటు వేయరాదు, జాబితాలో సంతకం చేయ రాదు, డబ్బు తీసుకొన రాదు - అదీ ఒక ప్రధాని పదవేనా? అని ప్రశ్నించారు.

సైనికులకు, పోలీసులకు తాను 'న్యాయానికి చట్టానికి వ్యతిరేక మయిన ఆజ్ఞలను వినకండ'ని ఇచ్చిన పిలుపును సమర్థిస్తూ, 'మంత్రులు - ప్రభుత్వము నైతిక విలువలను విడనాడి, ప్రాథమిక మైన ప్రజా స్వాతంత్ర్యాలను అణచి వేయాలని ప్రయత్నిస్తుంటే - పోలీసులు, సైనికులు అట్టి చర్యలను సమర్థించనక్కరలేదు. దేశంలో ప్రజాస్వామ్యాన్ని తుడిచిపెట్టే ప్రయత్నం జరుగుతూండడాన ఈ దారుణాన్ని ఆపడానికి ఒక కళంకం ఆపాదింపబడ్డ వ్యక్తి నాయకత్వాన నడిచే ప్రభుత్వాజ్ఞలను - అవీ అక్రమమైనవైతే - వ్యతిరేకించమన్నాను' అని జె. పి. స్పష్టీకరించారు. 'ఇది కేవలం ఉచితానుచితాల ప్రశ్న కూడా కాదు. రాజకీయ ప్రతిష్ఠను కూడా చూడాలి. దేశాన్నేకాక, ప్రజలను, రాజ్యాంగాన్ని రక్షించవలసిన బాధ్యత కూడా పోలీసులకు, సైనిక బలగాలకు ఉన్నది. రాజ్యంపట్ల నేను కుట్రపన్నుతున్నాననే నిజంగా భావిస్తే నన్ను రాజ్యద్రోహ నేరంమోపి గృహమంత్రి కోర్టులో విచారింపచేయవచ్చు' - అని సవాలుచేశారు.

ప్రజల మనస్సులలో ఉన్న మాటలే ఇవ్వి. జె. పి. వాటిని ప్రతిధ్వనించాడు. కాని దేశం ఈ వ్యూహాన్ని ఆచరించడానికి సిద్ధంగా ఉన్నదా ? సత్యాగ్రహంలో ఎందరు పాల్గొంటారు.

జె.పి. 15000 మందైనా ఉండాలన్నాడు. పార్టీల వారు ముందు సంఖ్య ఇచ్చి - తరువాత బైటకు వచ్చి 'ఇందరు ఎలా సాధ్యం' ? అని కించపడ్డారని మాంకేకర్ అంటాడు.

మురార్జీ బహిరంగ సభలో అడిగితే దాదాపు 5000 చేతులు సత్యాగ్రహానికి సంసిద్ధమై లేచాయి. సత్యాగ్రహులను తమ పేర్లు నమోదు చేసుకోండని మదన్‌లాల్ ఖురానా విజ్ఞప్తి చేశాడు.

ఇందిరాగాంధీకి ఎప్పటికప్పుడు వార్తలు చేరుతూనే ఉన్నాయి. ఢిల్లీ ఉద్రేకంతో ఉడికి పోతున్నది. తెల్లవారితే అగ్ని పర్వతం బ్రద్దలవుతుంది. పత్రికలు ఆ నాటి రాంలీలా మైదానంలో జరిగిన నిశ్చయాలను దేశంలో మూలమూలకు అందచేస్తాయి. గుజరాత్ ఉడికి పోతున్నది. యు. పి., బీహార్లు అగ్ని గోళాలపై కూర్చుని ఉన్నాయి. మిగతా ప్రాంతాలకు ఈ చిచ్చు గబుక్కున ప్రాకవచ్చు.

తను ప్రధానిగా ఉండడమా ? లేదా ?

అల్హాబాదు హైకోర్టు తీర్పుతో ఆమె వ్యక్తిత్వం బాగా దెబ్బ తిన్నది. దేశంలో వయోవృద్ధులైన నాయకులు, ప్రతిభావంతులైన న్యాయ శాస్త్ర వేత్తలు, సంఘ సేవకులు, పత్రికలు 'ఆమె పదవిలో కొన అవినీతిని అందలా లెక్కించడమే నని' స్పష్టంగా ప్రకటించ ామె ప్రతిష్ఠకూడా దెబ్బతిన్నది.

అయినా ఆమె ఊరుకునే వ్యక్తికాదు.

'ఆమె మొండిది - రాజకీయాలంటే అభిరుచి మెండు - ఒకరి కష్ట సుఖాలను లెక్కపెట్టదు-తన కోసమే చూచుకునే మనిషి-ప్రమాద బుద్ధి' అని నెహ్రూయే ఆమెను గురించి వ్రాశాడు. అది అక్షరాల నిజం !

ఒకమూల జయప్రకాశ్ నారాయణ్ న్యాయం కోసం పోరాడుతూంటే అదేరాత్రి జూన్ 25 న సిద్ధార్థ శంకర్ రేతో కలిసి ఇందిరా గాంధి రాష్ట్రపతి భవనంవెళ్ళి ఎమర్జెన్సీ ప్రకటించాలని చెప్పివచ్చి రాత్రి 11-00 గంటలకు హోమ్‌మంత్రి బ్రహ్మానందరెడ్డిని పిలిపించి తన నిర్ణయాన్ని చెప్పింది. స్టేట్ హోమ్ మినిస్టర్ ఓం మెహతాకు, ధావన్‌కు పైవారికీ తప్ప ఈ విషయం మిగతా క్యాబినెట్ మంత్రులకు కూడా తెలియదు. ఆ అర్ధరాత్రి అధ్యక్షుడు ఎమర్జెన్సీ ప్రకటనపై సంతకం చేశాడు.

ఆ రాత్రి అంతా క్యాబినెట్ మంత్రుల ఇళ్ళు, సి. ఐ. డి. నిఘాకు గురి అయ్యే ఉన్నాయి. ఉదయం 6 గంటలకు మంత్రుల సమావేశంలో ఈ వార్తను హోంశాఖా కార్యదర్శి ఖురానా ప్రకటించాడు. క్లుప్తంగా, గోప్యంగా పదిహేను నిమిషాలసేపు జరిగిన ఆ సమావేశంలో మంత్రులు నోరు కదపలేదు. ఒక్కమాట ఎదురు పలుకలేదు. అప్పటికే జయప్రకాశ్ నారాయణ్‌ను మీసా క్రింద నిర్బంధించారు. జైలుకు వెళ్తూ ఆయన 'వినాశకాలే విపరీత బుద్ధిః' అన్నాడట. మొరార్జీ 'అంతా భగవదేచ్ఛ' అని జైలుకు వెళ్ళాడు. ఆ రాత్రే చరణ్ సింగ్, అటల్‌జీ, అశోక్ మెహతా, యల్. కె. అడవానీ, పిలూ మోడీ, చంద్ర శేఖర్ వగైరాలు అరెస్టు అయినారు. దాదాపు ఆ రాత్రి 400

[illegible] లోకి తీసుకోడం జరిగింది. 'రాజకీయ పార్టీల [illegible] ఆర్. యస్. యస్. మొదలగు సంస్థల [illegible] తెల్లవారేలోగా అరెస్టు చేయాలి' అని [illegible] ఆర్డర్లు జారీ అయినాయి.

[illegible] కూడా వెంటనే అరెస్టులు ప్రారంభమయ్యాయి. [illegible] మోహన్ (విజయవాడ), గౌతు లచ్చన్న, జూపూడి [illegible], పి.వి.యస్. రాజు (జనసంఘ అధ్యక్షులు), కేశవ [illegible], యం.వి. రామ మూర్తి (విజయవాడ), తుమ్మల చౌదరి, [illegible] కోటేశ్వర రావు, కొమరగిరి కృష్ణమోహన రావు [illegible] మాకినేని బసవ పున్నయ్య, ఓంకార్ (మార్క్సిస్టు [illegible], యం. డి. వై. రామ మూర్తి, మల్లికార్జున శాస్త్రి [illegible] మీసా క్రింద నిర్బంధింప బడ్డారు.

[illegible] పరిస్థితిలో ఆమెకు తోడ్పడ్డవారు పూర్వ [illegible] ఆమె అంతరంగ సహచరులు. మిగతా కాంగ్రెసు [illegible] ఆమె విశ్వసించలేదు. ఆలా ఇందిరాగాంధీ జాతి [illegible] ంచింది.

# 7

# సెన్సారు కోరల్లో

'ప్రజా స్వామ్యానికి
పత్రికా స్వాతంత్ర్యం
ఒక మూల స్తంభం.'

ఎమర్జెన్సీ ప్రకటించడంతో ఆ కథ ఆగిపోదు. ప్రజలింకా రెచ్చిపోవచ్చు. దీనిని పకడ్బందీగా చేయాలి. ఈ వార్తలు దేశంలో పొక్కకూడదు. ఉద్యమం సంక్రామకమైనది. అది అలా రాజుకుంటూ పోతుంది కనుక ఆ వ్యాప్తిని అరికట్టాలి. దానికి పత్రికల నోళ్ళు నొక్కడం తప్ప మరొక మార్గంలేదు.

వెంటనే ఆ రెండో చర్యకూడా ఇందిరా గాంధీ తీసుకున్నది.

ఢిల్లీ పత్రికలు అప్పటికే ఇందిరా గాంధీ నైతికంగా ప్రధానిగా ఉండే అర్హతను కోల్పోయిందని, ఆమె వెంటనే రాజీనామా చేయాలనీ కోరాయి. మదర్‌లాండ్ అనే ఢిల్లీ దినపత్రిక 26 జనవరి 75 నే అంటే అయిదు నెలల పూర్వమే వ్రాసింది - 'మెజారిటీ కోల్పోయినా ఇందిర గద్దె దిగదు; దీని కోసం కమ్యూనిష్టుల సహాయం తీసుకొనైనా అత్యవసర పరిస్థితి ప్రకటిస్తుంది. ప్రజల స్వేచ్ఛను అణగద్రొక్కుతుంది. బలవంతాన జాతి తనను సమర్థించేట్టు ప్రయత్నిస్తుంది. కాని

జూన్ 1976 తర్వాత ఆమె దేశాన్ని పరిపాలించ గలగడం అసాధ్యమనే నాకు తోస్తుంది. జూన్ 1976 నుండి డిసెంబరు 1978 వరకు దేశానికి కష్ట కాలం. ప్రయోగాత్మక స్థితి ఉంటుంది. జూన్ 76 లోపలే ప్రజాందోళన వలన ఇందిర దేశాన్ని నియంతలాగా పాలించే ప్రయత్నం వమ్మవుతుందని' ఒకవిధంగా దాదాపు భవిష్యవాణి పల్కింది. స్టేట్స్‌మన్ పత్రిక, హిందుస్థాన్ టైమ్స్ వగైరాలు 'ఇక గద్దె దిగే సమయం ఆసన్నమైందని' వ్రాయ నారంభించాయి. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కూడా ఆమె ప్రధానిగా ఒక క్షణం ఇక కొనసాగ వీలు లేదన్నది. చివరికి టైమ్స్ ఆఫ్ ఇండియా కూడా కేసు పర్యవసానం దాకా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు జరగాలన్నది. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రభూమి, జాగృతి, విజయభేరి (నెల్లూరు) మొదలగు పత్రికలుకూడా తెలుగు నాట గొంతెత్తి పలికాయి.

ఆ రాత్రి దేశంలో - 25 రాత్రి రామలీలా మైదానంలో ప్రతిపక్ష ప్రజానాయకులు ఇచ్చిన సందేశాన్ని, పిలుపునూ - భారత దేశం నలుమూలలా తెలియ చేయడానికి పత్రికలు తంటాలు పడుతూండగా ఢిల్లీ బహదూర్ షా జఫర్ మార్గ్‌లో ఎలక్ట్రిసిటీ సప్లై ఆపుచేసింది ప్రభుత్వం. తెల్లవారిందాకా తిరిగి పవరు లభించ లేదు. అయినా ఢిల్లీలో మదర్‌లాండ్, హైద్రాబాదులో దక్కన్ క్రానికల్ ప్రత్యేక సంచికలు వెలువరించాయి. 'అధ్యక్షుడు ఎమర్జెన్సీ ప్రకటించాడు, ప్రతిపక్షాలపై అర్ధరాత్రి హఠాత్తుదాడి. జె.పి., మొరార్జీ, అద్వాని, చరణ్‌సింగ్, చంద్రశేఖర్, రామ్‌ధన్, కృష్ణకాంత్‌ల అరెస్టు' అని ఫోటోలతో సహా మదర్‌లాండు పేపరు ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించి 60,000 కాపీలు ప్రచురించి పంచింది. ఆ రాత్రే మదర్‌లాండు ఎడిటర్ మల్కానీ నిర్బంధింపబడ్డాడు.

ఆంధ్రప్రాంతంలో డక్కన్ క్రానికల్ ఒకవైపు ముద్రించిన ఒక కాగితాన్ని బైటికి పోనిచ్చింది. ఇంకా ఎన్నో పత్రికలు ప్రత్యేక సంచికలు ప్రచురించి, అరెస్టు అయిన నాయకుల ఫోటోలతో సహా వివరాలిస్తూ ప్రచురించి, మార్కెటులోకి పంపాయి. మధ్యాహ్నానికి సెన్సార్ ఆజ్ఞలు పత్రికలకు చేరేటప్పటికి పత్రికలు ప్రజల చేతుల్లోకి వెళ్ళిపోయాయి. వెంటనే సెన్సారు విధించినట్లు పి. టి. ఐ. వార్తాసంస్థ ద్వారా అన్ని పత్రికలకు వార్తను చేరవేయడం జరిగింది. ఉద్యమం విషయంలోగాని, ఆ ప్రమేయంగల ఏ వార్తనుగాని ప్రచురించడానికి వీలులేదు. మదర్‌లాండు, ఆర్గనైజరు, పాంచజన్య మొదలగు దిన, వార పత్రికల కార్యాలయాలకు సీళ్ళు పడ్డాయి.

దేశంలో ఢిల్లీ పత్రికలు 4, బొంబాయి పత్రికలు 5, మద్రాసు పత్రికలు 2, త్రివేంద్రం పత్రికలు 2, పూనాలో ఒక పత్రిక, లక్నో, సూరత్‌లలో చెరొకటి, ఔరంగాబాద్‌లో రెండు పత్రికలు నిషేధింపబడ్డాయి. క్రమంగా 12 పత్రికలకు ప్రకటనలు ఆపుచేశారు. 93 పత్రికలకు ఇచ్చిన ప్రకటనలను నిలుపుచేశారు. 29 మంది విదేశీ పత్రికల విలేఖరులను దేశంలోకి రాకుండా నిషేధించారు. మరి 7 గురిని దేశ బహిష్కరణ చేశారు. భారతీయ విలేఖరులలో నలభై ముగ్గురికి ప్రభుత్వామోదాన్ని లేకుండా చేశారు. ఇద్దరు వ్యంగ్య చిత్రకారులను, ఆరుగురు ఫోటోగ్రాఫర్లను గుర్తింపు లేకుండా చేశారు. ప్రభుత్వ విధానాలను, ఇందిరాగాంధీ మహత్తును పొగడడమే పనిగా పెట్టుకున్న వాళ్ళకు ప్రకటనరేట్లు పెంచారు. 'బ్లిట్జ్'కు అయిదు రూపాయలు, 'కరెంటు'కు పది రూపాయలు, ఇందిరాగాంధి కోడలి పత్రిక 'సూర్య' కు 34½ రూపాయలు రేటు పెంచారు.

కొన్ని పత్రికలు కొన్నాళ్ళు ఖాళీలు వదలి పెట్టి తమ అసమ్మతిని, నిరసనను తెలియ జేశాయి. 'జాగృతి' తెలుగు పత్రికా

రంగంలో ఒక ప్రత్యేక స్థానాన్ని వహించింది. 16-6-75 న 'ఇందిరా గాంధీకి బహిరంగ లేఖ' అంటూ చక్కని విమర్శ ఇచ్చింది. కాని 21-6-75 కల్లా 'ఖాళీ వదిలేస్తున్నాం. క్షమించండి' అనాల్సి వచ్చింది.

పత్రికల నోళ్ళు కట్టివేయడంతో పాటు కిరాయి కవులను, రచయితలను, పాత్రికేయులను - డబ్బిచ్చి కొని, ఇందిరా భజన గీతాలు వ్రాయించడం ప్రారంభమైంది.

అందులో 'కరెంటు' ఆంగ్ల పత్రిక ఒకటి. కరెంటు పత్రిక జె. పి. ని మొదటినుండి వ్యతిరేకిస్తూనే ఉన్నది. 9 నవంబరు 74 న "ఏ విధంగా చూచినా జె.పి.ని సర్వోదయ నాయకుడని అనడానికి వీలు లేదు. నూతన వ్యవస్థను తెచ్చే పేరుతో దేశంలో అవ్యవస్థను సృష్టించాలని ప్రయత్నించే దురుసు రాజకీయవేత్త జె. పి.'' అని కరెంటు వ్రాసింది. ఇందిరాగాంధీని రాజీనామా చెయ్యమని లోకం కోడియై కూస్తుంటే 'న్యాయంగా చూచినా, రాజకీయంగా చూచినా, నైతికంగా చూచినా, ఆమె రాజీనామా ఇవ్వనక్కరలేదు' అని ఈ పత్రిక వ్రాసింది. ఎమర్జెన్సీ పెట్టటంతోనే ఈ పేపరు మొట్టమొదట సమర్థించింది. హర్షించింది.

ఇలా ఇందిరాగాంధీ తన పదవిని రక్షించుకోవడం కోసమని సెన్సారు షిప్పు పెట్టి, కొన్నింటిని నిషేధించి పత్రికల నోళ్ళు కట్టి వేసింది. 27, 28 జూన్ పేపర్లు తమ సంపాదకీయ స్థానాలను ఖాళీలుగా వదలి పెట్టాయి. విచక్షణా రహితంగా తెచ్చిపెట్టిన సెన్సారు షిప్పుకు వ్యతిరేకంగా - స్వాతంత్ర్యాన్ని ప్రబోధిస్తూ గాంధి, ఠాకూర్ వ్రాసిన ఉదాత్త వచనాలను కొన్ని పత్రికలు ప్రచురించాయి.

సెన్సారు నియమాల ప్రకారం నిర్బంధాలకు గురియైన నాయకుల పేర్లను పత్రికలలో ప్రకటించ రాదు. సెన్సార్‌షిప్ విషయంలో కూడా వార్తలు ప్రచురించ రాదు. అకారణంగా ఖాళీలు వదలి పెట్టడం, సందర్భం లేకుండా పెద్దల సూక్తులివ్వడం కూడా జూన్ 29 నాటికి నిషేధింపబడ్డాయి. విమర్శ పనికిరాదు. వాస్తవ వార్తకూడా ఇవ్వరాదు. ఫోటోలు ప్రచురించ రాదు. వ్యంగ్య చిత్రాల మాటే ఎత్త రాదు. దేశం మొత్తంలో మీసా క్రిందగాని, డి. ఐ. ఆర్. క్రిందగాని 253 మంది పాత్రికేయులను నిర్బంధించింది ఇందిర. అందులో ఆంధ్ర ప్రాంతానికి చెందినవాళ్ళు 5 గురు.

ప్రభుత్వం తీసుకున్న ఈ దుర్మార్గపు చర్యకు పత్రికా ప్రపంచం గాభరా పడ్డది. ఇలాంటి దారుణం స్వాతంత్ర్య పోరాట కాలంలో కూడా తటస్థ పడలేదు. జూన్ 28 న ఢిల్లీ ప్రెస్ క్లబ్‌లో 120 మంది స్థానిక పాత్రికేయులు సమావేశమై సెన్సారును పాత్రికేయుల అరెస్టులను నిరసిస్తూ తీర్మానించారు. తర్వాత కొన్నాళ్ళకు ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ తరఫున నేషనల్ యూనియన్ ఆఫ్ జర్నలిస్ట్స్ తరఫున ప్రతినిధులు ఇందిరను కలుసుకొని సెన్సారు నియమాలను సడలించాలని, సెన్సారు విధింపును తొలగించాలని కోరారు. ఆ తరువాత భారత పత్రికా సంపాదకుల సమావేశంలో సెన్సారుషిప్పును నిరసిస్తూ తీర్మానించారు.

'ఇది లోగడ అంటూ ఉండేవాణ్ణి. ఇప్పుడూ అంటా. స్థైర్యం, సహసం, త్యాగం, దీక్ష, సంఘటన, విజ్ఞత, చైతన్యం ఇవే ఏ సమాజానికైనా శ్రీరామరక్ష. ఆ గుణాలు జ్వలిస్తున్నంత కాలం – ఏ చీకటైనా, వచ్చిపొయ్యే మేఘచ్ఛాయల్లాంటిదే' అని జాగృతి సంపాదకుడు తూములూరి లక్ష్మీ నారాయణ అలనాటి జనసంఘ దక్షిణ

ప్రాంత కార్యదర్శి గోపాలరావు ఠాకూరును కలుసుకున్నప్పుడు అతనితో ఠాకూర్‌జీ అన్న మాట ఇది. ఇదికూడా సెన్సార్ అయిన వార్తే. సగం మాత్రమే ప్రచురించ బడింది.

సెన్సార్ విధించడానికి కారణం ఏమిటి ?

—ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా నిరసన తెలియజేసే అవకాశం లేకుండా చేయడానికి

—ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ఎవరూ నోరెత్తకుండా, ఉద్యమించ కుండా చేయడానికి

—ప్రభుత్వం అక్రమంగా తలపెట్టిన అణచివేత చర్యలపైన ముసుగు వెయ్యడానికి

—దేశంలో ఎక్కడ ఏం జరుగు తున్నదో తమ ప్రియతమ నాయకుల గతి ఏమైందో, ఎవరెవరిని ఏ జైల్లో పెట్టారో ఎవరికీ తెలియకుండా చెయ్యటానికి

—ప్రతిపక్షాల నోళ్ళు కట్టి వెయ్యడానికి, ప్రతిపక్షాలమధ్య క్రమంగా ఏర్పడుతున్న అవగాహనని ఛిన్నాభిన్నం చెయ్యడానికి, ప్రతి ఘటన ఉద్యమం, దాని తీరు తెన్నుల విస్తృతి ఎవరికీ తెలియ కుండా చెయ్యటానికి.

నియంతకు ఇదీ తృప్తినీయలేదు. తన 'ఇమేజి' పెరగాలి. తన భావానికి అనుకూలంగా ప్రజల బుద్ధులను మార్చాలి. తను చెప్పిన పంథాలో జనం ఆలోచించాలి. నడవాలి. ప్రతిపక్షాలను వారి ఆలోచనా పద్ధతులను కించపరచాలి – ప్రజల దృష్టిలో నికృష్టంగా చిత్రించాలి. ప్రతిపక్షనాయకుల వ్యక్తిత్వాలను, శీలాన్ని దూషితం చేయాలి – దెబ్బ తీయాలి.

అందుకే నిర్బంధితులను ఫాసిస్టులన్నది. ఆర్థికరంగాన్ని విచ్ఛిన్నం చేయ జూచిన జాతీయ వ్యతిరేక సంఘ విద్రోహ శక్తులన్నది. నిందితులు, టక్కరులు, మార్గభ్రష్టులు అన్నది. అసత్యాలను, అర్ధసత్యాలను వ్యాపింప చేయించింది. తన కనుకూలంగా ఎప్పటికప్పుడు సెన్సారు విధించడానికి-చెప్పిన కారణాన్ని చెప్పకుండా-మారుస్తుండేది. 27 జూన్ 75 న రేడియో ప్రసంగంలో - 'కొన్ని దినాలుగా కొన్ని పత్రికలు కావాలని వార్తలను వికృతం చేశాయి. ప్రమాదకరమైన రెచ్చగొట్టే విమర్శలు చేశాయి. సెన్సారుషిప్పు విశ్వాసంతో కూడిన వాతావరణాన్ని సృష్టించడానికే' అని అన్నది. ఏ కారణంగా ఎమర్జెన్సీని ప్రకటించాలనో - ఆ కారణంగానే - అంటే చట్టాలను ఉల్లంఘించమని ప్రజలను రెచ్చగొట్టకుండా చెయ్యడానికి - సెన్సారుషిప్పను విధించామని మెక్సికన్ వారపత్రిక 'సీంపర్' సంపాదకుడు శ్రీ లూయామ్ సు అరేజ్‌తో జరిగిన ఇంటర్వ్యూలో చెప్పింది.

13 జూలై 75 నాడు లండన్ పత్రిక 'సండే టైమ్సు' ప్రతినిధితో మాట్లాడుతూ కొన్ని వార్తాపత్రికలు ప్రతిపక్షాలతో పూర్తిగా కుమ్మక్కై ప్రజల నీతిని, స్థైర్యాన్ని చెరుస్తున్నాయని, హింసను ప్రేరేపిస్తున్నాయని, హత్యలను ప్రోత్సహిస్తున్నాయని సెన్సారుషిప్పు విధించడానికి ఇదే కారణమని ఆరోపించింది. పెట్టుబడిదారులు, పెద్ద పత్రికలు దేశాన్ని అధోగతిపాలు చేస్తున్నాయని, ఆర్థిక రంగంలో దేశం సాధించిన విజయాలను కించ పరస్తున్నాయని నిందించింది.

ఈ ఆరోపణలలో ఏ ఒక్క దానినీ - ఏ ఒక్క పత్రికను పేరు పెట్టి ఎత్తిచూపి నిరూపించ లేదు. చేసిన ఆరోపణలన్నీ అయోమయంగా ఎప్పుడు-ఎక్కడ-ఏ విషయంలో-ఏయే సందర్భంగా-ఏ పత్రిక చేసిన పొరపాటో నిర్దుష్టంగా చూపలేక పోయాయి.

ఇన్ని పత్రికలు వ్యతిరేకించాయని అనిపించినా దానికి బలమైన కారణం ఉండాలి. ప్రజాస్వామ్యంలో విమర్శకు గౌరవమైన స్థానం ఉన్నది. చట్ట విరుద్ధంగా ఏ పత్రిక ఐనా నడిచి ఉంటే అప్పటికే వాటి మీద చర్యలు ఎందుకు తీసుకోలేదు? ఒక్క పత్రిక గురించి ఐనా చర్య తీసుకోమని ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియాకు ఎందుకు సూచించ లేదు? సెన్సార్‌షిప్ క్రింద నిషేధింపబడిన వార్తలలో అనేకం ప్రభుత్వ నిరంకుశత్వాన్నే కాక అధికారుల ఇష్టానిష్టాల మీద కూడా ఆధార పడినవి ఎన్నో ఉన్నాయి.

— ఢిల్లీలో పేదల గుడిసెలను సంజయ్ గాంధి ఆధ్వర్యంలో నేలమట్టం చేశారు - ఆ రిపోర్టులు గాని, వాటి వివరాలు గాని, ఫోటోలు గాని ప్రచురించ రాదు.

— కార్మికుల బోనస్ విషయంలో, బోనస్‌కై జరిగే స్ట్రైకుల విషయంలో ఏ వార్తా ప్రచురించరాదు.

—ఆంధ్ర మహారాష్ట్ర ముఖ్యమంత్రుల మధ్య గోదావరి జలాల విషయంలో జరిగిన ఒప్పందానికి వ్యతిరేకంగా ఏమీ వ్రాయ రాదు.

—షట్సూత్ర ప్రణాళిక మీద నోరు కదపరాదు.

—బొంబాయి అప్పీలు కేసులో జస్టిస్ ఖన్నా ఇచ్చిన తీర్పును ప్రచురించ రాదు.

—బొంబాయికి జె. పి. రాకను గూర్చి, ఆరోగ్యాన్ని గూర్చి వార్తలు ఫోటోలు పత్రికలలో కన్పించ రాదు.

—కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చిత్తు తీర్మానాన్ని ప్రచురించ రాదు.

— తమిళనాడు మీద విధింపబడ్డ అధ్యక్ష పరిపాలనను సవాల్ చేస్తూ కరుణానిధి హైకోర్టులో చేసుకున్న రిట్ పిటిషన్ గురించి ప్రచురించ రాదు. అలాగే గుజరాత్ పైన విధించిన అధ్యక్షుని పరిపాలనను గురించి ఏ వార్తా ప్రచురించ రాదు.

—కుటుంబ నియంత్రణ విషయంలో విమర్శ పనికి రాదు.

— గుజరాత్ హైకోర్టులో భూమిపుత్ర కేసులో ఇచ్చిన తీర్పు ప్రచురించ రాదు.

— సంజయ్ గాంధి 76 ఏప్రిల్‌లో అతని గౌరవార్థం జరిగిన విందును బహిష్కరించి వెళ్ళిపోయిన వార్తను, ఢిల్లి టెలివిజన్ సెంటరులో అగ్నికాండను గురించి, లండన్‌లో నటయిత్రి నర్గీస్ ఒక దుకాణంలో దొంగతనం చేసి అరెస్టయిన వార్తను ప్రచురించ రాదు.

—జైళ్ళకు సంబంధించిన, నిర్బంధాలకు సంబంధించిన వార్తలేవీ ప్రచురించ కూడదు.

—ఆచార్య వినోబాభావే గోహత్యా నిరోధానికి నిరసనవ్రతం చేస్తానన్న వార్త, హైకోర్టు జడ్జీల ట్రాన్స్‌ఫర్ వార్తలు, జె. పి. రాక పోకలకు సంబంధించిన వార్తలు, ఢిల్లీ హైకోర్టు సెన్సార్‌షిప్ విషయంలో ఇచ్చిన తీర్పుకు సంబంధించిన వార్తలు ప్రచురించ రాదు.

— సుబ్రహ్మణ్య స్వామి రాజ్యసభకు వచ్చినప్పటి ఉదంతం ప్రచురించ రాదు.

— జైళ్ళలో డిటెన్యూలు చేసిన నిరసన వ్రతాలను గురించి వార్తలు కనబడ కూడదు.

ఈ విధంగా ప్రజలకు తెలియాల్సిన, ప్రజలకు తెలుసుకునే హక్కుగల, ప్రజాస్వామ్య సక్రమ నిర్వహణకు అవసరమైన ఏ వార్తనూ ప్రచురించనీయలేదు ప్రభుత్వం.

అప్పటికీ పత్రికలు ఊరుకో లేదు.

తెలుగునాట జాగృతి (విజయవాడ) చివరి దాకా పోరాడుతూనే వచ్చింది. జాగృతి సంపాదకుడు రకరకాల వేషాలతో భాషను మలచి ప్రజలకు వాస్తవ స్థితిని తెలుపుతుండేవాడు. ఈ వార్త ఢిల్లీ దర్బారుకు చేరింది. ఓం మెహతా వెంటనే జాగృతి పని పట్టమని ఆదేశం పంపాడు. అప్పుడు విజయవాడ సబ్‌కలెక్టర్ సునీల్‌ఖత్రి. "నాకు సంజయ్ స్నేహితుడు" అనేరకం. జాగృతి సంపాదకులు తూములూరి లక్ష్మీనారాయణని, భారత ముద్రాణాలయం వ్యవస్థాపక కార్యదర్శి విశ్వనాథయ్యని పిలిచి ఒక రోజల్లా నిర్బంధానికి గురిచేశాడు. అదుపులు అనేకం సూచించాడు. జాగృతి ఆదర్శానికి అంకితమైన పత్రిక. సంచిక లమ్ముకొని డబ్బు గడించడానికి పుట్టిందికాదు. తాత్కాలికంగా మూసివేయడం మేలనిపించి ప్రచురణను ఆపుచేసారు.

ధనెంకుల నరసింహం విజయభేరి (నెల్లూరు) సంపాదకుడు. స్వాతంత్ర్య పోరాటం గుర్తెరిగినవాడు. "బసవన్నలను తోడుచేసుకొని అమ్మా! సంక్రాంతీ! ఎందుకొచ్చావు?" అని 15-1-76 వ సంచికలో పెద్దక్షరాలలో ప్రశ్నించి "స్వరాజ్యం అందరిదీ కాకుండా కొందరే గుప్పెట్లో పెట్టుకుంటున్నారు—ప్రజాస్వామ్య సూత్రాలను హరింపచేయడానికి రాజ్యాంగాన్నే సవరించ బూనుకుంటున్నారు. తామొక ప్రత్యేకమైన తెగగా, జాతిగా, వ్యక్తులుగా రూపు దిద్దుకొనుటకు చట్టాలను, న్యాయ వ్యవస్థను తలక్రిందులు చేస్తున్నారు-అధికారంలో ఉన్నవారు లేనివారిపై అసంఖ్యాకంగా అస్త్రశుతులను వల్లిస్తున్నారు-వేలాది నాయకులు, లక్షలాది వారి అనుచరులు ఇనుప కటకటాలలో ఇరుక్కొని ఇబ్బందుల నెదుర్కొంటున్నారు—వారి ఇండ్లల్లో విందులు లేవు వినోదాలు అసలేలేవు. అమ్మా! సంక్రాంతీ! ఎందుకొచ్చావమ్మా?

ఇట్టి స్థితిలో నీవెందుకొచ్చావు?'' అని గుండెమండి తన ఆవేదనను ప్రకటించుకున్నాడు. నియంత ప్రభుత్వం ధనెంకుల నరసింహం మీద క్రిమినల్ కేసు పెట్టించి. అతడు చివరిదాకా పోరాడి హైకోర్టులో గెలిచి జైలునుండి విడుదలైనాడు.

కడపనుంచి 'హూసీను' ప్రభుత్వ దమనకాండను ఎదిరించడానికి పెనుగులాడింది.

కొన్నాళ్ళు 'కమెండో' తంటాలు పడ్డది.

విజయవాడనుంచి 'వికాసం', 'ప్రజాశక్తి' పెనుగులాడుతూ వచ్చాయి.

ఆంధ్రప్రభలో రాజకీయ పునఃశ్చరణ తరగతులు మనుష్యులను కుదిపాయి-కదిపాయి.

పనిగట్టికొని ప్రజాస్వామ్య శత్రువులా వ్యవహరించింది విశాలాంధ్ర.

ఆంధ్రజ్యోతి నామమాత్రంగా నార్ల వెంకటేశ్వరరావును సంపాదకుడిగా ఉంచి ఇందిర భజన గీతాలు వ్రాసింది; సంజయ్ ప్రత్యేక సంచికను వేసింది; దానితో విసిగిపోయి నార్ల ఆంధ్రజ్యోతినుండి విరమించుకున్నాడు.

ఇందిరా గాంధీ భక్తుడు, ఎమర్జెన్సీని గట్టిగా సమర్థించినవాడు పి. వి. నరసింహారావు. ఆయనను సమర్థించే పత్రిక ఇండియన్ హెరాల్డ్ అంటారు. హైద్రాబాదునుంచి ప్రచురించబడే ఈ అల్పప్రాణి

ఇంగ్లీషు పత్రిక ఇందిరా గాంధీ ప్రభుత్వానికి వింజామరలువీస్తూ ఇహం, పరం సాధించుకున్నది.

ఏ కొన్నో తప్ప, మిగతా పత్రికలు-మార్కెటు ధరలు, సినిమా ప్రకటనలు, సమాచార్ వాకాలు ప్రచురిస్తూ అడ్వర్టైజ్మెంటుకొరకు తమ మనుగడను కాపాడుకోడానికి తలదించాయి – 'కొద్దిగా వంగి నడవమంటే-పొట్టమీద దేకిన' న్యూస్ బులెటిన్లు.

దేశం ఒక ప్రమాద పరిస్థితిలోంచి నడుస్తున్నదని ప్రజలకు తెలుసు. కాని మనం ఎక్కడ ఉన్నాం? మన పరిస్థితి ఏమిటి? దేశం ఎటు పోతున్నది? అనే విషయం ప్రజలకు తెలియదు. తెలిసే అవకాశం లేదు.

# 8

# వ్యూహం

మన ఇంటికి నిప్పంటుకుంటే
చిచ్చు పెట్టింది ఇంటిలోవాడా
బైటివాడా అని ఆలోచించకుండా
ముందు దాన్ని ఆర్పివేయాలి.

—థామస్ జెఫర్సన్

ప్రజా సామ్యం ద్వారా తన పదవిని కాపాడుకోగలిగినంత మేరకు ఇందిరా గాంధీ ప్రజా స్వామ్యాన్ని బ్రతకనిచ్చింది. ప్రజలకు తన నియంతృత్వం ఏ మేరకు ప్రజాస్వామ్యపు అవకాశం ఇవ్వగలిగితే, ఆ మేరకు ప్రజలు ఎదురునిల్చి ఆమె నియంతృత్వ విధానాలను సవాలు చేయ నారంభించేసరికి, ప్రజాస్వామ్య పరిధులను కూడా కత్తిరిస్తూ వచ్చింది.

ప్రజలు పూర్తిగా ఎదురు తిరిగారు. అల్హాబాద్ హైకోర్టు ఆమెను ప్రధానిగా ఉండ వీలులేదని నిర్ణయించింది. సుప్రీంకోర్టు ఒక విధంగా ఆమె నీతిపై వచ్చిన అనుమానానికి తాత్కాలిక ముద్ర వేసింది. కనుక ఆ ప్రజాస్వామ్యాన్ని, ఆ న్యాయ వ్యవస్థను రూపుమాపి అయినా తన పదవిని రక్షించుకోదలచు కున్నది. తన పదవిని కాపాడుకోడానికి ఆమె తీసుకున్న ప్రమాదకరమైన చర్య ''ఎమర్జెన్సీ విధింపు''.

దాంతో ప్రతిచోటా భయం ఆవరించింది. దేశంలో ప్రజలు మొదటిసారి ఇలాంటి ప్రమాద పరిస్థితిని చూచారు. మహాశక్తిగల ప్రజాదరణ పొందిన నాయకులు ఇందరు ఒక్కసారిగా నిర్బంధింప బడ్డా, కదలికలు-దేశపు విస్తృతిని, జనసంఖ్యను పోలిస్తే-అక్కడక్కడ చిటపట మన్నాయేగానీ, ఎక్కువ కన్పించలేదు. విప్లవం రాలేదు. ఒక విధంగా దేశానికి పక్షవాతం వచ్చినట్లయింది.

నియంతలు పోయిన వారిలో-భయపెట్టి, భజన చేయించుకునే ధోరణి ప్రారంభమైంది. ఇందిరా గాంధీని - ప్రజలను - బంధించగల సమాన నైతిక సూత్రాలు - ఉభయ సమ్మతమైనవి - నామమాత్రంగా ఉన్నా, ప్రభుత్వం ప్రకటించిన అత్యవసర పరిస్థితిని ప్రజలు బహిరంగంగా ఎదిరించ కలిగి ఉండేవాళ్ళు. సమాన నైతిక విశ్వాసాలు లేని చోట-ఆటలో సమాన నియమాలు లేనిచోట-మౌలికంగా శాంతిపూర్ణ విప్లవాన్ని, సత్యాగ్రహ సమరాన్ని ప్రారంభించడానికి నిశ్చయించుకున్న ప్రజా ఉద్యమం కూడా నాటి అవసరాల పిలుపువిని ఆచరణ పక్షానికి ఒక క్రొత్త మలుపు నిచ్చింది. అందుకే ఈ పోరాటం పూర్తి అహింసాయుతంగా జరిగినా, క్రొత్త అన్వయంతో ప్రచ్ఛన్నంగా, అజ్ఞాతంగా కూడా సాగింది.

ఉద్యమానికి గౌరవాన్నివ్వడానికి జయప్రకాశ్ నారాయణ్ పేరు ప్రజలలో విద్యుత్తులా పనిచేస్తుంది. కాని ఆచరణలో క్రిందిదాకా ఈ వ్యూహాన్ని నిర్వహించవలసిందెవరు ?

ప్రజా ఉద్యమాలకు, అజ్ఞాత విప్లవాలకు తేడా ఉన్నది. అజ్ఞాత విప్లవంలో అడుగడుగునా ప్రమాదమే. ప్రభుత్వం ఎన్ని ఘాతుకాలు చేసినా ఆ ప్రక్కవాడికి తెలిసే దిక్కూ దారీ ఉండదు. ప్రజా ఉద్యమాలకు ప్రచారంవల్ల సంక్రామకత్వం లభిస్తుంది. అంటే అవి రాజు

కుంటూ పోతుంది. ప్రచారావకాశాలు లేనిచోట రాజుకోదు. ఉద్దీపనం ఉండదు. ఉద్యమాలలో ఉద్రేకం తాత్కాలికంగా ఉప్పొంగే అవకాశం ఉంటుంది. కాని ప్రస్తుత స్థితిలో దానికీ అవకాశంలేదు.

ఈ పరిస్థితిలో ఎవరీ ఉద్యమాన్ని చేపట్టాలి ?

రాజకీయ పార్టీలు చెల్లాచెదరైనాయి. పార్టీ ప్రముఖ నాయకులు-ప్రజలను కదిలించ గలవారు-ఎక్కడికక్కడ నిర్బంధాలలో ఉన్నారు. కొద్దిమంది బైటఉన్నా వారికి క్రమశిక్షణగల, పరిస్థితులు ఎలాఉన్నా, పట్టుదలతో, అర్పణ భావంతో పనిచేస్తూ పోగల కార్యకర్తల బృందం తక్కువ. రాజకీయ నాయకులు పిలుపు ఇస్తే పరుగెత్తుకొని వచ్చే సంసిద్ధత జనంలో ఉంటే అది వెంటనే అగ్నిగోళంలా ప్రబద్ధలై ఉండేది. మరి ప్రతిపక్ష నాయకులు 29 జూన్ నుండి సత్యాగ్రహం ప్రకటించారు. సత్యాగ్రహాన్ని వమ్ముచేయడానికి, ప్రజల శాంతిపూర్వమైన పోరాట శక్తిని దెబ్బ తీయడానికి నియంతృత్వం ప్రజాస్వామ్యాన్నే సమాధి చేసింది. ప్రజల స్వాతంత్ర్యాలను హరించింది. ప్రజా శక్తికి నియంతృత్వం ఇచ్చిన ఈ ప్రమాదకరమైన సవాలును అలా ఎదిరించకుండా దాసోహ మనడమా ? ప్రజలకంటే పార్లమెంటు, ప్రభుత్వమూ ఎక్కువ అధికారాలు కలది-అని ఇందిరా గాంధీ చెప్పిన తర్కాన్ని అంగీకరించి ప్రజలు తలవొగ్గడమా ? దేశ విదేశాలలో ప్రజల స్థైర్యానికి దీనివల్ల ఏగతి పడుతుంది ?

రాష్ట్రీయ స్వయంసేవక సంఘం (ఆర్. యస్. యస్) సమాజ సంఘటనచేసే సంస్థ. పార్టీలు పనిచేసేతీరు వేరు - సంఘం తలపెట్టిన పని వేరు. సంఘం క్రియాశీల జాతీయ పౌరసంఘటనకు శిక్షణద్వారా ప్రయత్నించే సంస్థ. క్రియాశీల పౌరులు ఈ నియంత సవాలు నెదిరించకపోతే దేశానికి దుర్దినాలు-శాశ్వత బానిసత్వం తప్పదు.

''సంఘం ఎన్నడూ తనవరకే ఆలోచించలేను. ఆలోచించదు. ఒక జాతీయ సంఘటనగా సమాజ హితాన్ని దృష్టిలో ఉంచుకునే సంఘం ఆలోచిస్తుంది. దేశానికి అవసరం ఏర్పడ్డప్పుడల్లా - ప్రకృతి ఈతిబాధల వల్లకాని, పరాయి దురాక్రమణల మూలంగా గాని-దేశాన్ని కాపాడేందుకు సంఘం ఎప్పుడూ ముందే ఉంటూ వచ్చింది. అత్యవసర పరిస్థితి జాతికి సంభవించిన ఒక ఆపద. ఇది వాస్తవమని తరువాత జరిగిన సంఘటనలు ఋజువు చేశాయి'' అంటారు ఆర్. యస్. యస్. ప్రధాన కార్యదర్శి మాధవరావు మూలే.

అప్పటికి సంఘాన్ని నిషేధించలేదు. క్రియాశీల పౌరులుగా, ప్రజాస్వామ్య వాదులుగా, దేశ భక్తులుగా గుజరాత్, బీహార్లలో జరిగిన మహోద్యమంలో స్వయంసేవకులు వ్యక్తిగతంగా పాల్గొన్న మాట వాస్తవం. భావనాబలం, క్రియాశక్తిగల వ్యక్తులు చేబట్టిన పనిలో ఊపు ఉంటుంది. ప్రభావం ఉంటుంది. ఫలితాల నిచ్చేదిగా ఉంటుంది. స్వయంసేవకుల చేరికవల్ల-ఉద్యమానికి ఒక దిశ-శక్తి-అర్థం ఏర్పడి ఉండవచ్చు. కాని సంఘం-సంఘంగా అంటే సంస్థగా-గుజరాత్ ఉద్యమంలోగాని, బీహార్ ఉద్యమంలోగాని లోక సంఘర్ష సమితి (యల్. యస్. యస్.)లోగాని చేరలేదు. ఇప్పుడు సంఘం ఉద్యమిస్తే తనపై బాధలు స్వయంగా, త్వరగా కొని తెచ్చుకున్నట్లే. అయినా సంఘం ఈ సవాలును స్వీకరించింది.

నియంతృత్వ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్యూహరచనచేసి పోరాడదలచుకున్నది; నాయకుల సమష్టి సంకల్పాన్ని సార్థకం చేయ దలచుకున్నది. అలా వ్యూహాన్ని, మొత్తం దేశమంతటా ఈ అజ్ఞాత స్వాతంత్ర్యపోరాటాన్ని నడిపే భారాన్ని స్వీకరించింది.

ఢిల్లీ ఆర్. యస్. యస్. కార్యాలయ ప్రముఖ్ దేవరాజ్. 25 జూన్ అర్ధరాత్రి 1-30 గంటలకు టెలిఫోను మ్రోగింది. 'మదర్ లాండు' పత్రికాసంపాదకుడు కె. ఆర్. మల్కానీ ఫోనుచేసి, తనను అరెస్టుచేయడానికి పోలీసులు వచ్చినట్లు, అరెస్టులు విస్తృతంగా జరిగే సూచనలున్నట్లు సంకేతించాడు. వెంటనే దేవరాజ్ ఫోనుద్వారా ఢిల్లీ, ఢిల్లీ పరిసరాలకు ఈ వార్తను అందచేయ నారంభించాడు. తెల్లవారు జామున మూడుగంటలకు పోలీసు సంఘ కార్యాలయానికి చేరింది. అందాకా ఫోనులో సందేశాలు వెళుతూనే ఉన్నాయి. పోలీసు దేవరాజ్‌ను నిర్బంధించి తీసుకొనివెళ్ళారు. అప్పుడు కార్యాలయంలో మరెవ్వరూ లేరు. మరో బాధ్యతగల సంఘ ప్రముఖుడు కృష్ణానంద సాగర్ డాబా మీద పడుకున్నాడు. అతడు తప్పుకున్నాడు. ఇంతలో జె. పి. వగైరాలు అరెస్టయినట్లు వర్తమానం అందింది. వెంటనే అతడు జలంధర్, జయపూర్, జమ్ము, చండీగఢ్, అహమదాబాద్, బొంబాయి, ఆగ్రా, లక్నో, కాన్పూర్, పాట్నా మొదలగు స్థలాలకు వర్తమానం పంపాడు.

అప్పుడు రోహతక్‌లో హరియానా, పంజాబ్ ప్రాంతాల సంఘ శిక్షణా తరగతులు నడుస్తున్నాయి. ఆర్. యస్. యస్. ప్రధాన కార్యదర్శి మాధవరావు మూలే, ఉత్తర ప్రాంతాల ప్రచారకులు బాపూరావు మోఘే, పంజాబ్ ప్రాంత ప్రచారకులు ఠాకూర్ రాం సింహ; ఢిల్లీ నగర ప్రచారకులు విశ్వనాథ్ రోహతక్‌లో ఉన్నారు. వారికీ విషయం తెలియచేయడంతోటే 26 న మాధవరావు మూలే ఢిల్లీ వచ్చారు. కార్యాలయానికి రాకుండా వేరేచోట ఉండి, వ్యక్తులను పిలిపించుకొని పరిస్థితిని గురించి చర్చించారు. అప్పటికి రేడియోలో అత్యవసర పరిస్థితి ప్రకటన జరిగింది. ఆయనతో ఆయా పార్టీల నాయకులు, పాత్రికేయులు, సంఘ కార్యకర్తలు కలిసారు. చర్చలో-"శ్రీమతి గాంధీ తప్పు

వారిన అడుగు పెట్టింది. ఎంతదూరం ప్రయాణిస్తుందో, ఎంత దుస్సాహసానికి దిగుతుందో అంచనావేయడం కష్టం. కనుక పోలీసులకు చిక్కరాదు. కార్యకర్తలు అజ్ఞాతంలోకి వెళ్ళిపోవాలి " అని నిర్ణయం ఐంది.

స్వయంసేవకులు ఆ తెల్లవారుజామునందే ఈ వార్తను నలుసుకికి నగరమంతటా తెలిపారు. దానితో వివిధ పార్టీల నాయకులు, కార్యకర్తలు పోలీసులకు చిక్కలేదు. జనసంఘ కేంద్ర కార్యాలయ కార్యదర్శి జగదీశ్ ప్రసాద్‌మాథుర్, కేదార్‌నాథ్ సహానీ, సుందర సింగ్ భండారీ, నానాజీ దేశ్‌ముఖ్, సుబ్రహ్మణ్య స్వామి, రవీంద్రవర్మ, రాంభావు గోడ్బోలే తప్పించుకున్నారు. లాలాహంస్‌రాజ్ గుప్త మసూరీలో ఉన్నవారు తిరిగివచ్చి పోలీసులకు పట్టుబడకుండా తప్పుకున్నారు.

దేశం నలుమూలలనుండి ఫోనులో 'ఏమిటి పరిస్థితి? ఏమిటి కర్తవ్యం?' అని అడుగుతుండేవారు. సి. ఐ. డి. లు టెలిఫోను సంభాషణలు వింటూండవచ్చు. అందుకని వారిని భ్రమలో ఉంచే నిమిత్తం నాయకులు ఎవ్వరూ ఢిల్లీలో లేరని, వేచి చూడండని వార్తలు ఫోనులో వెళ్ళాయి.

అర్. యస్ యస్. సహాయ ప్రధాన కార్యదర్శి మోరోపంత్, అఖిల భారతీయ సంఘటనా కార్యదర్శి భావురావ్ దేవరస్ గంగోత్రి - జమునోత్రి యాత్రలో ఉన్నారు. వారిని ప్రత్యేక సందేశంపంపి పిలిపించారు మాధవరావు మూలే

రోహతక్ శిక్షణ తరగతులకు పోలీసులు 'సంఘం నిషేధింపబడిం'దని అసత్యమైన వార్త చెప్పి రెండురోజుల ముందు ఆపు చేయించారు.

28 జూలై నాడు మాధవరావు మూలే సరసంఘచాలక్ బాల సాహెబ్‌ను కలుసుకొని సంప్రదించడానికి, మార్గనిర్దేశనం పొందడానికి ఫిరోజాబాద్‌కు వెళ్ళారు బాలాసాహెబ్ అక్కడ జరుగుతూన్న శిక్షణ తరగతులను పర్యవేక్షించడానికి వెళ్ళి ఉన్నారు. బాలాసాహెబ్ తన కార్యక్రమాన్ని రద్దుచేయవద్దన్నారు. తనను నిర్బంధిస్తే ఫరవాలేదు అన్నారు. వారక్కడినుండి నాగపూర్‌కు 30 న చేరుకోవాలి.

రోహతక్‌లో శిక్షణ తరగతులైపోగానే సి. ఐ. డి. ల దృష్టి పడకుండా కార్యకర్తలంతా తప్పుకున్నారు బాపూరావ్ మోఘే ఢిల్లీ వచ్చిన తరువాత ఇప్పటికింకా సంఘం నిషేధింపబడలేదనే వార్త తెలిసింది.

ఢిల్లీలో ఇందిరా గాంధీ బృందం ఎమర్జెన్సీ ప్రభావం ఎలా ఉంటుందోనని ఎదురు చూస్తున్నది. ప్రజలు రెచ్చిపోతా రనుకున్నది. దానితో అమానుషంగా అణచివేత ప్రారంభించవచ్చు ననుకున్నది. హింసాకాండను రెచ్చగొట్టడానికి అసత్య వార్తల ప్రచారం మొదలైనాయి. 'మదర్‌లాండు' సంపాదకుడు మల్కానీ గంగారాం హాస్పిటల్‌లో మరణించాడు అని పుకారు. కాని వెంటనే నిజాన్ని తెలుసుకొని, వార్తను నలుమూలలా పంపడం జరిగింది. ఇలాంటిదే 10 జూలై నాడు జరిగింది. 'అద్వానీ బెంగుళూరులో చనిపోయాడ'ని ఢిల్లీలో పుకారు. దానిని కూడా నిమిషాల మీద విఫలం చేయడం జరిగింది.

మోరోపంత్, భావురావ్-30 వ తేదీ రాత్రికి ఢిల్లీకి వచ్చారు. అప్పటికే బాలాసాహెబ్‌ను నాగపూర్‌లో అరెస్టు చేసినట్లు వార్త అందింది.

అత్యవసర పరిస్థితి ప్రకటింప బడటంతోటే బాలాసాహెబ్ నాగపూరు నుండి స్వయంసేవకులకు సందేశ మిచ్చారు.

"స్వయంసేవక సోదరులారా! ప్రయాగ హైకోర్టు తీర్పువల్ల దురదృష్ట వశాత్తు ప్రధాన మంత్రి స్థిమితత్వాన్ని కోల్పోయింది. దాని వల్లనే అత్యవసర పరిస్థితి ప్రకటింపబడ్డది. పెద్ద సంఖ్యలో ప్రజా నాయకులు నిర్బంధింప బడ్డారు. పత్రికలమీద ఆంక్షలు విధింప బడ్డాయి. ఈ చర్యలవల్ల ప్రజాస్వామ్యానికి దెబ్బ తగిలింది. ప్రజల ప్రాధమిక హక్కులు అణగారి పోయినాయి. సహజంగా నలువైపులా అసంతృప్తి, అశాంతితో వాతావరణం క్షుబ్ధంగా ఉన్నది.

ఈ అసాధారణ పరిస్థితులలో తమ స్థిమితత్వాన్ని కోల్పోక-మన ప్రధాన కార్యదర్శి మాధవరావు మూలే, లేక వారు సూచించిన అధికారుల సూచనల మేరకు సంఘ కార్యాన్ని నడుపుతూ-మునుపటి వలె జనసంపర్క-జనజాగృతి-జనశిక్షణ-కార్యక్రమాలను నిర్వహిస్తూ, సామాన్య ప్రజలు తమ జాతీయ కర్తవ్యాన్ని నెరవేర్చుకొనే శక్తి పొందేలా నిర్మాణం చేయడం స్వయంసేవకుల కర్తవ్యం."

నాగపూర్,
27-6-1975.

భవదీయ,
మ. ద. దేవరస్.

ఈ సందేశం మేరకు కార్యాచరణ నిమిత్తం జూలై ఒకటవ తేదీన ఢిల్లీలో మాధవరావు, మోరోపంత్, భావురావ్, ప్రొ. రాజేంద్ర సింహ్ (రజ్జూ భయ్యా) సమావేశమై కార్యాచరణ సమితికి కేంద్ర సంచాలకుడుగా మాధవరావు మూలే సలహాలతో మోరోపంత్ పింగళే పని చేయాలని తీర్మానించుకొని తదుపరి కార్యక్రమానికి సూత్ర నిర్మాణం చేసారు.

జూన్ 30, జూలై 1వ తేదీలలో యావద్దేశంలోని యూత్ కాంగ్రెస్ జిల్లా అధ్యక్ష, కార్యదర్శుల సమావేశం ఢిల్లీలో జరిగింది.

30 వ తేదీన ఆ సమావేశానికి ఒక సంఘ కార్యకర్త వెళ్ళాడు. సమావేశంలో కాంగ్రెసు అధ్యక్షుడు బారువా "సంఘంతో తలపడడానికి సిద్ధమవండ'ని ఉద్బోధించాడని, ఆ సాయంత్రం యు.పి. ప్రతినిధులు చంద్రజిత్ యాదవ్ ఇంటికి వెళ్తే సందులలో, గొందుల్లో ఇంటా బయటా, నడివీధుల్లో సంఘ స్వయంసేవకులను చంపాలి. మీకు నష్టమేమీ కలుగదు. పోలీసుల విషయంలో ఏర్పాటైంది. సంఘాన్ని కూడా నిషేధిస్తాము" అన్నాడట. ఈ వార్త మాధవరావ్‌కు చేరింది.

4 వ తేదీ హడావిడిగా గడిచింది. సంప్రదింపులు నడుస్తూనే ఉన్నాయి. ఇంతలో సంఘ నిషేధ వార్త కూడా చేరింది. అది విని "ఇందిరా ప్రభుత్వం తన పరిపాలనకు స్వస్తి చెప్పుకోడానికి ఏర్పాట్లు తానే చేసుకుంటోం"దన్నారు మాధవరావు మూలే.

మాధవరావు మూలే అజ్ఞాత వసతిలో ఆ రాత్రే సంఘ కేంద్ర అధికారుల సమావేశం జరిగింది. సంఘాన్ని నిషేధించిన తరువాత ఇది మొదటి సమావేశం. ఈ సమావేశంలో మాధవరావు మూలే, మోరోపంత్ పింగళే, భావురావు దేవరస్, ప్రొఫెసర్ రాజేంద్ర సింహ, బాపూరావు మోఘే పాల్గొన్నారు. సుందర్‌సింగ్ భండారి, దత్తోపంత్ ఠేంగడీ, నానాజీ దేశ్‌ముఖ్‌లను ఈ సమావేశానికి ఆహ్వానించారు. రాత్రి సుదీర్ఘంగా చర్చలు జరిగాయి. జులై అయిదవ తేదీన ఉదయం కూడా తిరిగి సమావేశమై చర్చించారు. పరిస్థితిని అన్నివిధాల పరిశీలించారు.

పరిస్థితుల సమీక్షలో "ఇందిరా గాంధీ పూర్తి వ్యక్తి వాది. ఆమెకు సిద్ధాంతాలు లేవు. సిద్ధాంతాలు తనకు ఉపయోగ పడ్డంత వరకు వల్లించడానికి, ఎదురు తిరగగానే వాటికి తిలోదకా లివ్వడానికి వెను కంజ వేయని వ్యక్తి. దేశంకంటే స్వంతానికి అంకితమైన మనిషి.

ఎమర్జెన్సీ పెట్టింది తన పదవికి అడ్డొగిలే శక్తులను అణచడానికే. ప్రజాస్వామ్య శక్తులే ఆ అద్భుతగల గలిగేవి. కనుక ప్రజాస్వామ్యాన్నే తుడిచి పెట్ట దలచుకున్నది. సంఘం రాజకీయ సంస్థ కాకపోయినా, ప్రజాస్వామ్యాన్ని విశ్వసించే ప్రబలమైన సంఘటనాశక్తి. సంఘం ప్రజాస్వామ్య హత్యను సహించి ఊరుకోదు. అందుకుగాను సంఘాన్ని విడుకోవాలనీ సంఘాన్ని అణచి వేయాలనీ నిశ్చయించుకున్నది. సంఘాన్ని అణచడ మనేది ఆమెకు సిద్ధాంత విషయంకాదు. ప్రజా స్వామ్య సమర్థన కొరకు పోరాడే శక్తులను తల ఎత్తకుండా చేయా లని సంకల్పం.

కనుక ముందున్న కర్తవ్యం సంఘం మీదనుండి నిషేధం తొలి గించు కోడానికి తపన పడడం కాదు. ప్రజాస్వామ్య పునరుద్ధరణ కొరకు ప్రయత్నం సాగాలి. ప్రజాస్వామ్యంపైన నమ్మకమున్న వ్యక్తు లను, సంస్థలను సమీకరించి ప్రతిఘటనాశంఖాన్ని పూరించాలి. ఆ ప్రతిఘటన పూర్తిగా అహింసా ధోరణిలో నడవాలి. పక్షాతీతంగా నడవాలి. 25 జులైనాడు ఏర్పడ్డ లోక సంఘర్ష సమితి పేరిటే ఈ కార్యక్రమాన్ని నడపాలి. ఈ ప్రతిఘటన ఉద్యమానికి సంఘం పూర్తిగా సహకరించాలి" అని నిష్కర్షకు వచ్చారు.

యల్. యస్. యస్. నాయకుల్లో నానాజీ దేశ్ ముఖ్ మినహా దాదాపు అందరూ అరెస్టయినారు కనుక లోక సంఘర్ష సమితి కార్య క్రమాలను-నిర్ణయానుసారం ఆయనపేర నడపాలనుకున్నారు. అప్ప టికే దేశంలో అన్ని సంఘ కార్యాలయాలను పోలీసులు తమ స్వాధీనం లోకి తీసుకున్నారు. సోదాలు చేశారు. సంఘ స్వయంసేవకులు నిర్వ హించే పాఠశాలలను, కాలేజీలను, హరిజన గిరిజన సంక్షేమ కేంద్రా

లను ప్రభుత్వం జప్తుచేసి, స్వాధీనం చేసుకున్నది. ఆర్.యస్.యస్. ను అణచి వేయడమే పరమ లక్ష్యంగా సాగింది వ్యవహార మంతా.

తరువాత సంఘ నాయకులు పంజాబ్, కేరళ, వంగ, బీహార్ ప్రాంతాల గురించి ఆలోచించారు - ఈ నాల్గు ప్రాంతాలకు నాల్గు సమస్య లున్నాయి. పంజాబులో ప్రతిఘటన జరగాలంటే అకాలీల మద్దతు ఉండి తీరాలి. కేరళ, బెంగాల్ ప్రాంతాలలో మార్క్సిస్టు కమ్యూనిస్టులు కూడి రావాలి. బీహార్‌లో జె. పి ప్రభావం ఉన్నది. కనుక ఈ నాల్గు ప్రాంతా లను పర్యటించి ప్రజలను, నాయకులను ప్రతిఘటనకు సిద్ధం చేయాలి. అక్కడి వ్యక్తులను కలియడానికి ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క ప్రముఖుడు వెళ్ళాలని నిశ్చయించు కొన్నారు. గుజరాత్‌లో, మద్రాసులో కాంగ్రెసేతర ప్రభుత్వా లున్నాయి. వారి ధోరణి ఎలా ఉంటుందో తెలుసుకోడానికి వ్యక్తులు వెళ్ళారు.

దక్షిణ భాగంలో ఉన్న రాజకీయ నాయకులను కలుసుకుంటూ, ప్రతిఘటనోద్యమానికి సంబంధించిన వ్యవహారాలు చూచేందుకు భార తీయ మజ్దూరు సంఘ నాయకులు దత్తోపంత్ ఠేంగ్డేజి కదిలారు. ఉత్త రాది నాయకుల సంబంధాలను ఏర్పరచుకునేందుకు సుందరసింగ్ భండారి నడుంకట్టారు.

ఈ సమావేశంలోనే ప్రతిఘటనోద్యమానికి నియమావళి తయారు చేశారు. నిరంతరం సంబంధాలు నెలకొల్పుకుంటూ ముందుకు సాగేందుకు దేశాన్ని ప్రతిఘటనోద్యమ కేంద్రాలుగా విభజించారు.

1. ఢిల్లీ కేంద్రంతో ఢిల్లీ, రాజస్థాన్, హరియానా, పంజాబ్, హిమాచల్, జమ్మూ-కాశ్మీర్‌లను సమావేశ పరచారు. దీనికి బాపూరావ్ మోఘే మార్గ దర్శకులు.

2. కాన్పూర్ కేంద్రాన్ని ప్రొ. రాజేంద్రసింహ్ కిచ్చారు. దీనిలో ఉత్తర ప్రదేశ్, బీహారులను చేర్చారు.

3. కలకత్తా కేంద్రానికి ఒరిస్సా, బెంగాల్, అస్సాం, మేఘాలయ, అరుణాచల్, మణిపూర్, నాగాలాండ్ లను చేర్చారు. ఈ ప్రాంతాలతో వ్యవహారం నడిపేది భావురావ్ దేవరస్.

4. బెంగుళూరు కేంద్రానికి యాదవరావు జోషిని సంచాలకునిగా నియమించి దీనికి కర్ణాటక, ఆంధ్ర, తమిళ, కేరళ, పాండిచ్చేరి మొదలైన ప్రాంతాలు చేర్చారు.

5. అలాగే విదర్భ మినహా మిగతా మహారాష్ట్రను, గుజరాత్, గోవాలను చేర్చి బొంబాయి కేంద్రంగా లక్ష్మణ్‌రావు ఇనాందార్‌కు అప్పగించారు.

6. నాగపూర్ కేంద్రంలో విదర్భ, మధ్య ప్రాంతాలను చేర్చి ఆభాంకర్జీకు అప్పగించారు.

మాధవరావు మూలే కేంద్రంలో ఒకచోట ఉంటారు-కదలరు. వారిని సంప్రదిస్తూ, దేశంలో పర్యటిస్తూ ఉద్యమాన్ని నడపడానికి ఆర్. యస్. యస్. అఖిల భారత కార్యదర్శి మోరోపంత్ పింగళేను ఎంచుకున్నారు.

ఈ సమావేశంలోనే పెద్దల నామకరణాలు జరిగాయి. మాధవరావు మూలే 'ప్రభుదాస్ శర్మ' ఐనారు. మోరోపంత్ 'వినోద్ భరద్వాజ్' అయినారు. భావురావ్ దేవరస్ 'సోమనాథ శర్మ' అని మార్చుకున్నారు. రజ్జూ భయ్యా 'గౌరవ కుమార్' అయినారు. సుందర్‌సింగ్ భండారి 'శ్యాంసుందర్'గా మారితే ఠేంగ్డేగారు 'బావా' అని మార్చు

కున్నారు. బాపూరావ్ మోఘే 'సుభాష్' అని, నానాజీ 'సుధీర' అని పెట్టుకున్నారు.

ఆ రాత్రికి రాత్రి ఎక్కడివారక్కడ వేర్వేరు దారుల, రిజర్వేషనులు చేయించుకోకుండా, సెకండుక్లాసులో బయలుదేరారు.

మాధవరావు మూలే, మోరోపంత్, బాపూరావు మోఘే ఢిల్లీలోనే ఉన్నారు.

ఢిల్లీ కార్యాలయాన్ని పోలీసులు ఆక్రమించుకొని, అసత్యమైన సాక్ష్యాధారాలతో, ఆయుధాలు లభించాయని సృష్టించి టెలివిజన్, రేడియో, సినిమాలద్వారా ప్రచారంచేయ నారంభించారు. కార్యాలయం సోదాచేసినప్పుడు ఒక్క సంఘవ్యక్తి కూడా అక్కడలేడు. రానున్న ఆపద సంఘాన్ని దెబ్బ తీస్తుందని నాయకులకు తెలుసు. అంతకు క్రితమే ఇందిరాగాంధీ ఈ ఉద్యమాని కంతటికీ ఆర్. యస్. యస్. శక్తులే కారణమని గగ్గోలు పెడుతున్నది. నిజంగా కార్యాలయంలో ఆయుధాలే ఉంటే స్వయంసేవకులు నిద్రపోతారా ? వాటిని బైటికి దాటవేయరా ? ప్రభుత్వం తుంటరితనంతో అపకీర్తిపాలు చేయడానికి చూచిన పాడుపని అది. సంఘం ఆయుధ సేకరణను విశ్వసించదు. అది డాక్టర్జీ - సంఘ నిర్మాత-అనుభవ సారంలోంచి పుట్టిన విధానం.

ఢిల్లీలో తప్పుడు సాక్ష్యాధారాలు సృష్టించడానికి ప్రయత్నించినట్లే నాగపూర్ కేంద్ర కార్యాలయం విషయంలో కూడా చేయాలను కున్నారు. ఒక కేబుల్ద్వారా ప్రత్యేక వార్త నాగపూర్కు పోయింది. కాని అక్కడ ఏమాత్రం వీలు కలుగలేదు. అప్పటికే పోలీసులు కార్యాలయాన్ని సోదాచేసి, వస్తువుల జాబితా, పంచనామా వగైరాలు తయారు

చేశారు. నేర నివేదిక కోర్టుకిచ్చారు. కనుక నాగపూర్‌లో వారి కుట్ర ఫలించలేదు. అప్పటికీ రేషంబాగ్ సంఘస్థలంలో ఒకనాటు రివాల్వరు దొరికిందని ప్రచారం చేశారు.

ఆర్. యస్. యస్. వాస్తవలక్ష్యాన్ని గ్రహించాలని లేనప్పుడు నిందారోపణలు చేయడం సులభమే. ఉద్యమానికి ఆర్. యస్. యస్. వెన్నెముకలా ఉండడం ఇందిరాగాంధీకి ఇష్టంలేదు. కనుక ఆర్. యస్. యస్. పై చర్య తీసుకునేముందే తగినంత ప్రబలమైన సాక్ష్యాన్ని సృష్టించాలి. కథ పూర్తిచేసి ఆరోపణలు చేయాలి. రెండోవైపు సంఘ నాయకులను నిర్బంధించి, సంస్థను రెచ్చగొట్టి మైదానంలోకి ఈడ్వాలి. అందుకే ఆమె సంఘాన్ని వెంటనే నిషేధించలేదు.

'సంఘాన్ని వెంటనే నిషేధించక పోవడానికి కారణం ఏమై ఉండవచ్చనే' ప్రశ్నకు సమాధానమిస్తూ సంఘ అఖిల భారతీయ నాయకులు, ఉద్యమంలో కేంద్ర కార్యాచరణ సంఘంలో భాగస్వాములు ఐన భావురావ్ దేవరస్ ఇలా అంటారు.

"ముందు ముఖ్యులను అరెస్టు చేద్దాము. రాజకీయ పార్టీలను నిషేధించకుండా ముఖ్యులందరిని అరెస్టుచేసినట్లుగాచేసి సంఘాన్ని నిషేధించకుండా వేచి చూద్దా"మనుకున్నది కాబోలు. సరసంఘచాలక్ గారిని మరికొందరు కార్యకర్తలను దొరికినంతమట్టుకు వెంటనే నిర్బంధంలోకి తీసుకున్నారుకదా !...... సంఘనాయకులను నిర్బంధిస్తే 'రియాక్షన్' వస్తుంది. వస్తే అణచడానికి ఒక నెపం దొరుకుతుందని కూడా అనుకొని ఉండవచ్చు. వాళ్ళు చేసిన ప్రచారపు తతంగం కూడా అలాగే సాగింది. కార్యాలయాలల్లో మారణాయుధాలు దొరికాయని దుష్ప్రచారం జరిగింది కదా ! అలాంటి దుష్ప్రచారానికి ఇదే కారణం కావచ్చు. కాని స్వయంసేవకులు నిగ్రహానికి అలవడ్డవాళ్ళు. నిర్ణయాలను తు. చ.

తప్పకుండా పాటిస్తారు. అందుకనే నిషేధం విధించిన వెంటనేగాని పూర్తి ఎమర్జెన్సీ కాలంలోగాని-వారికి సరియైన మార్గదర్శనం లభించింది. దానికై నిత్య ప్రయత్నం జరిగింది. అల్లరి చిల్లర హింసా దౌర్జన్యాలవల్ల దేశములో మార్పురాదు-అని నచ్చచెప్పడం జరిగింది. స్వయంసేవకులు కూడా సూచనలననుసరించి చాలా నిగ్రహంతో పని చేశారు. తాత్కాలిక ఉద్రేకానికి లోనైగాని రోషం పుట్టిగాని ఒక్క పొరపాటు చర్యనైనా స్వయంసేవకులు చేయలేదు.''[1]

అప్పటివరకు ఏ ప్రాంతంలో పరిస్థితి ఎలా ఉన్నదీ ఎవరికీ తెలియదు. ప్రాంత ప్రచారకులు ఎందరు అరెస్టయిందీ ఎందరు తప్పుకున్నదీ తెలియదు. కార్యాలయాలపై దాడులు, సోదాలు, సీళ్ళు - అరెస్టులు వగైరా వార్తలు ధారాప్రవాహంగా వచ్చిపడుతున్నాయి. అఖిల భారత అధికారులలో మిగతావాళ్ళు ఎక్కడ ఉన్నదీ తెలియదు.

దేశ వ్యాప్తంగా సంబంధాలు నెలకొల్పడానికి, వెంటనే కార్యక్రమంలోకి దిగడానికి నిశ్చయించుకున్నారు.

వివిధ స్థాయిలలో సంబంధ సూత్రాలు ఏర్పరచే దగ్గరనుంచి, ముందు వ్యూహాన్ని ఆలోచించారు.

వ్యూహ రచనకు కార్యాన్ని భాగాలుగా విభజించారు.

1. క్రియాశీలమైన రహస్య సంఘటనోద్యమాన్ని నిర్మాణంచేసి, నిర్వహించే ఏర్పాటు చేయడం; కార్య సూత్రాన్ని నిర్వహించే వ్యక్తులు నిర్బంధింపబడితే, వెంటనే స్థానాన్ని పూరించే ఏర్పాటు చేయడం -

---

1. హైదరాబాదులో 16-10-77 న భావురావ్ దేవరస్‌తో జరిగిన గోష్ఠిలో నిశ్చయమైంది.

2. దేశమంతటా 'లంకె' లను నెలకొల్పడం. వేగంగా, మెరుపులా వార్తలు-సూచనలు పంపడానికి, పొందడానికి మారుపేర్లు, మారు చిరునామాలు, టెలిఫోను నెంబర్లు, అనుమానానికి తావీయని వార్తాహరుల బృందాన్ని ఏర్పాటు చేసుకోడం—

3. ప్రజలకు ఒకరితో ఒకరికి వార్తా సంపర్కం లేకుండా సెన్సారు విధించిన నియంతృత్వపు వ్యూహాన్ని వమ్ము చేయడానికి ప్రచార యంత్రాంగాన్ని పుష్టివంతంగా నిర్మాణం చేసుకోడం—

1. కరపత్రాలు వ్రాయడం, వ్రాయించడం;
2. సాహిత్యాన్ని సృష్టించడం;
3. ప్రచ్ఛన్న పత్రికలను ప్రచురించడం;
4. వీటిని సైక్లోస్టైలు, టైపు, ప్రింటు ద్వారా-ఏది సాధ్యమైతే-సులువైతే-ఆ పద్ధతిలో ఉపయోగించి తయారైన వ్రాతలను సిద్ధంచేసి ఇవ్వడం;
5. అలా ఇచ్చిన దాన్ని పంచడానికి వివిధ ప్రదేశాలకు చేర్చడం;
6. ఆయా ప్రదేశాలకు చేరిన సాహిత్యాన్ని, కరపత్రాలను, పత్రికలను ప్రజల కందించే యంత్రాంగాన్ని సిద్ధం చేసుకోడం;
7. గ్రామస్థాయినుండి ఉద్యమ వార్తలు, ప్రభుత్వపు అణచివేత చర్యలు, ప్రభుత్వ విధానాల దుష్పరిణామాలు సేకరించి ఎప్పటికప్పుడు స్థానిక కేంద్రాలకు, తరువాత ప్రాదేశిక కేంద్రాలకు-అలా అఖిల భారత కేంద్రానికి పంపడం;

8. వివిధ పార్టీల వారితో, ప్రముఖులతో సంబంధాలు నెలకొల్పడం, వారిని కలిపి కదిలించడం;

9. నాయకుల, ప్రముఖుల పర్యటనలు ఏర్పాటు చేయడం; ఆచూకీ తెలియకుండా వారిని అజ్ఞాతంగా ఉంచే వసతులు ఏర్పాటు చేసుకోవడం;

10. అజ్ఞాత సమావేశాలు జరపడం – వాటిని నిర్వహించడం;

11. అరెస్టయినవారి కుటుంబాలను పరామర్శించడానికి, వారి బాధల నర్థంచేసుకొని సహకరించ డానిక, దళాల నేర్పాటు చేసుకోడం;

12. సత్యాగ్రహం కొరకు వ్యక్తులను సిద్ధంచేయడం – దళాలుగా విభ జించి, తేదీలు, స్థలాలు నిర్ణయించి సత్యాగ్రహాలను నడిపించడం;

13. సాధన సామాగ్రిని-నిధులను సమీకరించడం, వాటి సక్రమ నిర్వహణను చూచుకోడం;

ఈ వ్యూహ రచన జరిగిన తర్వాత మాధవరావు మూలే రెండు రోజులు దేశంలో ప్రముఖు లందరికీ స్వయంగా తన దస్తూరితో ఉత్త రాలు వ్రాసి, సూచనలతోపాటు బాలాసాహెబ్ 27 న నాగపూరు నుండి ఇచ్చిన సందేశాన్ని కూడా ప్రతి ప్రాంతానికి పంపారు.

క్రమంగా అప్పటికే 'తొలి-జంకు' కరిగిపోయి 'లింక్సు' ఏర్పడుతూ వచ్చాయి.

# 9

# నడచిన తీరు

'సాగరాల నెవరు బంధించగలరు
తుఫానుల కెవ్వరు అడ్డుకొట్ట గలరు'

ఇందిరా గాంధీ ఎమర్జెన్సీ లాంటిదేదో పిచ్చిపని చేస్తుందని చాలా మంది అనుకుంటు వచ్చారుకాని, ఇంత దారుణంగా విరుచుకు పడుతుం దనుకోలేదు. ఇంత వ్యాపకంగా నిర్బంధాలు జరుగుతాయనికూడా అనుకోలేదు. కొన్ని కొన్ని ప్రాంతాలలో జిల్లా స్థాయి కార్యకర్తల దాకాను, కొన్నిచోట్ల తాలుకాస్థాయి కార్యకర్తలనుగూడా అరెస్టు చేశారు. మొదటి నాలుగు వారాలలో దాదాపు 50 వేల మందిని జైళ్ళలో పెట్టడం జరిగింది. అరెస్టయిన వారిలో ఆర్. యస్. యస్. సభ్యులు ఎక్కువ. ఆర్. యస్. యస్. మీద 4 వ తేదీన నిషేధం పెట్టినా నిర్బంధాలు అంతకుముందే ప్రారంభమయ్యాయి. ఇన్ని నిర్బంధాలు జరిగినా సంఘ కార్యకర్తల వలయం చాలా వ్యాపకంగా ఉండడాన కార్య క్రమాన్ని నడిపించుకోడం సాధ్యమయింది.

ఇందిరా గాంధీకి సంఘమంటే భయమే. 75 ఆగస్టు ఒకటవ తేదీన న్యూయార్కు పత్రిక సాటర్‌డే రివ్యూ సంపాదకుడు నార్మన్ కజిన్‌తో జరిగిన గోష్ఠిలో ఆమె ''రాష్ట్రీయ స్వయంసేవక సంఘ బాహుబలాన్ని నమ్ముకొని ఏదైనా రాజకీయ కూటమి కేంద్ర ప్రభు

త్వాన్ని చేపడితే భారతదేశంలో ప్రజాస్వామ్యానికే కాకుండా భారత సమైక్యతకే భంగం వాటిల్లుతుంది-" అని వాపోయింది. టైమ్స్ ఆఫ్ ఇండియా విలేఖరితో 75 జులై 3వ తేదీన - ఆర్. యస్. యస్. ను నిషేధించడానికి ఒకరోజు పూర్వమే - "ఆర్. యస్. యస్. రహస్య సంస్థ. తమ కుట్రలకు ప్రజాస్వామ్యాన్ని దుర్వినియోగం చేసుకుంటు న్నారు" అని అన్నది.

ప్రతిపక్షాల ఉద్యమాలకు-జె. పి. ఉద్యమానికి ఆర్. యస్. యస్. సహకరించడం ఇందిరాగాంధీకి ఇష్టం లేదు. ఆర్. యస్. యస్. రాజకీయ పార్టీ కాకపోయినా ప్రజాభిప్రాయాన్ని మార్చగల శక్తి ఆర్. యస్. యస్. కు ఉన్నదని ఆమె గుర్తించి - 'శక్తి', 'క్రమశిక్షణ' గల ఇలాంటి సంస్థ ప్రతిపక్షాలతో చేతులు కలిపితే తన సింహాసనం కదలిపోక తప్పదనే భయంతో వ్యవహరించింది. అందుకే ఆర్. యస్. యస్. అంటే ఆమె కంత పలవరింత!

కాని ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని నమ్మే వివిధ వర్గాలు ఒకటై నిలవ వలసిన అవసరంకూడా ఇందిరా గాంధీ కారణంగానే ఏర్పడింది.

ప్రభుత్వం కొందరిని బైట ఉండనిచ్చింది. సోషలిస్టు పార్టీకి చెందిన యన్. జి. గోరే, యస్. యమ్. జోషి, సంస్థా కాంగ్రెస్ నాయకుడు దిగ్విజయ్ నారాయణసింహ, జనసంఘ యం. పి. ఓంప్రకాశ్ త్యాగి, భారతీయ లోకదళ్ సభ్యుడు హెచ్. యం. పటేల్ బయటే ఉన్నారు.

ప్రభుత్వం అరెస్టు చేయాలని ఎన్ని ఉచ్చులు పన్నినా వెంటనే అరెస్టు కాకుండా తప్పించుకు బయట పడ్డవాళ్ళు నానాజీ దేశ్‌ముఖ్, జార్జి పెర్నాండజ్, కర్పూరి ఠాకూర్, సురేంద్ర మోహన్, మోహన్

ధారియా, జగదీశ్ ప్రసాద్ మాథుర్, సుబ్రహ్మణ్య స్వామి, కేదార్ నాథ్ సహాని, దత్తోపంత ఠేంగ్డీ మొదలైనవారు.

ఆర్. యస్. యస్. అగ్రనాయకులలో నిర్ణయానుసారం బాలా సాహెబ్ దేవరస్ అరెస్టయినారు. వీరు, మరి కొందరు తప్ప-దేశం మొత్తంలో సంఘ నాయకులను ప్రభుత్వం పట్టుకోలేక పోయింది. కేంద్ర నాయకులే కాదు-ప్రాంత ప్రచారకులు; విభాగ్, జిల్లా ప్రచారకులు; అనేక వేలమంది మిగతా ప్రముఖ కార్యకర్త లందరూ పోలీసుల వలయాన్ని తప్పించుకొని ఉద్యమ సారథ్యాన్ని స్వీకరించారు.

మిగిలిన యల్. యస్. యస్. నాయకులు సమావేశమై పోరాట వ్యూహాన్ని, 21 సూత్రాల పోరాట కార్యక్రమాన్ని నిర్ణయించారు. ఈ కార్యక్రమాన్ని నిర్వహించ డానికి యల్. యస్. యస్. ప్రతినిధులు ఆర్. యస్. యస్. కేంద్ర నాయకులతో చర్చించి సమన్వయాన్ని నెలకొల్పు కున్నారు.

ఉద్యమాన్ని పార్టీల కతీతంగా యల్. యస్. యస్. పేరనే నిర్వహించాలని నిశ్చయించడాన ముందు యల్. యస్. యస్. కార్యాచరణ శాఖలను పైనుండి జిల్లా స్థాయిదాకా సృష్టించ వలసి వచ్చింది. నెలాపదిహేను రోజులలోగా ఈ కార్యక్రమాన్ని ఆర్. యస్. యస్. సహాయంతో ఏర్పాటు చేయటం జరిగింది.

ప్రతి స్థాయిలో, కార్యాచరణ సంఘాలలో ఎన్ని పార్టీలవారుంటే - వారందరినీ తీసుకోవాలని నిశ్చయమైంది. కార్యాచరణ సంఘం వ్యాపకంగా - పార్టీల కూటమిగా కాక ప్రజా ఉద్యమానికి నిజమైన కార్యాచరణ సంఘంగా - రూపొందాలి. కనుక ప్రముఖు లందరినీ - రాజకీయ నాయకులను, విద్యార్థి నాయకులను, సాహితీవేత్తలను, న్యాయవాదులను, ప్రతి రంగానికి చెందిన ప్రతినిధు

లందరినీ చేర్చుకోవాలి. ఎవరైనా విరమించుకున్నా ఆ ఖాళీ పూరించాలి. పోరాటంలో ఎవరైనా తప్పుకున్నా, అరెస్టయినా, ఉద్యమం ఆగదు. ఆగరాదు. అలా అన్ని పార్టీలవారు-ఉన్న ప్రతిచోటా - యల్. యస్. యస్. లో కలిసారు.

రాజధాని ఢిల్లీలో జనసంఘ, సంస్థా కాంగ్రెస్, బి. యల్. డి. ల నాయకులు కేదార్‌నాథ్ సహాని, ధన్‌రాజ్ ఓజా, పి. కె. చాండ్లా, శాంతి దేశాయ్, యం. కె. ఆర్య పోలీసులకు పట్టుబడలేదు. ఢిల్లీలో అజ్ఞాత సమావేశం జూన్ 26 నే జరిగింది. శాంతి దేశాయ్, పి. కె. చాండ్లా, ఢిల్లీ ప్రదేశ్ జనసంఘ అధ్యక్షులు సత్యనారాయణ బన్సల్ ఇంకా కొందరు సమావేశ మైనారు. మరునాడు కన్వర్‌లాల్ గుప్త, మదన్‌లాల్ ఖురానా కూడా చేరారు. బిర్లా మందిర్‌లో జరిగిన ఈ సమావేశానికి 40 మంది హాజరైనారు. 27 నే సంస్థా కాంగ్రెస్ నాయకుడు చాండ్లా ఎమర్జెన్సీని వ్యతిరేకిస్తూ ఒక కరపత్రాన్ని ఢిల్లీలో జారీ చేశాడు. అప్పటి నుంచి ప్రతిరోజు ఈ నాయకులు కలుస్తూండేవారు. అలాటి ఒక సమావేశానికి సురేంద్ర మోహన్ కూడా హాజరైనాడు.

మొట్టమొదట సత్యాగ్రహం జూన్ 29 న చాందినీ చౌక్‌లో జరపాలని నిశ్చయమైంది. ఆర్. యస్. యస్. స్వయంసేవకులు కొన్ని గంటలలో వార్తలను కరపత్రాలను ఢిల్లీ నగర మంతటా, సమీప నగరాలలోనూ చేరవేసే ఏర్పాటు చేశారు.

చాందినీ చౌక్ చరిత్ర ప్రసిద్ధి చెందిన కేంద్రం. ఇక్కడే గురు తేజ్ బహదూర్ ఆత్మార్పణం జరిగింది. ఆ నాడు సత్యాగ్రహ దళానికి గ్వాలియర్ రాజమాత నాయకత్వం వహించాలి. కాని ఢిల్లీ చేరకముందే ఆమెను నిర్బంధించారు. చాందినీ చౌక్ నిండా పోలీసులు

సి. ఐ. డి. లు ప్రతి వ్యక్తిని సోదా చేశారు. పరిశీలించి చూశారు. సత్యాగ్రహ వార్త పోలీసులకు ముందుగానే అందచేయడం జరిగింది. 15 మంది నినాదా లిస్తూ వేరు వేరు స్థలాల నుంచి బయలుదేరి కరపత్రాలు పంచుతూ ప్రజల ఆత్మ నిశ్చయాన్ని నాయకుల పిలుపును సార్థకం చేశారు. వెంటనే సత్యాగ్రహులను తిహార్ జైలుకు పంపించారు. అలా జులై 5 దాకా సత్యాగ్రహాలు జరుగుతూనే ఉన్నై. ప్రముఖు లెందరో సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కె. యల్. గుప్తా, సత్యనారాయణ బన్సల్ వీరిలో ముఖ్యులు.

ప్రతిఘటనోద్యమం రాజధాని నుండి రాష్ట్రాలకు ప్రాకింది. ఆర్. యస్. యస్. వ్యవస్థ రీత్యా కర్ణాటక, ఆంధ్ర, తమిళనాడు, కేరళ, పాండిచ్చేరి కలిపి ఒక భాగం. దీనికి యాదవరావు జోషీ నాయకుడు. ఎమర్జెన్సీ ప్రకటించినపుడు వారు కేరళలో ఎర్నాకులంలో ఉన్నారు. జనసంఘ నాయకులు పరమేశ్వరన్ ఎమర్జెన్సీ ప్రకటింపబడ్డట్లు వారికి వార్త అందించారు. ''ఈ ఎమర్జెన్సీ మన కోసమే'' అన్నారు యాదవరావు జోషీ. జూన్ 26, 27 తేదీలలో కేరళ ప్రాంత ఆర్ యస్. యస్. సమావేశాలు జరిగాయి. చివరి సమావేశంలో యాదవరావు జోషీ ఎమర్జెన్సీ పూర్వపు స్థితిని సమీక్షించి రానున్న ప్రమాణాలను సంకేతించారు. ప్రచారకు లందరినీ వెంటనే అజ్ఞాత వాసంలోకి పొమ్మన్నారు. కార్యదర్శులు, సంఘ చాలకులు తమ తమ స్థానాలలో గట్టిగా నిల్చొని అరెస్టు చేస్తే నిర్భయంగా జైళ్ళకు వెళ్ళాలి అని సూచన లిచ్చారు. కార్యాలయాల్లో విలువగల వస్తువులను ఉంచ వద్దని చెప్పారు.

1948 లో ఆర్. యస్. యస్. ను నిషేధించి నప్పుడు పోలీసులు దేశ మంతటా కార్యాలయాలను దోచుకున్నారు. వేల కొలది

రూపాయలు విలువచేసే ఆస్తిని జప్తుచేసి తీసుకు వెళ్ళారు. నిషేధం తొలగించిన తర్వాత కూడా ఆ వస్తువులు తిరిగి లభించలేదు. అందుకే ఈమారు ముందే జాగ్రత్త పడమన్నారు.

అజ్ఞాతంగా పనిచేసే కార్యకర్తలు తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పి తోటి వారికి రానున్న తీవ్రతను గురించి సంకేతిస్తూ ఎలాంటి కఠోర పరిస్థితినైనా సవాలుచేసి ఎదిరించి నిలవగల మానసిక స్థితిని నిర్మాణం చేయమని చెప్పారు.

యాదవరావు జోషీ 28 న బెంగుళూరు వచ్చారు. కర్ణాటక ప్రాంత ప్రముఖులతో సంప్రతింపులు జరిపారు. సమావేశాలు జరిపారు. అప్పటికింకా ఢిల్లీ పరిస్థితి, ఢిల్లీ నుండి సూచనలు వారిదాకా రానేలేదు.

అయినా కేరళలో స్వయంగా ఆయనే సూచన లిచ్చారు. కర్ణాటక రాష్ట్ర మంతటా జిల్లాస్థాయి కార్యకర్త లందరికి ఎమర్జెన్సీ వార్తను, వారి సందేశాన్ని అందచేయడానికి మనుషులు వెళ్ళారు.

అలాగే ఆంధ్ర, తమిళ ప్రాంతాలకు ప్రత్యేక వార్తావాహకులను పంపారు.[1]

జూన్ 26 న ఆర్. యస్. యస్. ఆంధ్ర ప్రాంత ప్రచారక్ సోమయ్య విజయవాడలో ఉన్నారు. ఆ రోజు ఉదయం 5 గంటలకు విజయవాడలో అడ్వకేటు మురళీ మోహన్‌ను అరెస్టు చేశారు. వరుసగా అందర్ని అరెస్టు చెయ్యవచ్చని అనుమానం వచ్చి వెంటనే అందరూ అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు.

---

1. యాదవరావుజీ ద్వారా తెలిసిన వివరాలు.

సోమయ్యగారు జూన్ 28 న హైద్రాబాద్ వచ్చారు. హైద్రాబాద్ విభాగ్ కార్యకర్తల సమావేశం 28, 29 తేదీలలో నడవాలని ముందు నిశ్చయం. కాని 28న ఒకరోజులో సమావేశం ముగించారు. "సంఘంమీద నిషేధం రావచ్చు. రాకపోవచ్చు. ఎట్టి పరిస్థితినైనా ఎదిరించే సిద్ధత ఉండాలి. జాగ్రత్తగా ఉండాలి. సమాజంలో అందరికీ తెలిసిన కార్యకర్తలు అజ్ఞాతంలోకి పోనక్కరలేదు. కార్య క్షేత్రంలో అక్కరకువచ్చే ఏ కార్యకర్తా బయటపడరాదు. అరెస్టు కారాదు.'' ఇవీ స్థూలంగా వారు చెప్పిన సూచనలు.

అప్పటికే ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా వేడి పుట్టింది. జూన్ 26న ఎమర్జెన్సీ ప్రకటించడంతోటే వార్త విన్న వరంగల్ ఇంజనీరింగ్ కాలేజి విద్యార్థులు తరగతులను, జరుగుతూన్న పరీక్షలను బహిష్కరించారు. రాంమోహన్, కృష్ణమూర్తి, బాలబ్రహ్మం విద్యార్థులకు నాయకత్వం వహించి ఆ రోజు నిరసన కార్యక్రమాన్ని నిర్వహించారు. కాలేజి ప్రిన్సిపాల్ వీరి పేర్లను పోలీసుల కందచేశాడు. ఆ ముగ్గురినీ మీసా క్రింద నిర్బంధించి వరంగల్ జైలుకు పంపారు. బహుశా ఉద్యమంలో తొలి అడుగు వేసింది వీరే. ఉద్యమాన్ని నడిపిన కారణంగా తొలిగా మీసా క్రింద అరెస్టు కావింపబడింది వీరే.

ఎమర్జెన్సీ ప్రకటించగానే హాస్పిటల్‌లో ఉన్న తెన్నేటికి ఈ వార్త ఎవరో అందించారు. వెంటనే ఆయన పత్రికలకు ఒక ప్రకటన జారీచేసి తీవ్రంగా తన అధిక్షేపాన్ని తెలిపారు.

27 న తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థులు తరగతులను బహిష్కరించారు. ప్రాంతంలో ఎన్నోచోట్ల ఎమర్జెన్సీని నిరసిస్తూ కరపత్రాలు పంచారు. నల్గొండ, వరంగల్, హైద్రాబాదు, అనంతపూర్, ఖమ్మం మొదలగు ప్రదేశాలలో న్యాయ వాదుల సంఘాలు

ఎమర్జెన్సీని నిరసిస్తూ తీర్మానాలు చేశాయి. కొన్నిచోట్ల అడ్వకేట్లు కోర్టులను బహిష్కరించారు.

విజయవాడలో జూన్ 28 న భారతీయ జనసంఘ, మార్క్సిస్టు పార్టీల సంయుక్త అధ్వర్యంలో హర్తాళ్ నిర్వహించబడింది.

క్రమంగా ఉద్యమానికి ఒక స్థిరమైన రూపం ఇచ్చేందుకు ప్రయాత్నాలు ప్రారంభమైనాయి.

ఆంధ్ర ప్రాంతంలో ప్రతిపక్షాలలో జనసంఘ, బి. యల్. డి., సంస్థా కాంగ్రెసు, సోషలిస్టు పార్టీలుఉన్నా వ్యాపకంగా అన్ని జిల్లాల్లో కొంతరూపు సంతరించుకున్నది జనసంఘ. తరువాత లచ్చన్నగారి నాయకత్వాన బి. యల్. డి.

మిగతా పక్షాల క్రియాశీల సహకారాన్ని గురించి పరామర్శిస్తూ ''మనసులో ప్రతివ్యక్తీ తీవ్రంగా బాధ పడుతుండేవాడు. చేయాలనే తపన ఉండేది. ఈ విధంగా జాతీయ శక్తుల సమాన అవగాహన ప్రత్యక్షంగా కన్పించిన కాలమది. అయితే ఎవరిశక్తి మేరకు వారు సహకరించారు. సంస్థాబలం సంఘానికి పకడ్బందీగా ప్రతిచోటా ఉన్నది గనుక ఈ ప్రాంతంలో ఎక్కువ బరువు సంఘంమీద పడడం సహజం'' అంటారు సోమయ్య.

75 మే లో జె. పి. ఆంధ్రపర్యటన చేసినప్పుడు తెన్నేటిని ఆంధ్ర ప్రదేశ్ లోక సంఘర్ష సమితికి కన్వీనరుగా నియమించారు. తెన్నేటి ప్రజాపార్టీ సభ్యుడు. జె. పి. కోరికపై రాజీనామాచేసి, సమగ్ర విప్లవ కార్యంలో ప్రవేశించాడు. యల్. యస్. యస్. కు ఒక స్వరూపం అప్పటికి ఏర్పడ లేదు. ప్రతిపక్షనాయకులు అరెస్టు కాగా, మిగిలిన వాళ్ళు పార్టీ సంఘటనలేని కారణాన వ్యాపకమైన కార్యక్రమాన్ని ప్రాంత

మంతటా ప్రారంభించలేక పోయినారు. ఈ లోపాన్ని ఆర్. యస్. యస్. పూరింపింది. చివరిదాకా నిభాయించింది కూడా.

రాష్ట్రాన్ని ఏడు విభాగాలుగా విభజించి, విభాగానికి కొన్ని జిల్లాల చొప్పున ఏర్పరచింది.

రాజకీయ కార్యకలాపాల నిర్వహణ ప్రస్తుత జాగృతి సంపాదకుడు పెదమాళ్ల వేణుగోపాల్ రెడ్డి, సాహిత్య విభాగం దీవి ద్వారకా నాథ్‌లు చూస్తూండేవారు.

రాష్ట్ర రాజధానికి పొన్నపల్లి సోమయాజులు; హైద్రాబాద్ పరిసర జిల్లాలకు రాంబావు హల్దేకర్, వరంగల్ విభాగానికి శ్రీధర్– ఆయన మీసాలో అరెస్టుకాగానే ఆయన స్థానంలో పల్లెట్ల రామిరెడ్డి, విజయవాడ విభాగానికి దివ్వెల కృష్ణమూర్తి, నెల్లూరు విభాగానికి అంగర త్రివిక్రమరావు, అనంతపూర్ విభాగానికి వడ్లమూడి రామమోహన రావు, విశాఖ విభాగానికి వేదాంతం సంగమేశ్వర శాస్త్రి నేతృత్వం వహించారు.

విభాగాలలోని జిల్లాప్రచారకులు, వారికి సహాయకంగా మిగతా కార్యకర్తలు పనిచేశారు. కార్యక్రమాన్ని తిరిగి వేరువేరుగా విభజించారు.

1. జిల్లా ప్రముఖ్ 2. సత్యాగ్రహులను సిద్ధం చేయడం 3. ప్రచార విభాగం 4. సాహిత్య నిర్మాణం 5 ప్రింటింగు 6. పంపిణీ 7. కోర్టు వ్యవహారం 8. నిధులు 9. సంఘటనాకార్యం 10. జైళ్ళు.

ఈ విధంగా కార్యక్రమాన్ని పంచుకున్నారు. వేర్వేరుగా వ్యక్తులు దొరికిన ప్రతిచోట విభాగాలు వేర్వేరుగా పనిచేసేవి. లేనిచోట రెండు మూడు కలిపి ఒకే వ్యక్తి పర్యవేక్షణలో వేర్వేరుగా నిర్వహించారు.

కార్యకర్తలకు ఆచార సంహితను ఇచ్చారు.

1. అజ్ఞాతులు పేర్లు-వేషాలు మార్చుకోవాలి.
2. ఎవరికి ఏపని అప్పగించారో అంతకుమించి అడుగరాదు. చెప్పరాదు.
3. ఉద్యమనాయకుల వసతులగురించి, కార్యక్రమ కేంద్రాలను గురించి, 'వార్తావాహకుల'కు తప్పితే మరెవ్వరికీ తెలియరాదు.
4. సూచనలు గోప్యంగా, ప్రచ్ఛన్న భాషలో ఉండాలి.
5. సమావేశాలలో ఎవరవసరమో వారు మాత్రమే పాల్గొనాలి.
6. సూచనలు అవసరానికంటే ఎక్కువ ముందుగా ఎవరికీ యివ్వరాదు.
7. సూచనలు సాధ్యమైనంతవరకు ముఖతః ఉండాలి.
8. చిరునామాలు, పేర్లుగల కాగితాలు - మిగతా వివరాలుగల కాగితాలు దగ్గర ఉంచుకోకూడదు.
9. ప్రెస్సు, సైక్లోస్టైలు వగైరా వివరాలు ఒకరిద్దరికి తప్పితే - మరెవ్వరికీ చూచాయగానైనా తెలియరాదు.
10. క్రమశిక్షణతో సూచనలు పాటించాలి.
11. అజ్ఞాత కార్యకర్తలు తమ వసతులను, సమావేశ స్థలాలను ప్రచార కేంద్రాలను తరచూ మారుస్తూండాలి.
12. అరెస్టయితే, పోలీసులు బాధపెట్టినా కార్యక్రమ వివరాలు, పేర్లు బయటపెట్టరాదు. వత్తిడివల్ల బయటపెట్టవలసి

వచ్చినా, అతనికి తెలిసింది నష్టం చేకూర్చేదిగా ఉండ రాదు. అంటే ఆ మేరకే తెలిసి ఉండాలి.

13. బహిరంగ స్థలాల్లో మాట్లాడుకునేప్పుడు హెచ్చులు చెప్పడం, రోషంతో మాట్లాడడం పనికిరాదు.

14. తక్కువలో తక్కువఖర్చుతో ఎక్కువలో ఎక్కువ పని జరగాలి.

15. పోలీసు, సి. ఐ. డి., ఇంటిదొంగలు ఉంటారు–జాగ్రత్త.

16. పార్టీలు వేరు కావచ్చు–లక్ష్యం ఒక్కటే. కనుక భేదాభి ప్రాయాలకు, మనస్సులు కించపరచుకునే పరిస్థితికి అవ కాశం రానీయకూడదు.

అనుకున్న ప్రకారం ప్రాంత ఆర్. యస్. యస్. ప్రచారక్ సోమయ్య శేఖర్ అయినాడు. వేణుగోపాలరెడ్డి సుబ్బారావైనాడు. ద్వారకాచార్యులు 'కే' (కేశవరావు) అయినాడు. ఠాకూరుగారు మాత్రం గోపాలరావుగానే ఉండిపోయారు. పి. వి. చలపతిరావు నాగరాజు ఐనాడు. సోమయాజులు వెంకటరావు అయినాడు. రాంభావు హల్దేకర్ ప్రభాకర్‌గా మారాడు.

వరంగల్ విభాగ్ ప్రచారకుడు శ్రీధర్-వినోద్‌గా మారాడు. ఆ తరువాత వచ్చిన రామిరెడ్డి దయాకర్ అయినాడు. వరంగల్ జిల్లా ప్రముఖ్ రేవా కోటేశ్వరావు 'పంజీ'గా, రవిగా, పండిట్‌జీగా, అవతారా లను ఎత్తాడు. ఇదే ప్రాంతమంతటిలో జరిగిన వ్యవహారం.

అత్యవసర పరిస్థితి ఎత్తివేసిన తరువాత అసలు పేర్లతో వ్యవ హరించడానికి కొంతకాలం పట్టింది.

వరంగల్ విభాగ్ ప్రచారక్ రామిరెడ్డి నలుగురికీ దయాకర్‌గా ఎమర్జెన్సీలో తెలిసినవ్యక్తి. తరువాత అసలుపేరు తెలిసి ఆశ్చర్య పోయినాడు మాటూరి నరసింహారావు అనే అడ్వకేటు. ప్రాంత కార్యాలయ ప్రముఖ్ నరసింహం పద్మనాభంగా చెలమణీ అవుతుండే వాడు. లక్ష్మీకాంతమ్మ (యం. పి.) తో అతను ఎన్నికల సమయంలో తిరుగుతుండేవాడు. ఎన్నికలైన తర్వాత ఆమెకు అసలు పేరు తెలిసి ఆశ్చర్యపోయింది. అయినా ఇప్పటికీ ఆ పూర్వపు పేరనే పిలుస్తుంది కలిసినప్పుడు. ఇలా ఎన్నో——

సమావేశాలు అతి రహస్యంగా జరిగేవి. ఆర్. యస్. యస్. కేంద్రనాయకుల సమావేశం ఒకటి 76 జూన్‌లో హైదరాబాద్‌లో జరిగింది. అది జరిగిన తరువాత చాలాకాలానికిగాని పోలీసులకు జరిగిందని తెలియలేదు. ఎక్కడ జరిగిందో ఇప్పటికీ బహుశా తెలియదు.

సమావేశాలకు ఎవరెవరు ఏయే తేదీలలో వచ్చేది రెండు మూడు రోజులకు ముందుగా మాత్రమే తెలిసేది. ఆ తెలియడం కూడా ఇద్దరు ముగ్గురికి మాత్రమే. ప్రతిదీ జ్ఞప్తికి ఉంచుకోవాల్సిందే గాని ఏదీ కాగితంమీద రికార్డుగా ఉంచబడక పోయేది......ఒక రోజు టోలీచౌక్‌లో లింగయ్య చౌదరిగారి వసతిలో, రెండవరోజు బంజారాహిల్స్‌లో జరిగాయి. మెహదీపట్నం, నల్లకుంట, సికింద్రాబాద్ వగైరా స్థలాలలో వసతులు ఏర్పాటయ్యాయి. ఒక్కొక్కరు ఒక్కొక్క ఇంట్లో. వాళ్ళ రికార్డ్సు వారికి కూడా తెలియని మరోచోట ఉండేవి. వేర్వేరుగా కార్లలో బయలుదేరి ఐదేసినిమిషాల వ్యవధిలోవచ్చి-అలాగే తిరిగి వెళ్ళేవారు. వారిని దించి కార్లు వెళ్ళిపోయేవి. ఎవరు వచ్చారో-తిరిగి ఎప్పుడు పోతారో డ్రైవర్లకు కూడా తెలియదు. పగలంతా సమావేశాలు రాత్రికి విడివిడిగా ఎవరి నివాసాలకు వారు వెళ్ళిపోయేవారు.

ఇలాగే విభాగ ప్రచారకులు కూడా రెండు నెలలకోసారి కలుసు కుంటుండేవారు.

సత్యాగ్రహాల వ్యూహాన్ని ఊహించడానికి అన్ని పార్టీల సంయుక్త సమావేశం హైదరాబాదులో జరిగింది. ఆ సమావేశానికి యల్. యస్. యస్. ప్రాంత కన్వీనరు జనార్ధన రెడ్డి రావాలి. అతడు పట్టుబడకుండా ఉండేందుకు ఒక ప్రభుత్వ జీపులో నిశ్చయించుకున్న స్థలానికి వచ్చాడు. అక్కడ మాణిక్యరెడ్డి అనే యువకుడున్నాడు. సూచనమేరకు జనార్ధన్‌రెడ్డి ఆ యువకునికి తనపేరుచెప్పి 'సమావేశం ఎక్కడ' అని అడిగాడు.

మాణిక్యరెడ్డి వచ్చిన ప్రభుత్వపు జీపును చూచాడు. అనుమానం వచ్చింది. మీటింగా ? ఇక్కడా ? ఏ మీటింగు ? అని అమాయకంగా అడిగాడు.

పాపం జనార్ధనరెడ్డి ! ఏంచేయాలి ! తిరిగి–తిరిగి – జీపు నెక్కడో దూరాన వదలివచ్చి తన పుట్టు పూర్వాలు చెప్పుకొని–నమ్మకం కల్గించు కొన్న తరువాత సమావేశంలోకి వెళ్ళగలిగాడు.

హైదరాబాదు జిల్లా అజ్ఞాత ఉద్యమ నిర్వాహకుడు తీపిరెడ్డి సోమిరెడ్డి–గొర్రెల కాపరిగా – వ్యాపారిగా – ఇలా రోజుకొక అవతార మెత్తితేనేకాని ఆ జిల్లాలో – తిరగలేక పోయేవాడు. అలానడిచేది——

"ఎండలు ఎక్కువగా ఉన్నాయి. నీడలు వెంటబడు తున్నాయి" ఇదీ వార్త. అంటే "వాతావరణం భయంకరంగా ఉన్న దన్నమాట–సి. ఐ. డి. లు వెంబడి బడుతున్నారన్నమాట".

"సరుకు సరి చూచుకున్నావా ? ఎప్పుడు వస్తుంది ? అమ్మకాలు బాగా జరగాలి".

అంటే-సాహిత్యం వస్తున్నదా ? మరి మా కెప్పుడు చేరుతుంది. విరివిగా పంపకం జరగాలని-వార్త.

జైలుకు ఇంటర్వూలకు వచ్చేవాళ్ళు ఎప్పుడు వచ్చినా జరిగిన కార్యక్రమాల వార్తలే తప్ప - రాబోయే కార్యక్రమాలు తెలియక పోయేవి.

తెలుసుకోవాలనే ఆకలి మాత్రం బాగా ఉంటుంది. జైల్లో ఉన్నప్పుడు నా భార్య కుసుమ వచ్చింది. సోమయ్యగారు వచ్చారన్నది. సాయంత్రం రేవావచ్చి 'విశాఖనుంచి మీ అన్నయ్య వస్తున్నా'రన్నాడట !

అన్నయ్య ఎవరు ? విశాఖలో ఎవ్వరూ లేరే ! తేరుకొని "అలాగా-ఎన్నాళ్ళకు ! అన్నది-అంతే. ప్రక్కింటి వాళ్ళున్నార మెతో అప్పుడు—

తీరా మరునాడు వచ్చింది సోమయ్యగారు. ఇప్పటికీ చుట్టుప్రక్కల వాళ్ళకు ఆనాడు వచ్చింది సోమయ్యగారు కాదు. మా శ్రీమతి అన్నగారే.

మరునాడు నన్ను చూడడానికి జైలుకు వచ్చింది. సోమయ్యగారు వచ్చి వెళ్ళారన్నది. ఇంకా ఏమన్నా చెప్పారా ? అని ఆగి పోయాను. ఆమె కూడా చెప్పలేదు.

ఉద్యమం ప్రజలలో నింపిన ధైర్యం-పట్టుదల-అవగాహన అది. అన్నిచోట్ల ఇలాగే సాగింది.

యాదవరావ్‌జీ కేంద్ర సంఘ నాయకుల సమావేశానికి బొంబాయి వెళ్ళారు. సత్యాగ్రహాల తరువాత భవిష్యత్తును గురించిన ఆలోచన కొరకు ఆ సమావేశం ఏర్పాటైంది. గణపతి షెనాయి అనే మంగళూరు

స్వయంసేవకుడు బొంబాయిలో ఉన్నాడు. అతని ఇంట్లో ఆ రాత్రి యాదవరావ్‌జీ గడపాలి. 76 ఫిబ్రవరి 8 వ తేదీ.

అంతకుముందు రాత్రి ప్రొఫెసర్ రాజేంద్రసింహ - అక్కడే గడిపారు.

రెండురోజులు ముందునుంచే వీరిని చేరవేసిన కారు రాకపోకలను పోలీసులు అనుమానించారు. నిఘావేసి ఉంచారు. అది ఆగిన ఇండ్లను గుర్తించుకున్నారు.

యాదవరావ్, రాజేంద్రసింహ గణపతి షెనాయి ఇంటికి వెళ్ళారు. రాజేంద్రసింహ తన చేసంచీ వగైరా తీసుకొని మరోచోటికి జారుకున్నారు.

అర్థరాత్రి : పన్నెండు దాటింది. యాదవరావు మంచి నిద్రలో ఉన్నారు. గణపతి షెనాయి వెళ్ళి "మీకోసం ఎవరో వచ్చా"రన్నాడు.

యాదవరావు బయటకు వెళ్ళిచూస్తే ఎవరో కొత్త మనిషి.

'ఎవరు మీరు' అని అడిగితే 'నా పేరు మొకాషీ. ఇక్కడి పోలీసు కమీషనర్ని' అని యాదవరావ్‌జీని మీ పేరు అని అడిగాడు. 'నా పేరు యన్. కె. ప్రసాద్' అని ఆయన చెప్పారు.

'మీ సామాను సోదాచేయాలి' అన్నాడు.

సోదాచేస్తే అందులో సత్యాగ్రహ రిపోర్టులన్నీ దొరికాయి. సత్యాగ్రహ దళాల ఫోటోల ఆల్బందొరికింది. సత్యాగ్రహుల పట్టికలు దొరికాయి. ఇహ తప్పుకోడానికి వీలులేకపోయింది.

అప్పుడు మళ్ళీ గణపతి షెనాయిని ప్రశ్నిస్తే యాదవరావుజీ పేరును అతడు చెప్పక తప్పింది కాదు. ఇది జరుగుతుండగానే చాటుగా బైటికి హెచ్చరికచేసే ప్రయత్నంకూడా జరిగింది.



నగరంలో సమావేశానికి వచ్చి వేరు వేరు స్థలాలలో ఉన్న వాళ్లు తప్పుకున్నారు.



కొంచెం అజాగ్రత్త జరిగినా ప్రమాదం ఇలా ఏర్పడేది. యాదవరావుతోపాటు గణపతి షెనాయి కూడా నిర్బంధింపబడ్డాడు. అజ్ఞాత కార్యకర్తలకు వసతి కల్పించినా ఇలా ప్రమాదం నెత్తిన కొని తెచ్చుకోడమే.



అయినా కార్యకర్తలు తెగించి ముందుకు వచ్చారు.

# 10
# ప్రజా పోరాటం

'స్వాతంత్ర్యం మన జన్మహక్కు.'
—తిలక్

ప్రాంతంలో లోక సంఘర్ష సమితి మే నెలలో ఏర్పడ్డా, పరిస్థితులు పరుగెత్తుతూ ప్రవహించడాన, దాన్ని జులైదాకా పునర్నిర్మాణం చేయలేకపోయినారు. సుందరసింగ్ భండారి హైదరాబాద్ వచ్చినప్పుడు దానిని విస్తృతంగా ఏర్పాటుచేశారు. ఎందరో ప్రముఖులను—అన్నిపార్టీలవారిని చేర్చుకోవడం జరిగింది.

యల్. యస్. యస్. మొదటి ఆంధ్రప్రాంత సమావేశం మదరాసులో జరిగింది. తమిళనాడులో అప్పుడు డి. యం కె. ప్రభుత్వం ఉన్నది. ఆంధ్రలో ఇందరు కలవడం కష్టమే !

ప్రాంతంలో, బయట ఉన్న ప్రతిపక్షనాయకులు నల్గురూ ఏం చేయాలో ఆలోచించుకోవటానికి విజయవాడలో కలిసారు. ఒకపూట సమావేశాలయ్యాయి. మధ్యాహ్నం భోజనానికి వెళ్ళి వచ్చేలోపు జి. సి. కొండయ్యే అరెస్టయ్యాడు—ఎక్కడ నల్గురు కలవాలన్నా ఇదే పరిస్థితి.

ఆ సమావేశానికి తేన్నేటి, గోపాలరావు ఠాకూర్, సుంకర సత్యనారాయణ, యం. డి. రామారావు, పి. వి. చలపతిరావు,

డి. సూర్యప్రకాశరెడ్డి, బంగారు లక్ష్మణ్, చక్రధర్, పాపిరెడ్డి, శివరామ కృష్ణారెడ్డి, కొల్లిమర్ల వెంకటేశ్వర్లు, పిరాట్ల వెంకటేశ్వర్లు వగైరాలు హాజరైనారు. సంజీవరెడ్డి ఒకరోజు ఆలస్యమైనా వచ్చారు.

గోపాల్‌రావు ఠాకూర్-జనసంఘ దక్షిణప్రాంత సంఘటన కార్యదర్శి - కార్యనిర్వహణకు పూనుకోగా. పి. వి. చలపతిరావు, బంగారు లక్ష్మణ్, డి. యస్. పి. రెడ్డి, జగన్ మోహన్‌రెడ్డి ప్రభృతులు లోక సంఘర్ష సమితి పక్షాన కలుస్తూ కార్యక్రమాల సమన్వయానికి, అఖిలపక్ష కార్యాచరణకు ప్రయత్నించేవారు.

తుమ్మల చౌదరి, యలమంచలి శివాజీ, చక్రధర్, పిరాట్ల వెంకటేశ్వర్లు, తెన్నేటి ఇంకా ఎందరో సారథ్యం వహించారు. చాలా మంది సంఘర్ష సమితికి తమ సహకారాన్ని అందచేస్తుండేవారు. ఆర్. యస్. యస్. ప్రాంత ప్రచారక్ సోమయ్య సమితి నిర్ణయాలను నిర్వహింప చేయడానికి, కార్యకర్తలను నలుదిశలా విస్తరింపచేసి, సమితి ఆశయాల సాధనకు వనరులను సమకూర్చడం మొదలయిన కార్యాచరణ భాగాన్ని పూర్తిగా చూస్తుండేవారు. అలా చివరిదాకా ప్రాంతంలో పర్యటిస్తూ, పట్టుబడకుండా తిరిగారు.

సమితి దేశమంతటా తీసుకున్న కార్యక్రమాలలో క్రమంగా ఎమర్జెన్సీని గురించిన భయాన్ని వదలకొట్టడం - ఎదురు తిరిగే స్థైర్యాన్ని క్రమంగా నెలకొల్పడం — తమ హక్కులను ఎలుగెత్తి చాటడం ఆశయాలుగా ఉండేవి.

నానాజీ దేశాన్ని సంబోధిస్తూ 27-6-75 న ఒక లేఖ వ్రాశారు. అందులో 'భయాన్ని వదలించి - దేశాన్ని నడిపించి - నియంతృత్వాన్ని ఓడించండి' అని హెచ్చరించారు. అలాగే ఢిల్లీలో లోక సంఘర్ష

సమితి నగారా మ్రోగించింది. రాజస్థాన్‌లో ప్రాంత సంఘచాలక్ రస్తోగీ అరెస్టయినారు.

రెండవ మెట్టు 'సత్యాగ్రహం' జులై 15 నుండి ప్రారంభించారు. కరపత్రాలు ముమ్మరంగా సాగాయి. వ్యక్తి సత్యాగ్రహం ఇది. ఎమర్జెన్సీతో ఆవరించిన మొదటి జంకు వదలించడానికి జరిగిన ఉద్యమం ఇది.

ఆ పిలుపు నందుకుని దేశంలో సత్యాగ్రహులు ఒక్కరొక్కరే బహిరంగ స్థలాల్లో, ఎమర్జెన్సీని వ్యతిరేకిస్తూ ఉపన్యసించి, నిరసన తెల్పారు. కరపత్రాలు పంచారు. గోడ వ్రాతలు వ్రాశారు. అలా ప్రతి ప్రాంతంలో జరిగింది.

ఆంధ్రలో జరిగిన సత్యాగ్రహాలలో ఖమ్మం సత్యాగ్రహం చెప్పుకోతగ్గది. 13వ తేదీన గోడ వ్రాతలతో పట్టణం మేల్కొన్నది. సైక్లోస్టైలు కరపత్రాల వర్షం ఖమ్మం, మధిర వగైరా స్థలాల్లో కురిసింది. 15వ తేదీ ఉదయమే సత్యాగ్రహ వివరాల కరపత్రాలు పంచారు.

సాయంత్రం ఐంది. సత్యాగ్రహి లక్ష్మీనారాయణ - నగర కూడలిలో ప్రత్యక్షమై 45 నిముషాలు ఉపన్యసించాడు.

అతణ్ణి పోలీసు అరెస్టు చేసింది. సత్యాగ్రహాన్ని నిరోధించడానికి మధిర, ఖమ్మం పట్టణాలలో అనేకమంది అడ్వకేట్లను, వ్యాపారులను, ఉపాధ్యాయులను, విద్యార్థులను పట్టుకున్నారు. కొందరి దగ్గర కరపత్రాలు దొరికాయి. కొందరిని డి. ఐ. ఆర్. క్రింద నిర్బంధించి, బైలుమీద విడుదల చేశారు. ఎక్కువ మందిని మీసాక్రింద వరంగల్ పంపారు.

15-7-75 న నల్గొండ జిల్లా భోనగిరిలో ఎడ్ల నారాయణరెడ్డి - ఆర్. యస్. యస్. తాలూకా కార్యవాహ - సత్యాగ్రహం చేస్తే కాంగ్రెసు మిత్రుడు చక్రపాణిరెడ్డి అతని సాహసానికి మెచ్చుకొని పూల మాల వేసి సత్కరించాడు. పోలీసులు ఇద్దరినీ అరెస్టు చేశారు. జిల్లాలో ప్రముఖులైన అడ్వకేట్లను, వ్యాపారులను, విద్యార్థులను మూక ఉమ్మ డిగా నిర్బంధించారు.

కందుకూరులో గోడలమీద నినాదాలు వ్రాశారని అనేక మందిని అరెస్టులుచేసి యమయాతనలు పెట్టారు. తర్వాత చేయవల్సిన పనుల నాలోచించటానికి పదిమంది ఉద్యమకారులు ఒకచోట కలిశారు. విషయం - ఎలానో - పసిగట్టిన పోలీసులు దాడిచేశారు. బచ్చు వెంక టేశ్వర్లు అనే అతను పైనుండి వచ్చిన సూచనా పత్రాన్ని నోట్లో వేసు కొని నమిలి మింగేశాడు పోలీసుల ఎదుటే. మండిపోయింది పోలీసు లకు - చావబాది, 'కాగితాలు తినేవాడికి నీకు అన్నమెందుకురా' అని మూడు రోజులు అన్నం పెట్టకుండా కొట్లోకి తోసేశారు.

పోలీసు జులుం ఎక్కువైంది. ఇండ్లు సోదా చేయడం, ఆడ వాళ్ళతో అసభ్యంగా ప్రవర్తించడం, కరపత్రాల రహస్యం గ్రహించ డానికి నీచమైన హింసా విధానాలు ప్రయోగించడం ప్రారంభ మైనాయి.

కాని ఉద్యమం ఆగదు. 26 జులై 75. నాటికి ఎమర్జెన్సీ ప్రక టించి నెల రోజులైంది.

ఆ తరువాత వచ్చింది 'ఘంటానాద' కార్యక్రమం. ఈ స్థితి 'ఇహ ఇంతే' నంటూ సహిస్తారా! జాగతే రహో! అంటూ 'నిద్ర

విడచి - నడవండి - ప్రమాదం ముంచుక వస్తున్న'దని గంటలు ఎత్తైన ప్రదేశాలనుండి మ్రోగించాలి. వాడవాడలా గంటలు మ్రోగాలి.

జాగరణకు సాగిన ఈ ప్రయత్నం ఒక క్రొత్త ఉత్సాహాన్ని కార్యకర్తలలోకి తెచ్చింది.

కార్యక్రమాలలో ఒక రహస్యం ఉంటుంది. చమత్కారం ఉంటుంది. రోజూ తినే ఉప్పే; కాని దానిపై సాగిన యాత్రలో దేశానికి ఎంత సంస్కారం లభించింది అనేదే ప్రశ్న. కార్యక్రమం ఎలాంటిదనేదికాదు. అదొక ప్రతీక; అంతే. దాని వెనుక ఉన్న నిశ్చయం - అన్యాయానికి ఎదురొడ్డగల శక్తిసత్వా లెంత కన్పించాయనేది ముఖ్య ప్రశ్న.

నియంత పశుబలాన్ని వినియోగిస్తే దానిని లెక్కచేయకుండా ఏ మేరకు దేశం ఎదిరించింది? అనేది చూడాలి.

దేశంలో ఘంటా నాదం మారుమ్రోగింది. నియంత పాలన కివి తుది గంటలని వినిపించింది.

నియంతకు నిద్ర పడుతుందా? గంటలు మ్రోగించరాదని నిషేధించింది కొన్నిచోట్ల.

అమలాపురంలో, కాకినాడలో యువకులు సైకిళ్ళమీద "అదే పనిగా గంటలు మోగిస్తూ" ఊరి చుట్టూ తిరిగారు.

పోలీసులు ఆ యువకులను, సైకిళ్ళను పట్టుకొని పోలీసు స్టేషన్లలో చాలాకాలం ఉంచారు.

గుళ్ళో గంటలు మ్రోగుతాయేమోనని భయం నియంతకు; అందుకని గుళ్ళో గంటలు పీకించారు నియంత భటులు అనేకచోట్ల.

నందిగామలో సమయం కాకముందే కళాశాల గంటలు మ్రోగాయి. విద్యార్థులు కాలేజీ బైటికి వచ్చి ఇండ్లకు వెళ్ళిపోయారు. ఇలా ఎన్ని ఉదంతాలో :

కర్ణాటకలో షిమోగాలో ఒక వింత. ఫైర్ ఇంజనుకు ఎవరో ఫోను చేశారట : ఆ ఇంజను గణగణ గంటకొడుతూ రోడ్డున పడ్డది. మరి ఆ వాహనాలను మీసా క్రింద పెట్టాలా ? వద్దా ? నియంత భటులకు అర్థం కాలేదు.

గంట మ్రోగితే తమ పదవికి మృత్యు గంటలా భావించిన ఘట్టం ఇది.

తరువాత లోక సంఘర్ష సమితి ఉద్యమాన్ని ఇంకా పటిష్ఠం చేసింది. ఢిల్లీలో అకాలీలు అలనాడు మొదటి సత్యాగ్రహం ప్రారంభించిన నాటినుండి – ఆపకుండా నడుపుతునే ఉన్నారు.

మీసా అరెస్టులు జరుగుతూనే ఉన్నాయి. జైళ్ళు నిండుతునే ఉన్నాయి.

అజ్ఞాత కరపత్రాలు వ్యాపకంగా ప్రజల కందుతూనే ఉన్నాయి. అజ్ఞాత పుస్తకాలు – పత్రికలు అందుతూనే ఉన్నాయి.

ప్రజల మనోభయం తగ్గుతూ వచ్చింది. ఆఖరి కుదుపు కావాలి.

కుదుపు ఎలా తేవాలి ?

జైల్లో జె. పి. ఆమరణ నిరాహారదీక్ష తీసుకోడానికి ఆగస్టు 10 న నిర్ణయించుకున్నాడు. ఒక్క జె. పి. తలపెడితే లాభముంటుందా ? స్వేచ్ఛగా వార్తలుకూడా ప్రజలకు చేరవుకదా ! మానవ ప్రాణాలకు మూల్యం మెరుగని నియంతతో భావుకంగా పోరాడడంకంటే వ్యావహారి

కంగా పోరాడాలని లోక సంఘర్ష సమితి - సంప్రదింపులలో నిర్ణయించింది. జైలులో జె. పి. నిరాహారదీక్ష చేస్తే - దానికి బైట ప్రజా ఉద్యమం తోడుపడాలి. మరి ప్రజా ఉద్యమానికి సమయం కావాలి కదా !

కనుక తాత్కాలికంగా జె. పి. ఆ నిశ్చయాన్ని విరమించుకోవాల్సిందిగా కోరడం జరిగింది. జె. పి. సంఘర్ష సమితి నిర్ణయాన్ని ఆమోదించారు.

ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవం జాతికి చీకటి రాత్రిగా - నిరసనదినంగా నల్ల బాడ్జీలతో - నిరసన కరపత్రాలతో గడిచింది. ప్రభుత్వాలకు తమ నిరసన తెలియచేస్తూ చాలా జైళ్ళలో - బైటా సామూహిక నిరాహార దీక్షలు జరిపారు.

వరంగల్ జైల్లో ఆ నాడు డిటెన్యూ మిత్రులందరూ కలిసి, గోష్ఠి జరిపి ఎమర్జెన్సీని వ్యతిరేకిస్తూ ప్రభుత్వానికి లేఖ పంపారు.

లోక సంఘర్ష సమితి తరువాతి అడుగు వేసింది. నవంబరు 14 నుండి దేశమంతటా సత్యాగ్రహం జరగాలి. ఆ సత్యాగ్రహం పెద్దపెట్టున జరగాలి. దానికై ప్రయత్నాలు ప్రారంభమైనాయి.

ఈ లోగా ఆగస్టు 22 న బాలా సాహెబ్ దేవరస్ ఇందిరా గాంధీకి ఒక లేఖ వ్రాశారు. ఆర్. యస్. యస్. పై నిషేధం అక్రమంగా పెట్టబడిందని, సంఘ సేవచేసే వేలకొలది స్వయంసేవకులను జైళ్ళలో నిర్బంధించడం అనుచితమని ప్రకటించారు.

సత్యాగ్రహానికి ముందే వాతావరణం నిర్మాణం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి.

లోక సంఘర్ష సమితి వ్యూహాన్ని సారథ్యం వహించి నడిపించిన నానాజీ దేశ్‌ముఖ్ సెప్టెంబరు 10 న అరెస్టయినారు. ఆయన అరెస్టయి పోలీసులతో నేనే 'నానాజీ' నంటే నమ్మలేదు ! నానాజీ పట్టుబడడమే ! నానాజీకి వ్యక్తిగతంగా తెలిసిన మనిషి వచ్చి 'అవున'న్నదాకా వారికి గుండె దడదడే !

నానాజీ దేశ్‌ముఖ్ ఎమర్జెన్సీ పెట్టగానే మొదట అరెస్టు చేయబడవల్సిన వ్యక్తి. ఇందిరా గాంధీకి ఆయనంటే ప్రత్యేక అభిమానం ఏర్పడింది. ఆయన తప్పించుకున్న వివరాలను 'ఆపత్కాల్‌మే గుప్త క్రాంతి' అనే హిందీ పుస్తకం వ్రాసిన దీనానాథ్ మిశ్రా చక్కగా వివరించాడు.

'75 జూన్ 25 న రామలీలా మైదానంలో సభ జరిగిన వెంటనే ఒక పెద్దమనిషి నానాజీని జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాడు. ఏదో బాధ ఏర్పడవచ్చును అనుకున్నాడు కానీ, నానాజీ ఎమర్జెన్సీ వస్తుందనుకోలేదు. ఆయన డాక్టర్ జైన్ అనే మిత్రుని ఇంటికి వెళ్ళాడు. కొద్దిసేపు పిచ్చాపాటి సాగింది. తెల్లవారు ఝామున 4.30 గంటలకు జె. పి. పాట్నా వెడుతున్నాడు. వీడ్కోలు ఇవ్వటానికి పాలం విమానాశ్రయానికి నానాజీ వెళ్ళాడు. విమానాశ్రయంలో ఎటు చూచినా పోలీసే. పోలీసుకార్లు వరుసగా నిల్చొని ఉన్నాయి. ఒక ఆఫీసరు వచ్చి "మీరు నానాజీ కదూ !'' అన్నాడు.

''అవును. అయితే ?''

''మీ రెందుకొచ్చారిక్కడికి'' అన్నాడా ఆఫీసర్.

''ఒక వ్యక్తిని కలుసుకొనేందుకు - అసలు విషయం ఏమిటి ?"

"జె. పి. మరికొందరు నాయకులు అరెస్టయినారు. మీ కింకా తెలియదా! మీ కోసం తెగ వెతుకుతున్నారు. మేం వచ్చింది మీ కోసమే" అన్నాడా ఆఫీసర్.

మాటల మధ్యలోనే జె. పి. కార్యదర్శి వచ్చి, ఒక చీటీ ఇచ్చి "అరెస్టు కాబోకండి. అజ్ఞాత ఉద్యమ బాధ్యతను స్వీకరించండి - ఇది జె. పి. మీ కిచ్చిన సందేశం" అని చెప్పి తప్పుకున్నాడు.

నానాజీ వెనక్కు మళ్ళారు. మళ్ళీ ఆ మునుపటి ఆఫీసర్ కలిసి "త్వరగా తప్పించుకోండి" అని చెప్పాడు.

అక్కణ్ణుంచి నానాజీ డాక్టర్ జైన్ నివాసానికి వెళ్ళాడు. ఆయనకోసం టెలిఫోన్ మ్రోగుతోంది. అప్పటికే జగదీశ్ ప్రసాద్ మాథూర్, మదన్‌లాల్ ఖురానా, శ్రీమతి మల్కానీ నాయకుల అరెస్టులు జరుగుతున్నాయని ఫోన్లు చేశారు.

నానాజీ నైట్ ప్యాంట్‌లో ఉన్నారు. ఒక వదులు లాల్చీ వేసుకున్నారు. తన కారువైపు సాగారు. లిఫ్టునుంచి క్రిందకు దిగగానే ఒక పోలీసు వాన్ కన్పించింది. కొందరు ఆఫీసర్లు పచారు చేస్తున్నారు. మళ్ళీ కార్ల చప్పుడు. పోలీసులు ట్రక్కుల్లోంచి దిగుతున్నారు. అదంతా చూచి డాక్టర్ జైన్ 'నా కారులో పోదాం' అన్నాడు. నానాజీ కారును పోలీసు కనిపెట్టుకొని ఉంది.

సరే - ధైర్యంతో డాక్టర్ కారులో హారన్ ఇస్తూ - ఎదురుగ్గానే కారు నడుపుతూ - ఇద్దరూ ముందుకు వెళ్ళిపోయారు. ఛేమ్స్‌ఫర్డు కూడలిలో మళ్ళీ అడ్డంగా పోలీసు జీపు వచ్చింది. మొత్తానికి దాన్ని కూడా దాటవేశారు దక్షిణ ఢిల్లీలో దగ్గర పరిచయముఉన్న ఇంటికి ఇద్దరూ వెళ్ళారు. ఆ గృహస్థు చేతులు జోడించి 'బాబ్బాబు మా

యింటికి వద్దన్నాడు'. అక్కడనుండి ఒక బంధువు ఇంటికి వెళ్ళారు. అతడు ఆనందంతో "1942 లో అరుణా అసఫాలీ మా యింట్లో పది పదిహేను రోజుల చొప్పున ఉండేది" అని ధైర్యంగా స్వాగత మిచ్చాడు.

నానాజీ అరెస్టయిన తర్వాత రవీంద్ర వర్మను కార్యదర్శిగా నియామకం చేశారు.

తొలిమెట్టున, అక్టోబరు 2 న అడుగు పెట్టారు జనం. ఆ నాడు గాంధీ జయంతి. లోక సంఘర్ష సమితి ప్రజలందరినీ 'అవినీతి - అన్యాయం - దమనకాండలకు తలవంచడం పిరికితనం' అనే సూక్తి గల బాడ్జీలను ధరించమని ఉద్బోధించింది. ప్రాంతంలో 6000 బాడ్జీ లను విడుదల చేశారు. సభలు సమావేశాలు జరిగాయి. హైదరాబాదులో మంత్రి పురుషోత్తమరెడ్డి అధ్యక్షతన గాంధీ జయంతి జరిగింది. ఆ సభలో గాంధీజీ సూక్తులుగల కరపత్రాన్ని సునీతినందన్ నేతృత్వంలో ముగ్గురు మైనర్లు పంచారు. పోలీసులు వారిని పట్టుకొని అజ్ఞాత ఉద్యమ నాయకులను గురించి తెలుసుకోవాలని చాలా హింసించారు. కాని ఆ మైనర్లే ప్రహ్లాదులై చలించకుండా నిల్చున్నారు.

ఢిల్లీ రాజఘాటులో కృపలానీ, గాంధీజీ మనుమడు రాజ మోహన్ గాంధీ, హెచ్. వి. కామత్, సుశీలా నాయర్ మరో పది కొండు మంది సర్వోదయ కార్యకర్తలు ప్రార్థనలు జరిపి - 'బాపూ సంస్మరణ' చేసుకుందామని వెళితే పోలీసులు అరెస్టు చేశారు. అక్కడ గుమికూడిన జనాన్ని తరిమికొట్టారు. లాఠీ చార్జీతో రాజఘాటును ఆ నాడు నియంత ప్రభుత్వం అపవిత్రం చేసింది.

అక్కడేఉన్న ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేఖరి ఇలా ఎందుకు కొడుతున్నారని ప్రశ్నించినందుకు, అతణ్ణి మీసాలో నిర్బంధించారు.

ఆ ఒక్కనాడు వేలాది యువకులు అరెస్టయినారు. ఒక్క బీహార్‌లో 3000 మంది విద్యార్థులు అరెస్టయినారు.

ఆర్. యస్. యస్. ప్రధాన కార్యదర్శి మాధవరావు మూలే శ్రీ గురూజీ ఆశీర్వాక్కులు "విజయహీ విజయహై" అన్న మాటలను గుర్తుచేస్తూ - దీర్ఘకాల పోరాటానికి జాతిని సమాయత్తం చేయడానికి సిద్ధం కావాలని ఉద్బోధిస్తూ ఆ నాడే ఒక లేఖ కార్యకర్తలకు వ్రాశారు.

సత్యాగ్రహ సమరానికి రూపం ఏర్పరచేందుకు హైదరాబాద్‌లో లోక సంఘర్ష సమితి కలిసి ప్రాంతానికి పి. జనార్ధనరెడ్డిని కన్వీనరుగా నియమించింది. అలాగే జిల్లా కన్వీనర్లుకూడా నియమింప బడ్డారు.

నవంబరు మొదటి వారంలో నూతన కార్యదర్శి రవీంద్రవర్మ ఆధ్వర్యాన లోక సంఘర్ష సమితి కేంద్ర కార్యవర్గ సమావేశం జరిగింది. నవంబరు 14 నెహ్రూ పుట్టిన రోజు. ఆ నాటినుండి దేశ వ్యాప్తంగా వారాని కొకరోజు దళాలుగా సత్యాగ్రహాలు చేయాలని నిర్ణయించు కున్నది.

సత్యాగ్రహ వ్యూహాన్ని రచించి దేశమంతటికీ అందచేయడం జరిగింది. దేశనాయకుల ఉద్బోధక లేఖలు సత్యాగ్రహులకు అందాయి.

అక్టోబరు 25 లోగా సత్యాగ్రహులను సమకూర్చి, దళాలుగా విభజించి, దళ నాయకులను నిశ్చయించాలి. సత్యాగ్రహులకు, సత్యాగ్రహానికి పూర్వం - సత్యాగ్రహం సమయాన - సత్యాగ్రహం తరువాత - అనుసరించతగ్గ సూచన లివ్వాలి.

జిల్లా కేంద్రాలతో ఆరంభమై, తాలూకా, సమితి, గ్రామాలకు సత్యాగ్రహాలు వ్యాపించాలి.

వార్తలు, ఫోటోలు సేకరించాలి.

ప్రాంత కేంద్రంతో ఎప్పటికప్పుడు సంబంధాలు ఉంచుకోవాలి.

వివిధ పార్టీల మధ్య సయోధ్య కల్పించాలి.

సత్యాగ్రహ వార్తలను విరివిగా ప్రచారం చేయాలి. గోడ వ్రాతలు - కరపత్రాలు - వాల్ పోస్టర్లు, అజ్ఞాత పత్రికలు - సైక్లో స్టైలు కావచ్చు - ముద్రితాలు కావచ్చు - విరివిగా ప్రజల కంద చేయాలి.

సత్యాగ్రహులకు కోర్టులలో సహకరించడానికి న్యాయవాదులను ఏర్పాటు చేయాలి.

ధన సేకరణకు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయాలి. ఈ కార్య క్రమాలను సూత్రీకరించి నడిపించడానికి యోజన జరగాలి.

అలాగే జిల్లాకొక సత్యాగ్రహ - సంయోజకుడు ఏర్పాటైనాడు.

కట్టుదిట్టంగా - ఒకడు పట్టుబడ్డా అజ్ఞాత ఉద్యమం దెబ్బతిన కుండా ఏర్పాట్లు జరిగాయి.

అన్ని ఏర్పాట్లు జరిగిన తర్వాత ఇందిరా గాంధీకి సంఘర్ష సమితి కార్యదర్శి రవీంద్ర వర్మ నవంబరు 4 న ఒక లేఖ వ్రాసి హెచ్చరించాడు.

'మా సత్యాగ్రహం పూర్తిగా శాంతియుతంగా అహింసాత్మకంగా ఉంటుందని పునరుద్ఘాటిస్తున్నాము. ఉద్యమం మొదటి రోజున - జాతి అంతా ఒకరోజు ఉపవాసం చేసి ప్రార్థనలు చేస్తూ గడపాలని కోరాం. మీకు మా విన్నపం ఏమంటే మీరుకూడా ఆ రోజు ప్రార్థనలో గడపండి. ఆత్మ పరిశీలన చేసుకోండి." అని కోరుతూ, బానిసత్వాన్ని, ప్రజా

వ్యతిరేక చర్యలను, ప్రజాస్వామ్య వ్యతిరేకతను ఎదిరించే పోరాటాన్ని ప్రకటించారు.

ఆర్. యస్. యస్. పై నిషేధాన్ని - అపోహలను విడనాడి, వాస్తవాన్ని గుర్తించి - ఉపసంహరించుకొని సంఘశక్తిని దేశ ప్రయోజనాలకు వినియోగపడేట్లు అవకాశం కల్పించమని బాలా సాహెబ్ దేవరస్ కూడా ఇందిరా గాంధీకి రెండోమారు నవంబరు 10 న లేఖ వ్రాశారు.

తెన్నేటి ముందుగా అక్టోబరు 3 వ తేదీనే 'క్రియాశీలులు కావాలని' ప్రజలను ఉద్బోధించాడు.

అందులో "ఈ మూడు నెలల ఎమర్జెన్సీ మన బ్రతుకులు ఎలా ఉన్నవో తెలియ చేసింది. ప్రజలకు విరుద్ధంగా, ప్రతిపక్షాలకు వ్యతిరేకంగా అహర్నిశలు ప్రధాని చేస్తూన్న ప్రకటనలను ఎదుర్కోవాలి. కేంద్ర సంఘర్ష సమితి నిర్ణయించిన ఒక కార్యక్రమం మీకు త్వరలో చేరుతుంది. దేశం సార్థకతను గడించుకోడానికి, మీకు సాధ్యమైనంత - ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి - ప్రయత్నించండి" అని ఆయన సంకేతించి ఉన్నారు.

14 నవంబరున, సత్యాగ్రహాలు ప్రారంభ మవుతాయని పోలీసులకు తెలుసు - ప్రజలకు తెలుసు. సత్యాగ్రహులు ఎవరెవరో ఒకరికొకరు తెలియదు. స్థలం - సమయం - నిశ్చయ మవుతాయి. ఆ వేళ కాగానే వాతావరణం నిండిపోయేట్లు 'భారత మాతాకీ జయ్' అని దళ నాయకుడు నినాద మిస్తాడు. మిగతావారు దాన్ని అందుకుంటారు. అందాకా వాళ్ళూ ప్రేక్షకులే - అమాయకులు.

విశాఖలో తెన్నేటి - హైదరాబాద్‌లో వై. సి. రంగారెడ్డి సత్యాగ్రహ సమరభేరి మ్రోగించారు.

దళాలు సాగినాయి. స్త్రీలు కూడా సత్యాగ్రహాలు చేశారు. ఒక్కొక్క దళానికి 10 లేక 11 మంది ఉంటారు. కొన్నిచోట్ల సంఖ్య ఎక్కువగా ఉండేది. ప్రజలు విరగబడి నియంతృత్వాన్ని పరిహ సిస్తూ ముందుకు దుముకుతున్న ఈ వీరమూర్తులను హర్ష ధ్వానాలతో స్వాగతిస్తుండేవారు.

స్థలాలు మారుతుండేవి. రాష్ట్రమంతటా ఈ సత్యాగ్రహ తీర్థులు ప్రవహించారు. చీకటిలో వెలుగులా జిల్లాలు - తాలూకాలు ధగధగ మెరిసాయి. కొన్నికొన్ని చోట్ల ప్రజలు ప్రభుత్వానికి ఎదురు తిరిగారు - సత్యాగ్రహులతోపాటు తామూ కదిలారు.

నెల్లూరు, గుంటూరు, నల్లగొండ, వరంగల్, నిజామాబాద్ - మరికొన్ని స్థలాలలో ముందు సత్యాగ్రహులు పరిసర గ్రామాల్లో తిరిగి ప్రచారంచేసి వచ్చేవాళ్ళు. ప్రజా పోరాటంలో పాల్గొనడానికి ఆహ్వానం ఇచ్చి వచ్చేవాళ్లు. డాక్టర్లు, లాయర్లు, ప్రతిపక్ష నాయకులు, వ్యాపారులు, విద్యార్థి ఉద్యమపు నేతలు - అన్ని రంగాలవారు సత్యాగ్రహాలు చేశారు.

సత్యాగ్రహ సమరంలో పోలీసు అత్యాచారాలు నాగరిక ప్రభుత్వానికి తలవంపులు తెచ్చేవి. ఉద్రేకాన్ని కల్గించేవి.

గోదావరి ఖనిలో కాగితాలు అంటిస్తున్న ఒక ఉద్యమ కార్యకర్తను 200 చోట్ల క్రొవ్వువత్తి మంటతో కాల్చాడట ఒక సబ్ ఇన్స్పెక్టరు - అతడి మానవత్వం ఎంతగా జారిన స్థాయిదో—

నల్గొండలో ఒక సత్యాగ్రహికి పోలీసు దెబ్బల బాధకు మూత్రం ఆగిపోయింది. అతను పడ్డ బాధ చెప్పవలసిందికాదు.

కృష్ణయ్య భువనగిరిలో అజ్ఞాత కార్యకర్త. పోలీసులు పశువుల వలె కొట్టినందుకు తొడలు వాచాయి. మడిమెలు మెలిత్రిప్పితే అవి చచ్చుపడి పోయాయి. సర్జన్ శస్త్ర చికిత్స కావాలన్నాడు. కాని ఈ రహస్యం పొక్కితే ప్రభుత్వం అప్రతిష్ఠ పాలవుతుందని, ఆ ప్రయత్నం మానుకున్నారు. అతని జీవితం అలా అవిటిదై పోయింది.

జనగామ విద్యుచ్ఛాఖలో పనిచేస్తూన్నాడు సంగోజు సత్యనారాయణ. అతణ్ణి త్రిప్పినచోటికి త్రిప్పకుండా పోలీసు కస్టడీలో 50 రోజులు ఉంచుకున్నారు. ప్రతిరోజూ విపరీతంగా కొడుతుండేవారు. తిండిపెట్టక మాడ్చారు. సత్యాగ్రహ కేంద్రాలను, నాయకులను, ఆర్. యస్. యస్. ప్రచారకులను తెల్పమని విపరీతంగా బాధించారు. కాని అతడు చలన్మేరువు. చివరిదాకా ధైర్యంగా నిల్చున్నాడు. పోలీసు అత్యాచారాలకు మచ్చు ఇవికొన్ని మాత్రమే.

పోలీసు అత్యాచారాలు రకరకాలుగా సాగేవి. అవివాళ్ళ ఇష్టం. పై అధికారుల మెప్పుకోసం, ప్రమోషన్ల కోసం నరపిశాచాల్లా ఎన్నో చోట్ల పోలీసులు వ్యవహరించారు. మరీ నీచమైన సంగతి - సత్యాగ్రహుల జేబులు కొట్టడం - గడియారాలు, పెన్నులు, డబ్బులు దోచుకోడం. వరంగల్‌లో పోలీసు నిర్బంధంలోఉన్న వ్యక్తికి ఇంటివాళ్ళు కారియర్‌లో అన్నంతెస్తే లక్ష్మణరావు అనే పోలీసు ఆ అన్నంతిని ఖాళీ కారియర్ అవతల పారేశాడట!

ఆంధ్రలో సత్యాగ్రహంలో మొత్తం 21 జిల్లాలు పాల్గొన్నవి.[1] మొత్తం 122 తాలూకాలలో 354 గ్రామాలనుండి 216 దళాలు సత్యా

---

1. సత్యాగ్రహాల పూర్తి వివరాలకు 'నవభారతి' ప్రచురణ 'ప్రజా పోరాటం' చదవండి.

గ్రహాన్ని చేశాయి. సత్యాగ్రహ కాలంలో 53 కళాశాలల విద్యార్థులు తరగతులను బహిష్కరించారు. దాదాపు 40,000 విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. సత్యాగ్రహ వార్తలు 5,000 గ్రామాలకు 20,00,000 ల సాహిత్య ప్రతులద్వారా అందజేయబడ్డాయి. వీరుగాక మొత్తం 400 మంది మీసా క్రింద, 500 మంది డి. ఐ. ఆర్. క్రింద నిర్బంధింప బడ్డారు. సత్యాగ్రహులు దాదాపు 1,700 మంది. అందులో మహిళల సంఖ్య 50. ఈ సత్యాగ్రహాల్లో దేశంలోని అన్ని జిల్లాలు పాల్గొన్నాయి. 1,25,000 మంది డి. ఐ. ఆర్. క్రింద షుమారు 287 జైళ్ళలో నిర్బంధింప బడ్డారు. ఆ సమయానికి మరో 50 వేల మందికి పైగా మీసాలో నిర్బంధించ బడ్డారు. శాంతియుత సత్యాగ్రహులమీద షుమారు 40 చోట్ల లాఠీ ఛార్జీలు జరిగాయి.

ఆంధ్రలో లోక సంఘర్ష సమితి ప్రకటించిన ఈ సత్యాగ్రహ కార్యక్రమాన్ని రాజకీయ పార్టీలకు వెంటనే చేపట్టడం సాధ్యం కాలేదు: పరస్పర సంబంధాలు తెగిపోయిన కారణంగా, పార్టీ సభ్యులకు వాళ్ళ అగ్రనాయకుల సందేశాలు, అభిప్రాయాలు వెంటవెంటనే అందేవికావు. సత్యాగ్రహం కేవలం ఆర్. యస్. యస్., జనసంఘ సభ్యులే తమ కొరకు చేసుకొంటున్నారని కొందరు ప్రతిపక్షాలవారు మొదట భావించారు. అందుచేత సత్యాగ్రహ నిర్ణయం సమష్టి నిర్ణయంగా అంగీకరించడానికే కొంత కాలం పట్టింది. అదీగాక క్రియాశీల సభ్యుల పాత్ర తక్కువగా ఉన్న కారణాన ఎక్కువమంది రాజకీయ పార్టీల తరఫున ఈ సత్యాగ్రహాలలో పాల్గొనలేక పోయారు. సానుభూతి మాత్రం పూర్తిగా ఉండేది.

తెన్నేటి 'ప్రజాపార్టీ చిన్నది' అని అంటూ సత్యాగ్రహంలో తమ పార్టీనుండి ఒకరిద్దరు పాల్గొని ఉండవచ్చునన్నారు. సోషలిస్ట్

పార్టీ నేషనల్ కౌన్సిల్ సభ్యుడు బి. సత్యనారాయణరెడ్డి చాలమంది పాల్గొన్నారన్నారు. బి. సత్యనారాయణరెడ్డి ఆగస్టు 1975 నుండి మీసా క్రింద నిర్బంధంలోనే ఉన్నారు. సోషలిస్ట్ పార్టీ నేషనల్ కౌన్సిల్ సభ్యుడు తుమ్మల చౌదరి తమ పాత్రను గురించి చెప్పింది ప్రత్యక్షానికి అందుబాటులో ఉన్నది-యల్. యస్. యస్. సత్యాగ్రహం ప్రారంభించింది గనుక, బైటఉన్న మా వాళ్లు సత్యాగ్రహాలలో పాల్గొనాలా? లేదా? అనే విషయాన్ని ఆలోచించవలసి వచ్చింది. నియంతృత్వానికి వ్యతిరేకంగా, వాస్తవ దృక్పథంతో ప్రచారం చేయడము, మిగతా ప్రాంతాల కామ్రేడ్స్‌తో సంబంధాలు నెలకొల్పుకోవడమే ప్రథమ కర్తవ్యంగా స్వీకరించాలి అని సమావేశంలో ఒక అభిప్రాయానికి వచ్చారు. అప్పటికి జార్జి ఫెర్నాండజ్ పంపుతూండిన లేఖలు, ప్రకటనలు అంద నారంభించాయి. ఇతర ప్రాంతాల కామ్రేడ్సుతో సంబంధాలు నెలకొల్పుకునేందుకు ఇరువురు మిత్రులను నియమించాం.

''సత్యాగ్రహోద్యమాలలో శ్రీ ఆంజనేయులు గౌడ్ మిగతా కామ్రేడ్లూ అరెస్టయినారు. ఆదోనిలో బి. వి. ఆర్. రెడ్డి, ప్రొద్దుటూరులో ఆర్. వి. సుబ్బారెడ్డి, హైదరాబాద్ నగరంలో మరి కొందరు కామ్రేడ్లు అరెస్టయినారు. సత్యాగ్రహం నడిచిన రోజులలో గుంటూరునుండి యం పాపిరెడ్డి, కల్వకుర్తినుంచి వై. కృష్ణారెడ్డి, బందరునుండి పి. దశరథరామ శర్మ నిర్బంధింప బడ్డారు"......

''మాకున్న కొద్దిపాటి వ్యక్తుల సంఖ్యను, వనరులనుబట్టి నియంతృత్వాన్ని ఎదిరించడానికి మేముకూడా కొంత పని చేయగలిగాం'' — అన్నారు తుమ్మల చౌదరి.*

---

* తుమ్మల చౌదరి ఉద్యమానికి సంబంధించిన సోషలిస్టు పార్టీ పాత్రను గురించి పంపిన వివరణనుండి.

మన ప్రాంతంలో బి. యల్. డి. వారుకూడా తమ కేంద్ర పార్టీ నుండి సూచన లందక మొదట ఇబ్బంది పడ్డారు. యల్. యస్. యస్. ప్రారంభించిన సత్యాగ్రహంలో - అందుచేత కావచ్చు, మరే కారణా లైనా కావచ్చు - కొద్దిమంది మినహా ఎక్కువ ఎక్కడా పాల్గొన్నట్లు లేదు.

సోషలిస్టు పార్టీలో జార్జి ఫెర్నాండజ్ వర్గం యల్. యస్. యస్. నడిపిన సామూహిక ఉద్యమంలో పాల్గొన్నట్లు కనిపించదు. సత్యాగ్రహంద్వారా సాధించగలమనే విశ్వాసం వారికి పూర్తిగా కలుగలేదు. కాని జనజాగరణకు, భయరహితమైన వాతావరణాన్ని సృష్టించడానికి సత్యాగ్రహంవల్ల సాధారణ ప్రజలలో ఏర్పడే స్వేచ్ఛా సంకల్పం ఆ తర్వాత ఎంతగా ఉపకరించిందో, ఎన్నికల పర్యవసానం తెల్పింది.

* * * *

ప్రజాస్వామ్యంలో పత్రికలు ప్రభుత్వానికి ప్రజలకు మధ్య వంతెనలా పనిచేస్తాయి. బ్రిటీష్‌వారి ప్రభుత్వహయాంలో కొన్ని పత్రికలమీద ఆంక్షలు పెడితే బాగుంటుందా-అనే ఆలోచన వచ్చింది. అప్పుడు ఒక బ్రిటీష్ రాజకీయవేత్త "నీ కొంపకు నడికప్పున నిప్పంటుకున్నదాకా మైకంలో ఉండాలని ఉందా?" అన్నాడు. బ్రిటీష్‌వారి హయాంలో ప్రజలతపన ఎన్ని డిగ్రీలలో ఉందో తెలుసుకోవడానికి పత్రికలు, రాయిబహదూర్, రావుబహదూర్లూ ఉపయోగపడ్డారు.

అందుకే అన్నాళ్ళు పాలించగల్గారు.

నియంతల లక్షణం అదికాదు. అహంకారం; తమ నిశ్చయానికి తిరుగులేమి; విమర్శనేరూపంలోను సహించకపోవడం; సలహాలను నిర్లక్ష్యంచేయడం; ముఖస్తుతికి లొంగిపోవడం అతి సామాన్యలక్షణాలు.

ఎమర్జెన్సీ మొదటిరోజుల్లో ప్రభుత్వ గూఢచారి సంస్థలు ఇందిరా గాంధీకి ప్రజలలో ప్రభంజనంలా వ్యాపిస్తున్న వ్యతిరేకాన్ని-ఉన్న దున్నట్లు తెలపడానికి ప్రయత్నించారట.

కానీ నియంతకా వార్తల ధోరణి నచ్చలేదు. 'మనకెందుకీపీడ'- అనుకున్నారు తాబేదార్లు. "బ్రతికియుండిన సుఖముల వడయవచ్చు." కనుక తీయని వార్తలు - ఇందిరా గాంధీ పట్ల ప్రజల్లో బ్రహ్మాండమైన అభిమానం ఉప్పొంగి పోతున్నదని - ఎమర్జెన్సీని సామాన్యుడు వేనోళ్ళపొగడుతున్నాడని, నియంత కుమారుడు "ఉదయిస్తున్న ప్రచండ ప్రభాకరుడని ప్రజలు స్వాగతిస్తున్నా"రనీ - ఇలాంటివే అభూతకల్పనలు అందచేయనారంభించారు. ఇందిరా గాంధీ-అధికారం కళ్ళకు పొరలుకప్పి - నిజమని భ్రమించింది. ప్రజలకు ఆమెకు సంబంధం తెగిపోయింది.

పత్రికలపై సెన్సారుతో 'ఆ఼, ఏముంది, భజనపాటలేగా' అని చదవడం మానినవాళ్ళు అసంఖ్యాకులు. ప్రజలకు వార్తల ఆకలి ఏర్పడింది.

అలాంటి సమయంలో ప్రచ్ఛన్న వార్తా పత్రికలు-కర పత్రాలు-పుస్తకాలు-ప్రజలకు అమృత గుళికలు-అవెప్పుడువస్తాయో ఏం వార్తలు తెస్తాయోనని కుతూహలంతో కూడిన భయంతోనే-చాటు చాటుగా-చదవాలి, తెలుసుకోవాలి, అనే తపనతో వాటికోసం ఎగబడ్డారు.

చదివిన పదప గుసగుసలు-అలా దావానలంలా వార్తలు వ్యాపిస్తుండేవి. కొందరు ఇందిరా భక్తులు - సి. పి. ఐ. గూఢచారులు, పై వత్తిళ్ళను భరించలేని సి. ఐ. డి. పోలీసు తండా దీన్ని నివారించడానికి ఊపిరి తీసుకోకుండా ప్రయత్నించారు.

ప్రచ్ఛన్న పోరాటంలో-ప్రచ్ఛన్న సాహిత్య రచన-ప్రచురణ-వితరణ-పఠనం-అన్నీ శరీరంలో ఒక విద్యుత్తును ప్రవహింపచేస్తాయి. ఒక 'థ్రిల్' కలుగచేస్తాయి. ఒక విశ్వాసాన్ని, ధైర్యాన్ని పోరాడటానికి సాహసాన్ని కలుగ చేస్తాయి.

గదర్ పార్టీ, అనుశీలన సమితి, హిందూస్థాన్ రిపబ్లికన్ పార్టీ, సావర్కర్ నడిపిన ఉద్యమం ఈ రహస్య సాహిత్యంతో - వేడినెత్తురులు చప్పబడ్డ ధమనుల్లో ఆ నాడు ఉరకలెత్తించినట్లు, ఈ నాడు కూడా అంతకంటే మహావిజృంభణంతో వ్యాపకంతో గ్రామగ్రామలలో ప్రచ్ఛన్న సాహిత్యం పరవళ్ళు త్రొక్కింది.

స్వేచ్ఛా సమాజానికి అలవాటుపడ్డ ప్రజలకు పత్రికలపై అదుపుసంకెళ్ళు పడడంతో, ఏ పత్రిక ఏ వార్తను ప్రచురించినా, ఆలిండియా రేడియో, టెలివిజన్, సినిమా; ఏ ఉదంతం చూపినా, చెప్పినా 'బూటకం-దగా' అనే స్థితి, 'మనం మోసగింపబడ్డాం' అనే ఆక్రోశం సహజంగా వచ్చాయి.

అలాంటి విసుగుకు - ఉక్రోషానికి, ఆప్యాయమైన చల్లని పానీయంలా ప్రచ్ఛన్న సాహిత్యం ప్రవహించింది. అందులోని ప్రతి అంశాన్ని ప్రతి వార్తను, ప్రతి విమర్శను ప్రజలు విశ్వసిస్తారు. విశ్వసించారు. ఎందుకు? దాన్ని వ్రాయడంలో, పంచడంలో ప్రమాదమున్నది. అరెస్టులు కావచ్చు. క్రూరహింసలకు గురికావచ్చు. ప్రాణాలే కోల్పోవచ్చు.

దూసి ఆనంద్ 'పలాస' గ్రామంలో సంగ్రామ సాహిత్యంతో దిగాడు. ఊళ్ళో పోలీసు గస్తీ ఉందని తెలిసి లాడ్జిలో గది తీసుకున్నాడు. సి. ఐ. డి. లు పసిగట్టారు. అతనికి కాపలాగా ఓ కానిస్ట

బుల్‌నుంచి వెళ్ళారు. ఇది కనిపెట్టిన ఆనంద్ పెట్టిబేడ హోటల్ బాయ్‌తో 'బస్సురాగనే బస్సులోవేయిమని' క్రిందికి వచ్చాడు. కానిస్టేబుల్ ఆనంద్‌ను ఆపి - నీ మీద అనుమానం. ఎక్కడికీ వెళ్ళే వీల్లేదు - అన్నాడు. నవ్వుతూ ఆనంద్ - ఎక్కడకుపోతానయ్యా ! అంటూ బాతాఖానీ మొదలుపెట్టాడు. బస్సువచ్చింది - సంగ్రామ సాహిత్యం బస్సులో పెట్టబడింది - ఆనంద్ మాట్లాడుతూనే ఉన్నాడు. కానిస్టేబుల్ మాటల్లోపడ్డాడు - బస్ కదిలింది ఆనంద్ 'రైటో-గుడ్‌బై' అంటూ ఒక్క అంగంలో బస్ ఎక్కాడు. కానిస్టేబుల్ నోరు వెళ్ళబెట్టటం ఆనంద్ గుండెలనిండా గాలి బీల్చటం ఒక్కసారిగా జరిగాయి.

ఆ రోజు రాంనగర్‌లో కాంప్. గోడలమీద వ్రాయటం, కరపత్రాలు ఇంటింటికీ పంచటం - అదీ పని. అనుకోకుండా పోలీసులకు తెలిసి ఉద్యమ కారుల వెంటబడ్డారు. అందరూ తలోదిక్కుకూ తప్పుకున్నారు. ఆనంద్ వెళ్ళినవైపు ఇంక దారిలేదు. గభాల్న ఓ మురుగు కాలవ తూములో చేరాడు. బురద-మురుగు-దోమలు. బయటికి వచ్చే వీల్లేదు. తెల్లవారింది. చూచుకొంటే ఒంటినిండా బురదే ! అట్లా వెళ్తే ఎవరన్నా అనుమానిస్తారు. అందుకని ఆ పగలంతా అందులోనేగడిపి చీకటి పడ్తుండగా ఆ గహ్వరంలోంచి బయటపడి ఇంటికి చేరాడు.

హైద్రాబాదులో సుధాకర్ అజ్ఞాత పుస్తకాల పెట్టెలు ఆటో నిండా పేర్చుకుని వెళ్తున్నాడు. నింబోలిఅడ్డ పోలీసుస్టేషన్‌వద్ద పోలీసు ఆటోని అటాకాయించి లైసెన్సు చూపమన్నాడు. లైసెన్సులేదు దానికి. ఆ పోలీసు అన్ని పెట్టెలు ఉండటం అనుమానం కలిగి ఏమిటి ఇవి ? అంటూ ఒక పుస్తకం లాగాడు. 'హిట్లర్ అడుగుజాడల్లో ఇందిర' అది. వాడికి తెలుగురాదు ఉర్దూతప్ప. క్యా కితాబ్ హై ? అన్నాడు.

బ్రతికాననుకొని పుస్తకం లాక్కొంటూ, 'ప్రధాని వస్తోందిగదా-అందుకని' అన్నాడు. అయినా బండి పోనీను అన్నాడు. పదిరూపాయలు ముడుపు-డ్రైవరుకుబదులు తాను చెల్లించి, కానిస్టేబుల్‌కో సలాంకొట్టాడు సుధాకర్. ఆటో బయలుద్దేరింది. పదిగజాలు దాటగానే ఆటో ఆపివేసి డ్రైవరు "నేనురాను-పెట్టెలా ఎదో ఉంది. లేకపోతే నా బదులు డబ్బులు నువ్వెందుకిచ్చావు ?" అన్నాడు. ఇంకో 5 రూపాయలు నీకిస్తాలే అని అనునయింగా మాట్లాడి-వీపుత ట్టేగానీ ఆటో ముందుకుసాగలేదు.

భీమున్నిపట్నంలో గవర్నరుగారు ఒక కార్యక్రమానికి హాజరైనారు. తిరిగి ఇంటికివచ్చేప్పటికల్లా కారులో అజ్ఞాత సాహిత్యం ప్రత్యక్షమైంది. మండిపడ్డ గవర్నరుగారి కోపం తాలుకా తహశీల్దార్‌దాకా వచ్చిపడింది. ఎవరు కారులో వేసిందీ ఎవరికీ తెలియదు. కార్యక్రమం ఫోటోలు తీయటానికి వచ్చిన ఫోటోగ్రాఫరు ద్వారా ఈ పని జరిగిందని ఇప్పటికీ తెలీదు వాళ్ళకు.

'76 జనవరి మొదటి వారంలో విశాఖలో సైన్సు కాంగ్రెసు మహాసభలు పెట్టారు. దేశం నలుమూలలనుంచి ప్రతినిధులు వచ్చారు. ఒక రోజు ఉదయం వాళ్ళ వసతిగదుల్లో గ్రీటింగ్ కవర్సు పడి ఉన్నాయి. విశాఖవాళ్ళు మంచివాళ్ళే ! అనుకొంటూ కవర్లు తీసి చూచుకొన్నారు. వాటి నిండా అజ్ఞాత సాహిత్యం పదిలంగా ఉంది. ఇంక ఆ రోజు వాళ్ళందరి మధ్య చర్చావిషయం 'అత్యాచార పర్వమే' !

అజ్ఞాత సాహిత్య విభాగంలో పనిచేసే పదోతరగతి విద్యార్థి లంకా వెంకట రామశాస్త్రి. హుషారైన కుర్రవాడు. ఒక రోజు అజ్ఞాత సాహిత్యాన్ని ఒకచోటనుంచి, రెండోచోటికి తీసుకు వెళ్తున్నాడు అందీ అందని సైకిల్‌మీద. ఒక మలుపువద్ద వేగంగావస్తున్న మోటరు కారు ఢీకొట్టింది. శాస్త్రి క్రింద పడ్డాడు అజ్ఞాత సాహిత్యం చెల్లా

చెదురుగా రోడ్డుమీదపడింది. సైకిలు వంగిపోయింది. జనం గుమి కూడు తున్నారు. కారువాడిదే తప్పు. వాడితో పోట్లాడి సైకిలు రిపేరుకు డబ్బులు వసూలు చేయవచ్చు. కాని, సాహిత్యప్రతులు సర్దుకొని, విరిగిన సైకిల్ ఓ రిక్షాపైవేసి 'చలో భాయ్' అని అమాయకంగా పోతున్న శాస్త్రినిచూచి పాపం! నోరులేని వాడు అనుకున్నారు అమాయక జనం. అలా ధైర్యంగా, తెలివిగా, మొండిగా-నలుగురి కోసం-దేశంకోసం త్యాగానికి, ఆత్మార్పణకు సిద్ధమైన కార్యకర్తలను ప్రజలు నమ్ముతారు. సానుభూతి చూపుతారు. మనవారు-ఆప్తులు-అను కొంటారు. ద్రవించి సహకరిస్తారు. అదే అండ-అదే బలం-ఉద్యమానికి విజయం చేకూర్చేది ఆ ఆప్త భావమే. ఈ కృషిలో దేశమంతటా పత్రికలు ఏ పేరవచ్చినా నడిపింది ఆర్. యస్. యస్. కార్యకర్తలే ఎక్కువగా. ఇది అందరూ ఆమోదించిన వాస్తవం.

ప్రచారతంత్రం ముఖ్యంగా అజ్ఞాత కార్యకర్తల సాహసాన్ని నిలిపి ఉంచడానికి – నిజమైన వార్తల నందించి, ఉద్యమ ప్రగతిని తెల్పుతూండడం; ప్రభుత్వం వ్యాపింపచేసే అసత్యాలను, ప్రకటించే విమర్శలను ఎప్పటికప్పుడు ఖండించి వాస్తవాలను తెల్పుతుండడం; ప్రభుత్వ దమనకాండను, అధికార దుర్వినియోగాన్ని, ఎమర్జెన్సీ అధి కారంతో జరిపే రకరకాల అత్యాచారాలను విరివిగా ప్రచారం చేయడం; జైళ్ళకు వార్తల నందీయడం లక్ష్యాలు.

ప్రభుత్వం ఈ అజ్ఞాత ప్రచారాన్ని అణచడానికి ఎన్ని చేయాలో అన్నీచేసింది. ముద్రణ ఎక్కడ జరుగుతున్నదోనని ప్రెస్సులమీదపడి పీడించారు. అనేక స్థలాల్లో సైక్లోస్టైల్ మిషన్లకోసం వెదికారు. కొన్నిచోట్ల పట్టుకున్నారు. ఒకోసారి తీసుకొని పోతున్న సాహిత్యాన్ని రిక్షాలోనే వదలి వెళ్ళిపోవల్సి వచ్చేది.

వార్తలు కేంద్రంనుండి ప్రాంతాలకు చేరేవి. అక్కడినుంచి వచ్చిన వార్తలు, స్థానిక వార్తలు కలిపి దాదాపు దేశంలో 250 వివిధ పత్రికలు ప్రకటింపబడేవి. వార్తలు జిల్లానుండి ప్రాంతం, అక్కడి నుండి కేంద్రానికి పంపే ఏర్పాటు జరిగింది. పోలీసులు దేశంలో 200 ప్రెస్సులపై దాడి చేశారంటారు సుందర్‌సింగ్ భండారి. గుజరాత్, మద్రాసు ప్రాంతాలలో ప్రతిపక్షాల ప్రభుత్వాలున్న రోజుల్లో, అక్కడ ముద్రణ చేయించి వ్యాపార సంస్థలద్వారా ప్రాంతాలకు పంపబడు తుండేవి. పదిరోజుల్లో ఏ వార్తైనా దేశమంతటా వ్యాపించేది.

ఆంధ్రలో కరపత్రాలు లక్షలు ముద్రింప బడ్డాయి అంటారు ప్రాంత ఆర్. యస్. యస్. ప్రచారకులు సోమయ్య.

పక్షపత్రికలు 8 కేంద్రాలనుంచి వెలువడ్డాయి-తెలుగులో 'ఢిల్లీ నగారా,' 'సమాచార్' హైదరాబాదునుండి దేశ విదేశ వార్తలతో వెలు వడేవి. విశాఖనుండి స్వరాజ్య, విజయవాడనుండి వందేమాతరం, నెల్లూరునుండి గర్జన, అనంతపురంనుండి ఎక్స్-రే, వరంగల్‌నుండి సాధన హైద్రాబాద్‌నుండి అంతర్వాణి, ప్రజావాణి, నిజామాబాద్‌నుండి జనవాణి మున్నగునవి వెలువడేవి. కొన్నాళ్ళు ఇలా విడిగా నడిచిం తర్వాత రాష్ట్రంలోని అజ్ఞాత పత్రికలన్నింటికీ ఒకే పేరుపెట్టారు- 'వందేమాతరం' అని.

మొదట్లో సైక్లోస్టైలులో ప్రారంభించారు. తరువాత విజయ వాడ, హైద్రాబాదు, ఖమ్మంలలో ప్రింటింగుకు ఏర్పాటుచేసి-ప్రింటు చేయించేవాళ్ళు. "వందేమాతరం - లోక సంఘర్షసమితి ఢిల్లీ" అని ప్రచురింపబడేది. కేంద్రానికి రాష్ట్రప్రభుత్వం తన రహస్య నివేదికలో ఢిల్లీ నుండి ఈ పత్రికలు వస్తున్నాయని వ్రాసి పంపింది. (Andhra

Pradesh Government, strictly confidential, D. O. letter No. 3872/general A/76-1. Report upto 31-7-76).

పత్రికలకు చందాలు విరివిగాలభించేవి. అవి స్వయం పోషకాలైనాయి. ప్రతినెలా 10-15 రూపాయల చొప్పున 3000 మంది ఇస్తుండేవారు. 25 నుండి 50 వరకు విరాళమిచ్చినవాళ్ళు, 100 చొప్పున ఇచ్చినవాళ్ళు కూడా ఎందరో ఉన్నారు. అలా ధనం వచ్చేది. కాని కార్యకర్తలు నియమంగా ఇంట్లో తినాలి. తమ జేబులోంచి తమ ఖర్చు పెట్టుకోవాలి. ఆర్. యస్. యస్. కార్యకర్తలందరూ అలానే వ్యవహరించారన్నారు సోమయ్య.

కరపత్రాలు దాదాపు 5000 గ్రామాలకు పంచేవాళ్ళు. పత్రికలు 1200 గ్రామాలకు వెళ్ళేవి. అలా 12000 పక్షపత్రికలను పంచామన్నారు ఆయన.

షణ్ముఖాచారి హైదరాబాదు అజ్ఞాత సాహిత్య విభాగంలో ఆర్టిస్టు. ఆవుగా ఇందిరను, సంజయ్‌ను దూడగా - తనువేసిన బొమ్మను బ్లాక్ మేకింగ్‌కు ఇచ్చాడు. సి. ఐ. డి. లు పసికట్టి అతనికోసం బ్లాక్ మేకర్ వద్ద కాపుకాసారు. షణ్ముఖాచారి కొద్ది రోజులపాటు ఆ రోడ్డు ఎక్కితే ఒట్టు.

మరో బొమ్మ-మరో బ్లాక్ మేకర్. తయారైంది 'అవినీతికి మారు పేరు ఇందిర' అనే పుస్తకం. ఇలా తయారైన ఏ కరపత్రమైనా, ఏ పుస్తకమైనా, ఏ పత్రిక ఐనా అన్ని వార్తా పత్రికలకు, మంత్రులకు పోలీసు తదితర అధికారులకు చేరుతుండేవి.

కడపలో మునుస్వామి అనే సంఘ ప్రచారక్ వద్ద ఆ జిల్లాకు సంబంధించిన ఇలాంటి చిరునామాలు పట్టుబడ్డాయి. వాళ్ళందర్ని చంప

టానికి కుట్ర పన్నుతున్నాడన్న అభియోగంతో కేసు పెట్టబడింది. అంతేకాదు 'మీసా' బహుకరించారు.

ఒకచోట కరపత్రాలు ఉన్న నేరానికి ఒకతనిపై పోలీసులు కేసు పెట్టారు. ఆ నాడు ఆ మేజిస్ట్రేటు టేబిల్‌మీదే ఒక కరపత్రం ఉన్నది. ఆ మేజిస్ట్రేటు 'ఏమయ్యా, నా టేబుల్‌మీద కరపత్రం ఉందికదా! నన్ను కూడా అరెస్టు చేస్తావా' అని పోలీసు అధికారినడిగాడు.

ప్రజలదాహం తీరుస్తూ, ప్రజల సహకారంతో అటు సెన్సారు వారి కార్యాలయం తెరవబడగానే ఇటు మొదలైన అజ్ఞాత పత్రికలు ఇలా నిర్విరామంగా ఎన్నికలు ప్రకటించబడి సెన్సారు వారి కార్యాలయం మూతపడేవరకు, నిరంతర పోరాటం కొనసాగిస్తూ వచ్చాయి. (మచ్చు తునకలకు అనుబంధం చూడండి.)

# 11

# తరచి చూస్తే

'స్వాతంత్ర్యపు చెట్టుకు
వేళ్ళూనితే
పెరగటానికి
పెద్ద సమయం పట్టదు.'

— జార్జి వాషింగ్టన్

సత్యాగ్రహం విషయంలో ఆర్. యస్. యస్. నిర్ణయాలను భారతజాతీయ దృక్పథాన్ని, పరంపరను పునరుద్ఘాటించిన శ్వేత పత్రాలనవచ్చు. ఆర్. యస్. యస్. మూడుసార్లు ముఖ్యమైన నిర్ణయాలను తీసుకొన్నది. ఈ విషయంలో ఆర్. యస్. యస్. కేంద్ర సారథ్య సంఘ సభ్యులలో ఒకరైన బాపూరావ్ మోఘే ఇలా అన్నారు.

''అత్యవసర పరిస్థితిలో ఆర్. యస్. యస్. మీద నిషేధం తొలగించుకోవడానికి, మిగతా సమస్యల పరిష్కారానికి ఒంటరిగా పోరాడాలా లేక లోక సంఘర్ష సమితితో కలిసి పోరాడాలా అనే సమస్య మా చర్చల్లో వచ్చింది. మాకు రాజకీయాలతో సంబంధం లేక పోవచ్చు. కాని ఈ ఆపద జాతికి సంబంధించిన ధోరణిలో నడుస్తున్నది. కనుక పోరాటాన్ని విజయవంతం చేయడానికి ఏ పద్ధతిలో వీలైతే ఆ

పద్ధతిలో పూర్తిగా సహకారం అందచేయాలి. కాని సంఘర్ష సమితిలో ఆర్. యస్. యస్. సంస్థగా భాగస్వామి కాకూడదని నిర్ణయించుకొన్నాం. (ప్రభుత్వం ఆర్. యస్. యస్. ను ప్రతిపక్షాలనుంచి వేరు చేయడానికి, గాలం కూడా వేసింది. అది తరువాత చూద్దాము.)

రెండో ముఖ్యమైన నిర్ణయం సత్యాగ్రహం విషయంలో. కొందరు సత్యాగ్రహం నిరర్థకం - పనికిరాదు. ఈ ప్రభుత్వానికి 'సత్యాగ్రహ' ధోరణి అర్థంకాదు; అనవసరంగా ఒక లక్షమంది సంఘ సభ్యులను జైళ్ళకు పంపడం పొరపాటవుతుంది అని భావించారు. ఐనా చివరకు సత్యాగ్రహం చేయాలని నిర్ణయం ఐంది.

ఆ నిర్ణయాన్ని సఫలం చేయడం ఆర్. యస్. యస్. తన కర్తవ్యంగా స్వీకరించింది. ఆ నాడు సత్యాగ్రహం సఫలం కాకపోతే పరిస్థితి ఎలా ఉండేదో ఊహించుకోవడం కష్టం. 12 ఫిబ్రవరి 1976 న బి.బి.సి.తో ఇంటర్వ్యూలో జె. పి. "ప్రమాదం రావచ్చునని నేను ఊహించి ఉండినా, తెలుసుకొని ఉన్నా, ఉద్యమాన్ని ఇంకా కొద్దిగా ఆలోచనా పూర్వకంగా నడిపి ఉండేవాణ్ణి. మరోమార్గం అన్వేషించడానికి ఇంకా ఎక్కువ ఆలోచించి ఉండేవాణ్ణి...సహాయ నిరాకరణ - భూమిశిస్తు-మిగతా పన్నులు ఇవ్వవద్దనడందాకా నేను వెళ్ళి ఉండేవాణ్ణి కాదు. రాజకీయ చర్యలమీద, ప్రజాస్వామ్య చర్యలమీద కేంద్రీకరించే వాణ్ణి. 'డైరెక్టు ఆక్షను' కాదు" అన్నారు. నియంతృత్వం జె. పి. లాంటి వారిలో కూడా కలుగచేసిన దైన్యస్థితి అది. మిగతా ప్రజలు ఎలా భావించి ఉంటారో చెప్పుకోవడం దేనికి ?

కనుక ఆ దైన్యస్థితి తొలగిపోవాలి. నియంతృత్వాన్ని బహిరంగంగా ఎదిరించి నిలవడంతో, దేశంలో నివురుకప్పిన నిప్పులా అణగి ఉన్న వ్యతిరేకత ప్రజ్వరిల్లుతుంది. మూగవోయిన ప్రజలవాక్కు గొంతు

విప్పుతుంది. ప్రజాస్వామ్య చైతన్యం బలపడుతుంది అని భావించడం జరిగింది.

మూడవది-సంఘనాయకుల్లో రాకపోయినా-సహచర వర్గంలో-ఇందిరా గాంధీ శాంతియుత పద్ధతులతో మాట వినదు. హింసా పద్ధతికి పూనుకోని పక్షంలో సరియైన దారి ఏర్పడదు - అని అప్పుడప్పుడు కల కలం కన్పించేది. అపుడు ఆర్. యస్. యస్. నాయకత్వం అహింసా విధానంపట్ల, శాంతిమయ పంథాపట్ల తన విశ్వాసాన్ని పునరుద్ఘాటించి, హింసాపద్ధతులపట్ల 'లూజ్ టాక్' (బాధ్యతారహిత ప్రసంగాలను) గట్టిగా నిరోధించి వ్యాప్తి కలుగకుండా చేసింది. ఈ విషయంలో చర్చించే ధోరణిని కూడా నిరుత్సాహ పరిచింది.

ఆర్. యస్. యస్. నిర్ణయాలు మూడూ-జాతీయ సమైక్యతకూ ప్రజాస్వామ్య పరిరక్షణకొరకు, క్రియాశీల పౌరులు కష్టనష్టాలను సహించడానికై అలవరచుకున్న నిత్యసంసిద్ధతకు, మానవ సంబంధా లలో శాంతిపూర్ణ మార్గాల ప్రోత్సాహానికి - మూడు మైలు రాళ్ళు. భవిష్యత్తుకు పాథేయాలు.

ఈ సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్న లక్షకుపైగా ఆర్. యస్. యస్. సభ్యులు తొంభై శాతం ఆర్థికంగా పేదకుటుంబాలకు, మధ్యతరగతిలో నిమ్నవర్గానికి చెందినవాళ్ళే. గుమస్తాలు, సన్నకారు రైతులు, విద్యార్థులు, యువకులు, ఉపాధ్యాయులు, స్వయం ఉపాధి శీలంగల సామాన్య కుటుంబీకులు. అధికార రాజకీయాలతో కాని, వ్యక్తి తత్వారాధనతో కాని, కులతత్వంతో కాని ఉత్తేజం పొందనివారు- ఈ లక్షణాలకు మైళ్ళదూరాన ఉండే మనస్తత్వాన్ని, ఆదర్శాన్ని అల వరచుకున్న సన్నకారు సాదా పౌరులు. ఇందరు స్పందించడానికి అనేక దశాబ్దాలు 'పరిస్థితి నిరపేక్షం'గా క్రియాశీల జాతీయ పౌర

జీవనాన్ని ప్రజలకు అలవరచేందుకు ఆర్. యస్. యస్. సాగించిన తనదైన విలక్షణ కార్యక్రమమే కారణం. ఆ కార్యక్రమంవల్ల మనిషిలో 'స్వార్థప్రవృత్తి' తగ్గి, జాతీయ సమస్యలకు స్పందించే అవగాహన వ్యాపకంగా పెరిగినందున - ఇంతటి అజ్ఞాత ఉద్యమాన్ని నడిపేశక్తి-బలగం - మనఃస్థితీ దేశంలో వ్యాపించింది. ఏ మేరకు ఈ వ్యాప్తి ఏ రాష్ట్రంలో వేళ్ళూనిందో ఆ రాష్ట్రాలలో ఆ మేరకు ఉద్యమ తీవ్రత కనిపించింది. ఆ మేరకు క్రియాశీల పౌరుల చైతన్యం కన్పించింది. ఆ మేరకే ఫలితాలు కూడా కన్పించడం - జాతి శ్రేయస్సును కోరే మూర్థవ్య మేధావులు జాగ్రతగా గుర్తించవలసిన సత్యం.

సత్యాగ్రహంలో వివిధ పార్టీలు, సర్వోదయ వాదులు కొందరు, ఇతరులనేకమంది ప్రముఖులు పాల్గొన్నారు. వారి కృషికూడా 'అనల్పమైనదే'. ముఖ్యంగా ఎడతెరపిలేకుండా సత్యాగ్రహ పోరాటం కొనసాగించిన అకాలీ దల్ పట్టుదల, లక్ష్యశుద్ధి స్మరించుకొని తీరాలి. ఒకనాటి గురుపరంపర చేసిన త్యాగాలు చూపిన సాహసాలు దేశం ఈనాడు మరొకసారి చూచింది.

కర్ణాటకలో సంస్థా కాంగ్రెస్, ఉత్తరప్రదేశ్‌లో బి. యల్. డి. ఎక్కువ పాత్ర వహించాయి.

సత్యాగ్రహం ప్రారంభించడమంటే దానికి కొన్ని ప్రయోజనాలు నిర్ధారణ కావాలి. ఆశించిన మేరకు సత్యాగ్రహం ఆ ఫలితాలను, ప్రయోజనాలను సాధించిందా అనేది ప్రశ్న.

సత్యాగ్రహ లక్ష్యాన్ని గురించి లోక సంఘర్ష సమితి కార్యదర్శి రవీంద్ర వర్మ నవంబరు మొదటి వారంలో పంపిన 'ఛార్టర్ ఆఫ్ డిమాండ్స్' ద్వారా ప్రజలు కోరిన లక్ష్యాలివి.

1. ఎమర్జెన్సీని ఎత్తి వేయాలి.
2. జె. పి. ని, మిగతా దేశనాయకులను విడుదల చెయ్యాలి.
3. పత్రికలపై విధించిన 'ఆంక్ష'ను తొలిగించాలి.
4. ఆలోచన, భావ ప్రకటన, వాక్ సమావేశ-పత్రికా స్వాతంత్ర్యాలను పునరుద్ధరించాలి.
5. రాజ్యాంగం యొక్క, న్యాయస్థానాల యొక్క పవిత్రతను కాపాడాలి.
6. అధికార నిరంకుశత్వాన్ని, పోలీసు దౌర్జన్యాలను అంతం చేయాలి.
7. ఆర్. యస్. యస్. మీద మిగతా కొన్ని సంస్థలమీద విధించిన నిషేధాన్ని తొలగించాలి.

ఈ కోరికలతో సాగిన సత్యాగ్రహ ఉద్యమం రెండు ముఖ్య శాఖలుగా నడిచింది. ఒకటి సత్యాగ్రహ లక్ష్యాలను ప్రజలకు తెలియచేసి, ప్రభుత్వ విధానాల వాస్తవ రూపాన్ని ప్రజలకు, ప్రపంచానికి తెలియ చేయడం - ప్రభుత్వ విధానాల వెనక దాగిఉన్న నియంతృత్వాన్ని, అధికార దాహాన్ని వెలుగులోకి లాగి, ప్రజలకు ఎత్తి చూపడం. వీటివల్ల దేశానికి, ప్రజలకు రానున్న ముప్పును గురించి ప్రచారంచేసి, నచ్చచెప్పడం - దీనిలో భాగంగానే ప్రభుత్వం ప్రతిపక్షాలను దుయ్యబట్టడానికి చేస్తున్న ప్రచారపు సమారాన్ని వమ్ము చేయడం. దీనికి ప్రత్యామ్నాయంగా, సూటిగా ప్రతిపక్షాలు ప్రజల కొరకు కోరుతూన్న "డిమాండ్సు" ఏ విధంగా ప్రజాల క్షేమాన్ని ఆశించి కోరబడుతూన్నాయో, ప్రభుత్వ వైఫల్యాలతో పోల్చి జూపి ప్రచారం చేయడం.

రెండోది: ఒకవైపు పదవులలో, అధికారంలో ఉండడానికి ప్రభుత్వ పార్టీ చేస్తున్న దుష్కృత్యాలను బాహాటంగా ఎత్తిచూపుతూ 30 ఏండ్ల ఒకే రకం పాలనలో తిష్ఠవేసుకొని కూర్చున్న ఈ 'జలగల బలగాన్ని', వాటి రాక్షసాలను ప్రజలకు తెలియచేస్తూ ప్రజల కొరకు కష్టాలు పడటానికి, బాధలకు గురికావడానికి, స్వేచ్ఛతో తమంతట తాము ముందుకు దుమికి సత్యాగ్రహాలుచేసే 'ప్రజా వీరుల' కథల - గాథల ప్రచారంతో ప్రజల హృదయాలలో సానుభూతిని, హర్షాన్ని, ఆత్మీయతను నెలకొల్పడం.

ఈ లక్ష్యాలను సాధించడానికి ఉద్యమం ఎంత వ్యాపకమైతే అంత ప్రజల హృదయాలలో మార్పు వస్తుంది. ప్రజాస్వామ్యం ఉన్న దేశంలో, స్వప్రజే పరిపాలిస్తున్న దేశంలో, ప్రజాస్వామ్య విలువల గుర్తింపు ప్రజలకు సక్రమంగా లేకుండా ముప్పై ఏండ్లు తప్పుడు ప్రచారంతో గడిచిన దేశంలో - వ్యాపకమైన - ప్రజా సహకారంగల ఉద్యమంవల్ల మాత్రమే, ఫలితాలను సాధించగలమనే విశ్వాసం ఉన్న వాళ్ళు, ప్రజల ప్రబుద్ధ చైతన్యాన్ని - దానిని సరిగా సాధిస్తే ఫలితాలు వస్తాయని - విశ్వసించిన వాళ్ళందరూ ఈ సత్యాగ్రహాన్ని సమర్థించి పాల్గొన్నారు.

లోక సంఘర్ష సమితి కేంద్ర నాయకులలో ఒకరైన సుందర్ సింగ్ భండారీ ఈ 'సత్యాగ్రహ ప్రచార' ఉద్యమ ప్రభావాన్ని గురించి, నాయకత్వాన్ని గురించి, వ్యాపకత్వాన్ని గురించి, పరిణామాన్ని గురించి చెబుతూ —

దేశం మొత్తంలో ఈ వార్తా ప్రసార ప్రచారాల కొరకు 250 కేంద్రాలు నడిచాయన్నారు. కేంద్రంనుండి క్రిందికి - క్రిందినుండి కేంద్రానికి వార్తా ప్రసార యంత్రాంగం స్థిరంగా ఏర్పడింది. దేశంలో

ఎన్ని రకాల కరపత్రాలు, ఎన్నిరకాల పుస్తకాలు వెలువడ్డాయో తెలియ చేయడం కష్టం. దేశం మొత్తం మూడుసార్లు పర్యటనలో తెలియవచ్చిన వివరం, బహుశా ప్రపంచంలో నడచిన ఏ ఉద్యమంలోకూడా ఇంత తక్కువ కాలంలో ఇంత ఎక్కువ సాహిత్యం నిర్మాణమై ఉండదని. ప్రభుత్వ వార్తా ప్రసారపు యంత్రాంగంమీద విశ్వాసం కోల్పోయిన ప్రజలు ఈ అజ్ఞాత వార్తా పత్రికలను, సాహిత్యాన్ని విశ్వాసంతో చదువుతుండేవారు. ఆ చదవడమే వారిని ఉద్యమంలో భాగస్వాములను చేసేది. (Sense of participation).

అజ్ఞాత సాహిత్యాన్ని పంచడానికి ఏర్పాటైన యంత్రాంగం కూడ చాల విజయవంతంగా తన కర్తవ్యాన్ని నిర్వహించిందని చెబుతూ భండారీ రెండు ఉదాహరణలు యిచ్చారు.

అప్పుడు భారత దేశంలో కామన్వెల్తు దేశాల ప్రతినిధుల సమావేశం జరుగుతున్నది. ఎన్నో పెద్ద దేశాలనుండి ఆ యా ప్రభుత్వ ప్రతినిధులు భారత దేశానికి వచ్చారు. దేశంలో ప్రజాస్వామ్యం 'మూడు పూవులూ - ఆరు కాయల్లా' సుభిక్షంగా కొనసాగుతూన్నదని వివిధ దేశాల ప్రతినిధులను నమ్మించడానికి, ప్రభుత్వం ఎన్నో రకాల ప్రయత్నం చేస్తూన్నది. దేశంలో అలజడిలేదని, శాంతి భద్రతల సంక్షేమ రాజ్యం ఉన్నదని, అజ్ఞాత ఉద్యమం మచ్చుకైనా తలఎత్త లేదని నమ్మించేందుకు నానా తంటాలు పడుతున్నది.

అజ్ఞాత ఉద్యమానికి ఇదొక సవాలు. అంతకుముందే - 20 రోజులనుంచే, వివిధ దేశాల ప్రతినిధులకు దేశంలో నడుస్తూన్న 'ప్రజా స్వామ్య హత్య'ను గురించిన సాహిత్యాన్ని అందజేసే ప్రయత్నం ప్రారంభమైంది. ఢిల్లీలోనేకాక, ఈ ప్రతినిధులు ఏ యే స్థలాలను

దర్శించనున్నారో అక్కడక్కడ గట్టిగా పోలీసు, సి. ఐ. డి. సిబ్బంది మంచుపొగ కమ్మినట్లు కమ్మి కూర్చున్నారు.

ప్రభుత్వపు కట్టుదిట్టాలను వమ్ము చేయడానికి రెండురకాల 'కార్యాచరణ దళాల'ను లోక సంఘర్ష సమితి నిర్మాణం చేసింది. అందులో ఒకటైనా అనుకున్న ఫలితాలను సాధించాలని ప్రయత్నం.

'అజ్ఞాత సాహిత్యా'న్ని విదేశీ ప్రతినిధులకు 'సమితి' అందచేయ బోతున్నదని ప్రభుత్వానికికూడ జాడ తెలిసింది. సమావేశ స్థలంలో, వారి నివాసాలవద్ద గట్టి ఏర్పాట్లు జరిగాయి. అయినా అజ్ఞాత సాహిత్యం ప్రతినిధులకు చేరింది. ఈ పని ప్రభుత్వోద్యోగుల సహకారం లభించని పక్షంలో సాధ్యమయ్యేదికాదు. అజ్ఞాతంగా ఉంటున్న నాయకులు ఈ విదేశ ప్రతినిధులను కలుసుకోవడంకూడా జరిగింది. ఈ ప్రతినిధులు లక్నో, పాట్నా, భోపాల్, జయపూర్, బెంగుళూరు, హైదరాబాదు మొదలగు స్థలాలకు వెళ్ళినపుడు, అక్కడకూడా "సాహిత్యం'' అందచేయడం జరిగింది. ఆయా స్థలాల్లో అజ్ఞాత కార్యకర్తలు ప్రతినిధులను కలిశారు.

నవంబరు 4 న హైదరాబాదులో ఈ విదేశీ ప్రతినిధులు సాలార్ జంగ్ మ్యూజియం దర్శించడానికి వెళ్ళారు. అప్పుడు తామూ దర్శించ వచ్చామనే నెపంతో అజ్ఞాత ఉద్యమ కార్యకర్తలైన నరసింహరెడ్డి బృందం ఒడుపుతో ఆ ప్రతినిధులు మ్యూజియం లోపలి భాగపు గదుల లోకి ప్రవేశించగనే అజ్ఞాత సాహిత్యాన్ని వారికి అందచేశారు. ఇలా ఒక్కొక్కచోట ఒక్కొక్క ఉపాయంతో పని జరిగింది.

రెండోది, ఈ విదేశీ ప్రతినిధులకు 'ఎర్రకోట'వద్ద స్వాగత సమారోహం జరిగినప్పటి విషయం. ఆ సమారోహం తంతు ప్రారంభం

కాగానే, వేదికకు ఎదురుగా సంఘర్ష సమితి ఇరవైమంది కార్యకర్తలు సత్యాగ్రహం చేశారు. ఒక ఇరవై ముప్ఫై నిముషాలు ఆశ్చర్యం, విభ్రమం కల్గించిన దృశ్యమది. చీమలు దోమలుకూడా అనుమతిలేందే లోపలికి ప్రవేశించడానికి వీలులేకుండా 'పకడ్బందీ' ప్రయత్నాలు జరిగాయని ప్రభుత్వం అనుకున్నది. కాని వారి ప్రయత్నాలు భంగమయ్యాయి.

ఇలాగే దేశంలోని ప్రముఖ పౌరులకు, సైన్యాధికారులకు, పోలీసులకు, శాసన సభల ప్రతినిధులకు ఈ సాహిత్యం తప్పని సరిగా అందుతూండేది.

ఈ సాహిత్యం చదవడం, ప్రభుత్వ ప్రచారంతో పోల్చి చూచుకోడం – ప్రజలకు ఒక రాజకీయ శిక్షణగా జరుగుతూండేది.

దానికి ప్రత్యక్షంగా సత్యాగ్రహులు కన్పిస్తుండేవి. సత్యాగ్రహులలో పాల్గొన్న ప్రముఖులు కన్పిస్తుండేవారు. దేశంలో ఇలాంటి నిరంకుశత్వం ఉన్నప్పుడు ఒక లక్షమంది సత్యాగ్రహం చేయడమంటే సత్యాగ్రహులను పెట్టిన బాధలను అజ్ఞాత సాహిత్యంద్వారా చదవడమంటే దేశం రానున్న నిర్ణాయక ఘడియల్లో తనను సిద్ధం చేసుకుంటున్నదన్నమాట.

అప్పటికే దాదాపు 50,000 మంది డి. ఐ. ఆర్., మీసాల క్రింద జైళ్లలో ఉన్నారు. సత్యాగ్రహంలో ఒక లక్ష ఇరవై ఐదు వేలమంది పాల్గొన్నారు. అయినా వార్తలు పత్రికల్లో కన్పించవు. ప్రజలు నిత్యమూ చూస్తున్న సత్యాగ్రహుల వార్తలను పత్రికలు ప్రచురించక పోవడంతో, అజ్ఞాత పత్రికలు సత్యాన్ని ప్రజల కందించే దివ్య దీపిక లైనాయి.

దాదాపు రెండు లక్షల మంది జైళ్ళలో మగ్గుతూన్నారంటే దాని ప్రభావం ఎందరిమీద పడుతుందో ఊహించవచ్చు. లక్ష ఇరవై వేలమంది సత్యాగ్రహం చేశారంటే వారి వెనుక ఎందరో ఉండిఉండాలి. అజ్ఞాతంగా ఒక్కొక్క సత్యాగ్రహి వెనుక పదిమందైనా కార్యకర్తలు పనిచేయని పక్షంలో ఇంత విస్తృతమైన, వ్యాపకమైన వివిధ రంగాల కార్యక్రమం నడపక పోయేది. అలా చూస్తే దేశంలో ఇరవై ముప్పై లక్షల మంది కార్యకర్తలు పనిచేశారన్నమాట! ఇరవై ముప్పై లక్షల మంది కార్యకర్తలు - ప్రమాదాన్ని ఎదుర్కోడానికి సిద్ధులై ప్రయత్నించారంటే అజ్ఞాత కార్యకర్తల వాణి, సందేశం ఎన్ని ద్వారాలను తట్టి ఉంటుంది ? ఎందరి హృదయాలను కదిలించి ఉంటుంది ? అలా మేల్కొన్న మనుషులు - స్పందించిన హృదయాలతో ఎంత ఆవేశంగానూ, అద్భుతంగానూ - పనిచేసి ఉంటారు.

ఇది ఒక భావ విప్లవం. సత్యాగ్రహపు మారిన ప్రయోగ విధానాలతో సాధించిన మార్పు. ఈ సంఘర్ష సమితి ఉద్యమంలో ప్రతిపక్షాల వారందరూ — జార్జి ఫెర్నాండజ్ వర్గం తప్ప - పాల్గొన్నారు.

"జార్జి ఫెర్నాండజ్ ధోరణి కొద్దిగా వేరుగా ఉండేది. 'లోక సంఘర్ష సమితి' ఉద్యమం నడిపే పద్ధతిపై బహుశః అతనికి విశ్వాసం లేదు. అజ్ఞాత ఉద్యమ కాలంలో అతనితో లోక సంఘర్ష సమితి కేంద్ర నాయకులు ముగ్గురూ సుదీర్ఘంగా సంప్రదింపులు జరిపారు. లక్ష్యం విషయంలో అభిప్రాయ భేదం లేకుండినా, దారులు వేర్వేరు. అతడు కొంచెం తీవ్ర ధోరణిని ప్రతిపాదించేవాడు. తీవ్ర ధోరణి అంటే 'హత్య - రక్తపాతం' అని మాత్రం కాదు. హత్య - రక్తపాతం కాని -

వేరే విధంగా ప్రభుత్వ యంత్రాంగాన్ని నిరుద్ధం చేయడానికి గల తేడా తెలిసిన వివేకశీలి అతడు."[1]

ప్రజాస్వామ్య బీజాలను - మన దేశానికి సహజంగా సరిపోయే విధానంగా విశ్వాసముంచున్న వ్యక్తులు - సంస్థలూ సాధ్య సాధనాల సమన్వయాన్ని కోరినమాట వాస్తవమే. కాని స్వాతంత్ర్య పోరాటంలో ఏ మార్గమైనా - అవసరాలనుబట్టి వరించక తప్పని పరిస్థితి ఏర్పడ వచ్చు. కాని ఏ ప్రయత్నానికైనా - ఆ ప్రయత్న సాఫల్యానికి అవసర మైన అనుచర బలం, వనరుల సమీకరణ శక్తి, చూచుకోకుండా జరిగే ప్రయత్నాలు విఫలం కావడమే కాకుండా - ఉద్యమ శక్తిని - ఉద్య మించాలనే ఆకాంక్షను సన్నగిల్ల చేస్తుంది. జార్జి ఫెర్నాండజ్ ప్రయ త్నాన్ని గురించి ఈ దృష్టితో మాత్రమే చూడగలుగుతాం.

1. ఆపాత్కాల్ మే గుప్త క్రాంతి - దీనానాథ్ మిశ్రా - 18 వ పేజీ.

# 12

# భవిష్యత్తుకు ప్రయత్నం

'తెల్లవారే ముందు
చీకటి మరింత దట్టమవుతుంది.'

అత్యవసర పరిస్థితి ప్రకటించిన తర్వాత ఇందిరాగాంధీ "రెక్కలుకత్తిరించిన ప్రజాస్వామ్య" సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. దానికి ఆమె—ఆమె అనుచరులు రకరకాల అన్వయాలు, వ్యాఖ్యలు ఇచ్చారు. క్రమంగా పౌరహక్కు లన్నిటిని కుదించి, కత్తిరించి, అంగ వికలత్వాన్ని తెచ్చారు.

ఈ కుదింపులు-కత్తిరింపులు ఎమర్జెన్సీ విధించిన తరువాత వచ్చినా, ఈ అధికార దుర్వినియోగం 1971 నుండే ప్రారంభమైంది. ఈ అధికారాలను న్యాయస్థానాలు చెల్లవని ప్రకటిస్తే, న్యాయస్థానాలు ప్రగతి నిరోధకాలని, వాటి రెక్కలు కత్తిరించడం జరిగింది.

అలా దేశము, ప్రజాస్వామ్యము, పౌరుడు అవిటితనం ఆవేశించి చచ్చుబడ్డ పరిస్థితిని తెచ్చి, ప్రతిపక్షాలను కూడ అణచడానికి-ముఖ్యంగా శక్తిగల సంస్థలను తన మార్గంనుండి తొలిగించడానికి, తన ఏకచ్ఛత్రాధిపత్యాన్ని చిరకాలం స్థాపించుకోవడానికి అత్యవసర పరిస్థితి విధించింది. అత్యవసర పరిస్థితికి ముందే ప్రజలు నిస్సహాయులవుతూ వచ్చారు. పార్లమెంటులో ఉండడం, ఉండకపోవడము ఒకటేనని,

విసిగి అటల్ బిహారీ వాజపేయి పార్లమెంటు సభ్యత్వానికి రాజీనామా ఇవ్వడానికి పూనుకొన్నారు.

అలాంటి స్థితిలో-మార్పురాదు-ఈ అన్యాయాలు ఆగవు; తల దించక పోతే లాభంలేదు-అనే భావన ప్రబలిన రోజుల్లో ఎమర్జెన్సీని పురస్కరించుకొని వరుసగా వచ్చిన భయానిక పరిస్థితులను ఎదిరించే మనస్తత్వాన్ని కాపాడడం - పెంచడం-వ్యాపింపచేసి అదొక ప్రబల ప్రవాహంగా రూపొందించడం - అనే దశలలో ఉద్యమం నడవాలని లోక సంఘర్ష సమితిపేర సంస్థలన్నీ నిర్ణయించుకున్నాక, దాన్ని సముచితంగా సాధించడానికి ప్రయత్నం జరిగింది.

25 జూన్ న లోక సంఘర్ష సమితి నాయకులు 29 నుండి సత్యాగ్రహం జరగాలని నిర్ణయించి, రామలీలా మైదానంలో జరిగిన సభలో ప్రజలకు పిలుపు నిచ్చారు. ఆ సత్యాగ్రహం జరిగింది. నవంబరు 14 నుండి దేశవ్యాప్తంగా సత్యాగ్రహం జరగాలని నిశ్చయించారు. అది కూడా ఆశాతీతంగా నేరవేరింది. సెన్సారుషిప్పును వమ్ముచేయాలనుకున్నారు. అదీ అజ్ఞాత సాహిత్యంద్వారా ఎంతో సమర్థవంతంగా నడిచింది. క్రమంగా ఈ కార్యక్రమాలతో భయం తొలగుతూ, ఎమర్జెన్సీని గురించి, అధిక ధరలనుగురించి, ప్రభుత్వంలో ఎమర్జెన్సీలో పెరిగిపోయిన అవినీతినిగురించి, అధికార దుర్వినియోగాన్ని గురించి బహిరంగంగా, మాట్లాడుకునే వాతావరణం వ్యాపించనారంభించింది. ఎమర్జెన్సీని వమ్ముచేయడం, ఎమర్జెన్సీ ప్రభావాన్ని, భయాన్ని వమ్ముచేయడం-ఒక పెద్ద ఫలితం. ఆ తరువాత వచ్చిన పౌరహక్కుల సంరక్షణ సంఘ సమావేశాలకుగాని, రాజ్యాంగ సవరణలను వ్యతిరేకించే ఉద్యమానికిగాని ప్రజల సహకారం పూర్తిగా

లభించింది. నియంత భయంతొలగి, నియంతపట్ల సాత్వికమైన ఆగ్రహం మొదలైంది.

దీనిని వ్యాపకంగా రూపొందించి, మరుమట్టు ప్రజల ఉద్యమాన్ని ప్రబల ఉద్యమంగా రూపొందించడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

బొంబాయిలో సత్యాగ్రహాల తరువాత లోక సంఘర్ష సమితి సమావేశాలు జరిగాయి. అప్పుడే ఆర్. యస్. యస్. కేంద్ర కార్యాచరణ దళం కూడా అక్కడ కలిసింది. ఆ తరువాత అఖిలభారత నాయకులు దేశమంతా పర్యటించారు.

ఫిబ్రవరి '76 లో జరిగిన ఈ సమావేశాలకు వెళ్ళినప్పుడే లోక సంఘర్ష సమితి కార్యాచరణ కార్యదర్శి రవీంద్రవర్మ పోలీసులకు చిక్కిపోయినాడు. ఆయన తర్వాత దిగ్విజయ నారాయణసింగ్ పేరిట కార్యకలపాలు జరగుతుండేవి. అజ్ఞాతంగా-భారతీయ మజ్దూర్ సంఘ్ నాయకులు - దత్తోపంత్ ఠేంగ్డే కార్యాచరణ భాగాన్ని నిర్వహిస్తుండేవారు. మరికొందరు కూడా ఠేంగ్డేకి సహకరించారు.

ఈ మూడవదశలో - ఎదురుదెబ్బ తీసేముందు తీసుకోవలసిన జాగ్రత్తలు కూడా ఆరంభమైనాయి.

ఒక మూల ప్రజలలో ప్రతిపక్షాలు కలవాలనే తీవ్రమైన కోరిక మొదలైంది. మరోమూల రాజ్యాంగంలో 19 వ సూత్రాన్ని స్తంభింప చేసి, మీసా చట్టాన్ని మరోమారు సవరించి, కొన్ని ముఖ్యమైన చట్టాలను కోర్టుల పరిధినుండి తప్పించి, నియంతృత్వాధికారాలను గట్టి పరచుకోడానికి ప్రయత్నంతోపాటు రాజ్యాంగాన్నే మార్చి, ఏకవ్యక్తి పరిపాలనకు దోహదంచేసే విధంగా రూపొందించడానికి కృషి ప్రారంభ

మైంది. ఈ రెండు పక్షాలు తీవ్రమైన ప్రయత్నాలు సాగించాయి. ప్రతి పక్షాలు వివిధ రంగాలలలోని ప్రముఖులను ఉద్యమానికి అనుకూలంగా త్రిప్పుకోడానికి చేసిన కృషివల్ల, వినోబా ప్రమేయంతో జనవరిలో పవనార్ ఆశ్రమంలో 'ఆచార్యుల సమ్మేళనం' జరగడం ఒక ప్రముఖ మైన ఘట్టం.

వినోబా గాంధీజీకి ఆధ్యాత్మిక వారసుడని ప్రజల్లో ఒక నమ్మకం ఉంది. ఎమర్జెన్సీని 'అనుశాసన పర్వం'గా ఆయన సమర్థించాడని, నియంత తరఫున విపరీతంగా ప్రచారం జరిగింది. దేశంలో ఇన్ని దారుణాలు జరిగినా కదలని వ్యక్తి, జోక్యం కలుగచేసుకోడం, ఆయన పిలుపును పురస్కరించుకొని మేధావులు '76 జనవరి 16, 17, 18 తేదీలలో పవనార్ ఆశ్రమంలో సమావేశం కావడం జరిగింది. తటస్థ భాషలోనైనా ఎమర్జెన్సీని వెంటనే తొలగించి, ప్రజాసామ్యజీవనాన్ని నెలకొల్పాలని ఈ సమావేశంలో ఆచార్యులు ప్రకటించారు. ఈ ఆచార్య సమ్మేళనం స్పష్టంగా తన తీర్మానాలలో ఈ క్రింది విధంగా సూచించింది.

1. అత్యవసర పరిస్థితి అంతం కావాలి.
2. రాజకీయ ఖైదీలుగా ఉన్న సామాజిక, రాజకీయ కార్య కర్తలు విడుదల కావాలి.
3. పౌర స్వాతంత్ర్యాలు, ప్రాథమిక హక్కులు పునరుద్ధరింపబడాలి.
4. ప్రెస్ సెన్సార్‌షిప్ రద్దు కావాలి.
5. ప్రజాస్వామ్య విలువలు, సంస్థలు పరిరక్షింపబడాలి.

6. రాజ్యాంగ సంస్కరణలపైన ఎన్నికల సంస్కరణలపైన పెద్ద ఎత్తున చర్చలు జరగాలి.

7. త్వరలో ఎన్నికలు పెట్టబడాలి మున్నగునవి. దేశంలోని అగ్రగాములైన మేధావులు ఈ విధంగా ప్రకటించడం ప్రజాస్వామ్య వాదులకొక విజయంగా ప్రజలు భావించారు.

ఇందిరాగాంధీ వినోబా ఏర్పాటుచేసిన సమ్మేళనాన్ని, సమావేశమైన పెద్దలను దురుసుభాషలో తూస్కరించి వీళ్ళకు ప్రజాప్రాతినిధ్యం లేదని విమర్శించడంతో ప్రపంచ మేధావులకు కూడా నియంత దురహంకారం ఏ మేరకు ప్రాకిందో తెలిసి పోయింది. ఇందిరాగాంధీ మొండివైఖరిని మార్చగలగడం మామూలు విషయం కాదనేది స్పష్టమైంది.

ప్రతిపక్షాలు ఒకటై పోరాటాన్ని విస్తృత ప్రాతిపదిక మీద నడపడానికి, అన్ని పార్టీలు కలిసి ఒకే పార్టీగా రూపొందాల్సిన అవసరాన్ని అందరూ అంగీకరించారు. కాని దురదృష్టవశాత్తూ పూర్వం ఎర్పరచుకొన్న వికృతభావాలను వదలుకోడానికి, దేశ భవిష్యత్తు దృష్ట్యా తమతమ వ్యక్తిగతమైన స్వార్థాలను తగ్గించుకొని, ఏకోన్ముఖంగా ప్రయత్నించడానికి కొందరు నాయకులలో సంసిద్ధత ఏర్పడడం కష్టమైంది.

సత్యాగ్రహాల తర్వాత ఒకవైపు ఈ రాజకీయ సామరస్య సాధనకొరకు, రెండోవైపు రాజ్యాంగ సవరణలను ఎదిరించడానికి ప్రబలమైన ప్రయత్నాలు ప్రారంభమైనాయి.

ఎన్నికలు ఎప్పుడువస్తవో ఊహించేస్థితి కూడా లేదు. సత్యాగ్రహంవల్ల, అజ్ఞాత ప్రచార యంత్రాంగంవల్ల దేశంలో ఏర్పడ్డ అను

కూల పరిస్థితులను వినియోగించుకొని రానున్న ఏ పరిస్థితినైనా ఎదు ర్కొని నిలోచ్చడానికి ఆర్. యస్. యస్. విస్తృతమైన పథకాన్ని రూపొందించి, 7-5-76 న దేశంలోని సమస్త కేంద్రాలకు ఒక సూచనా పత్రాన్ని ఆలోచనార్థం పంపింది.

"ప్రస్తుతం మన (ఆర్. యస్. యస్.) మీద నిషేధం ఉన్నది. ప్రభుత్వం ఈ చర్యను వేరుగా, స్వతంత్రంగా తీసుకున్న దనడానికి వీలులేదు. ప్రజాస్వామ్య మూల్యాలను, ప్రజాస్వామిక ప్రతిపక్షాలను మట్టుబెట్టి భారతదేశంలో నియంతృత్వాన్ని నెలకొల్పాలనే కుట్రలో ఒక భాగంగా మాత్రమే ఆర్.యస్.యస్. ను నిషేధించడం జరిగింది. ప్రతిపక్షాలమీధ, వ్యక్తులమీద నియంతృత్వపు చర్యలెన్నో తీసుకొన్న తర్వాత, 'భారతీయ పరంపరను అనుసరించి ప్రజాస్వామ్యంపట్ల దృఢ విశ్వాసంగల' దేశవ్యాప్తమైన రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని నిర్మూలించందే, ప్రజాస్వామ్యాన్ని మట్టుపెట్టడం సాధ్యంకాదని గ్రహించి, ఆర్. యస్. యస్. మీద ఈ గొడ్డలి పెట్టు పెట్టింది...." అని సమీక్షించి, ప్రజాస్వామ్య వ్యవస్థను పునరుద్ధరించే ప్రయత్నం మొదట ప్రారంభం కావాలని, దానికై ప్రయత్నం విశాలమైన ప్రాతి పదిక మీద జరగాలని సూచించింది.

జాతీయ ప్రతిపక్షాల కలయిక అవసరమైనదని పరామర్శిస్తూ "ప్రజాస్వామ్యాన్ని దృఢంగానమ్మే భారతీయులందరూ జాతీయాభి వృద్ధికి-సాంఘిక-ఆర్థిక న్యాయాన్ని దేశంలో నెలకొల్పడానికి-దేశ హితాన్ని పురస్కరించుకొని ఒకే బలవత్తరమైన రాజకీయపార్టీగా ఏకం కావాలి-ఇది నేటి జాతీయావసరం. దీన్ని గుర్తించి జాతీయ పక్షాలు నేటివరకు తీసుకొన్న చర్యలన్నీ స్వాగతించదగ్గవే. అలాంటి పార్టీలన్నీ ఒకేపేరు - సమాన సాంఘిక, ఆర్థిక కార్యక్రమం-కలిసి

అభ్యర్థుల ఎంపిక - కలిసి పార్లమెంటు కార్యక్రమం మొదలగు వాటిని ఒకే వేదికద్వారా సాధించుకోడానికి అంగీకారం కుదుర్చుకోవాలి. దీనిలోంచి ఒక జాతీయ ప్రజాస్వామ్య పార్టీ-దృఢమైన పునాదులమీద వికసిస్తుంది. ఈ దృష్ట్యా జరుగుతూన్న ప్రయత్నాలు శ్లాఘించ తగ్గవి...ఎన్నికల దృష్ట్యా - అవి ఎప్పుడైనా రావచ్చు - ప్రయత్నాలు ప్రారంభం కావాలి..." అని హెచ్చరించింది.

దానిపై ఆ సూచనాపత్రంలో-"కనుక జాతీయపక్షాలన్నీ...కలిసి ఓటర్లలిస్టులను పరిశీలించాలి. నియోజకవర్గాలన్నిటిని అందరూ కలిసి పరిశీలించి, పరస్పర అంగీకారంతో ఆయా రాష్ట్రాల ఎన్నికల చిత్రాన్ని సిద్ధం చేసుకోవాలి''-అని సలహా ఇచ్చింది.

''విద్యార్థులకు, కార్మికులకు, కర్షకులకు మిగతావారికి సంబంధించిన రంగాలలో ఇదేవిధంగా చేయాలి. ఈ ధోరణితోటే జాతీయ ప్రజాస్వామ్య వాదులుకూడా ఎవరికివారు ఏ రంగానికి ఆ రంగం ఏకం కావడం సముచితంగా ఉంటుంది, లాభదాయకంగా కూడ ఉంటుంది.''-అని కూడా సూచించింది.

రానున్న పోరాట స్వరూపాన్ని విశదీకరిస్తూ సత్యాగ్రహ పర్వం పూర్తి అయింది. రెండోపర్వపు మొగసాలలో నిల్చున్నాం. సత్యాగ్రహంవల్ల మనమాశించిన ప్రభావం ప్రతిరంగంలోను కన్పించింది. ప్రజలలో భయం తొలగి పోయింది. ఈ దృష్ట్యా వెంటనే చతుస్సూత్ర కార్యక్రమాన్ని చేపట్టాలి.

1. దీర్ఘకాల పోరాటం కొరకు జన సమీకరణ అన్ని రంగాలలో చేయడం—

2. జన సమీకరణకు-ప్రజలలో చొచ్చుకుపోయే అవకాశాలను కల్పించగల సేవా పథకాలను-సహాయ కార్యక్రమాలను చేపట్టాలి.

3. ప్రభుత్వపు రోజువారీ చర్యలను-దుర్మార్గాలను ఎదిరించే నిత్య ఉద్యమాలను ఊహించి నడిపించాలి.

4. ప్రజా జాగరణకై వార్తలను ఎప్పటికప్పుడు సేకరించి-ప్రచురించి - విరివిగా పంచడం; కరపత్రాలద్వారా-అజ్ఞాత పత్రికలద్వారా-సమీక్షా పుస్తకాలద్వారా ప్రజలలో చైతన్యం కలుగ చేయడం జరగాలి.

ఈ వ్యూహంతో అన్ని క్షేత్రాలలోకి కార్యకర్తలు ప్రవేశించి, ప్రబోధం కలుగచేసి, ప్రజల మనస్సులో నియంతృత్వ వ్యతిరేక భావాన్ని, పోరాటానికి సంసిద్ధతనూ స్థిరంగా నెలకొల్పడం అవసరమని నిర్దేశించడం జరిగింది.

''ఇది మన వ్యూహం. దీన్ని సాధిస్తే గెలుపుకు తలుపులు తప్పక తెరచుకుంటాయి. ఈ పోరాటం దీర్ఘకాలం సాగుతుందని మనకు తెలుసు. కాని సంఘకార్యం ఈశ్వరీయమైనదని, దోషం లేనిదని, ఎలాంటి పరిస్థితులున్నా, ధైర్యంతో సక్రమంగా పనిచేయగల 'దేవ దుర్లభు'లైన కార్యకర్తలు పరమ పవిత్ర భగవాధ్వజాన్నుండి ఆశీస్సులు పొందుతూ నిరంతరం పనిచేస్తూనే ఉన్నారనే విషయాలు కూడా మనకు తెలుసు. పరిస్థితి ఎంత వ్యతిరేకంగాఉన్నా సూచనల ననుసరించి పని జరిగితే విజయం తథ్యమని కూడా మనకు తెలుసు''నని ఉద్బోధించడం జరిగింది. ఈ సూచనమేరకు జైళ్ళలో బైటా సంప్రదింపులు జరిగి, ఎన్నికల తేదీ ప్రకటన కొరకు ప్రతిపక్షాల ఏకీకరణకు,

అభ్యర్థుల నిర్ణయానికి ఎదురు చూడకుండా మొత్తం దేశంలో ఎన్నికల వ్యూహాన్ని రచించి, దానిని కూడా సంఘటన చాతుర్యంతో పూర్తిగా అనుసరించి, అన్ని రంగాలలో పనిచేయడం ప్రారంభించారు.

నియంత కట్టుదిట్టాలన్నీ చేసుకొని, హఠాత్తుగా ఎన్నికలు ప్రకటించి, ప్రజల ఆమోదాన్ని తిరిగి పొందవచ్చుననే భావన ఆర్. యస్. యస్. నాయకులకు మొదటినుండి ఉన్నది. ప్రజాస్వామ్యంతో ప్రజాస్వామ్యాన్ని పరాభవం చేయదలచుకున్న వాళ్ళ ఎత్తుగడలు అలాగే ఉంటాయి. రాజకీయ పార్టీలు ఇంకా కలవకుండా ఊగిసలాడుతున్నాయి. అవి కలవకముందే ఎన్నికలు ప్రకటిస్తే ప్రజాస్వామ్యానికి లాభం ఉండదు. ప్రభుత్వ యంత్రాంగాన్ని, పదవిని, అధికారాన్ని, వనరులనూ వినియోగించి మరొకసారి ఎన్నికల తతంగం రచించి, 'గెలుపునాది' అనిపించుకొని బైట పడవచ్చునని ఇందిరాగాంధీ భావించే పక్షంలో ఆమెకు ఓటమిని బహూకరించే ప్రయత్నం పెద్ద పెట్టున అప్పటినుండే అజ్ఞాతంగా ఆర్. యస్. యస్. ప్రారంభించింది.

విద్యార్థులకు, రైతులకు, కార్మికులకు, మహిళలకు వేర్వేరు కార్యక్రమాలను ఊహించి, పూర్తి సమయమిచ్చి పనిచేసే కార్యకర్తలను నియమించి పని ప్రారంభించింది.

రాజకీయ కార్యకలాపాలకు ప్రస్తుతం జాగృతి సంపాదకులు వేణుగోపాలరెడ్డి. వివిధ పక్షాలనాయకులు సంధానానికి తోడ్పడ్డారు. ఈ యనతో పి. వి. చలపతిరావు యం. యల్. సి., న్యాయవాది జగన్మోహనరెడ్డి ప్రభృతులు కృషి చేశారు. తేన్నేటి విశ్వనాథం, తుమ్మలచౌదరి ప్రభృతులు చక్కని సామరస్యంతో పార్టీలలో ఏకీభావం తీసుకు రావడానికి ప్రయత్నం చేశారు.

విద్యార్థులు విడిగానూ, విద్యార్థి పరిషత్ ఆధ్వర్యంలోనూ రాష్ట్రమంతటా ఎన్నో విధాల కార్యక్రమాలు నడిపారు. వీటిని పిల్లాట్ల వెంకటేశ్వర్లు, ఇంద్రసేనారెడ్డి నడపటం జరిగింది – వారు పట్టుబడిన తర్వాత జిల్లాలవారీ ఏర్పాటు జరిగింది.

రాష్ట్రంలో '76 వేసవి సెలవల్లో వందలాది విద్యార్థులు గ్రామ యాత్రలద్వారా జనజాగరణ చేశారు. నల్గురైదుగురు కలిసి కొన్ని గ్రామాలు ఎంపిక చేసుకొని బయిల్దేరేవారు. ఆ రోజు, ఆ వూళ్ళో క్రొత్తగా పరిచయం అయినవాళ్ళే... వీరి ధైర్యసాహసాలకు మెచ్చుకొని ఆ పూట వారి ఇంట భోజనంపెట్టి పంపేవాళ్ళు. ఆ వూళ్ళో నినాదాలు వ్రాయటానికి, కరపత్రాలు పంచటానికి ముందుకు వచ్చేవాళ్ళు – అనేకమంది. అనేక చోట్ల ఈ విద్యార్థుల్నే నాయకులుగా చేసి బహిరంగ సభలు, సమావేశాలు ఏర్పాటుచేశారు. ఇలా వందలాది గ్రామలో రెండునెలలపాటు ఉద్యమ నిర్మాణం జరిగింది.

రైతు ఉద్యమంలో కొన్ని జిల్లాలు చాలా ముందుకు అప్పటికే వెళ్ళాయి. శీలం జోగారెడ్డి, వడ్డే శోభనాద్రేశ్వరరావు, దామోదర్ రావు యం. యల్. ఎ., మల్లారెడ్డి మరికొందరు రైతు నాయకులు రైతులను సమీకరించి – మహాసభలు జరిపి ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

'76 జూన్ మొదటివారంలో నిజామాబాద్ జిల్లాలోని సిద్ధిరామేశ్వర దేవాలయంలో వందమంది యువకులు, కొందరు మహిళలు సమావేశమయ్యారు. సత్యనారాయణవ్రతం నెపంతో పోరాటపు భవిష్యత్తు కార్యక్రమాల యోజనకై ఒక రోజంతా చర్చించుకునే నిమిత్తం అందరూ అచట చేరారు. ఆ జిల్లా అజ్ఞాత ఉద్యమ నిర్వాహ

కుడు పాపిరెడ్డి, యువనేత ఇంద్రసేనారెడ్డి, రెండు జిల్లాల అజ్ఞాత ఉద్యమ సారధి దత్తాత్రేయులు అందరికీ యోజనలు అందిస్తున్నారు.

అంతలో ఒక వ్యక్తి భక్తిగా బావివద్ద స్నానంచేసి దేవాలయానికి ప్రదక్షిణాలు మొదలుపెట్టాడు. ఎంతసేపైనా ప్రదక్షిణాలు చేస్తాడేకాని గుళ్ళోకి పోడే! అనుమానం వచ్చింది. అతన్ని సి. ఐ. డి. పూర్ణచంద్ర రావుగా గుర్తు పట్టారు. ఇలాంటి భక్తులు ఇంకా ఎందరు వచ్చారో - అనిచూస్తే దేవాలయ ప్రాకార ముఖద్వారంవద్ద యస్. ఐ., సి. ఐ. లు మఫ్టీలో ఉన్నారు.

కార్యక్రమం సత్యనారాయణ కథగా మారింది. సి. ఐ. డి. లు గుర్తుపట్టలేని పాపిరెడ్డి వారి ముందునుండే వెళ్ళిపోయాడు. బహిర్భూమికి వెళ్తునట్లు చెంబుడు నీళ్ళు తీసుకొని ముఖద్వారంగుండా దేవాలయం వెనుకకు చేరాడు ఇంద్రసేన్. అందరూ గుర్తుపట్టే దత్తాత్రేయ అప్పటికే 15 అడుగుల గోడదూకి, మందిరం వెనక్కుచేరిన ఇంద్రసేన్‌తో కలిసి, దేవాలయం వెనుకనుంచే అడవిలో పడి నడక సాగించారు.

13 మైళ్ళు నడిచి ప్రక్క జిల్లా చేరారు.

ఇలా అడుగడుగునా ఇబ్బందులు ఎదుర్కొంటూ ప్రజలలో చైతన్యం కల్గించటానికి నిరంతర ప్రయత్నాలు సాగాయి.

# 13

# ప్రతిపక్షాలొక్కటైతే

'కలసి ఉంటే
కలదు సుఖం.'

1952 నుండే జాతీయ ప్రతి పక్షాలను ఏకం చేయడానికి ప్రయత్నం శ్యాంప్రసాద్ ముఖర్జీ మొదలు పెట్టారు. సోషలిస్టుభావాలు కలవారిని ఏకం చేయడానికి వామపక్ష సమైక్యతకుకూడా కృషి సాగింది. కాని కమ్యూనిస్టుల వివిధవర్గాలు ఈ రెండు వర్గాల ప్రయత్నానికీ దూరంగా ఉంటూ – కలిసి అప్పుడప్పుడూ పనిచేసినా - వేరుగానే తమ మనుగడను నిల్పుకొంటూ వచ్చాయి.

1969 లో కాంగ్రెసులో చీలికలు ఏర్పడ్డనాటి నుండి ఈ ప్రయత్నానికి ఒక ఊపు లభించింది. కాని అది 'మధ్యేమార్గం' గా నడిచిందే గాని, ఒక నిర్ణయానికి దారి చూపలేదు.

గుజరాత్ ఎన్నికలలో 'జనతామోర్చ' గా ఏర్పడటం ఈ ప్రయత్నానికి తొలి పలుకు. క్రమంగా గుజరాత్, బీహరు ఉద్యమాలలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా - ఒక సమాన వేదిక నిర్మాణమవుతూ వచ్చింది. జూన్ 24న జైప్రకాశ్ ప్రోద్బలంతో 4 పార్టీల ప్రముఖులు ఎమర్జెన్సీకి ముందే ఒకసారి కలుసుకున్నారు. కాని అప్పుడు జనసంఘ,

సోషలిస్టుపార్టీలు 'పార్టీల సమాఖ్య'ను ప్రతిపాదించాయి. బి.యల్.డి. - సంస్థా కాంగ్రెసులో విలీనం కావడం మంచిదని అభిప్రాయం వెలిబుచ్చింది. ఇందిర ఎమర్జెన్సీ పెట్టడంతో ఈ ప్రయత్నం కొంత వేగాన్ని పుంజుకున్నది. ఈ విషయంలో జయ ప్రకాశ్ నారాయణ కృషి అనల్పమైనది. ఆయన పట్టుదలవల్ల - ఆయన ఒత్తిడివల్ల - భిన్న అభిప్రాయాలతో సతమత మవుతూ వచ్చిన పార్టీలు జైల్లో కూడబలుక్కునే అవకాశాన్ని - బయిట సంప్రదించుకొనే అవకాశాన్ని సంతరించుకొన్నాయి.

"మీరు బయిట కలవకపోతే, కటకటాల వెనుక కలువ వలసి వస్తుందని జూన్ 24 నాడే జె. పి. హెచ్చరించాడు.

ఈ యత్నానికి ప్రబలమైన కదలిక తిహార్ జైల్లో జరిగింది. 4 జనవరి 1976న 250 మంది డిటెన్యూలు జైల్లో సమావేశమైనారు. ఆ సమావేశంలో చరణ్‌సింగ్, ప్రకాశ్‌సింగ్ బాదల్, సుందర్‌సింగ్ భండారీ, జగన్నాథరావు జోషి, నానా దేశ్‌ముఖ్, కన్వర్‌లాల్‌గుప్త, సురేంద్ర మోహన్, యస్. యన్. త్యాగి మరికొందరు పాల్గొన్నారు. అదేరోజు కొందరు ప్రముఖులు కలిసి కమ్యూనిస్టేతర ప్రతి పక్షాల కలయికకు ప్రయత్నంగా తొలి సంప్రదింపులు జరిపారు. బి.యల్.డి. తరపున చరణ్‌సింగ్, జనసంఘ పక్షాన సుందరసింగ్ భండారి, అకాలీదళ్ తరపున బాదల్, సోషలిస్టుల పక్షాన సురేంద్రమోహన్, సంస్థా కాంగ్రెస్ తరపున యస్.యన్. త్యాగి ప్రాతినిధ్యం వహించారు. రొహతక్, అంబాలా జైళ్ళలో అశోక్ మెహతా, పిలూ మోడి, సికిందర్ భక్త్, రాజనారాయణలు ఉన్నారు. వారికి ఈ వార్త పంపించారు. అలాగే బైట చికిత్స నిమిత్తం ఉన్న అటల్ బిహారీ వాజ్‌పేయి మరి కొందరు నాయకులకుకూడా ఈ సంప్రదింపుల వారలు పంపి అభి

ప్రాయ సేకరణ ప్రారంభం చేశారు. అలాగే బెంగుళూరు మొదలైన జైళ్లకు కూడా వార్తల నందీయడం, అభిప్రాయం పొందడం జరిగింది.

జనవరి 1976 లో ప్రారంభమైన మంతనాలలో జనసంఘ, బి. యల్. డి. లు అన్ని పార్టీలు కలిసి ఒకే పార్టీగా రూపొందాలని కోరితే ; సంస్థా కాంగ్రెస్, సోషలిస్టు పార్టీలు సమాఖ్యగా రూపొందాలన్నాయి. అదేగాక ఆర్. యస్. యస్, విద్యార్థి పరిషత్, భారతీయ మజ్దూర్ సంఘ్ మొదలైన సంస్థలుకూడా తమను రద్దుచేసుకొని కొత్త పార్టీలో చేరాలని ప్రతిపాదించారు. ఆర్. యస్. యస్. రాజకీయ పార్టీ కాదు. ఐనా సోషలిస్టులలో కొందరికి, బి. యల్. డి. నాయకులలో కొందరికి ఒక అనుమానం వచ్చింది. అదేమంటే, అన్ని పార్టీలు కలిసి ఒకే పార్టీగా ఏర్పడ్డ తర్వాత కూడా ఆర్. యస్. యస్. విడిగా ఉంటే కొత్తపార్టీలోని పూర్వ జనసంఘ సభ్యులకు మద్దతునిచ్చి కొత్త పార్టీని ఆక్రమించు కుంటుందేమోనని; మాజీ జన సంఘీయులకు విభక్త విశ్వాసాలు ఉంటయేమోనని-. ఈ భయానికి కారణం సూక్ష్మంగా పరిశీలిస్తే వ్యక్తిగతమైందిగా కనిపిస్తుందేకాని సిద్ధాంతపరమైందిగా కన్పించదు. ఆర్. యస్. యస్. ను జాతీయ సాంస్కృతిక సంస్థగా గుర్తించి విశ్వసించిన వారెవరూ ఈ అనుమానానికి లోనుకారు.

ఆర్. యస్. యస్. కు రాజకీయాలతో సంబంధంలేదు. 1948 వరకు ఈ సంస్థ సభ్యులు ఎందరో కాంగ్రెసులో ఉంటూ ఉండేవారు. 1949 లో కాబోలు - నెహ్రూ గారు విదేశ పర్యటనలో ఉన్నప్పుడు కాంగ్రెసు వర్కింగు కమెటీ ఆర్. యస్. యస్. సభ్యులు కాంగ్రెసులో చేరవచ్చునని తీర్మానించింది. అప్పుడు పటేల్, పంత్, పట్టాభి వగైరా ఎందరో మహారథులు ఉన్నారు. నెహ్రూ తిరిగివచ్చిన తరువాత ఆ

తీర్మానాన్ని మార్పించి - ఆర్. యస్. యస్. వారు ఆ సంస్థ సభ్యత్వాన్ని వదలుకొని, కాంగ్రెసులో చేరవచ్చని సవరణ చేయించారు. ముందు చేసిన తీర్మానాన్ని - ఆ తరువాత సవరణను చేసుకున్నది కాంగ్రెస్ వారే. సంఘ శక్తిని గుర్తించిన వారికి, వారి సహకారం పొందాలని ఉండేది. కొందరికి ఆ నాటి నుండే భయం కూడా ఉండేది. భయం ఉన్నచోట మతిస్థిమితత్వం సహజంగా ఉండదు; అపస్మారపు మాటలు వస్తాయంటారు వైద్యశాస్త్రజ్ఞులు - మానసిక శాస్త్రవేత్తలు.

అలాగే ఇప్పుడూ జరిగింది.

దేశంలో రాజకీయాలకు దూరంగా ఉండి హిందూ సమాజంలో వ్యాపించిన చీలికలను, విబేధాలను తొలగించి సమాజాన్ని సంఘటితం చేయడం అవసరమని ఆర్.యస్.యస్. భావించింది. మనరాజకీయాలను మొదటినుండీ కలుషితం చేస్తున్నవి, కుల-ప్రాంత-భాషా వివాదాలు;- వ్యక్తిగత స్వార్థాలు - అవినీతి విధానాలు - ప్రతిదీ ప్రభుత్వమే చేయాలనే బలహీన మనస్తత్వాలు. ఈ రోగాలను తొలగించడానికి ఉపన్యాసాలు చాలవని ఆర్. యస్. యస్. గుర్తించింది. రాజకీయ పార్టీలలో ప్రాతినిధ్యంగాని - అభ్యర్థిగా నిలవడంగాని - కులాల బలాల నిష్పత్తుల నాశ్రయించి జరుగుతున్నది. కాంగ్రెసు-మైనారిటీలను సమాజం నుండి వేరుచేసి, విభజించి పాలిస్తున్నది. అదే మిగతా పార్టీలకు గుణపాఠమైంది. పోగా - పార్టీలు స్పష్టంగా విధులను, కర్తవ్యాలను చెప్పలేవు. తప్పక ప్రజలకు ఇతోధికంగా మేలుచేస్తామని పలురకాల వాగ్దానాలు చేస్తూ ఉంటవి. ఆశలు చూపుతుంటవి. దానివల్ల సమాజం పట్ల వ్యక్తికున్న కర్తవ్యాన్ని సరిగా బోధించలేవు. ప్రజలకు "ఎవరెక్కువ సదుపాయాలు కలుగచేస్తారో వారే పెండ్లి కొడుకు"లన్న ధోరణితో సమాజ సంఘటన నిర్మాణంకాదు. త్యాగ - సేవా భావాలు అధికార

రాజకీయాలకు అతీతమైన గుణాలు. కనుకనే ఆర్. యస్. యస్. తన కార్యక్రమానికి అనుగుణంగా రాజకీయాలనుండి వేరుగానే ఉంటూ వచ్చింది అది ఒకరు చెప్పినందున - అలా ఉండాలని ఆదేశించినందున కాదు. ఆర్. యస్. యస్. రాజకీయాలలో ప్రవేశిస్తే ఆపగలిగే వెవరు? ఎవరికా అధికారం ఉన్నది? ఈ ప్రాతిపదికను కొందరు అర్థంచేసుకో నిరాకరిస్తే, ఆర్. యస్. యస్. వారిపట్ల జాలి ప్రకటిస్తుంది అంతే.

ఆర్. యస్. యస్. నియమావళి ననుసరించి, ఆ సంస్థ సభ్యులు ఏ సంస్థలో నైనా చేరే అవకాశమున్నది. దేశంలో జాతీయ విపత్తులు వచ్చినప్పుడల్లా స్వయంసేవకులు ప్రభుత్వ పార్టీ అయిన కాంగ్రెసుకు అండగా నిలిచారు. అలా అంటే అది పార్టీకి అండగా నిలవడమా? శ్రీ గురూజీ 'వయం పంచాధికం శతమ్' అంటూండేవారు. దేశంనెత్తిన విపత్తు విరుచుకు పడుతూంటే - మన పరస్పర విభేదాలు మరచి ఒకటై నిల్చోవాలి. అప్పుడందరం ఒకటే - అలాంటి విపత్తే ఇందిరా గాంధీ అధికారదాహం - నియంతృత్వ విధానం వల్ల వచ్చింది. అదొక జాతీయ విపత్తు. స్వయంసేవకులు - సంఘ సిద్ధాంతంతో ప్రేరితులైనవారు - వ్యక్తిగతంగా జె. పి. రంగంలోకి రాక ముందు నుండే గుజరాత్ నవ నిర్మాణ సమితిలోను - బీహార్ ఛాత్ర సంఘర్ష సమితిలోను ప్రవేశించి, ఉద్యమానికి బలం కూర్చారు. జె. పి. గాని మరెవరోగాని రమ్మంటే వారు రాలేదు. జె. పి. వచ్చిం తర్వాత ఆ కృషి అలా సాగుతూనే వచ్చింది. ఆర్. యస్. యస్., జె. పి. ఉద్యమాన్ని బలపరచిందనడం కంటే - దేశానికి తటస్థించిన విపద్ఘడియలో - ప్రజాస్వామ్య శక్తులకు ఆర్. యస్. యస్. స్వయంసేవకులు - క్రియాశీల పౌరులుగా - చైతన్యమూర్తులుగా - బాసటగా నిల్చారనడం సరిగా ఉంటుంది. కనుక జనతాలో ఆర్. యస్. యస్. చేరాలనడం ఒక విధంగా వత్తిడి

రాజకీయాలకు పూనుకోవడమే. మరి అలా సోషలిస్టులు మఱికొందరు ఎందుకు అంటున్నారు ? ఒకే కారణం కన్పిస్తుంది. ఆర్.యస్.యస్. జనతాలో కలిస్తే, పార్టీ క్రమశిక్షణపేర - సిద్ధంగా ఉన్న శక్తిని ఊదరగొట్టి తమ కొరకు ఉపయోగించుకో వచ్చుననే భావమే. "నవకం తేలుతూ - అన్నిరకాల యోగ్యుడైన - యువకుణ్ణి వరించటానికి ప్రతి యువతీ ఇష్టపడుతుంది'' అని దక్షిణాంచల సంఘ ప్రచారక్ యాదవరావ్ అన్నారు.

''విభక్త విశ్వాసాలు'' (divided loyalties) అనే వినాదం మరొకటి. జనసంఘంలోని ఆర్. యస్. యస్. వారికి అటు సంఘం మీద - ఇటు జనసంఘం మీద చలించని విశ్వాసం ఎలా ఏర్పడు తుంది ? వారు ''ఇద్దరు తల్లుల ముద్దుల కొడుకులు'' అవుతారేమోనని భయం. ఈ భయం కూడా వికృతం వ్యాపించిన మనస్సుల్లోంచి పుట్టేదే. వ్యక్తికి అనేక సంబంధాలు ఉంటాయి. ఒకే వ్యక్తికి తన కుటుంబం పట్ల శ్రద్ధా విశ్వాసాలు ఉంటాయి; రాజకీయేతరమైన ఏదైనా కార్యకలాపంలో భాగస్వామ్యమూ ఉండవచ్చు; ఒక రాజకీయ పార్టీలో సభ్యత్వమూ ఉండవచ్చు. వ్యక్తిని ముద్దగాచేసి-ఒకే మూసలో - ఒకే రూపంలో మలచే పద్ధతి కమ్యూనిస్టు విధానం - వ్యక్తి స్వేచ్ఛ కదొక సవాలు. ప్రజా స్వామ్య శత్రుతా భావం. పార్టీ ఆశయాలకు — క్రమ శిక్షణకు వ్యతిరేకం కాని అన్ని సాంఘిక, సాంస్కృతిక, కార్యకలాపాల్లోనూ పాల్గొనే అధికారం ప్రతివ్యక్తికీ ఉంటుంది. వ్యక్తులను అనుమానిస్తూ, పార్టీని చీల్చి - బలహీనపరచే ఈ మనస్తత్వం మంచిది కాదని, నిత్యశంకితులైన వారికి ఎంత చెప్పినా అర్థంకాదు. ''నిద్రిస్తున్న వాణ్ణి లేపి నచ్చ చెప్పవచ్చు. మేలుకొన్న వాడికీ చెప్పవచ్చు. నిద్రిస్తున్నట్లు నటిస్తూ వినదలచుకోని వానికి చెప్పగలగడ మసాధ్యం''.

కాంగ్రెస్ ప్రచారంవల్ల, తమ అపోహలవల్ల, తమ తమ స్వార్థం వల్ల, కొన్ని కొన్ని భావాలు ఏర్పర్చుకొని వాటినే పదేపదే ప్రతిపాదిస్తూ చర్చిస్తూ ఒత్తిడి తేగలమనే అపోహకు లోనైనట్లు గూడా అనిపిస్తుంది.

పోగా, ప్రభుత్వం జనసంఘాన్ని కూడ నిషేధిస్తుందేమోననే భయం ఏర్పడి జనసంఘం విలీనానికి దోహదం చేస్తున్నదని సోషలిస్టులలో కొందరు-సురేంద్ర మోహన్-మధులిమాయె లాంటివారు దురుసుగా అభిప్రాయాలను వెలిబుచ్చటంతో, జనసంఘ్ - బి యల్. డి. లు కలసి ఒకే పార్టీగా రూపొందాలని కూడ ఆలోచన వచ్చినట్లు కొందరు అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయాలన్నిటికి సైద్ధాంతికమైన ప్రాతిపదిక అంటూ ఏమీలేదు. ఒకటిగా - ఒకే పార్టీగా - రూపొందేముందు - తమ తమ స్థానాలకు ముప్పం, రాకుండా కాపాడుకోవాలనే భావన - బలగం లేని - పార్టీ వ్యవస్థలేని నాయకులకు రావటం సహజం.

ఈ తొందరపాటు అభిప్రాయ ప్రకటనతో విసిగి 'సోషలిస్టులు ఒకే పార్టీగా పదేండ్ల పాటు కలిసి పనిజేసిన దశ ఎప్పుడూలేదని, చీలికలు - కలయికలు వారికి నిత్యలక్షణమని వారికొక సంఘటన కాని కార్యకర్తల వలయంగానీ లేదని' కొందరు అభిప్రాయం వ్యక్తం చేస్తూ వచ్చారు.

ఆర్. యస్. యస్. రద్దు కావడమా, వేరుగా ఉండడమా అనే ప్రశ్న తీసుకవచ్చి, ఈ సమస్యను త్వరగా పరిష్కారం కాకుండా సృష్టించిన చిక్కుల వల్ల కొంత కాలయాపన జరిగినా, దేశంలో క్రమంగా వ్యాపిస్తున్న విషమ పరిస్థితులు జాతీయ పార్టీల విలీనానికి ప్రేరణ కలగజేశాయి.

పార్టీల విలీనానికి పరస్పర అవగాహనకు, పైనుండి వచ్చిన సూచనలు, సలహాలు, సంప్రదింపుల వార్తలు ఎప్పటికప్పుడు వివిధ పార్టీలకు అందజేసి, ఏకాభిప్రాయ సాధనకు ఆంధ్రలో కూడా కృషి జరిగింది. నీలం సంజీవరెడ్డి, తెన్నేటి, గోపాలరావ్ ఠాకూర్ - ఇంకా కొందరు ఈ ఏకాభిప్రాయ సాధనకు కృషిచేశారు.

ఈ సందర్భంలో ఆర్. యస్. యస్. మీద సోషలిస్టులు వ్యాపింప చూపిన అపోహలు చాల దురదృష్టకరమైనవే కాక జాతీయ ఆవశ్యకతను గుర్తించని రూఢి వాద మనస్తత్వాన్ని ప్రదర్శించేవిగా కనుపించాయి.

బెంగుళూరు జైల్లో డిటెన్యూలందరి సమక్షంలో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ మధు దండావతే -

"ఇంతకుముందు గాంధీ వాదులు, గాంధీ వ్యతిరేకులు అంటూ రెండు రకాలగా విభజన జరుగుతుండేది. వ్యతిరేక వర్గంలో ఆర్.యస్. యస్. జనసంఘాలను చేరుస్తూండేవారు. కానీ వాస్తవానికి చూస్తే సోషలిస్టులమైన మా కంటే ఆర్. యస్. యస్. జనసంఘ వారే గాంధీ మహాత్మునికి దగ్గరివారు ... అదివరకు నేను-సంఘమూ ఉత్తర దక్షిణ ధృవాలుగా ఉండేవారం. ఇప్పుడు చాల సన్నిహితులయ్యాము. ఇందిరాగాంధీ సంఘాన్ని ఫాసిస్టు అంటోంది. అది నిజంకాదు..."

కాని బైటికి రాగానే కొందరు తిరిగి పాతపాట ప్రారంభించారు.

ఆర్. యస్. యస్. పూర్తి శక్తిని వినియోగించి ప్రజాస్వామ్య పరిరక్షణకు - పోరాటంలో ప్రతిపక్ష రాజకీయ పార్టీలు కలిసి ఏర్పాటు చేసిన లోక సంఘర్ష సమితికి - ఒక జాతీయ కర్తవ్యంగా భావించి సహకరించింది.

పోరాటంలో భాగంగా సంఘర్ష సమితి ఏ పిలుపు నిచ్చినా, దానిని సఫలం చేయటానికి పూర్తిగా కృషిచేయడమే కాక సత్యాగ్రహాలలో-తొంభై శాతం-తన సభ్యులను జైలుకు పంపింది. అజ్ఞాత సాహిత్య ప్రచురణను అవిచ్ఛిన్నంగా - మహా ప్రవాహంగా నడిపి - దేశంలో పార్టీలు - ఉద్యమాలు, అంతకుముందు సాధించలేని, సుముఖమైన వాతావరణము నిర్మాణం చేయటంలో పూర్తి బాధ్యతను స్వీకరించింది. అజ్ఞాత కార్యకర్తలకు - వారే పార్టీ వారైనా - నివాస సౌకర్యాలు అజ్ఞాత నాయకుల కలయికకు ఏర్పాట్లుచేసి-సంబంధాలు నెలకొల్పింది. విదేశాలలో ''ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్'' అనే సంస్థను సంఘ కార్యకర్తలు స్థాపించి, ప్రపంచ అభిప్రాయాన్ని - భారత సహాయక దేశాలను కదిలించి, అజ్ఞాత ఉద్యమానికి ఆయా దేశాల మేధావుల చేత మద్దతు పలికించి, దీనినొక మానవీయ సమస్యగా రూపొందించి, ప్రపంచ మానవతావాద ఉద్యమాల్లో అగ్రస్థానాన్ని కల్పించారు. ఈ కార్యకలాపాలన్నింటిని హర్షించి, సంఘ సిద్ధాంతపు విశాల ప్రాతిపదికను గ్రహించడానికి బదులు-కొందరు — చీకటి గదిలో లేని పిల్లినిచూచి, బెదరి అరిచినట్లు-అల్లరిపెట్టి ఏదో సాధిద్దాం అనుకుంటే - మన రాజకీయ నాయకుల అవగాహన లోపానికి జాలి పడడం తప్ప అప్పటికి చేయగల్గింది లేదు. ఈ అసహనం, ఈర్ష్య వదలని కారణంగానే ఒకే రకం మనుషులను - మట్టిబొమ్మలను - ఈ దేశాన్ని ముప్పై ఏండ్లు పాలించనిచ్చారు. నియంతృత్వాన్ని అవతరింపచేసుకున్నారు. మనదేశంలో రాజకీయ పార్టీలు కూడ, ప్రజలను క్రియాశీల పౌరులుగా తీర్చిదిద్దడానికి చేసిన ప్రయత్నం చాలకొద్ది.

ప్రతి ఉద్యమంలో-ప్రతి ఎన్నిక సమయంలో-ప్రజలకు కొంత విజ్ఞానదాయకమైన విషయాలు లభిస్తాయి. కానీ అధికార రాజకీయాలకే ప్రధాన స్థానాన్ని మన పార్టీలు ఇస్తూ వచ్చినందున ప్రజా శిక్షణ-జన

జాగరణ ఏ మేరకు జరగాలో ఆ మేరకు జరగలేదు. కాంగ్రెసు మొదటి నుండి ఏకపాత్రాభినయంగానే నడిచింది. 1969 లో చీలిన కాంగ్రెస్ ఎమర్జెన్సీలో జరిగిన గౌహతి సమావేశాలనాటికి "సంజయ్ కాంగ్రెస్" గా రూపొందింది. కాంగ్రెస్ మరణించింది - యువకాంగ్రెస్ వర్ధిల్లాలి అనే పాట ప్రాణం పుంజుకున్నది. పాత తరాన్ని బైటకు గెంటి సంజయ్ అనుచరులు కాంగ్రెస్‌ను వశం చేసుకొనే పథకం మొదలైంది. పీటలు పోతవేమోనని వృద్ధులు సంజయ్‌కు వింజామరలు వీయనారంభించారు. ప్రజలకు ప్రజాస్వామ్య శిక్షణకంటే "తోలుబొమ్మలాటలు" కన్పిస్తుండేవి.

అంతకుపూర్వం గాంధీజీ, దీనదయాల్ జీ, లోహియా కొంత మేరకు జనజాగరణ నిమిత్తం ఆలోచించారు. మిగతావాళ్ళు ఐచ్ఛికంగా వచ్చిన వాళ్ళతో తమ తయారైన సరుకును ఉపయోగించుకున్న వారే కాని, మౌలిక శక్తి నిర్మాణానికి తగినంత శ్రద్ధ చూపిన వాళ్ళుకాదు. "హక్కుల కేక"లతో కాక "జాతీయకర్తవ్యా"లను ప్రతిపాదించనందున వైఫల్యాలకు లోనవుతూ వచ్చినవారు. జార్జి ఫెర్నాండజ్ ఆగస్టు 1975లో పంపిన ఒక సర్క్యులర్ లో "ప్రజాస్వామ్యంమీద, తద్వారా శ్రామిక వర్గాలమీద-ఫాసిస్టు ఇందిరా కాంగ్రెస్, మున్నెన్నడూ ఎరుగనంత పెద్ద అఘాతాన్ని కలుగజేస్తే, మనం ప్రజాస్వామ్య హక్కుల సంరక్షణకొరకు పోరాటం సాగించలేక పోయినాం. మన ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఈ బలహీనత కన్పించింది"-అన్నారు. మిగతా నాయకులు కూడా ఈ వాస్తవాన్ని గుర్తించారు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నుండి చంద్రశేఖర్, మోహన్ ధారియా గెంటివేయబడటంతో, దేశంలో స్పష్టంగా రెండు ధోరణులు ఏర్పడ్డాయి. ప్రజాస్వామ్య పక్షాలు నియంతృత్వ విధానం. పోరాటంకూడా

ప్రజాస్వామ్యమా? నియంతృత్వమా? అనే కేంద్ర బిందువును ఆశ్రయించింది. మార్చి 76లో బొంబాయిలో జె. పి. సమక్షంలో వివిధ రాజకీయ పక్షాల ప్రతినిధులు కలసి సమైక్య ప్రజాస్వామ్య పక్షం ఏర్పాటుకు యన్. జి. గోరే, హెచ్. యం. పటేల్, ఓ. పి. త్యాగి, శాంతిభూషణ్‌లతో ఒక సారధ్య సంఘాన్ని ఏర్పరిచారు.

76మే 25వ తేదీన బొంబాయిలో జె. పి. ప్రెస్ కాన్ఫరెన్సు జరిగింది. అన్ని పార్టీలు పూర్తిగా సంసిద్ధం కానప్పటికీ కనీసం తన ప్రకటనను అనుసరించైనా ఒకటవుతారని-చనువుతో, సదుద్దేశంతో, జాతీయ అవసరాలను గుర్తించి - కొత్త పార్టీ ప్రారంభంకానున్నట్లు ప్రకటన చేశారు.

ఇందిరా గాంధీ చిత్తం ఎప్పుడు ఎలా ఉంటుందో చెప్పలేము. ఎలక్షన్లు ప్రకటించవచ్చు. ప్రకటిస్తే ప్రతిపక్షాల పాత్ర ఏమిటి? నాయకులను కార్యకర్తలను నిర్బంధాలలో ఉంచి ఎలక్షన్లు ప్రకటిస్తే, సెన్సారు తిష్ఠవేసుకొని ఉంటే ఎన్నికలు "గుడు గుడు గుంచం గుండే రాగం" అవుతుందని, నియంత ఎలక్షన్లను సరిగా జరగనివ్వదని "పోరాట" మార్గమే ఏకైక మార్గమని జార్జి ఫెర్నాండజ్ 11-11-75 ననే "A Note for Discussion" అనే దానిలో తన భావాన్ని ప్రకటించాడు.

ప్రతిపక్షాలన్నీ ఈ భయాన్నే ప్రకటించాయి. ముఖ్యంగా వారి సమస్య "ఎన్నికలలో అక్రమాలను ఆపడం. ప్రతి పోలింగు బూతు దగ్గర ప్రతిపక్ష సభ్యులు 20 మంది ఐనా ధైర్యంగా నిలోచ్చవాలి. అక్రమాలను ఎదిర్చగలగాలి".

ఎమర్జెన్సీ రాక్షసికి 'మీసా', 'సెన్సారు'లు రెండు కోరలు. అవి ఊడితే ఎమర్జెన్సీ ఉండదు. ప్రత్యక్షంగా ఎత్తివేయకపోయినా,

సత్తువ ఉడిగి పేరుకు మిగులు తుంది. కాని ఇది చేసేశక్తి ఏ ఒక్క ప్రతిపక్షానికి లేదు. అలాంటపుడు ఏం చేయడం ! గంభీరంగా ఎన్నికలను బహిష్కరిస్తే బాధ తప్పుతుందని కొందరు అనుకొన్నారు.

ఈ మార్గం తప్పని సంఘం అభిప్రాయపడ్డది. సంఘ కేంద్ర కార్యాచరణ సంఘం సభ్యుడు, బాపూరావు మోఘే 76 అక్టోబరులో అజ్ఞాతంగా ఆంధ్రలో పర్యటించారు. అప్పుడు అజ్ఞాత కార్యకర్తల సమావేశాలు రాజమండ్రి, విజయవాడ, కర్నూలు, వరంగల్, హైద్రాబాద్ నగరాలలో జరిగాయి. ఆ సమావేశాలలో అంతకుముందు ఆలోచనార్ధం పంపించిన సూచనా పత్రం ననుసరించి జరిగిన పనులను సమీక్షించారు.

"రానున్న పరిస్థితులను సంకేతిస్తూ ఎన్నికలు జరుగుతాయనే భావంతోనే మనం సిద్ధంగా ఉండాలి. ఏర్పాట్లు కొద్ది వ్యవధిలో చేసుకోవడం అసాధ్యం. చేసిన ఏర్పాట్లను రద్దుచేసుకోవడం తేలికే" అన్నారు.

"ఎన్నికలు తప్పక వస్తాయి." ఇందిరా గాంధీ సొంతానికి ఆలోచించినా ఎన్నికలు రాక తప్పవు. ఆమెముందున్నది రెండేమార్గాలు.

ఒకటి: ఇంకా చట్టాన్ని బిగించడం.

ఈ మిగిలిన రాజ్యాంగ సౌకర్యాలను కూడా నడవనీక, ప్రతిపక్షాలను పూర్తిగా అణగ ద్రొక్కటం - ప్రజా వాణిని అణచివేసి, గొంతు నులమడం.

రెండోది: కొన్ని సడలింపులుచేసి, ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తున్నట్లు నాటక మాడడం.

"మొదటి మార్గం ఆమె అనుసరించడానికి సాధ్యంకాదు. ఇప్పుడున్నది వ్యక్తి నియంతృత్వం. దీనిని శాశ్వతంగా కొనసాగించలేదు.

తన పార్టీని ఎన్నడో ధ్వంసంచేసుకున్నది. ప్రస్తుతం ఆమె పార్టీలో నిండి ఉన్నది ఎక్కువ మంది అవకాశవాదులు, గొంతులు కోసేవాళ్ళు-గూండాలు. వాళ్ళతో ఎప్పుడూ ఆమెకు ప్రమాదమే. వాళ్ళు ప్రజాభిమానాన్ని ఆమెకు అనుకూలంగా సాధించలేరు ..రష్యా అండతో ఎక్కువ కాలం గడపలేదు. రష్యా గొంతెమ్మ కోర్కెలు కోరుతున్నది. మన ఆర్థిక వ్యవస్థను పిండి పీలుస్తున్నది... కమ్యూనిస్టుల కుట్రకూడా ఒకటున్నది. అలాంటిది తటస్థిస్తే ముందు మొప్పం ఆమెకే ... అంతర్జాతీయ పరిస్థితి కూడ ఆమెకు అనుకూలంగాలేదు. ఇందిరాగాంధీ రష్యా పర్యటన కూడా ఆమెకు ఏ ప్రయోజనాన్ని సాధించి పెట్టలేకపోయింది. నిరాశతో తిరిగి వచ్చింది. రష్యా బారువాను రక్షణ మంత్రిగా నియమించి, దేశంలో జిల్లాకొకరు చొప్పున తమ మనిషిని నియమించాలని కోరిందని వినికిడి.

ఆంతరిక పరిస్థితికూడ బాగాలేదు. కాంగ్రెసు విచ్ఛిన్నమైంది. బెంగాల్‌లో వ్యతిరేకత నడివీధికెక్కింది. మిగతా రాష్ట్రాలు ఎప్పుడు బ్రద్దలౌతవో తెలీదు. సంజయ పర్యటనలను కేరళ రెండుసార్లు వ్యతిరేకించింది.

ప్రభుత్వ యంత్రాంగం నిరంకుశంగా, అవినీతికరంగా ఉండడం ప్రజల కోపానికి గురి అవుతున్నది. కుటుంబ నియంత్రణ పథకంలో అవలంభిస్తున్న విధానాలు - ఢిల్లీనుండి వేలాది జనం పారిపోవడం - దీనికి నిదర్శనాలు. హాథేలీలో ప్రజలు బహిరంగంగా ఎదురు తిరిగారు. 6 వేల మంది పౌరులు పోలీసులను కొట్టారు. కాల్పులు జరిగాయి. పోలీసులు 600 మందిని నిర్బంధించి కసి తీర్చుకోవడానికి బలవంతంగా ఆపరేషన్లు చేశారు.

కార్మికులు కూడా ఎదురు తిరుగుతున్నారు. హరదిత్‌లో ఒక కార్మికుని కాల్చిచంపారు. కార్మికులు ప్రతీకారచర్యగా పర్సనల్ మేనేజరును చంపారు. కర్ఫ్యూ విధించబడింది. మిలిటరీని రప్పించారు.

హైద్రాబాదు ఐ. డి. పి. యల్. ఫ్యాక్టరీలో తమ బోనసు తమకివ్వమని కోరినందుకుగాను లాఠీ ఛార్జికి, కాల్పులకు గురిచేయబడ్డారు.

బెంగుళూరు టెలిఫోను విభాగంలో ఒక సబిన్స్పెక్టర్‌ను చంపారు.

ప్రభుత్వం ఇలా కొనసాగటం అసంభవమనడానికి ఇవి నిదర్శనాలు. అనేక ఉక్కు కర్మాగారాలు మూతబడ్డాయి. ప్రతిపక్షాలు పార్లమెంటును బహిష్కరించాయి. ఇందిరాగాంధీ బయట ఉన్న ప్రతిపక్ష సభ్యులను పార్లమెంటుకు హాజరు కమ్మని మధ్యవర్తుల ద్వారా కోరింది. ప్రతిపక్షాలవారు 3 షరతులు విధించారు.

1 కనీసం పార్లమెంటు సభ్యులను విడుదలచేయాలి.

2. పార్లమెంటులో ప్రతిపక్షాలవారు చేసిన ప్రసంగాలను పత్రికలు ప్రచురించగల్గాలి.

3. ప్రజాభిప్రాయాన్ని సేకరించటానికి సెమినార్లను, సభలను నడపటానికి అనుమతి ఇవ్వాలి.

ఈ మూడింటిలో చివరి రెంటినీ ఆమె అంగీకరించక తప్పలేదు. అలాగే ఎన్నికలు కూడ విధిలేకనే ఆవిడ పెట్టవల్సి వస్తుంది.... ఈ ఎన్నికల్లో ప్రధాన ప్రశ్న కాంగ్రెసును ఓడించడం. ఈ ఎన్నికల ధోరణే వేరుగా ఉంటుంది. డబ్బు వాహనాల విషయంలో చాలా అంతరాలుంటాయి. ప్రతిపక్షాలకు వాహనాలుండవు. నిధులుండవు. ఈ మధ్య

నెల్లూరు, కర్ణాటక, ఢిల్లీ ఎన్నికలలో జరిగినట్లు అసహ్య పద్ధతులను అవలంభించటం తథ్యం. కానీ మనం 'జనసమీకరణ' చేస్తే వీటన్నింటినీ ఎదుర్కోవచ్చు. ప్రజలు ఒకే 'జాతీయ ప్రతిపక్షం' అని కోరుతున్నారు. దీని కంతకూ బాధ్యత చివరకు స్వయంసేవకుల మీద ఉంటుంది. మనం కార్యకర్తల నివ్వాలి. పార్టీ అభ్యర్థి ఎవరైనాసరే మనం పన్జేస్తాం. మనం ఏ క్షేత్రంలో ఉన్నా, ఎక్కడ ఉన్నా, కాంగ్రెసు ఓటమికి తోడ్పడాలి. "కాంగ్రెస్‌కు వ్యతిరేకంగావేసే ప్రతి ఓటు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఓటు". ఇది మన విజ్ఞప్తి. కనుక ఎంతమంది-ఆదర్శవాదులు-అంకితులు అయిన, ముందుకు దూకి పనిచేయగల కార్యకర్తలను సమీకరించగలమో చూడండి... ప్రతి బూత్‌లో క్రియాశీల కార్యకర్తల దళం ఒకటి ఉండాలి. వాటిని ఇప్పటినుండే ఏర్పాటు చేయండి. ఒక మహిళను, ఒక హరిజన సోదరుణ్ణి, ఒక అల్ప సంఖ్యాకవర్గ ప్రతినిధిని - ఒక యువ ప్రతినిధిని అందులో చేర్చుకోండి. ఇప్పటి నుండే ఓటర్లను కలవనారంభించండి ... ఓటర్ల సమావేశాలు ఏర్పాటుచేయండి.

వచ్చే పోరాటంలో మన సర్వశక్తులను సమీకరించటంలోనే మన విజయం ఆధారపడిఉంది. ప్రస్తుత పరిస్థితుల్లో పోరాటంలో ముందుపడి పనిచేయవల్సిన బరువు మన మీదపడింది. కనుక అధికంగా త్యాగాలు చేయవలసి ఉంటుంది."

1975 మే నుండి ప్రారంభించిన ఈ వ్యూహానికిగాను అక్టోబరు 76 నుండి ఆర్. యస్. యస్. కార్యక్షేత్రంలో పూర్తిగా తన యావచ్ఛక్తినీ ప్రవేశ పెట్టింది. రాజ్యాంగ సవరణలమీద ఇదే కాలంలో ప్రజాభిప్రాయ సేకరణ పేరిట ఉద్యమం ప్రారంభమైంది.

# 14

# రాజ్యాంగ పోరాటం

'ఎమర్జెన్సీ రాజ్యాంగం నుండి
జనించవచ్చు;
రాజ్యాంగం ఎమర్జెన్సీ నుండి
జనించరాదు.'

ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ పెట్టిందే గాని, ప్రజాస్వామ్య హత్యను కోర్టులు అంత తేలికగా క్షమిస్తాయని అనుకోలేదు. అందుకే కోర్టుల మీద అంతకు ముందునుంచే దుమారం ప్రారంభింప జేసింది. ప్రభుత్వం తలపెట్టిన అభివృద్ధి పథకాలను కోర్టులు వమ్ము చేస్తున్నాయని ఆరోపించింది. వత్తిడి తెచ్చి బెదిరించి జడ్జీలను 'అదుపు' లో పెట్టాలని చూచింది. నియామకాలలో తనకు నచ్చిన వారిని తనపాటకు వంత పాడే వారిని కీలక స్థానాలలో నిలుపుతూ వచ్చింది. వారిని స్థానచలనం చేస్తూ వచ్చింది. ఈ విధంగా కోర్టులను, జడ్జీలను ప్రభుత్వానికి జోహుకుంలు పలికే జీ హుజూర్‌ల్లాగా చేయాలనుకున్నది. ఎమర్జెన్సీ ఆమెకు ఒక గొప్ప అవకాశం కలిగింప జేసింది.

అప్పటి వరకు కారణం చూపందే ఏ వ్యక్తినీ నిర్బంధించడానికి వీలులేదు. దాన్ని మార్చి వ్యక్తుల స్వేచ్ఛను హరించింది.

మీసా క్రింద ప్రభుత్వం చూపిన కారణాలను పరిశీలించే హక్కు కోర్టులకు లేకుండా చేసింది.

ఎన్నిసార్లైనా "తృప్తి కలిగితే చాలు, ఎన్ని ఏండ్లైనా మీసా క్రింద నిర్బంధించ వచ్చునని" సవరణలు చేసింది.

పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించడానికి చట్టం చేసి, దాన్ని కోర్టులలో సవాలు చేయకుండా రాజ్యాంగం 9వ షెడ్యూలులో చేర్చింది.

మీసా క్రింద నిర్బంధంలో ఉండగా డిటెన్యూలను చంపినా, తిండి పెట్టక మాడ్చినా, కనీసపు మానవ సౌకర్యాలు ఇచ్చినా ఇవ్వకున్నా ప్రశ్నించే అధికారం డిటెన్యూలకు లేకుండా, పరిశీలించే అధికారం కోర్టులకు లేకుండా చేసింది.

సుప్రీం కోర్టులో వాదిస్తూ "ప్రభుత్వం ఒక వ్యక్తిని ఈ ఎమర్జెన్సీ కాలంలో చంపినా కోర్టుకు ప్రశ్నించే అధికారం లేదని - అలా చంపటం న్యాయమా అన్యాయమా అని పరిశీలించే అధికారం కూడా లేద"ని ప్రభుత్వం తరపున న్యాయవాది నిరేన్ డే అన్నాడు.

అదా న్యాయం? చట్టానికి అదా అర్థం! ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత "అలా ఎందు కన్నావయ్యా?" అని నిరేన్ డేను ప్రశ్నిస్తే, "చస్తానా! అనకపోతే మీసాయే గతి"అని - ఆ నాటి తన నిస్సహాయతను ప్రకటించాడు.

డిటెన్యూలు ఈ అత్యాచారాన్ని సహించి ఊరుకోలేదు. బెంగుళూరు హైకోర్టులో అద్వానీ వగైరాలు రిట్ పిటీషన్లు దాఖలు చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో అన్ని జైళ్ళనుంచి రిట్ పిటీషన్లు హైకోర్టులో దాఖలు అయ్యాయి. జైళ్లలో కొన్నాళ్ళు డిటెన్యూలకు ఇదొక మెద

డుకు మేత. జైలు అధికారులకు తలనొప్పిగా ఉండేది. దేశ మంతటా ఈ రిట్ పిటీషన్లు హైకోర్టులను కదలించాయి. సెన్సారు షిప్పును సవాలు చేస్తూ పాత్రికేయులు; అక్రమ నిర్బంధాలను, జైళ్ళలో ఇబ్బందులను, వసతుల నిరాకరణాన్ని - అనేక రకాల - అనేక హక్కుల కొరకు ఈ 'రిట్స్' ద్వారా పోరాటం సాగింది.

హైకోర్టులు చట్టరీత్యా అవకాశం ఉన్న ప్రతి కేసులో డిటెన్యూ లను విడుదల చేస్తూండేవారు. అనుకూలంగా తీర్పులను ఇస్తుండేవారు. అలా విడుదల చేయడానికి, తీర్పుల నివ్వడానికి హైకోర్టులు ఏ కార ణాలు చూపుతుండేవో ఆ కారణాలు చెల్లకుండా మరో సవరణ ప్రభు త్వం తెచ్చేది. మరో ఆర్డినెన్సు వచ్చేది. మళ్ళీ దాన్ని రిట్ పిటీషన్లతో సవాలు చేయడం; అదొక కబడ్డీ! కోర్టులకు వివిధ జైళ్ళనుంచి డిటె న్యూలు వస్తుండే వారు. ప్రాంతంలో ప్రయాణిస్తూన్న దారి పొడుగునా ఇందిరాగాంధీకి వ్యతిరేక నినాదాలతో ఒక సంచలనం ఏర్పడు తుండేది. ప్రజా పోరాటపు గాథలతో హైద్రాబాదులో హైకోర్టు భవనం దద్దరిల్లు తుండేవి.

కాని నియంతకు అధికార దాహం అంత తేలికగా చావదు. తన పదవిని, పరువును, ప్రతిష్ఠను ఆచంద్ర తారార్కం నిలుపుకుందా మనుకున్నది.

ఈ ఊహతో రాజ్యాంగ సవరణలకు పూనుకున్నది.

తన ఎన్నిక ఏ, ఏ కారణాలుగా చెల్లదని ఆరేండ్ల వరకు తిరిగి పోటీ చేయకుండా ఏ ఏ కారణాలవల్ల అలహాబాదు హైకోర్టు తీర్పు ఇచ్చిందో వాటి అన్వయాన్ని రద్దు చేస్తూ రాజ్యాంగాన్ని సవరించింది. ఎన్నిక జరిగిన 5 ఏండ్ల తరువాత ఈ సవరణ జరిగింది - కాని ఇది 5 ఏండ్ల పూర్వం నుండి అమలులోకి వస్తుంది. తన పదవికోసం అలా

రాజ్యాంగాన్ని భ్రష్టం చేసిన హిట్లర్ శిష్యురాలు ఇందిరా గాంధీ. ఈ సవరణలను గురించి చమత్కరిస్తూ "ఇన్ని బాధలు దేనికి? నేను – నా తరువాత నా కొడుకు సంజయ్ – తరువాత అలా నా......" అని ఒకేసారి సవరించుకుంటే పోదూ, మన ప్రాణాలు తీయక" అని ఒక న్యాయవాది అన్నాడు.

అంతే కాదు తన హయాంలో నగర్‌వాలా కేసు జరిగింది. జైల్లో నగర్‌వాలా హత్య జరిగింది. 'మారుతి' రహస్యం కాశీ మజిలీ కథ అయిపోయింది. మిశ్రా హత్యమీద సరిగా విచారణ జరుగవలసి ఉన్నదని ఒత్తిడి ప్రారంభమైంది. వీటి పర్యవసానం – ఒకవేళ తన పదవి ఊడితే – ఎలా ఉంటుందో? కనుక దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దు కోవాలి. అందుకని ప్రధానిగాని మరి కొందరు ముఖ్యులు గాని – పదవిలోకి రాకపూర్వం – పదవిలో ఉన్నప్పుడు – ఆ పదవి ఊడిన తరువాత క్రిమినల్ నేరం చేసినా, ఏ సివిల్ ఇబ్బందికి లోనైనా అట్టి వారిపై ఏ చర్యా చెల్లదు. వారు న్యాయ విచారణకు అతీతులు. "శివమెత్తి నడి వీధినపడి నరికినా" ఫరవాలేదు. ప్రభుత్వ కోశాన్ని కొల్లగొట్టినా, లంచం పట్టినా, దోచుకు తిన్నా అడిగే దిక్కుండదు.

ఇందిరాగాంధీ పెద్దల కోసం కోరిన మినహాయింపులు ఇవ్వి! ఇందిరాగాంధీకి ఉన్న నైతిక విలువలు ఇవ్వి!

ఈ విలువలతో – ఆ ధోరణితో దేశాన్ని ఏలాలని – తనను కాదని ప్రతిపక్షాలు అడ్డగిస్తున్నా యని – తన భవిష్యత్తును నిష్కంటకం చేసుకోవాలని ప్రయత్నించిన 'సోషలిస్టు – ప్రజాస్వామ్య వాది' అయిన నెహ్రూ అడుగు జాడల నడిచే ప్రజల మనిషి!

నియంతలకు అధికారపు కుతి తీరదు. ఇందిరా గాంధీకి ఈ దేశంలో నియంతృత్వాన్ని, ఏక పక్ష పరిపాలనను నెలకొల్పాలని ఉన్నది. దానికై రాజ్యాంగంలో మౌలికమైన మార్పులను తెచ్చింది.

రాజ్యాంగ పీఠికను మార్చి, అలనాడు మహా మేధావులు, స్వాతంత్ర్యం కొరకు అనవరతం పోరాడిన మానవత్వ వైతాళికులు రచించిన పీఠికను చించి, కత్తిరించి, జోడించి రష్యాకు సహచర దేశంగా నిర్మాణం చేద్దామను కున్నది.

తన ఆయువు పరిమితి పెంచుకోడానికి లోకసభా కాలాన్ని కూడా ఆరేండ్లకు పొడిగించింది.

ప్రజల సాధారణ స్వాతంత్ర్యాలను హరించి, 'విధుల జాబితా'ను రచించింది.

ఆదేశిక సూత్రాలకు ప్రాథమిక హక్కుల కంటే అగ్రగణ్యతను కలిగింపచేసి వాటి పరిధులను పెంచి మనిషిని, ఈ దేశపు పౌరుణ్ణి కుదించి మట్టి ముద్దగా చేసింది.

కేంద్ర శాసనాలను ప్రశ్నించే అధికారం హైకోర్టులకు లేకుండా చేసింది.

రాజ్యాంగంలోని 32 వ సూత్రం క్రింద ప్రభుత్వం చేసే శాసనాలు రాజ్యాంగానికి అనుకూలంగా ఉన్నవా - లేవా - అనే హక్కును కూడా సుప్రీం కోర్టుకు - అదీ పరిమితంగా ఉండేట్టు చేసింది.

ప్రాథమిక హక్కుల సంరక్షణ విషయంలో హైకోర్టుల అధికారాలను కత్తిరించి తీరని అపచారం చేసింది.

స్టే, రిట్, మధ్యంతర ఆదేశాల విషయంలో హైకోర్టుల అధికారాలను తగ్గించింది.

ప్రభుత్వ ఉద్యోగులకు కోర్టులకు వెళ్ళే అధికారం లేదు.

భారత రిపబ్లిక్ అధ్యక్షుని బ్రతుకును హోదాను పూర్తిగా రబ్బర్ స్టాంపు క్రిందికి మార్చింది.

ప్రభుత్వ పార్టీకి నచ్చని ఏ సంస్థనైనా 'జాతీయ వ్యతిరేక కలాపాలు' చేసేదిగా చిత్రించవచ్చు. "జాతీయ వ్యతిరేక సంస్థగా నిర్ణయించి నిషేధించ వచ్చు. మట్టు పెట్టవచ్చు." ఇందిరా గాంధీ – నియంతృత్వపు పోకడలకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య ప్రతిష్ఠ కొరకు పోరాడుతున్న ఆర్. యస్. యస్. పై అక్కసు తీర్చుకోవడానికే ఈ మార్పును ఆయుధంగా చేపట్టింది.

దేశంలో ఎమర్జెన్సీని తన కిష్టం ఉన్నచోట ఇష్టం ఉన్నంత మేరకు విధించవచ్చు.

ఇలాంటివే రాక్షస వరాలు యింకా ఎన్నో !

పూర్వం హిరణ్యకశిపుడు చావు లేకుండా కలకాలం బ్రతకడానికి – రాజ్యం ఏలడానికి పొందిన వరాల్లాంటివి.

ఈ సవాలును ఎదిరించడానికి జాతి చేసిన పోరాటం అమోఘమైంది. పార్లమెంటులో పశు బలగంతో చేతు లెత్తించుకొని "అవు"ననిపించుకొన్న ఈ రాజ్యాంగ సవరణలకు అడుగడుగునా ప్రజలు మేధావులు ఎదురు నిల్చారు. ఊపి రాడనివ్వకుండా సవాలు చేస్తూ దేశంలో పోరాటం సాగించారు. ఈ పోరాటానికి వేదిక నిర్మించి – హంగులు కూర్చి – ప్రజావాణిని – ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి అజ్ఞాత ఉద్యమం సాగించిన కృషి సార్థకమైనది. ఎమర్జెన్సీ తరువాత పార్లమెంటు మొదట సమావేశ మైనపుడు ప్రతిపక్ష నాయకులు, ప్రభుత్వ చర్యలను, ఎమర్జెన్సీని, సెన్సారును, నిర్బంధాలను, నిషేధాలను తీవ్రంగా విమర్శించారు. 'పశుబలం' గల కాంగ్రెసును,

ఇందిరా గాంధీని అంత తీవ్రంగా విమర్శించడానికి అప్పటికి బైటకు మిగిలిన యం. పి. లు చూపిన సాహసం - నిర్భయం - చరిత్రలో గౌరవ స్థానాన్ని పొందుతాయి.

పార్లమెంటులో 21-7-75 న ప్రసంగిస్తూ ఎ. కె. గోపాలన్ ఆనాటి కాబినెట్ మంత్రుల స్థితిని వర్ణిస్తూ ''ఆహారమంత్రి జగజీవన రాం ఉపన్యాసం విన్నాను. కాని అవి వారి భావాలు కాదని నా కనిపి స్తోంది. ఎందుకంటె మాటి మాటికి ప్రధానివైపు చూస్తూ ఆయన ప్రసంగించారు'' అన్నారు. 'పార్లమెంటు అపహాస్యం చేయబడ్డ' దన్నారు. 22-7-75 న యన్. జి. గోరే రాజ్య సభలో ప్రసంగిస్తూ, ''ఈ పోరాటం చివరిదాకా సాగిస్తాం'' అన్నాడు. కృష్ణకాంత్ ప్రసం గిస్తూ ఇందిరా గాంధీని, ఎమర్జెన్సీని విమర్శించారు. ఎర్రా సెజియన్, మోహన్ ధారియా ఇందిరా గాంధీ తీసుకున్న చర్యలను వ్యతిరేకించారు. జగన్నాథరావ్ జోషి - 'ఇందిరా గాంధీ ఎమర్జెన్సీని సమర్థిస్తూ చేసిన ప్రసంగాలను' క్రమంగా విమర్శించి - స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఎక్కువ కాలం ఎవరూ అణచలేరన్నారు. 76 జనవరిలో జరిగిన పార్ల మెంటులో కూడా ప్రతిపక్షాలు పోరాటపు పతాకను ఎగుర వేస్తూనే ఉన్నాయి. కాని ఆ పార్లమెంటు ఉపన్యాసాలను పత్రికలు ప్రకటించరా దన్నారు. రికార్డుల్లో కూడా సెన్సారు ప్రారంభమైంది. అంతేకాదు పార్లమెంటులో మాట్లాడినా, ప్రభుత్వానికి అది వ్యతిరేక మనిపిస్తే చర్య తీసుకోవచ్చని చట్టాలు చేయబడ్డాయి. పార్లమెంటులో మాట్లా డినా, బైట మాట్లాడినా 26 జూన్ 75 న ప్రకటించిన ఎమర్జెన్సీని, జులై 1 న ప్రకటించిన 20 సూత్రాలను పొగిడితేనే క్షేమం. లేకపోతే జైలేగతి అనే స్థితి వచ్చింది. పార్లమెంటు చివరి చివరి సమావేశాల్లో అనధికార తీర్మానాలకు తావు ఇవ్వలేదు. ప్రశ్నోత్తర సమయాలు రద్దు చేశారు.

జాతి స్వేచ్ఛను వెన్నుపోటుపొడిచే 42వ రాజ్యాంగ సవరణను ఆమోదించటానికి వివిధ రాష్ట్రాల అసెంబ్లీలు ఆదరాబాదరాగా ఎలా ఒకరోజు, అర రోజుల్లో ప్రయత్నం చేసిందీ అందరికీ తెలుసు.

న్యాయం కొరకు సాగిన ఈ పోరాటంలో మొదటి గంట ఢిల్లీలో బార్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా - 26 డిసెంబరు 1975 న మ్రోగించింది.

గుజరాత్ రాష్ట్ర న్యాయవాదుల సభ ఆ నాదాన్ని ప్రతిధ్వనింప జేసింది. దేశంలో వ్యతిరేక నినాదం ప్రతి ప్రాంతానికీ ప్రాకి బహుశా ఒక్క బెంగాల్ తప్ప అన్ని ప్రాంతాల బార్ కౌన్సిళ్ళూ రాజ్యాంగ సవరణకు తమ అసమ్మతిని తెలియజేశాయి.

76 మార్చిలో బొంబాయిలో ఒక సభ జరిగింది. చాగ్లా, కె. సంతానం, బాబూభాయ్ పటేల్, శాంతి భూషణ్, కామత్, తార్కుండే, అలుబ స్తర్, ఎరా సెజియన్, కృష్ణకాంత్ కన్వీనర్లుగా ఒక సంఘం ఏర్పడ్డది. ఈ సంఘం ఏప్రిల్‌లో ఢిల్లీలో సమావేశమై ప్రభుత్వం తలపెట్టిన సవరణలను నిరసిస్తూ తన భావాలను తెలిపింది. 76 జులై 31, ఆగస్టు 1 లలో సి. డి. దేశ్‌ముఖ్ అధ్యక్షతన హైద్రాబాదులో ప్రసంగిస్తూ సుప్రీంకోర్టు రిటైర్డు జడ్జి కె. యస్. హెగ్డే "మనం మౌనంగా కూర్చునే సమయం కాదిది. మనలో ప్రతి వ్యక్తి ఏ కొంచెమైనా చేసితీరాలి" అన్నాడు.

నానీ పాల్కీవాలా, ఎ. కె. సేన్ మొదలైనవారు సవరణలను వ్యతిరేకించారు.

76 అక్టోబరు 19 న ఢిల్లీలో జరిగిన నేషనల్ సెమినార్‌లో దేశంలోని మేధావులు దాదాపు అందరూ సమావేశమై "ఈ ప్రభుత్వానికి, ఈ పార్లమెంటుకు రాజ్యాంగాన్ని సవరించే అధికారం లేదు.

భయంలేని వాతావరణంలో, స్వేచ్ఛా వాయువుల్లో న్యాయంగా, అక్ర మాలకు తావులేకుండా ఎన్నికలు జరగాలి. ప్రభుత్వం ప్రజల దగ్గరకు వెళ్ళాలి. వారినుంచి తిరిగి ఆమోదం పొందనిదే ఈ సవరణలు తలపెట్టే అధికారం ఈ పార్లమెంటుకు గాని ఈ ప్రభుత్వానికి గాని లేదు'' అని తీర్మానించారు.

దేశంలో పత్రికలు వెంటబడి వ్యతిరేకించాయి. కాంగ్రెస్, సి. పి. ఐ. జంట తప్ప సవరణకు ఎవరూ సుముఖంగా లేరు. అజ్ఞాత కరపత్రాలు, 'బిగ్ బేర్ టు ఇందిరా' 'డెతనీల్ టు ఎ డెమోక్రాటిక్ కాన్స్టి ట్యూషను' అనే అజ్ఞాత పుస్తకాలు పంచి ప్రజలకు విమర్శలు అందజేసి, రాబోయే రాజ్యాంగ సవరణల పరిణామంగా దేశానికి పట్టనున్న దుర్గతిని గురించి ఎప్పటికప్పుడు తెలియ చేయడం జరిగింది.

అద్వానీ 4-11-76 న జైలు నుంచి పంపిన సవరణల సమీ క్షలో ''ఈ 44వ సవరణ బిల్లు మన కిచ్చేది, కొత్త సవరణను కాదు- కొత్త రాజ్యాంగాన్ని. ఇంతవరకు మనకున్న ప్రజాస్వామ్య రాజ్యాంగం పోయి నియంతృత్వపు అధికార రోగపూరిత రాజ్యాంగం మనకు లభి స్తున్నది......1933 లో ఎడాల్ఫ్ హిట్లర్ సమర్థక చట్టాన్ని చేస్తూ శాసనాలు చేసే అధికారాన్ని తన క్యాబినెట్‌కు దత్తం చేసుకొన్నాడు. అందులో ఒక సూత్రం - 'హిట్లర్ క్యాబినెట్'ను ఇబ్బంది పెట్టే ఏ చట్టమూ చేయరాదు' అని. మనముందున్న ఈ సవరణలుగనుక అంగీక రించి నట్లయితే మనకూ అదేగతి పడుతుందని అద్వానీ హెచ్చ రించారు.

దేశంలో సాగిన ఈ పోరాటంలో ఆంధ్ర ప్రాంతం తన పాత్రను తాను నిర్వహించింది. న్యాయవాదులు, మేధావులు సవరణలను గురించి చర్చించారు. రాజ్యాంగ సవరణలవల్ల దేశానికి రాబోతున్న ముప్పును

గురించి ప్రజలకు స్పష్టంగా చెప్పారు. న్యాయవాదుల సంఘాలు సవరణలను వ్యతిరేకిస్తూ తీర్మానాలు చేశాయి. సభలు, సెమినార్లు సమావేశాలు జరిగాయి. 76 అక్టోబరులో విజయవాద, గుంటూరులలో మహా సభలు జరిగాయి. మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకుడు నంబూద్రిపాద్ సవరణలను వ్యతిరేకిస్తూ బ్రహ్మాండమైన సభల్లో ప్రసంగించాడు.

వాతావరణంలో కదలిక బయలు దేరింది. నెల్లూరు, విశాఖ, వరంగల్, రాజమండ్రి, కర్నూలు, నిజామాబాద్, మంచిర్యాల్, హిందుపూర్ నగరాలలో అర్థవంతంగా సభలు జరిగాయి. దళాలుగా యువకులు ఏర్పడి గ్రామాలకు వెళ్ళి ప్రచారం ప్రారంభించారు.

రాష్ట్ర రాజధాని హైద్రాబాదులో రాజ్యాంగ సవరణలమీద ఎన్నో కార్యక్రమాలు జరిగాయి. నీలం సంజీవరెడ్డి, తెన్నేటి, కర్ణాటక మాజీ ఎం. పి. రాంరెడ్డి, హైకోర్టు న్యాయవాద సంఘ అధ్యక్షుడు శివరామ శాస్త్రి, వరంగల్ బార్ అసోసియేషన్ అధ్యక్షుడు వి. రాజేశ్వరరావు సవరణల ఉద్దేశ్యాన్ని, ముంచుకువస్తున్న ముప్పును ప్రజలకు అందజేశారు. నగరంలో బాబులురెడ్డి, వందేమాతరం రామచంద్రరావు-ఇంకా ఎందరో మహానుభావులు ఈ సవాలును గట్టిగా ఎదుర్కొన్నారు

జైళ్ళలో ఈ సవరణలను గురించి కూలంకషంగా చర్చలు జరిగాయి. క్లాజువారీ సమీక్ష జరిగింది. వరంగల్ జైలులో మార్క్సిస్టులు, జనసంఘ సభ్యులు మిగతావారు తమ అభిప్రాయాలను బయటికి పంపారు.

రిటైర్డు సుప్రీం కోర్టు జడ్జి, ఉస్మానియా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ జగన్ మోహనరెడ్డి 76 డిసెంబరు 10 న ఆంధ్ర విశ్వవిద్యాలయం అల్లాడి కుప్పుస్వామి స్మారక ఉపన్యాసాల పథకం క్రింద

ఉపన్యసిస్తూ ''మన రాజ్యాంగం సాంఘిక న్యాయాన్ని చేకూర్చడానికి ఇప్పటికే అవసరమైనంత సదుపాయాన్ని కలగ చేస్తూ ఉన్నది...చట్టాలలో ఎక్కడ పొరపాట్లున్నా వాటిని కోర్టులు ఎత్తి చూపుతాయి. ఏ యే చట్టాలు రాజ్యాంగంలోని మౌలిక సూత్రాలకు అనుకూలమో, ఏవేవి కావో కోర్టులు ఎత్తి చూపుతాయి. అది వాటి కర్తవ్యం...ఆదేశిక సూత్రాలు నిర్దుష్టమైనవి. స్పష్టంగానే ఉన్నాయి. నాయకులు తలచు కుంటే ఇప్పటి ఈ రాజ్యాంగాన్ని అనుసరించే సాంఘిక న్యాయం కొరకు ఏ మార్పైనా తీసుక రావచ్చు. దాని కొరకు రాజ్యాంగాన్ని మార్చ నవసరంలేదు. పేదల కొరకు కేంద్ర ప్రభుత్వం కోర్టు ఫీజులు తగ్గించా లంటే అడ్డుపడిం దెవరు? కోర్టులా? కావు. రాష్ట్ర ప్రభుత్వాలు అడ్డు పడ్డాయి-'' అని తీవ్రంగా మందలించారు.

ప్రభుత్వం కూడా తన కనుకూల సమావేశాలు జరపాలని ప్రయత్నం చేసింది. రజనీ పటేల్, బారువా, వి. బి. రాజు మరి కొందరు మహా తంటాలు పడ్డారు. వి. బి. రాజు హైద్రాబాదులో బార్ కౌన్సిల్‌లో మాట్లాడు తున్నాడు. విషయం రాజ్యాంగ సవరణలు. ముందే కొన్ని ప్రశ్నలు ఆ మహా వక్తకు అందజేయ బడ్డాయి. నిము షాలు దొర్లు తున్నాయి. కులాసా కబుర్లు సాగుతున్నాయి. సవరణల ముచ్చట ఎత్తుకోడే. అల్లి - బిల్లి - జాబిల్లిగా నడుస్తోంది వ్యవహారం. ''అయ్యా అసలు విషయానికి రాండి'' అని పూర్తి 40 నిముషాల తరు వాత న్యాయవాదులు వెంటబడ్డారు. పాపం వి. బి. రాజు ''మీ రీ అవ కాశం నా కిచ్చినందుకు ధన్యవాదాలు'' అని నేరుగా ఢిల్లీ దారి పట్టాడు.

సివిల్ లిబర్టీస్ ఉద్యమం తరపున కూడా ఈ దిశలో మంచి కృషి జరిగింది.

డిసెంబరు 76 లో విజయవాడలో సివిల్ లిబర్టీస్ (పౌర హక్కుల పరిరక్షణ సంఘం) తొలి సమావేశాలు జరిగాయి. 19

జిల్లాల నుండి దాదాపు వెయ్యిమంది అన్ని రంగాలకు ప్రాతినిధ్యం వహించే ప్రముఖులు హాజరైనారు.

ప్రారంభ సమావేశానికి ప్రజాకవి కాళోజీ నారాయణరావు అధ్యక్షత వహించాడు. దీనికి కన్వీనర్ యం. వి. రామమూర్తి. ఇందిరా దురాగ్రహానికి గురి అయిన టి. లక్ష్మీకాంతమ్మ, అఖిల భారత పౌర రక్షణ సంఘం - కార్యాచరణ ఆధ్యక్షులు తార్కుండే, తెన్నేటి, గుంటూరు బాపనయ్య, సి. అమ్మన్న రాజా, మాకినేని బసవ పున్నయ్య, ఎం. ఎల్. ఏ. దామోదరావు, ఆర్. యస్. యస్. అధ్యక్షులు లింగయ్య చౌదరి - ఇంకా ఎందరో ప్రముఖులు ఈ సభలో పాల్గొన్నారు.

తార్కుండే గుంటూరు, హైదరాబాదు, విజయవాడ నగరాలలో గూడా పర్యటించారు. ఈ వార్తలు పత్రికల్లో రాలేదు. అజ్ఞాత పత్రిక 'సమాచార్' 28-12-76 న ప్రచురించిన 59వ సంచికలో ఈ వార్తను ప్రజల కందించింది.

పోరాటం బహుముఖంగా జరగడం ప్రజల పోరాట మనస్తత్వానికి నిదర్శనం. ఇందిరా గాంధీ విధానాలకు ప్రజల ఆమోదం లేదనడానికి ఇంతకంటే సంకేతమేమి కావాలి.

4-1-76 న రాజమండ్రిలో ఆంధ్ర రాష్ట్ర లాయర్ల కాన్ఫరెన్సు జరిగింది. ఆ కాన్ఫరెన్సులో సవరణలను వ్యతిరేకిస్తూ వ్రాసిన కరపత్రాలు పంచుతూ ఒకతను పట్టుబడ్డాడు. అతనికి నియంత ప్రభుత్వం ఎలా సన్మానించి ఉంటుందో ఊహించుకో వచ్చుకదా!

ఇదే మిగతా జిల్లాల్లో జరిగిన వ్యవహారం. సవరణలను వ్యతిరేకిస్తూ సభలు - సెమినార్లు - కరపత్రాలు - ప్రచారాలు.

అయితే ఈ కదలికను నియంత అనుమతిస్తూ 'ఆఁ మన కేమవుతుందిలే - పార్లమెంటులో చేతులెత్తే జనం ఉన్నారు కదా!' అనుకున్నది. కాని సవరణల చర్చలతోపాటు 'నియంత నెలకొల్పిన ఎమర్జెన్సీ' ప్రజల స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని ఎలా అణచి వేసిందో, ఎలా నాయకు లందరూ జైళ్ళలో మగ్గిపోతున్నారో - ఈ ప్రచారం గూడా సాగింది. 14 నవంబరు 75 నుండి జనవరి 76 దాకా సాగిన సత్యాగ్రహం తర్వాత ఈ సవరణలపై ధ్వజం ఎత్తగల అవకాశం లభించడం పోరాటం దృష్ట్యా భగవంతుడు పంపిన ఒక వరమే.

రాజ్యాంగ సవరణల నెదరిస్తూ, పౌర హక్కుల కొరకు సాగిన సమరంలో సాహిత్యం నిర్వహించిన పాత్ర అద్భుతమైంది. శ్రీకాకుళంలో 57 గ్రామాలలో పర్యటించి వేలకొలది కరపత్రాలు పంచారు.

రిఫరెండం కావాలని కోరుతూ 39 గ్రామాల నుండి 421 మంది ప్రముఖ పౌరులు రిపబ్లిక్ ప్రెసిడెంటుకు లేఖలు వ్రాసారు.

విశాఖలో సవరణలు ఆపమని 2000 మంది లేఖలు వ్రాసారు. సవరణపై ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి 700 కాపీలు ప్రశ్నావళి పంపి, ప్రత్యుత్తరాలు స్వీకరించారు. 1000 పోస్టర్లు అతికించారు. 28,000 కరపత్రాలు పంచారు.

పశ్చిమ గోదావరిలో పెద్ద పట్టణాలలో రాజ్యాంగ సవరణలకు వ్యతిరేకంగా బహిరంగ సభలు జరిగాయి. 145 గ్రామాలకు వెళ్ళి వేలకొలది కరపత్రాలు పంచారు. 1500 మంది సవరణలు ఆపమని ప్రెసిడెంటుకు లేఖలు వ్రాసారు.

మొత్తం రాష్ట్రంలో 117 స్థలాల్లో సభలు సమావేశాల ద్వారా రానున్న ప్రమాదాన్ని ప్రజలకు తెలియ చేయటం జరిగింది.

# 15

# ఏ దేశమేగినా*

'ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వ రేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము.'

—రాయప్రోలు

ఇందిరా గాంధీ అత్యవసర పరిస్థితి పెట్టడమే కాకుండా దేశంలో ఏకచ్ఛత్ర ప్రభుత్వాన్ని స్థాపించాలని తలపెట్టడంతో ప్రజాస్వామ్య దేశాలకు ఒక విధమైన ఆందోళన కల్గింప చేసింది. వివిధ దేశాలలోఉన్న మన సోదర భారతీయులకు ఈ వార్త పిడుగుపాటునే కల్గించినది.

ఒక్కసారిగా ఈ దారుణ చర్యకు ఇందిరా గాంధీ పూనుకోడం, జె. పి., మురార్జీ, బాలాసాహెబ్ లాంటి మహానుభావులను నిర్బంధిం

---

* ఈ అధ్యాయానికి సామాగ్రి ఢిల్లీనుండి ప్రచురింప బడుతూన్న 'జాహ్నవి' జులై, ఆగస్టు, సెప్టెంబరు 77 సంచికలు, న్యూయార్కునుండి ఎమర్జెన్సీ కాలంలో ప్రచురింపబడ్డ 'సత్యవాణి' అనే ఆంగ్ల పత్రిక నుండి, మిగతా కొన్ని అజాత పత్రికలనుండి లభించింది.

చడం దారుణ పరిణామాలకు దారి తీసే పీడ కలగా విదేశాలలోని భార తీయులు భావించారు. ప్రజాస్వామ్య పరిరక్షణ తమ కర్తవ్యంగా నమ్మిన వారు. నియంతృత్వానికి వ్యతిరేకంగా ప్రవాస భారతీయులను సంఘటితం చేసారు.

ఇందిరా గాంధీ ప్రపంచ ప్రజలలో తన పరువు నిలుపు కునేం దుకు, ప్రభుత్వ రాయబార కార్యాలయాల ద్వారా, టన్నుల కొద్ది సాహిత్యంద్వారా భారతదేశంలో జె. పి. ఉద్యమం ప్రతిపక్షశక్తుల ఉద్యమ మని, తాను పేద ప్రజలకు మేలుచేసే కార్యక్రమాలు తలబెడితే, ప్రతి పక్షాలు అడ్డు తగులుతున్నాయని ప్రచారం సాగించింది. దానిని ఎదు ర్కోవడానికి దేశభక్త భారతీయులు, భారతీయ మిత్రుల సహకారంతో నడిపిన ఉద్యమం అద్భుతమైనది.

జూన్ 26 వ తారీఖున ఎమర్జెన్సీ వార్త అమెరికాకు చేరింది. వాషింగ్‌టన్‌లో గల కొందరు భారతీయులు "ఇండియన్స్ ఫర్ డెమొ క్రసీ'' పేర ఒక సంస్థను స్థాపించారు. ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా 27 జూన్ నాడు చికాగోలో భారతీయ కాన్సలేటు ముందు అక్కడి భార తీయులు నిరసన ప్రదర్శనలు జరిపారు.

అమెరికా పెద్ద దేశం. వెంటనే వ్యక్తిగతంగా అందరూ కల పడం అసాధ్యం. అందుకని ఫోనులో మిత్రులు మాట్లాడుకున్నారు. ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ విద్యార్థి ఆనందకుమార్ షికాగోలో ఉంటాడు. హీరామథ్ స్కాలర్ షిప్పుతో ఆంధ్ర నుండి షికాగో వెళ్ళాడు. మిషియన్‌లో కుమార్ పోద్దార్, వాషింగ్‌టన్‌లో డా॥ జితేంద్ర కుమార్, న్యూయార్క్‌లో రవి చోపడా – జూన్ 29 న ఎందరు మిత్రులు కలిస్తే అందరితో ఒక సంస్థను ప్రారంభించాలని ఆ సంస్థ ద్వారా భారత దేశంలో ప్రజాస్వామ్యాన్ని అణచడానికి జరి

గిన ప్రయత్నాన్ని ఎదిరించాలని నిశ్చయించు కున్నారు. ప్రతి వ్యక్తీ ఏదో చేయాలి అని తపనపడ నారంభించారు. సమయం కొద్దిగా ఉన్నా, 29 జూన్ న 30 మంది కలుసుకున్నారు. వీరిలో కొందరు 1200, 1300 మైళ్ళ దూరంనుండి వచ్చారు.

ఏకాభిప్రాయంతో 'ఇండియన్స్ ఫర్ డెమొక్రసీ' పేర వాషింగ్టన్‌లో ఏర్పడ్డ సంస్థను ఆమోదించారు. ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ప్రపంచ ప్రజల అభిప్రాయాన్ని సేకరించడమే ఈ సంస్థ లక్ష్యం. ఆ రోజే వాషింగ్‌టన్‌లో ఉన్న భారత రాయబార కార్యాలయం ఎదుట 200 మందితో ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిపారు. "ఎమర్జెన్సీని ఎత్తివేయాలి; రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి; ప్రెస్ సెన్సారు షిప్పు తొలగించాలి; కోర్టుల అధికారాలను తగ్గించకుండా - ఎప్పటిలా నడవాలి''. ఈ నాల్గు రకాల నినాదాలతో బానర్లు పట్టుకుని వెళ్ళారు.

ప్రదర్శన ప్రారంభమయ్యే ముందు సభ జరిగింది. అందులో పలువురు వక్తలు పాల్గొన్నారు. భారత రాయబారికి 1200 మంది సంతకాలుగల ఒక విజ్ఞప్తి పత్రాన్ని అందచేయాలని ప్రయత్నించారు. కాని భారత తాత్కాలిక రాయబారి గాన్సాల్‌వెస్ ప్రవాస భారతీయులను కలుసుకోలేదు. ప్రతినిధులతో దురుసుగా ప్రవర్తించి "మీరంతా పాకిస్తాన్ ఏజెంట్లు, చైనా ఏజెంట్లు" అని అసభ్యంగా వ్యవహరించాడు. భారతీయులు విసిగి ఆ మహజరును అక్కడే మెట్లమీద పెట్టి, చెప్పి వెళ్ళిపోయారు.

వెంటనే వాషింగ్‌టన్ పోస్టు అనే దిన పత్రిక మూడు వంతుల పేజీ నిండా ఈ వార్తను ప్రముఖంగా ప్రచురించి, భారత రాయబారి దురుసు ప్రవర్తనను విమర్శించింది. 30 జూన్ నాడు వాషింగ్‌టన్

నేషనల్ ప్రెస్ క్లబ్‌లో పత్రికా విలేఖరుల సమావేశం కూడా ఏర్పాటు చేసి, వారికి ఎమర్జెన్సీని గురించి అరెస్టులను గురించి వివరించారు.

భారత రాయబారి ప్రవర్తనతో భారతీయులు మరీ రెచ్చిపోయి త్రివిధ కార్యక్రమం చేపట్టారు.

1. చిన్న చిన్న స్థలాలదాకా ఈ 'ఇండియన్స్ ఫర్ డెమొక్రసీ' (ప్రజాస్వామ్యం కోరే భారతీయులు) శాఖలు నెలకొల్పి, ప్రచారం ముమ్మరంగా చేయాలి.

2. ఉద్యమాన్ని పలు రంగాలలో వ్యాపింప చేయాలి.

3. పత్రికలను, టెలివిజన్, రేడియోలను విరివిగా ఉపయోగించు కోవాలి.

అలాగే 15 ఆగస్టు 75 న 'ప్రజాస్వామ్యం కోరే భారతీయుల' మొదటి సమావేశం వాషింగ్‌టన్‌లో జరపాలని కూడా నిశ్చయించు కున్నారు.

ఇంతలోకే నానాజీ దేశ్‌ముఖ్ వ్రాసిన పరిచయ పత్రంతో డా॥ సుబ్రహ్మణ్యస్వామి భార్య డా॥ రొక్సానా స్వామి వాషింగ్‌టన్‌కు వెళ్ళింది. ఆమె రాకతో భారత దేశంలో నడుస్తున్న ప్రచ్ఛన్న కార్యక్రమ కేంద్రంతో సంబంధాలు ఏర్పడ్డాయి. అమెరికాలో ఉన్న ఆర్. యస్. యస్. సభ్యులు 82 దేశాలతో సంబంధాలు ఏర్పరచు కున్నారు. దీనిలో హైదరాబాదు నుండి వెళ్ళిన మనోహర షిండే, నెల్లూరు నివాసి చెళ్ళపిళ్ళ చురుకుగా పాల్గొన్నారు. కెనడా, అమెరికాలలో 63 స్థలాలతో సంబంధాలు ఏర్పడ్డాయి. భారత దేశంనుండి వార్తల సేకరణకు మార్గాలు ఆలోచించారు. భారతదేశ పరిస్థితులు వెంట వెంటనే తెలుసు కోడానికి, విదేశాల వార్తలు భారతదేశ ప్రజలకు అంద చేయడానికి

ప్రచ్ఛన్న కార్యస్వరూపం ఏర్పడింది. బొంబాయి, మద్రాసు, బెంగుళూరుల నుండి వార్తలు, విమర్శలు వెళ్తుండేవి.

15 ఆగస్టున వాషింగ్టన్‌లో బ్రహ్మాండమైన ప్రదర్శనలు, ఊరేగింపు నడిపారు. ఆ ఊరేగింపు ఒక గొప్ప ప్రయోగం. చేతికి నల్ల బాడ్జి, మూతికి తెల్లపట్టి. శెలవు లేనిరోజు. అయినా ఆ నాడు 200 మంది సభ్యులు 5000 సంతకాలను ప్రోగు చేసారు.

ఆ నాడు నిరసన ప్రదర్శనలు జరుగుతవేమో నని భారత రాయబారి తన కార్యాలయాన్నే మూసి వేసాడు. ప్రదర్శకులు రాయబారి కౌల్ ఇంటిముందు నిరసన ప్రదర్శన జరిపారు. ఇది తెలిసి తలుపు వేసుకొని కౌల్ లోపల కూర్చున్నాడు. ఆ నాడు మామూలుగా 11-00 గంటలకు జరుపవలసిన జండా వందనం ఉదయం 8-30 గంటలకే ముగించాడు.

అమెరికా ప్రజలు స్వాతంత్ర్య ప్రియులు, ప్రజాస్వామ్యవాదులు. ఐనా ఈ ఉద్యమ కారులు సంతకాల సేకరణ కొరకుగాని, ధనం కొరకుగాని, ఊరేగింపులకుగాని, సంస్థ కొరకు మరే విధంగా కాని అమెరికా ప్రజల సహాయాన్ని తీసుకోలేదు. ఇందిరాగాంధీ "ఇదంతా విదేశీయులు చేయిస్తున్న నాటకం" అని అనడానికి అవకాశం ఉన్నది. ప్రతి కార్యకర్త ప్రతి నెల తన ఆదాయంలోంచి కొంత భాగం విరాళంగా ఇస్తుండే వాడు.

15 ఆగస్టు నాడు ఒక చక్కని పత్రికా విలేఖరుల గోష్ఠి కూడా జరిపారు. ఆ సమావేశంలో అయిదుగురు సభ్యులతో ఒక సారధ్య సంఘం ఏర్పడింది. 'ఇండియన్ ఒపీనియన్' అనే వార్తా పత్రికను, 'న్యూస్' అనే వార పత్రికను ప్రారంభించాలని నిశ్చయించు కున్నారు.

అదే రోజు లాస్ ఏంజల్స్ నగరంలో డాక్టర్ రామ్‌గహానీ నేతృత్వంలో ఒక ప్రదర్శన చేశారు. లాస్ ఏంజల్స్ వాషింగ్‌టన్ నుండి 3000 మైళ్ళ దూరాన ఉన్నది.

'ఇండియన్స్ ఫర్ డెమొక్రసీ' ఆధ్వర్యాన మొదటి సారిగా ఆగస్టు 18న భారత రాయబారి కౌల్ ను కలుసుకోడానికి వెళ్ళారు. ఆయన వెళ్ళిన వాళ్లను ముందు బెదిరించాడు. భయ పెట్టాడు. భారత దేశంలో ప్రకటింపబడ్డ ఆత్యాయిక పరిస్థితి ప్రవాస భారతీయులకు కూడా అనువర్తిస్తుందని అన్నాడు. "మీ ప్యాస్ పోర్టులు రద్దుచేసి, తిరిగి భారత దేశానికి పంపుతాం. అక్కడ మీగతి ఏమవుతుందో చూచుకోండ"న్నాడు. "భారత దేశంలో మీ బంధువులు, కుటుంబ సభ్యులు మీ కారణంగా అష్టకష్టాల పాలవుతార"ని వత్తిడి ఎత్తులు వేశాడు.

ఆనంద కుమార్ అనే కార్యకర్త దాదాపు 20 నగరాలకు వెళ్ళి ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. అనేక విశ్వవిద్యాలయాలలో, రేడియోలోను ప్రసంగించాడు. అతని ప్రచార ప్రభావంవల్ల 'ఎమర్జెన్సీ' నిజరూపాన్ని గ్రహించి మిగతా ప్రవాస భారతీయులు, అమెరికా ప్రజలు ఇందిరా గాంధీపట్ల విముఖులు అవుతూ వచ్చారు. ఇలా ఇందిర వ్యతిరేక ప్రభంజనాన్ని సృష్టించిన ఆనంద కుమార్‌కు భారత ప్రభుత్వం ఇస్తూ వచ్చిన స్కాలర్ షిప్పును రద్దు చేశారు. సరిగా చదవడం లేదని వంక పెట్టారు. కాని విశ్వవిద్యాలయ 'డీన్' 'ఆనంద్ బుద్ధిమంతుడు, శ్రమించి చదివేవాడు' అని విశ్వవిద్యాలయం వారిచే ఉపకార వేతనాన్ని ఇప్పించాడు. ఆనంద్ మరింత స్వేచ్ఛతో నలుమూలలా తిరిగి ప్రచారం ప్రారంభించాడు. ఉద్యమం బలం పుంజుకుంటూ ప్రజాభిప్రాయాన్ని - అభిరుచిని, ఆకర్షించ నారంభించింది.

న్యూయార్కు, చికాగో, కాలిఫోర్నియాలలో బహిరంగ చర్చలు జరిపి, భారత రాయబారులనుకూడా చర్చలకు ఆహ్వానించారు. కాని రాయబారులు ఏదో సాకు చెప్పి ముఖం చాటు వేసుకునేవారు. వచ్చినచోట్ల సరియైన సమాధానాలు - తృప్తికరమైన కారణాలు చూపలేక ముఖం వెలవెల పోయి, తిరోగమించే వారు. క్రమంగా నిరసన ప్రదర్శనల సంఖ్య పెరిగింది. జులైలోనే న్యూయార్కు, ఫిలడల్ఫియా, లాస్ ఏంజలీసులలో నిరసనలు జరిగాయి. ప్రదర్శన అనగానే తెలిసినవా రెవ్వరూ 'మనకేమిలే' అని కూర్చోలేదు. అమెరికా పత్రికలు ఈ వార్తలను విరివిగా ప్రచురించ నారంభించాయి. అమెరికా ప్రజలు, ప్రభుత్వము క్రమముగా భారత దేశంలో ఇందిర తెచ్చిన నియంతృత్వాన్ని నిరసించే పరిస్థితి రాకముందే పరిస్థితులు చక్కబరచాలనే ఉద్దేశ్యంతో భారత దేశంనుండి కేంద్ర మంత్రులను, మహా నాయకులను తీర్చి దిద్ది, పాఠం నేర్పి పంపడం ప్రారంభమైంది.

అప్పుడు భారత విదేశాంగ మంత్రి శ్రీ చౌహాన్ చికాగో వెళ్లారు. ఆయన సభలో "డి. పి. మిశ్రా, చెన్నారెడ్డి - ఈ ఇద్దరి ఎన్నికలు చెల్లనేరవని కోర్టులు తీర్పు ఇస్తే, వారిచేత రాజీనామాలు చేయించారు కదా ! మరి ఇందిరా గాంధీ ఎందుకు రాజీనామా చేయలేదు ?" అని ప్రశ్నించారు. చౌహాన్ గారు "వాళ్ళు ముఖ్య మంత్రులు - ఈమె ప్రధాన మంత్రిగదా'' అని జవాబిచ్చాడు - అంటే ముఖ్య మంత్రుల నెత్తిన తా నున్నది కనుక రాజీనామా యిప్పించింది. తన నెత్తిన మరొకడు లేడు కనుక ఇవ్వలేదన్న మాట !

''ఎమర్జెన్సీ ఎందుకు పెట్టారు !" రెండవ ప్రశ్న. చౌహాన్ ఈ ప్రశ్న వస్తుం దనుకోలేదు పాపం. గాబరా పడుతూ "నాదేముంది చెప్పినట్లు చేయవలసిన వాణ్ణి'' అన్నాడు.

26 జనవరి '76 నాడు వాషింగ్‌టన్‌లో ఒక తమాషా జరిగింది. భారత రాయబార కార్యాలయం నుండి 26 జనవరి రిపబ్లిక్ ఉత్సవం జరుగుతుందని వర్తమానం అందింది. 'ఇండియన్స్ ఫర్ డెమోక్రసీ' సభ్యులు రాయబార కార్యాలయ అధికారులను కలుసుకొని ''ఉత్సవం జరపరాదు'' - అన్నారు. ''రిపబ్లిక్ ఎక్కడున్నది గనుక - ఉత్సవం జరపడానికి?'' అని ప్రశ్నించారు.

చివరికి ఒక సాంస్కృతిక కార్యక్రమం జరిగింది. రాయబారి కౌల్ ఆ ఉత్సవంలో రాజకీయాల ప్రసక్తి ఏ మాత్రం రానీయలేదు. ఎమర్జెన్సీని సమర్థించే ప్రయత్నం చేయలేదు. ఆ ఉపన్యాసం కూడా కార్యకర్తలు ముందుగా పరిశీలించి-ఫరవాలేదులే - అని ఆమోదించారు.

ప్రవాస భారతీయులలో ఎమర్జెన్సీ వ్యతిరేకత ఎంతగా ఉండేదో ఊహించుకోవచ్చు.

భారత దేశంలో జరుగుతూండిన ప్రచ్ఛన్న కార్యకలాపాల వివరాలు అక్కడకుచేరే ఏర్పాట్లు జరిగాయి. అవి అక్కడికి చేరదంతోటే కరపత్రాలుగా అచ్చువేసి పంచుతుండేవారు.

ఈ వ్యతిరేకాన్ని ఎదుర్కోడానికి అప్పటి వార్తాప్రసార ఉపమంత్రి ధర్మవీరసిన్హా అమెరికా వెళ్ళాడు. దక్షిణ కెరనాలాలో అతడు ప్రసంగిస్తున్న సభలో గ్రుడ్లు, టమాటోలు వర్షం కురిసాయి. కార్యకర్తలు వేసే ప్రశ్నలకు జవాబు లివ్వలేక పోయినాడు. అప్పటి నుండి మంత్రుల పర్యటనను ముందుగా తెలియచేయడం మానారు.

తరువాత ప్రభుత్వం మరో పద్ధతి నవలంబించింది. ఎమర్జెన్సీని సమర్థిస్తూ, ప్రతిపక్షాలను తూలనాడుతూ, డబ్బిచ్చి వ్రాయించిన పుస్తకాలను నేరుగా ప్రవాస భారతీయులకు, మరి కొందరికి పంప నారం

ఖించారు. ఒక్కొక్క పాకెటు పంపాలంటే తొంభై రూపాయల ఖర్చు ఆయేది. ఈ కార్యక్రమానికి ఎంత డబ్బు ఖర్చుచేసిందో ప్రభుత్వం ! కాని వీటివల్ల ఉద్యమ తీవ్రతలో ఏ మాత్రము న్యూనత రాలేదు.

ప్రవాస భారతీయుల సహకారం ఎక్కడా ప్రభుత్వానికి లభించ నంత తీవ్రపరిస్థితి ఏర్పడింది.

టెక్సాస్ విద్యార్థి సంఘంపేర చౌహాన్‌కు ఆహ్వానం పంపారు. ఆయన ఎగిరి గంతువేసాడు. ఆయన రాగానే మర్యాదలతో దింపు కున్నారు. క్రిందికి దిగడంతోనే ఎమర్జెన్సీ వ్యతిరేక నినాదాలు స్వాగతం పలికాయి. చౌహాన్ ముఖం చిన్నచేసుకొని వెంటనే అదే విమానంలో వెనుతిరిగి పోయినాడు.

మంత్రుల పరువు దక్కించుకోవలసిన స్థితి చివరికి ఏర్పడింది. ఎక్కడైనా వ్యతిరేకతలేని స్థలమేదైనా లభిస్తుందేమోనని వెదికారు. ధర్మ వీరసింహ రాయబార కార్యాలయంలో కాకుండా 'లోటస్ మందిర్'లో కార్యక్రమం ఏర్పాటు చేయించాడు. కాని కార్యకర్తలు అక్కడికికూడా వెళ్ళారు. అది చిన్న కార్యక్రమం. మందిర ఆవరణంకూడ. మరి వ్యతిరేక ప్రదర్శనం చేయడం ఎలా ? నినాదాలు ఇవ్వలేదు. ఉపన్యాసం జోరుగానే జరిగింది. ఉపన్యాసం శాంతంగా జరగడంతో మంత్రిగారికి ఉత్సాహం పొంగి "ఇక అడగండి, ఏవైనా ప్రశ్నలుంటే" అన్నాడు. ఒక్కొక్క కార్యకర్త ప్రశ్నించ నారంభించారు. ఆ ప్రశ్నల జడి వానకు తట్టుకోలేక "మీ రందరూ సి. ఐ. ఎ. ఏజెంట్లు, దేశ ద్రోహులు" అని నిందించడం మొదలు పెట్టాడు. పాపం విసిగిపోయి మాట లేకుండా వెళ్ళాడు. ఇందరా గాంధీ దూతలు అమెరికన్ సెనేటు సభ్యులను కలియ నారంభించారు. సెనేటర్ కెనడీని కలిసి కేవలం భారత దేశంలో 1,000 మందే నిర్బంధంలో ఉన్నారని అన్నారు.

"వాళ్ళైనా ఆర్. యస్. యస్. వాళ్ళు - హింసాకాండ జరుపుతుందే ముతా అది. నాజీ తత్వం గలవాళ్ళు. మహమ్మదీయులను చంపు తుంటారు. ప్రెస్ సెన్సారుషిప్పు అనేదే లేదు.'' అని చెప్పారు.

వెంటనే డా॥ జితేంద్ర కుమార్, సహచరులతో పోయి ''ప్రతి పక్ష నాయకులందరూ జైళ్ళలోనే ఉన్నారు. ఆమె తన పార్టీ వాళ్ళను కూడా జైల్లో పెట్టింది'' అని వివరించి, ఆర్. యస్. యస్. జన సంఘల స్వరూప స్వభావాలు - ఆదర్శాలు వివరంగా చెప్పారు. వివరా లన్నీ సేకరించుకొని సెనేటర్ కెనడీ అమెరికన్ సెనేటులో గంభీరంగా ఎమర్జెన్సీని వ్యతిరేకిస్తూ ఉపన్యసించారు. అంతేకాదు సెనేటు, కాంగ్రెసు - రెంటికి చెందిన ప్రముఖ సభ్యులు పలువురు కలిసి ఎమ ర్జెన్సీని విమర్శిస్తూ ఇందిరా గాంధీకి టెలిగ్రాములు ఇచ్చారు. అందులో వారు 'ఎమర్జెన్సీని ఎత్తివేయండి. ప్రజానాయకులను విడుదల చేయండి. ప్రెస్ సెన్సారు షిప్పును తొలగించండి' అని కోరారు. ఈ టెలిగ్రాంల వల్ల ఢిల్లీలో ఇందిరా గాంధీ ఆంతరంగ బృందంతోసహా చాలా గాభరా పడ్డారనికూడా తెలిసింది.

సెనేటర్లు, అమెరికన్ కాంగ్రెసు సభ్యులు అలా టెలిగ్రాంలు పంపిన తరువాత ప్రవాస భారతీయులుకూడా టెలిగ్రాంలు పంపడం ప్రారంభించారు. రెండుమూడు నెలల్లో 46 దేశాలనుండి వేలకొలదిగా టెలిగ్రాంలు చేరాయి. ఇన్ని దేశాలనుండి ఇంతమంది ఎలా ఒక్క సారిగా తనకు వ్యతిరేకమైనారో బోధపడక ఇందిరా గాంధీ తన అంత రంగ మండలిలో 'ఇదంతా ఆర్. యస్. యస్. చేస్తున్న కుట్ర' అని ఆర్. యస్. యస్. ను అణచి వేయాలని, ఆర్. యస్. యస్. వ్యక్తుల ఏరివేత కార్యక్రమాన్ని చేపట్టాలని తీవ్రంగా మందలింపులు చేయ నారంభించింది.

విదేశాలలో జీవనం తీరికగా గడవదు. ఒక్క క్షణం తీరదు. అదొక పరుగులాట! అదొక హడావిడి! మరలాంటి చోట, పూర్తిగా శ్రమిస్తేనేగాని సరిపోయేటంత జీవనానికి లభించనిచోట ఈ 'ఎమర్జెన్సీ వ్యతిరేకానికి' ఇంత సమయం ఇచ్చేందుకు ఎలా సాధ్యం ? అని ఢిల్లీ హిందీ మాస పత్రిక 'జాహ్నవి' సంపాదకుడు భారత భూషణచడ్డా అడిగితే 'ఫ్రండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్' అధ్యక్షులు డా॥ జితేంద్రకుమార్ ''ఈ పని వచ్చినప్పటినుండి సినిమాకు వెళ్ళడానికి, కర్టెసీ డిన్నర్స్ (మర్యాద విందు)కు వెళ్ళడానికిగాని తీరిక లభించలేదన్నాడు. అదొక సవాలుగా ప్రవాస భారతీయులు తీసుకున్నారు. మిగతా మిత్రులంతా శ్రమించారు. మహిళలు చూపించిన ఉత్సాహానికి హద్దులేదు.'' అని అన్నారు.

యునైటెడ్ నేషన్స్ భవనం ముందు 30 జనవరి 1976న ఒక గొప్ప ప్రదర్శన జరిపారు. అప్పుడు మనం ఈ దేశంలో ఊహించుకోలేనంత చలి ఉన్నది. బానర్స్, అట్టలు – నినాదాలు వ్రాసినవి పట్టుకొని వివిధ దేశాలనుండి వచ్చిన సభ్యులకు 'అత్యవసర పరిస్థితి'ని గురించిన వాస్తవ వార్తలను ప్రచారంచేసి, అడిగిన వివరాలిచ్చి నిత్యమూ ఉదయం 8 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు కదలకుండా పనిచేశారు.

అప్పుడే 1976 జనవరి 31, ఫిబ్రవరి 1 తేదీలలో ఇండియన్స్ ఫర్ డెమొక్రసీ రెండవ వార్షిక సమావేశం జరిగింది. కొత్తగా అయిదు గురితో సారథ్య సంఘం ఎన్నుకోబడింది. అప్పుడే నడుపుతూన్న కార్యక్రమాలతోపాటు, వివిధ ప్రపంచ సంస్థలతో సంబంధాలు నెలకొల్పుకోవాలనుకున్నారు. ఈ క్రింది సంస్థలతో వెంటనే సంబంధాలు స్థాపించు కున్నారు.

1. ఎమ్నెస్టీ ఇంటర్నేషనల్.
2. సోషలిస్టు ఇంటర్నేషనల్.
3. ఇంటర్నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్ ఎండ్ వార్.
4. రిజిస్ట్రార్ ఆఫ్ లీగ్స్.
5. లీగ్ ఆఫ్ హ్యూమన్ రైట్స్.

ఇంకా ఇతర అనేక సంస్థలతో సంబంధాలు నెలకొన్నాయి.

ఆయా సంస్థలకు భారతదేశంలో ఇందిరా గాంధీ వ్యవహరిస్తున్న తీరు, ఎమర్జెన్సీ పేర పౌరులపై జరుగుతూన్న అక్రమాలు, జైళ్ళలో నిత్యమూ సాగుతూన్న అత్యాచారాలు - వివరాలు సిద్ధంచేసి ఇచ్చారు. వారిచేత ప్రకటనలు చేయించారు. ప్రపంచాభిప్రాయవేదికను నిర్మించ డానికిది దోహదం చేసారు.

అప్పుడే సుబ్రహ్మణ్యస్వామిని అమెరికాకు పంపించడం జరిగింది. అమెరికాలో స్వామి పర్యటన అద్భుత పరిణామాలను తెచ్చింది. మొత్తం అతడు 48 చోట్ల ఉపన్యాసాలిచ్చాడు. 32 సార్లు రేడియో టి. వి. కార్యక్రమాలలో పాల్గొన్నాడు. 18 పత్రికలు అతనితో జరిపిన ఇంటర్వ్యూలను ప్రకటించాయి. ఈ కార్యక్రమాలతో భారతదేశంలో 'ఎమర్జెన్సీ - అత్యాచారాలు' కేవలం భారతీయుల ప్రశ్న గామాత్రమేకాక, మానవత్వపు విలువలకు సంబంధించినదై పోయింది. ప్రపంచంలో ఇదొక తీవ్ర సమస్యారూపాన్ని ధరించ నారంభించింది.

ఇందిరాగాంధీ ప్రభుత్వానికి అసహనం మెండై, ప్రముఖుల ప్యాస్‌పోర్టులను రద్దుచేయించ నారంభించింది.

అప్పుడే 60 పేజీలకుపైగా భారత ఆత్యయిక పరిస్థితిని గురించిన ఒక 'రిపోర్టు'ను యునైటెడ్ నేషన్స్‌కు ఫ్రండ్స్ ఆఫ్ ఇండియా సమర్పించింది. ఆ రిపోర్టు సమగ్రంగా ఉంది. న్యాయశాస్త్ర రీత్యాను, యునైటెడ్ నేషన్స్ నియమావళి ప్రకారంగాను పకడ్బందీగా ఉన్నది. ఆ రిపోర్టును యునైటెడ్ నేషన్స్ పరిశీలించకుండా భారత ప్రభుత్వ ప్రతినిధి బృందం తీవ్రంగా ప్రయత్నించింది. కాని వారికి ఫలితం దక్కలేదు. ఇంటర్నేషనల్ రిలేషన్స్ సబ్‌కమెటీ - అయిదుదేశాల ప్రతినిధులతో - ఏర్పాటైంది. ఆ కమెటీ ఫ్రండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యుల వాఙ్మూలాలను సేకరించింది.

ఇందిరా గాంధీ ప్రభుత్వానికి దీనితో మరీ చికాకు ఎక్కువై నలుగురి ప్యాస్‌పోర్టులను రద్దుచేసింది. దీనివల్ల భారత ప్రభుత్వానికి మరోసమస్య ఏర్పడింది. విదేశ పత్రికలు ఈ సమస్యపై అతితీవ్రంగా వ్రాయ నారంభించాయి.

క్రమంగా అమెరికా మేధావుల సహకారం కూడా ఈ సంస్థకు లభించింది. నెహ్రూ కుటుంబంపట్ల అమితమైన అభిమానంగల డోరథీ నార్మన్ కృషివల్ల 80 మంది అమెరికన్ ప్రముఖులు సంతకం చేసిన ఒక విజ్ఞప్తిని - ఎమర్జెన్సీని నిరసిస్తూ, డిటెన్యూలను, ఇతర రాజకీయఖైదీలను విడుదల చేయవలసిందిగా కోరుతూ, సెన్సారు షిప్పు తొలగించమంటూ - ఇందిరా గాంధీకి పంపారు. ఈ సంతకాలు చేసినవారిలో ప్రథమశ్రేణికి చెందిన సాహిత్యకారులు, నోబెల్ బహుమతి గ్రహీతలు, కళాకారులు, విజ్ఞానశాస్త్రవేత్తలు ఉన్నారు.

ఈ విజ్ఞప్తి పత్రాన్ని అమెరికన్ పత్రికలు చాలా ప్రముఖ స్థానం ఇచ్చి ప్రచురించాయి.

'76 ఏప్రిల్‌లో 'ఫ్రండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్' పేర విదేశ భారతీయుల సమావేశం లండన్‌లో జరిగింది. దానికి అమెరికానుండి 8 మంది వెళ్ళారు. ఆ సమావేశం తరువాతనే గుజరాత్ మంత్రిగా పనిచేసిన మకరంత దేశాయ్ అమెరికా వెళ్ళాడు. అతడు అనేక నగరాలలో ఉపన్యసించాడు. ఎన్నో పత్రికా విలేఖరుల గోష్ఠు లలో పాల్గొన్నాడు. ఇదేకాలంలో భారతదేశంనుండి రామ్ జెట్‌మలానీ కూడా అమెరికా చేరుకున్నాడు. అతడు భారత బార్‌కౌన్సిల్ అధ్యక్షుడు. ప్రభుత్వం అతనిని నిర్బంధించాలని చాలా తంటాలు పడ్డది. కాని జైలులోపడి ఉండి ఏమీచేయలేక మ్రగ్గిపోయేకంటే స్వేచ్ఛా ప్రపంచానికి భారతదేశ మనుభవిస్తున్న బానిసత్వాన్ని గురించి తెలియజేయడం లాభదాయకమని ప్రచ్ఛన్న ఉద్యమ కార్యకర్తల సహాయంతో తప్పించుకొని బయట పడ్డాడు. జార్జ్ ఫెర్నాండజ్ భార్య లైలా ఫెర్నాండజ్ కూడా అమెరికా చేరుకున్నది. ఆమె ద్వారా ఉభయ దేశాల ఉద్యమ కార్యకర్తలకు పరస్పర సంబంధం నెల కొన్నది.

మరో చారిత్ర్యక ప్రదర్శనాన్ని కూడా అమెరికా భారతీయులు నడిపారు. దాన్ని మహాత్ముని దండియాత్రతో పోల్చుకున్నారు. కారు లేందే కాలుకదపడం అలవాటులేని అమెరికాలో 100 మైళ్ళ పాద యాత్రను 75 మంది బానర్లు పట్టుకొని, ప్రచార సామగ్రి తీసుకొని ఏప్రిల్ మాసాంతంలో ఫిలడల్ఫియానుండి ప్రారంభించారు. ప్రారం భంలో ఈ యాత్రలో సెనేటర్ మెకార్థీ, ప్రస్తుత గుజరాత్ మంత్రి మకరంత దేశాయి, హారిసన్ అలెగ్జాండర్, హోమర్ జైకా మొదలగు వారు ఉపన్యసించారు. ఈ పదయాత్రలో వనితలు కూడా పాల్గొ న్నారు. 4 ఏండ్ల ఒక బాలిక కూడా తన తల్లితోపాటు ఈ 100 మైళ్ళ పాదయాత్రలో పాల్గొన్నది.

ఈ పదయాత్ర ప్రారంభించడానికి ఫిలడల్ఫియాను ఎన్ను కోడానికి కూడా ఒక కారణమున్నది. అక్కడే అమెరికా స్వాతంత్ర్యాన్ని గురించి మొట్టమొదట ప్రకటించడం జరిగింది. అలా ఒక మహాదేశ స్వాతంత్ర్యపు తొలినినాదం వినవచ్చిన ప్రదేశంనుండి ఈ పదయాత్ర 70 రోజులుసాగి చివరికి అంతర్జాతీయ మహాసభా భవనం ముందు ఆగింది.

ఈ పదయాత్రకు అమెరికా పత్రికల్లో చిత్రపటాలతో సహా ఎంతో ప్రచారం లభించింది.

అక్కడి కార్యకర్తలు భారతదేశంలో పనిచేస్తున్న అజ్ఞాత నాయకుల వార్తలను సేకరించి 'వాయిస్ ఆఫ్ అమెరికా'కు అంద చేస్తుండేవారు. ఈ సంస్థ ప్రచారం జనహృదయాలను ఆకర్షించడం అమెరికాలో ప్రారంభించేసరికి రాయబారి కౌల్‌కు బెదురు ప్రారంభ మైంది. ఒక వ్యతిరేక వేదిక నిర్మాణం చేయించాలని చాలా తంటాలు పడ్డాడు. కాని లాభంలేకపోయింది.

'76 నవంబరులో ఇండియన్స్ ఫర్ డెమొక్రసీ మూడవ వార్షిక సమ్మేళనం జరిగింది. భారత రాజ్య సభలో చమత్కారంగా కన్పించి ఒక దృశ్యం నిర్మించి, అలాగే మాయమై, భారత ప్రభుత్వ నాయకుల పరిపాలనా సామర్థ్యాన్ని నవ్వులపాలుచేసిన సుబ్రహ్మణ్యస్వామి రెండో సారి అమెరికాకు చేరుకున్నారు. జనవరిలో ఎన్నికలు ప్రకటింపబడ డంతోటే ఆయన స్వదేశానికి తిరిగివచ్చారు.

మహిళలు ఈ ఉద్యమానికి అందచేసిన సహకారం అద్భుత మైంది. డా॥ హంసా శాహ, డా॥ ఖుశాల్ అహ్మద్, పీరా మిత్ర, మయూరికా పోద్దార్, కోకిలా బహన్, అంజలి పాండ్యా రాత్రీ పగలు

ఒకటిగా పనిచేసారు. 'సత్యవాణి'ని నిర్వహించింది అంజలి బహన్. రోజుకు 12 గంటలు శ్రమ పడుతుండేది.

అమెరికాలో జరిగిన ఈ ఉద్యమంతోపాటే ఇంగ్లాండులోని భారతీయులు కూడా ఈ ఉద్యమాన్ని చేబట్టారు. ఇంగ్లాండులో డా॥ కె. పి. హరదాస్ ఈ బాధ్యతను తీసుకున్నారు. ఆరేండ్లపూర్వం హరదాస్ లండన్ వెళ్ళాడు.

ప్రారంభంలో ఒకచోట సమావేశ మొకటి - భారతీయులది - జరుగుతున్నది. అందులో రాయబార కార్యాలయానికి చెందిన అధికారి ప్రసంగిస్తుండగా కొందరు యువకులు ఎమర్జెన్సీని గురించి ప్రశ్నించ నారంభించారు. తరువాత ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. అది క్రమంగా మిగతా నగరాలకు ప్రాకింది. అప్పటి కింకా ఉద్యమ రూపం దానికి లభించలేదు. ఎవరికి తోచినట్లు వారు, ఎక్కడ అవ కాశం ఉంటే అక్కడ ఎమర్జెన్సీని వ్యతిరేకించ నారంభించారు. ఇందులో అందరూ యువకులే. క్రమంగా వీరు 'ఇండియన్ ఫ్రీడమ్ ఫ్రంట్' అని ఒక సంఘాన్ని స్థాపించారు. ఇందులో కొందరు భారత దేశంలో పుట్టని భారతీయులు కూడా ఉన్నారు. ప్రారంభంలో చిన్న చిన్న సమావేశాలు జరిపి ఎమర్జెన్సీని గురించి అణచివేత విధానాలను గురించి చర్చించుకుంటూ ఉండేవారు.

25 ఆగస్టు '75 రోజున ఇంగ్లాండులో ఈ ఉద్యమాన్ని మూల మూలలకు విస్తరింపచేయడానికి "ఫ్రండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్" అనే పేర ఒక సంస్థను స్థాపించారు. సొసైటీ స్థాపించిన తరువాత సమావేశాలు - ప్రదర్శనలు - నిరసన ప్రకటనలు ముమ్మరంగా, వ్యవస్థా పూర్వకంగా ప్రారంభమైనాయి. కరపత్రాల ప్రచురణ ప్రారంభమైంది.

9 జనవరి 1976 న సుబ్రహ్మణ్యస్వామి ఇంగ్లాండు వచ్చాడు. ఆయన రాకతో ఉద్యమానికి బలం చేకూరింది. డా॥ స్వామి అపూర్వ మేధావంతుడు. చక్కని వాక్చాతుర్యంగల మనీషి. ప్రతిభావంతంగా, అంకెలతో నిరూపిస్తూ భారతదేశంలో ప్రారంభమైన అణచివేత చర్యలను, ప్రజాస్వామ్య హత్యనూ ఆయన వర్ణిస్తుంటే ప్రజలు క్షోభించి పోతూండేవారు. సహానుభూతి పుష్కలంగా లభిస్తుండేది. స్వామి ఎమర్జెన్సీ పెట్టగానే అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాడు. ఆర్. ఎస్. ఎస్. నిర్ణయాన్ననుసరించి – ప్రభుత్వం వేయికళ్ళ కాపు కాచినా – విదేశాలకు చేరుకున్నాడు. విదేశాలలో అతన్ని పట్టుకోవడానికి పన్నాగం పన్నింది భారత ప్రభుత్వం. న్యూయార్క్‌నుండి ప్రచురించబడుతున్న "సత్యవాణి" పత్రిక ఆ ప్రయత్నాన్ని ఇలా వివరించింది.

''మహారాజా వాయుయాన సర్వీసులో, దళాలుగా 12 మంది న్యూయార్క్‌ కొచ్చారు. ఈ రాక 10 జనవరి నుండి 14 దాకా జరిగింది. డా॥ సుబ్రహ్మణ్యస్వామిని రంగంలోంచి తొలగించటం ఈ దళం పని.

అధికారికంగా ప్యాస్‌పోర్టులుగల గూఢచార అధికారులిద్దరు ఈ దళానికి నాయకులు. మిగతా 10 మంది వ్యాపారులుగా, యాత్రికులుగా, విద్యావేత్తలుగా నటిస్తూండేవాళ్ళు. ఆ ఆఫీసర్లు స్వామిని పట్టుకొనేందుకు సహకరిస్తే ప్రత్యుపకారం చేస్తామని అమెరికా గూఢచారులతో మంతనాలు సాగించారు. మిగతా పదిమంది తలపాగ – గడ్డంధరించి తిరిగే ఒక వ్యాపారితో పొత్తుపెట్టుకొని – అమెరికా గూఢచారి అధికారులు సహకరించకపోతే – గుండాయిజంతో తామే చేద్దామని పథకం వేసుకున్నారు. ఈ పథకం ప్రకారం ''రా'' అధికారి రాయబార వర్గ కార్యాలయాల్లో ఉంటాడు. మిగతా రాయబార వర్గ కార్యాలయ అధికారులు అతనిక్రింద పనిచేయాలి......

స్వామిమీద దాడికి ప్రయత్నించటం ఇది మొదటిసారికాదు. గతజూన్‌లో స్వామి భారత్‌కు వెళ్ళేమార్గంలో, ఇంగ్లండ్‌లో దిగినపుడు 3 గురు భారతీయులు అతన్ని ఎత్తుకుపోవటానికి ప్రయత్నించారు. కానీ హిందూ స్వయంసేవక సంఘ యువసభ్యులు ఆ ముగ్గురిమీద విరుచుకు పడ్డారు. ఆ నేరాన్ని స్కాట్‌లాండ్‌యార్డ్ పోలీసు పరిశోధిస్తున్నది.

ఈ మారు వచ్చిన దళానికి ఆశ ఉన్నది. స్వామి హార్వర్డులో విజిటింగ్ ప్రొఫెసరుగా కొంతకాలం ఉంటాడు. ఈ దళం అతనిని కనిపెట్టి ఉండాలి. 'అతను ఉండేదెక్కడ - ఆర్థిక శాస్త్రబోధలకు ఎప్పుడు వెళతాడు - తిరిగి ఎప్పుడు వస్తాడు - ఇవన్నీ సేకరించిన తర్వాత అతణ్ణి 'మాయం జేసే పథకాన్ని రూపించవచ్చు.'

"ఆ దళం వచ్చినా ఇందిరాగాంధీ నియంతృత్వాన్ని నేను వ్యతిరేకిస్తూనే ఉంటాను. దీంట్లో మార్పులేదు" - అన్నాడు స్వామి "సత్యవాణి" విలేఖరితో. కానీ, పాపం! దళం విఫలమైంది.

స్వామి రాజ్యసభకు హాజరుకాక రెండునెలలు కావస్తున్నది. స్వామి ఆర్. ఎస్. ఎస్. అధికారులతో సంప్రదించి భారతదేశానికి వెళ్ళి, రాజ్యసభలో హాజరై మళ్ళీ తప్పించుకొని వచ్చే ప్రణాళికను సిద్ధం చేశాడు. ఆర్. యస్. యస్. అధికారులు ముందు సంశయించారు. స్వామి ఫర్వాలేదన్నాడు. విజయవంతంగా అనుకున్నది నెరవేరితే అజ్ఞాత ఉద్యమానికి ఒక ఊపు వస్తుందని చివరికి నిశ్చయమైంది.

భారత ప్రభుత్వానికి కూడ స్వామి తిరిగి రావచ్చునని చూచాయిగా తెలిసి, జాగ్రత్తగానే ఉన్నా - స్వామిరానే వచ్చాడు. ఆ వివరాలన్నీ అజ్ఞాత పత్రిక 'జనవాణి' ఈ విధంగా వివరించింది.

''జనసంఘ యం. పి. సుబ్రహ్మణ్యస్వామి, మెరపులాగా రాజ్య సభలోకి రావడం - ప్రభుత్వం అతన్ని నిర్బంధించడానికి ఎంత ప్రయత్నించినా తప్పించుకొని బయటపడడం - ఒక చమత్కారం - ఆశ్చర్యకరమైన విషయమైంది. ప్రజలు స్వామిని — శివాజీ, నేతాజీ వీర సావర్కర్‌లతో పోలుస్తూంటే - ప్రభుత్వవర్గాలకు, కమ్యూనిస్టులకు కడుపులు మండి పోతుండేవి... స్వామి తిరిగి వస్తున్నాడని ప్రభుత్వానికి తన గూఢచారులద్వారా తెలిసింది. ఆగస్టు 2 న సి. ఐ. డి. లు బొంబాయిలోనున్న స్వామి అత్తగారింటికి వెళ్ళి అడిగారు. తర్వాత విమానాశ్రయా లన్నింటిలో కాపలా పెట్టారు. ఇంతజేసినా లాభం లేకపోయింది.

ప్రొఫెసరు స్వామి ఆగస్టు 6 న దేశానికి తిరిగి వచ్చాడు. 10 వ తేదీన రాజ్య సభ సమావేశం ఆరంభంకాగానే సభ్యుల రిజిష్టరులో సంతకంచేసి సభలోకి ప్రవేశించాడు. ''పాయింట్ ఆఫ్ ఆర్డర్' లేవనెత్తి అందరి దృష్టి తనవేపు మరల్చుకొన్నాడు. సభాధ్యక్షుడు జెట్టి దిగ్భ్రాంతిచెంది కొయ్యబారి నిల్చున్నాడు. మిగతా సభ్యులు కూడా ఆశ్చర్యపోయి స్తబ్ధులైనారు. ఓం మెహతా స్వామినిచూచి, గబగబా తన కాగితాలు సర్దుకొని వెంటనే చర్య జరిపించటానికి పెద్ద పెద్ద అంగలతో బయటికి దూసుకుపోయినాడు. కానీ అటు ఓం మెహతా పోవడంతోటే - ఇటు స్వామి కూడా బయటికి జారుకున్నాడు. ద్వారం వద్ద గోడే మురహరి కన్పించాడు. ఆయన హలో — హలో అంటూ మాట్లాడే ధోరణిలో ఉన్నాడు. స్వామి ''ఇప్పుడే వస్తా'' అంటూ జారుకున్నాడు. ఓం మెహతా హడావుడి అంతా వ్యర్థమైంది. అందరూ చూస్తుండగా స్వామి సభలోంచి అంతర్థాన మైనాడు.

బయట సిద్ధంగా ఉన్న కారులో 'తుర్రు'మన్నాడు. కొన్ని మైళ్ళు వెళ్ళి వేషం మార్చుకొని రైల్వేస్టేషన్లో యూత్ కాంగ్రెస్ వాళ్ళతో కలిసి రైలెక్కి సాగిపోయాడు.

స్వామి కథలు చిలవలు పలవలైనాయి. ఉదాత్తమైన ధ్యేయం కొరకు తనను బాధల అగ్నికి అర్పణం చేసుకొనే ధీరులను, ప్రజలు దేవతల్లానే కొలుస్తారు. స్వామి అలా సహజమైన ధీరుడు. అతడొక తుఫాను సృష్టించాడు విదేశాల్లో—

లిస్టర్‌లో మొదటి సమావేశానికి 2,000 మంది హాజరైనారు. అది ఆ నగరంలో ఒక అపురూపం. ప్రజలలో ఈ సభ ఒక కదలిక కల్గించింది. ఆ సభలోనే కార్యకర్తల పట్టుదలకు పాథేయం లభించింది. తర్వాత ఏప్రియల్ మాసంలో ఒక అంతర్జాతీయ సమ్మేళనం ఏర్పాటు చేయాలని నిశ్చయించుకున్నారు. ఇందులో ప్రపంచంలోని వివిధ దేశాలనుండి భారతీయులు ప్రతినిధులుగా వచ్చి పాల్గొనాలని నిర్ణయమైంది. ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభమైనాయి.

ఇదిగాక రిపబ్లిక్ అవతరణ దినాన, ఎమర్జెన్సీ ప్రకటించిన తేదీన, గాంధీ జయంతినాడు, భారత స్వాతంత్ర్య దినోత్సవపురోజున, నెహ్రూ పుట్టినరోజున ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించాలని కూడా నిశ్చయమైంది.

ఆ ప్రయత్నం ఫలించింది. అంతర్జాతీయ భారతీయుల సమ్మేళనం విజయవంతమైంది. సమ్మేళనానికి ప్రచారం బాగా విశ్వవ్యాప్తంగా జరగాలనే ఉద్దేశ్యంతో, బి. బి. సి. వార్తా ప్రసార సంస్థ సహకారాన్ని సొసైటీ అర్థించింది. బి. బి. సి. ''ఎందరు వస్తారు ? మీ సమావేశం విజయవంతమవుతుందా ! మీ ప్రభుత్వ వ్యతిరేకంగా మీరు ఇలాంటి

మహాసభ ఏర్పాటుచేస్తే ధైర్యంతో ప్రతినిధులు వస్తారా ?'' అని అడిగారు. ''ఎందరు వస్తే సమావేశం చక్కగా జరిగినట్లు మీరు భావిస్తారు ?'' అని సొసైటీ ప్రతినిధులు అడిగితే, అలాంటిదే మరో సమావేశాన్ని ప్రసక్తికి తెచ్చి ఆ సమావేశంలో 14 మంది పాల్గొన్నా రన్నారు. అయితే అంతకన్నా ఎక్కువే వస్తారని సొసైటీ ప్రతినిధులు గట్టిగా చెప్పారు.

సమావేశానికి 15 దేశాలనుండి 350 మంది ప్రతినిధులు హాజరై నారు. బి. బి. సి. వారు అదిచూచి ఆశ్చర్యచకితులైనారు. భార తీయులు ఇంత సమర్థంగా క్రమశిక్షణతో నడిపించగలరా అని విస్తు పోయారు. సమావేశాలు క్రమశిక్షణతో, ఓర్మితో అర్థవంతంగా కొన సాగడం వారికి మరీ ఆశ్చర్యాన్ని కలిగింపచేసింది.

బి. బి. సి., లండన్ నగరంలోనివేగాక ఇంగ్లండు దేశానికి చెందిన ప్రముఖ పత్రికలన్నీ, టెలివిజనూ ఈ సమావేశానికి చాలా ప్రాముఖ్యాన్ని ఇచ్చాయి. సొసైటీ సుబ్రహ్మణ్యస్వామిని సంస్థాపక అధ్యక్షునిగా, మకరంత దేశాయిని కార్యదర్శిగా ఎన్నుకున్నది. దీనికి జె. పి., ఠేంగ్డితోసహా అనేకులు తమ శుభాకాంక్షలను తెల్పారు.

14 నవంబరు '75 న 25, 26గురు తరుణులు 'చాచా నెహ్రూ' ఉత్సవంపేర ఒక కరపత్రం తీసి – అందులో మనసును కరగించే విధంగా ''ఒకస్త్రీ తనపదవికొరకు వేలకొలది పసిపాపల హృదయాలలో ఎంత ఆవేదన కలిగించిందో; వారి సుఖాలను హరించింది'' అని వ్రాసి పంపారు. ఈ కరపత్రం మనసులను కదలించిం దంటారు.

జె. పి. ఆరోగ్యాన్ని గురించి సొసైటీతోపాటు 'బ్యూరో ఆఫ్ ది సోలిషస్టు ఇంటర్నేషనల్' వారు కూడా తీర్మానాలు చేసి పంపారు.

లండన్‌లో అటు లేబరు పార్టీకి ఇటు కన్జర్వేటివ్ పార్టీకి కూడా నెహ్రూ కుటుంబం అంటే ఒక అభిమానం. ఈ అభిమానం ఎంత పని చేసినా ఇందిరాగాంధీ వ్యక్తిత్వం ఇంగ్లాండులో పూర్తిగా దెబ్బతిన్నది.

సుబ్రహ్మణ్యస్వామి విదేశాలను కదలించాడు.

అతణ్ణి హైద్రాబాదులో 25-9-77 న కలుసు కున్నప్పుడు "ఈ పోరాటం ఇందిరాగాంధీ అధికారవలయానికి-మగత ప్రజకూ గదా ఇది జాతీయ సమస్య - కేవలం భారతప్రజలకు సంబంధించినది. మరి ఆంతరంగిక సమస్యను గురించి ప్రపంచ సద్భావాన్ని నిర్మించడానికి కొంతమంది ప్రతిభావంతులను బైటికి పంపవలసిన అవసరమే మొచ్చింది ?" అని అడిగితే ఆయన ఒక వైపు ఇందిరాగాంధీ ప్రపంచ సద్భావాన్ని - ఇంకా కఠినచర్యలు తీసుకొనే నిమిత్తం, తను తలపెట్టిన చర్యలన్నిటిని సమర్థించుకోడానికి - నిర్మాణం చేసుకుంటున్నది. ఇంకా ఎక్కువ కఠినచర్యలు తీసుకోబోతున్నది. దీనికొరకు ఆమెకు ప్రపంచంలో మెప్పుకావాలి. అందుకని విదేశాలలో ప్రచారం ప్రారంభించింది. ఆమెకు జవాబు ఇచ్చేందుకు, ప్రపంచంలో తప్పుడు అభిప్రాయాలు కల్గించడం ఆమెకు సాధ్యపడకుండా చేయడానికి కొందరు విదేశాలకు వెళ్ళాలని నిశ్చయమైంది. ఉద్యమాన్నిగురించి వాస్తవాలు తెల్పడం మా ప్రధాన లక్ష్యం" అన్నారు.

"ఈ కార్యక్రమంలో మీ మిషనుకు సహకారం ఎవరినుండి లభించింది ?" అని ప్రశిస్తే ఆయన "నన్నడిగితే స్వదేశంలోను - విదేశాలలోను ముందునిలిచి పనిచేసింది - రాష్ట్రీయ స్వయంసేవక సంఘ స్వయంసేవకులే. నేను దేశంలోపల పదినెలలు, బైట పదినెలలు పనిచేశాను. నాకు స్వయంగా తెలిసిన వాస్తవాలను బైటి ప్రపంచ ప్రజలకు తెలియచేయడమే నిజానికి నా కార్యక్రమం. కాని ఫ్రండ్స్

ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్ పేర సంఘటితులైన రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సభ్యుల వ్యవస్థ అక్కడ లేకుండా ఉండి ఉంటే నేను 300 సమావేశాల్లో, 70 విలేఖరుల గోష్ఠులలో, 82 టెలివిజన్ ఇంటర్వ్యూలలో ప్రసంగించగలిగి ఉండేవాణ్ణికాదు" అని అన్నాడు.

అలాగే నయనతారా షెహగల్, రజనీ కొఠారీలు కూడా విదేశాలలో ఉద్యమ ప్రచారం చేశారు.

విభిన్న దేశాలలో భారతీయులకు ఉద్యమ వార్తలు చేర్చి, వారిలో భావైక్యత నిర్మించే ఉద్దేశ్యంతో 'సత్యవాణి' పేర పత్రికను ప్రారంభించారు. ముందు 'న్యూస్ లెటర్సు' పంపబడుతుండేవి. కాని 'సత్యవాణి' ప్రచురణతో ఒక మలుపు ప్రచారానికి లభించింది. చక్కని కార్టూనులతో, కత్తిరింపులతో, అజ్ఞాత మార్గాలలో చేరిన భారత వార్తలతో, ఉద్బోధలతో, నిశితవిమర్శలతో విదేశ సహకార వార్తలతో 'సత్యవాణి' గొప్ప పాత్రను నిర్వహించింది. 5000 కాపీలు అచ్చవుతుండేవి. 52 దేశాలకు ఈ పత్రిక వెళ్తుండేది.

లండన్‌నుంచి 'స్వరాజ్య' అనే మరో పత్రిక కూడా కొన్నాళ్ళు నడిచింది.

లండన్‌లో జరిగిన ప్రయత్నాలలో రెండు ప్రదర్శనలు ప్రజాభిప్రాయాన్ని సేకరించడంలో చాలా గొప్పగా ఉపకరించాయి. 26 జనవరి 76 న విపరీతపు చలిలో మూడు పార్కులనుంచి 6 మైళ్ళు నడిచి, ప్రదర్శకులు 4000 మంది-స్త్రీ పురుషులు-నినాదాలిస్తూ ఇండియా హౌస్‌దాకావెళ్ళి, రాయబార కార్యాలయంలో ఒక విజ్ఞప్తిని సమర్పించారు. అదే ఏడు 26 జూన్ న విపరీతమైన ఎండల్లో మరో ప్రదర్శన జరిగింది. ఈ ప్రదర్శన ట్రైఫల్‌గర్ స్క్వేర్‌నుండి ఇండియాహౌస్‌దాకా 2½ మైళ్ళపొడవున సాగింది. కాలినడకన 2000 మంది ప్రదర్శకులు

నడిచి ఇండియాహౌస్ ఎదుట ఒక బహిరంగసభ జరిపారు. ఆ సభలో సుబ్రహ్మణ్యస్వామి, మకరంత దేశాయ్, అకాలీనాయకుడు జ్ఞానీ సోహనసింహ్ మాట్లాడారు.

15 ఆగస్టు, 4 నవంబరు తేదీలలో ఇంగ్లాండు మొత్తంలో అనేక ప్రదేశాలలో సభలు జరిగాయి. గాంధీజయంతి రోజున లండన్‌లో ఒక స్క్వేర్‌లో ఉన్న గాంధీ విగ్రహానికి పూలమాల నర్పించి భారత దేశంలో జైళ్ళలో నాయకులు, ప్రజలు అనుభవిస్తున్న బాధలను గురించి చాలమంది ప్రముఖులు ఉపన్యాసాలిచ్చారు. ఈ ఉద్యమం ఢిల్లీ పీఠాన్ని కదిలించింది. కేంద్రమంత్రులను పంపి ఉద్యమాన్ని ఆపాలని - నిరోధించాలని ప్రయత్నించింది. విద్యాచరణ్ శుక్లా లండన్ వచ్చి సొసైటీ కార్యకర్తలను కలుసుకున్నాడు. ఒక గంట పది నిముషాలు సాగిన సంభాషణలో సొసైటీ ప్రతినిధులు ఖచ్చితంగా ''ఎమర్జెన్సీ ఎత్తివేయాలి, నాయకులను విడుదల చేయాలి, సంఘం మీద నిషేధం తొలగాలి - అప్పుడే - ఉద్యమం ఆగుతుంది'' అని సమాధాన మిచ్చారు.

కాంగ్రెస్ అధ్యక్షుడు బారువా కూడా లండన్ వెళ్ళాడు. ఇండియా టీ సెంటర్ అనేచోట విలేఖరుల గోష్ఠి ఏర్పాటు జరిగింది. ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ కార్యకర్తలకు ఈ విషయం తెలిసింది. వెంటనే నిరసన ప్రదర్శనలకు ఏర్పాట్లు జరిగాయి. బారువా దీనిని గమనించి గోష్ఠిలో పాల్గొనకుండానే కారులోంచి దిగకుండానే పలాయనం చిత్తగించాడు.

బ్రహ్మానందరెడ్డి లండన్ వెళ్ళాడు. ఆయన ఒక హోటల్‌లో బస చేశాడు. అతను బస చేసిన హోటలుకు అతను వెళ్ళిన లగాయతు ఇంగ్లాండులో అనేక నగరాలనుంచి టెలిఫోన్ పిలుపులు వస్తూండేవి.

టెలిఫోన్ ఎత్తితే ఇంకా ఎమర్జెన్సీ ఎత్తేయలేదేం? నాయకులను ఎప్పుడు విడుదల చేస్తారు? సంఘం మీద నిషేధం తియ్యరా? అని సవాళ్ళు వినిపించేవి, ఒకటా – రెండా – వందల పిలుపులు. బ్రహ్మానందరెడ్డి ప్రాణాలు విసిగి రిసీవర్‌ని ప్రక్కకు పెట్టాడు.

హితేంద్ర దేశాయ్ లండన్ వెళ్ళాడు. సభలు జరపాలని నానా తంటాలుపడ్డాడు. కాని ప్రయత్నం ఫలించలేదు.

విదేశాలలో జరిగిన కృషిలో కేదారనాథ సహానీ పాత్ర కూడ విశేషంగా ఉన్నది. సెప్టెంబరు '76 లో సహానీ మలేషియా, థాయలాండ్, సింగపూర్, మారిషస్ మొదలగు దేశాలలో ప్రయాణిస్తూ ఇంగ్లండు వెళ్ళాడు. విదేశాలలో ఉద్యమ నిర్ణయాలను అనుసరించి మూడు నియమాలను పాటించాల్సి వచ్చేది. విదేశ ప్రభుత్వాల ప్రముఖులతో సంబంధాలు పెట్టుకోక పోవడం – విదేశీశక్తుల సహకారాన్ని ఏ విధంగానూ పొందక పోవడం – విదేశాలలో ధనసహాయం ఎవరుచేస్తామన్నా స్వీకరించకపోవడం. సహానీ వెళ్తూ తన వెంట అజ్ఞాత సాహిత్యాన్ని, జె. పి. టేప్ ఉపన్యాసాన్ని, జె. పి. జీవితాన్ని గురించిన ఓ చిన్న ఫిల్మును వెంటతీసుకొని వెళ్ళారు. సహానీ అంతకుముందే విదేశాలలో చాలమందికి తెలిసినవాడు. వలస భారతీయులలో సుబ్రహ్మణ్యస్వామి ఆసక్తికరమైన కదలిక కదిలిస్తే సహానీ పర్యటన వారిలో పట్టుదలను, ఆదర్శవాదాన్ని, క్రియాశీల భాగస్వామ్యాన్ని కలిగింపచేశాయి.

విదేశాలలో జరిగిన ఈ ఉద్యమం బహుశా ప్రపంచ చరిత్రలో మరో పోలిక లేనిది. బ్రిటిష్‌వారి హయాంలో విదేశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా స్వరాజ్యం కోసం సాగిన పోరాటకాలంలో విదేశాలలో ప్రపంచ ప్రజల సానుభూతిని సంపాదించడానికి ప్రయత్నాలు జరిగాయి.

విప్లవ ఉద్యమకాలంలో జరిగాయి. కాంగ్రెసువారిద్వారా జరిగాయి. కాని ఇంత వ్యాపకంగా ఇంత బహిరంగంగా ఇంత క్రియాశీలంగా జరగలేదు.

పోగా స్వదేశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విదేశాలలో ఉద్యమిస్తే ప్యాస్ పోర్టులు రద్దుకావచ్చు. సదుపాయాలు ఆగిపోవచ్చు. స్వదేశంలో ఉన్న కుటుంబసభ్యులు, బంధువులు ఇబ్బందులకు గురికావచ్చు. ఉద్యోగ అవకాశాలు లేకుండా పోవచ్చు. ఇంకా ఎన్నో ఇబ్బందులు కలుగ వచ్చు. ఎక్స్ట్రాడిషన్ (రప్పింపు) అమలుజరిపి ఉద్యమకారులను రూపుమాపడానికి కూడా ప్రయత్నించవచ్చు. కానీ ఉద్యమకారులు వీటిని లెక్కచెయ్యలేదు. ఒకటి – స్వాతంత్ర్యంపట్ల, మానవ అధి కారాలపట్ల, మౌలిక ఆదర్శాలపట్ల వారికి గల విశ్వాసం దీనికి కారణం. రెండు – విదేశాలలో "ప్రపంచ ప్రజాస్వామ్యదేశాలలో గొప్పదని, గాంధీపుట్టిన దేశమని, అహింసకు అంకితమైన జాతి అని – పేరు పొందిన భారదేశం – ఈ దేశ ప్రజల వ్యక్తిత్వం పేరు ప్రతిష్ఠలు ఇందిరాగాంధీ చర్యవల్ల మంటగలసిపోయాయి." ఈ అభిప్రాయాన్ని తొలగించవలసిన కర్తవ్యాన్ని ఉద్యమకారులు గుర్తించారు. మూడు – దీనికి ఒక రూపాన్నిచ్చి నడిపించడానికి విదేశాలలో అనేక కారణాలగా వెళ్ళి నివసిస్తున్న ఆర్. యస్. యస్. కార్యకర్తల ప్రయత్నం, పట్టు దలతోడై విసుగెరుగని, అలుపెరుగని పోరాటం కొనసాగింది. వీరి కలలు ఫలించి ఎన్నికలైన దరిమిలా ఇందిరాగాంధీ ఓటమి; జనతా గెలుపు జరిగాయి. న్యూయార్కు, ఫిలడల్ఫియా, హూస్టన్, లాస్ ఏంజలీస్ మొదలగు నగరాలలో భారతీయులు విజయోత్సవాలు జరుపు కున్నారు. అమెరికన్ సెనేట్ సమావేశంలో పూర్వం భారతదేశంలో అమెరికా రాయబారిగా పనిచేసిన సెనేటర్ పాట్రిక్ మొనిహాన్ విజయం సాధించిన భారత ప్రజలను అభినందిస్తూ తీర్మానం ప్రవేశపెట్టి "భారత దేశంలో ప్రజాస్వామ్యం పునరుద్ధరింపబడడంతో 1977 లో సమస్త

ప్రపంచానికి జరుగవలసిన అత్యంత ప్రాధాన్యమైన సంఘటన జరిగింది'' అన్నారు.

ఈ పోరాటంలో టైమ్స్ ఆఫ్ లండన్, ఫార్ ఈస్టరన్ ఎకనామిక్ రివ్యూ, గార్డియన్, డైలీ టెలిగ్రాఫ్ మొదలగు ఎన్నో పేపర్లు - పాత్రికేయులు సహకరించారు.

విదేశాలలో జరిగిన ఈ ప్రయత్నం వెనుక కీలక పాత్రధారిగా వ్యవహరించిన ఒక వ్యక్తిపేరు చెప్పందే ఈ వివరణకు అర్థం ఉండదు. అది భిడేగారు. విదేశాలలో ఉన్న సంఘ స్వయంసేవకుల సంపర్కం వీరిపని. సంఘ ప్రచారకులు. విదేశ ఉద్యమానికి వ్యూహరచయితలు.

# 16

# కోర్టుల్లో - జైళ్ళల్లో

'మోకాళ్ళమీద బ్రతికేకంటె
పాదాలమీద చస్తాం.'

—రూజ్‌వెల్ట్

ఉద్యమంలో నియంత ఏజంట్లకు కన్పించినవన్నీ నేరాలే. ప్రజాస్వామ్యంలో ఎమర్జెన్సీ పెట్టినా ప్రజలకు ప్రభుత్వాన్ని అభ్యర్థించే హక్కు – ఇది మంచి – ఇది చెడు – అని ప్రకటించే హక్కు కూడా లేదనడం ఫాసిజం కాదంటున్నది ఇందిరా గాంధీ.

'ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి'

'పౌర హక్కులను పరిరక్షించాలి'

'ఇందిర చేతిలో ప్రజాస్వామ్యము హత్యచేయబడింది'

'ఆర్. యస్. యస్. పై నిషేధం తొలగించాలి.'

'లిఫ్ట్ ఎమర్జెన్సీ' (ఎమర్జెన్సీ ఎత్తివేయి)

'పత్రికా స్వాతంత్ర్యము కావాలి'

'తానాషాహీ బంద్‌కరో'

'జాతీయ నాయకులను విడుదలచేయాలి'

ఎక్కడైనా ఇవే నినాదాలు. మాటల్లోమార్పు ఉండవచ్చు. కూర్పుల్లో తేడా ఉండవచ్చు.

ప్రజలకు ఎమర్జెన్సీలో పై నినాదాలనండి కోర్కెలనండీ, అభిప్రాయాలనండి ప్రకటించే హక్కు లేదా !

కారణం తెలుపకుండా నిలువునా ఉరితీసినా అడిగే హక్కు కోర్టులకూ లేదు. బాధితుడికీ లేదన్నాడు సుప్రీంకోర్టులో వాదిస్తూ నిరేన్ డే – అక్కడ ఢిల్లీలో.

ఇక్కడి జి. మల్లికారునరావు అనే మేజిస్ట్రేట్ ఆరుగురికి ఒక సంవత్సరము కఠినశిక్ష విధించాడు – పై నినాదాలన్నందుకు. అతనికి కోర్టులో యువకులు కనబరచిన ధైర్యం బాధ కల్గించింది. 'తమ నాయకులను జైళ్ళలోపెట్టి కాంగ్రెసు పార్టీ ఎలక్షన్లలోకి దిగుతున్నదని తాము ప్రాణాలైనా అర్పించేందుకు సిద్ధంగా ఉన్నామని యువక సత్యాగ్రహులు అనడాన ఆ ప్రవృత్తిని మొగ్గలోనే త్రుంచివేయడం ఉత్తమంగా తోచింది నారాయణపేట్ మున్సిఫ్ జి. మల్లికార్జునరావుకు.

హైదరాబాద్‌లో మొట్టమొదట సత్యాగ్రహ శంఖాన్ని పూరించిన అంబాదాస్ కేసును విచారించిన మెట్రోపాలిటన్ నాల్గవ మేజిస్ట్రేట్ ఎ. వి. వేంకట్రావ్ "నిందితుడు యువకుడు. రాజకీయ నాయకులవలె ప్రభుత్వం మీద ద్వేషం రెచ్చగొట్టగల శక్తికలవాడని నేననుకోను" అంటూ రెండు నెలల శిక్ష విధించి – ఆ నాటికే రిమాండులో ఆ కాలం గడిచినందున – విడుదలచేశాడు.

మహిళలు 13 గురు రమాదేవి అధ్వర్యాన సత్యాగ్రహం చేశారు. అది కూడా ఈ మెజిస్ట్రేట్ సమక్షానికే వచ్చింది. "సంక్రాంతి పండుగరోజులన్నీ ఈ మహిళలు జైళ్ళలోనే గడిపారు" అని ఆర్ద్రుడైనాడు. ఆడవాళ్ళకు ద్వేషం వచ్చేట్లు రెచ్చగొట్టవద్దు. అలాచేస్తే

ఎలాంటి ఫలితాలు వస్తాయో అనాదినుంచీ చూస్తూనే ఉన్నాం" అన్నాడు తీర్పులో. ఎంత నిజం !

పోలీసుకు - ఆర్. యస్. యస్. కు యల్. యస్. యస్. కు కూడా తేడా తెలీదు. ఒక పోలీసు అధికారి మొదటి అక్షరమే మార్పు. యస్. యస్. వచ్చిందల్లా ఆర్. యస్. యస్. బాపతే ! అన్నాడు. వారి జ్ఞానం ఆ మేరకు ఉంది - అలాంటివారి సహకారంతో ఈ పశాల దేశాన్ని ఎలా ఏలాలని ఇందిరా గాంధీ నిశ్చయించుకొన్నదో !

అందుకే అమలాపురం కోర్టు పోలీసు ఆరోపణలను నమ్మక జాతీయ సాహిత్య పరిషత్ ప్రధాన కార్యదర్శి, స్థానిక కళాశాలలో ఉపన్యాసకులు ఐన ఘన శ్యామల ప్రసాద్‌ను మరి కొందరిని విడుదల చేసింది.

"ఫాసిజం నశించాలి; వాక్స్వాతంత్ర్యం మా జన్మహక్కు" ఈ నినాదాలు నేరమెలా అవుతాయో కోవూరు మేజిస్ట్రేటుకు అర్థంకాక - అవి ప్రభుత్వం మీద క్రోధం రెచ్చగొట్టే నినాదాలు కావని తీర్పు ఇచ్చాడు.

సూర్యాపేటలో గవ్వా మధుసూధనరెడ్డి వకీలు గౌరవ ప్రతిష్ఠలు కల ప్రజాసేవకుడూ, రాజకీయాల్లో ప్రాంతస్థాయివ్యక్తి. ఆయనను పోలీసులు అరెస్టు చేశారు. ఆయన అరెస్టు కాగానే బార్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం జరిపి ఆ అరెస్టును విమర్శిస్తూ తీర్మానించింది. ఒక రోజు కోర్టును బహిష్కరించింది.

గోవిందరెడ్డి బార్ అసోసియేషన్ కార్యదర్శి. పోలీసులు అతని మీద కేసు బెట్టారు. కేసును హుజూర్‌నగర్ జడ్జి రామచంద్రారెడ్డి విచారణ చేశారు. కోర్టుల పనికి అడ్డం కలిగించాడని నేరం. ఆ బాధ

మాది ఈ పోలీసుల కెందుకింత బాధ ?'' అని నిశితంగా విమర్శించి కేసును కొట్టి వేశారు.

"ఇందిరా గాంధీ - ఆమె ప్రభుత్వం పడిపోవాలి" !

''నేషనల్ ఎమర్జన్సీ తొలగిపోవాలి.''

'20 సూత్రాల పథకం డౌన్-డౌన్' అన్నారు విశాఖ సంజయ్ గాంధీ మీటింగ్‌లో డా॥ వేదుల సత్యనారాయణమూర్తి నాయకత్వాన మరో ఇద్దరు యువవీరులు. పోలీసు కేసు పెట్టింది. ఇందులో తప్పేమిటో అడిషనల్ జుడిషియల్ మేజిస్ట్రేటు ఆర్. గోపాలరావుకు అర్థం కాలేదు. అలా నినాదాలివ్వడమే నేరంకాదు పొమ్మన్నాడు.

మధిర, వనపర్తి, సంగారెడ్డి మేజిస్ట్రేట్లు గూడ నిర్భీకంగా తీర్పునిచ్చి ప్రజాస్వామ్యంలో న్యాయస్థానాలకు ఉండవల్సిన ఉత్తమ గౌరవ స్థానాన్ని నిలుపుకున్నారు.

ఎక్కడ చూచినా - నిర్భీక ప్రవృత్తి, ప్రజాస్వామిక చైతన్యం, ప్రజాస్వామ్యంలో న్యాయశాఖలస్థానం - కర్తవ్యం తెలిసినవారు ఎమర్జెన్సీ బూచికి భయపడలేదు. సహజన్యాయాన్ని విస్మరించలేదు. వారిచ్చిన తీర్పులు ఉద్యమానికే కాక నిందితులకు గూడా ఉత్సాహాన్నిచ్చాయి. పరోక్షంగా వ్యక్తులు "మన హక్కులు రక్షించే కోర్టులు ఈ నాటికీ ఉన్నా" యని ధైర్యంపొంది ముందుకు సాగారు.

* * * *

25 జూన్ 1975 అర్థరాత్రి దేశంలో నిద్రిస్తున్న 'నియంత జైళ్ళ' నోళ్ళు భయంకరమైన ఆవలింతతో తెరచుకున్నాయి. జె. పి., మురార్జీ, అద్వానీ, చంద్రశేఖర్ - ఒకళ్లా ఇద్దరా ! ఒక చోటనా - రెండుచోట్లా ! వందలు వరుసగా ఆ జైళ్ళ కళేబరాల్లోకి నెట్టబడ్డారు.

దేశం మొత్తం ఆ రాత్రి నిద్రించలేదు. రహస్యంగా - దొంగ చాటుగా - తలుపులుకొట్టి బైట అడుగుపెట్టగానే - కనీసం గుడ్డలు కట్టుకోనీకుండా — చెప్పులు వేసుకోనీకుండా - ఇల్లాలి వీడ్కోలు పొందనీకుండా - బలిపశువుల్లా ఈడ్చుకుపోయినట్లు జైళ్ళ గూళ్ళలోకి లాక్కొనిపోయిన నియంత బహుశా తాను గెలిచాననుకొన్నది. యాభై వేలమందిని మీసా డి. ఐ. ఆర్. ల క్రింద కటకటాల పంజరాలలో బంధించి "ఏదీ ఉద్యమం? ఇదంతా కాగితపు పులి లాంటిది. పత్రికలు ప్రసవించిన ఉద్యమం ఇది" అని నియంతృత్వం వికటంగా నవ్వింది.

కాని క్రమంగా అజ్ఞాత ఉద్యమం రగిలించిన చిచ్చు సెగ తగిలి ''ఆర్. యస్. యస్. వాళ్ళు ఎప్పటినుండో 'అజ్ఞాతం'లోకి పోయినా" రన్నది నియంత. "ప్రతిపక్షాలు వినమ్రం అయ్యాయేగాని మట్టిగర వలే'' దన్నది.

''పూర్వపు స్వేచ్ఛరావడం కల్ల'' అన్నది.

"ఇహ మీగతి - బుద్ధివచ్చిదాంకా ఇంతే'' నన్నాడు ఆస్థాన విదూషకుడు బారువా.

ఎవరు-ఎక్కడ-ఏ జైల్లో ఉన్నదీ తెలియదు. ఒక్కొక్కరే లోపలికి వస్తుంటే హృదయాలలో అదో భావం - బాధ - ఆనందం కలిసిన భావం. మరొకడు పట్టుబడ్డందుకు బాధ - మనవాడు - సాటి బాటసారి - కన్పించిన ఆనందం.

* * * *

జైళ్ళలో - అనేక భావాలు కలవాళ్ళు - అనేక అభిరుచులకు అలవడినవాళ్ళు - స్వభావాలువేరు - స్పందనలువేరు - మార్క్సిస్టులు, జమాయత్ ఇస్లామీలు, సంస్థా కాంగ్రెస్‌వారు, సోషలిస్టులు, బి. ఎల్. డి. వారు-వీరుగాక ఏ పార్టీకీ చెందనివారు కూడా ఉన్నారు.

ప్రభుత్వానికి అందరూ సమానమే. ప్రభుత్వ దృష్టిలో అందరూ ద్రోహబుద్ధి కలవారే. ఐనా కొందరిమీద ఇందిరా గాంధీకి ఎంతో అభిమానం! అందులో ఆర్. యస్. యస్. ఒకటి. కొందరు వ్యక్తులు నానా దేశ్‌ముఖ్ - జార్జి ఫెర్నాండజ్‌లన్నా పాపం ఆమెకు అభిమానమే!

అదో ఆనంద ప్రసంగం! అందరూ ఒకే సమస్య కారణంగా ఒకచోట చేరారు. 'నెగటివ్' కారణాలుగా 'పాజిటివ్' ఫలితాలు వచ్చిన చిత్రమైన తర్కం అది.

జైళ్ళలో పెద్దలు కొందరు - విజ్ఞాన నిధులు, వినోద ప్రియులు కొందరు. నవ్వుల జల్లులు చల్లించేవారు - దండలు త్రిప్పే కండగల యువకులు కొందరు. భావమంథనంచేసి — ఆలోచనలకు పదును పెట్టగల మేధావులు మరికొందరు.

చిచ్చుబుడ్లూ, చిటపటరావులూ - ఒక రకం మనుషులూ!

అజ్ఞాత ఉద్యమంలో జైళ్ళలో మీసా క్రింద, డి. ఐ. ఆర్. క్రింద గడిపిన స్వాతంత్ర్య ప్రియులు నిజంగా బైటి కార్యకర్తల ఉద్యమ శీలానికి పదును పెట్టినవాళ్ళు. చలించని ధైర్యంతో అలా వారు ఉండడం వల్ల - నియంతకు భయపడక నిటారుగా నిల్చున్నందు వల్ల - దేశంలోని ఉద్యమశక్తి - ఉజ్వలంగా వెలుగులు చిమ్మింది.

బైటి పోరాటానికి జైళ్ళు కూడా బదులు పలికాయి.

హక్కుల పోరాటంలో జైళ్ళు తమపాలు పంచుకున్నాయి. 'వందేమాతరమ్' అనవచ్చా? నలుగురూ ఒకే గొంతుతో 'వందేమాతరమ్' అని నినాదం ఈయవచ్చా!

కపాడియా విశాఖ జైలు సూపరింటెంటు. అతని చెవులకు ఈ నినాదాలు రుచించిలేదు. ఆంధ్రప్రాంత ఆర్. యస్. యస్. కార్యదర్శి డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. 'భారత్ మాతాకీ జయ్' అని స్వతంత్ర భారతంలో జైళ్ళలో అనవచ్చా అని- పాపం ప్రభుత్వం ఏమి జవాబిస్తుంది! ఆదొక పోరాటం.

*    *    *    *

నిజామాబాద్ జైల్లో 26 జనవరి '76. 'భారత కుమారా వీరా......మాతృదేవి రమ్మంటుందోయ్' సామూహికంగా సత్యాగ్రహుల కంఠాల్లోంచి - జైలు గోడల ఎత్తును త్రోసేసుకొంటూ - పాట సాగిపోతున్నది.

జైలు సూపరింటెంటు వచ్చి —— సన్నగా జారుకున్నాడు. డిప్యూటీ జైలర్ కరకుమనిషి, పాటనాపడానికి వచ్చాడు. చలించకుండా తన్మయంగా పాడుకుంటున్న పాట పాషాణాలను కరిగిస్తుంది. 'దండా' ఝళిపిద్దామని వచ్చి - పాట పూర్తిగా విని - తడి కన్నులతో నవ్వుతూ తిరిగి పోయినాడు.

*    *    *    *

జైలు అధికారులు చాలవరకు తటస్థంగా ఉండేవాళ్ళు - కొందరు పనిగట్టుకొని ఇబందులు కల్గిస్తుండేవాళ్ళు.

క్రొత్తగా 'మీసా' క్రింద వచ్చాడు సుభాష్‌రెడ్డి. అప్పటికి డిస్ట్రిక్టు జైల్లో 53 రోజులున్నాడు. వరంగల్ సెంట్రల్ జైల్లో 'మీసా' డిటెన్యూల వ్యవహారాలు 'శెట్టి' - డిప్యూటి జైలరు చూస్తూండేవాడు. రెండురోజులైనా టూత్ పేస్ట్, బ్రష్, సబ్బులూ తెచ్చి ఈయలేదు.

శెట్టి, జైలరు ఫిలిప్సు రోజువారి 'రౌండ్సు'కు వచ్చారు. యువకులు - చిచ్చుబుడ్లు - "ఏవయ్యా! ఏవి టూత్ పేస్ట్ వగైరా! అని

అడిగారు. శెట్టిది తాచుపామంతకోపం - జైలరిపోతంత పిరికి. ముందు 'వచ్చిందాకా ఆగండి' అన్నాడు.

ఇంకేమున్నది! 'ఫట్ - ఫట్' నల్లురూచుట్టూ మూగారు. అందరికీ కోపం వచ్చింది. ఘర్షణ తారా స్థాయికి చేరింది. నేను కూడా వెళ్ళాను. గట్టిగా జైలరును మందలించగానే - మరి అతడు భయపడ్డాడో ఏమో - సైరను మ్రోగించడానికి (ప్రమాదసూచకంగా) విజిల్ తీసుకున్నాడు. మీ మీద చర్యతీసుకుంటానన్నాడు. సముద్రాల నాగభూషణం - కరీంనగర్ ఆర్. యస్. యస్. జిల్లా కార్యదర్శి - నడిస్తే చీమలు చస్తవేమోనన్నంత మెత్తని మధుర హృదయానికి యజమాని - అతడూ చర్రునలేచి "చేతనైతే - ఏ చర్య అయినా తీసుకో చూస్తాం" అన్నాడు. శఠగోపాచారి గారికి కోపం వచ్చింది! ఇదంతా చూచి జైలరు నెమ్మదిగా తప్పుకున్నాడు. అక్రమ ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకోందే 'రేషను తీసుకోము' అని చెప్పాం.

అరగంటకాలేదు. జైలరు గవ్వా మధుసూధన రెడ్డిని, చంద్రశేఖరరెడ్డిని పిలిపించుకుని 'forget and forgive' - మరచిపోయి మన్నించు - అని కోరాడు.

యస్. యస్. రెడ్డి జబ్బుగా ఉన్నప్పుడు స్ట్రెప్టో పెన్సిలిన్ ఇచ్చాడు జైలు డాక్టర్. దాంతో 'రియాక్షన్' వచ్చింది. మనిషి మనకు దక్కడనుకున్నారు. పెన్సిలిన్‌కు రెడ్డి క్రొత్తవాడుకాడు. కె. జి. హాస్పిటల్‌కు పంపితే ఏదో ఇన్ఫెక్షను వచ్చిందన్నారు. అప్పుడతణ్ణి హాస్పిటల్‌కు కదిలించాలనుకొన్నారు.

తోటి డిటెన్యూలు - సుబ్రహ్మణ్యశాస్త్రి గారితోసహా - ఒప్పుకోలేదు. అప్పటికే అంబులెన్స్, ఎక్స్‌కార్టు వచ్చింది. మరి ఎలా!

సత్యాగ్రహంచేసి లోపలికి వచ్చిన వేదుల సత్యనారాయణ ఉన్నాడు. అతడు యం. డి. అతని బ్లాకు వేరు. అయనను రప్పించ మన్నారు డిటెన్యూలు. జైలు నియమాలు ఒప్పుకోవని అధికారులు అంటే, 'Hang Them', అ నియమాలను ఉరితీయండి-అని అన్నా రొకరు. మొత్తానికి వేదుల వచ్చాడు. పరీక్షిస్తుండగా ఇంతలో డి. యం. ఓ. కూడా వచ్చాడు. మొత్తానికి విజయవంతగా చికిత్స జరిగింది.

వేదుల సత్యాగ్రహం చేసింది విశాఖలో జరిగిన సంజయ గాంధీ సభలో. డి. యం. ఒ. అతణ్ణి సత్యాగ్రహ వివరాలు అడగ నారం భించాడు.

వెళ్తున్నపుడు శాస్త్రిగారు 'రెడ్డిగారూ! రామ రామ అనుకోండి' అన్నారు. బ్రతికి రెడ్డిగారు తిరిగి వస్తాడని ఎవరికీ నమ్మకం లేదు. కాని రెడ్డి 'హరేరామ హరేరామ' ప్రారంభించి చిరునవ్వుతో వెళ్తుంటే డిటెన్యూ లందరూ కన్నీరు కార్చారు.

జైళ్ళలో పట్టుదలలు అటు ఆఫీసర్లకూ - ఇటు నిర్బంధితులకూ అప్పుడప్పుడూ వచ్చినా - మొత్తానికి సమరసంగానే నడిచింది.

లోపల కూడా సత్యాగ్రహాలు జరిగాయి. హక్కుల కొరకు నిరశన వ్రతాలు జరిగాయి. దీనికి తొలిగంట ముషీరాబాద్ జైల్లో డి. యస్. పి. రెడ్డి, వి. రామారావు మ్రోగించారు. డిటెన్యూల హక్కుల సాధనకు సత్యాగ్రహం చేసిన ఈ ఇద్దరూ యం. యల్. సి. లు - ప్రభుత్వం వీరిని హాస్పిటల్‌కు మార్చి బలవంతాన ఆహారం ఇప్పించింది.

ఊరేగింపులు జరిగాయి. నినాదాలు - సభలు, కవాతులు - విన్యాసాలు, ఉపన్యాసాలు జరిగాయి.

నల్ల బాడ్జీలు ధరించినందుకు 'అవి తీస్తేగాని వందమైళ్ల నుంచి వచ్చిన బంధుగులకు ఇంటర్వ్యూ ఇవ్వమని అధికారు లంటే - ఇంట ర్వ్యూలను వదలు కున్నారు గాని నల్ల బ్యాడ్జీలు తీయలేదు.

జైళ్ళలో క్షణం తీరిక ఉండక పొయ్యేది. ఉదయం 5 గంట లకు లేస్తే రాత్రి దాకా కార్యక్రమాలే. గీతా వ్యాఖ్య, పఠనం కొన్ని జైళ్లలో - భారత, ప్రపంచ చరిత్రల అధ్యయనం కొన్ని జైళ్లలో - కొన్ని చోట్ల షడ్దర్శనాలు - ఉపనిషత్తులు.

సంస్కృత తరగతులు జరిగాయి. వరంగల్ డిటెన్యూలు భార తీయ విద్యాభవన్ వారి మూడు పరీక్షలు - కాబోలు - వరుసగా వ్రాసి ప్రథమ శ్రేణులలో - కొందరు ప్రత్యేక స్థాయిలలో ఉత్తీర్ణులైనారు. పొడుగరి మార్క్సిస్టు యం. ఎల్. ఎ. ఓంకార్, పొట్టివాడు - యల్. యస్. యస్. కార్యకర్త - సంఘ స్వయంసేవకుడు కంచిరాజు, వరం గల్ శిశుమందిర్ ప్రధానోపాధ్యాయుడు వీరన్న 'రామః రామో రామః' అంటూ సంత చదువుతూ - కూడ బలుక్కుంటూ సాయిం త్రాలు - ఉదయం అటూ ఇటూ అరగంట దాదాపు నడుస్తూండే వారు. అది చూడదగ్గ దృశ్యం.

రాజ్యాంగ సవరణలను క్షుణ్ణంగా పరిశీలించారు. రాజకీయ పార్టీల సిద్ధాంతాలను తరచి చూచారు.

పుస్తకాలు లోనికి ప్రవహిస్తుండేవి. వరంగల్ డిటెన్యూలకు ఎక్కడ నుండి వచ్చినా 350 దాకా పుస్తకాలు వచ్చాయి. అవీ రక రకాలు.

వరంగల్ నగర సంఘ చాలకులు 'నేత్ర వ్యాధుల' మీద రెండు తరగతులు తీసుకున్నారు. శఠగోపాచార్యులు ఆయుర్వేదం మీద వరసగా పాఠాలు ఎన్నో రోజులు చెప్పారు. ఆయుర్వేదం బలిసి - "వాతం - పిత్తం - శ్లేష్మం" డిటెన్యూల ఊతపదాలైనాయి.

సికింద్రాబాద్, హైద్రాబాద్ జైళ్ళు ప్రాంతానికి కూడలులు. 'బోర్‌గా ఉందండీ ! రిట్ వేసి హైద్రాబాద్‌కు పోదామా !' అంటుండే వారు రిట్ల వర్షం కురిసింది.

చేసికొన్న భార్యతో కాపురం చెయ్యనివ్వని ఈ రాక్షస నియంతృత్వాన్ని అదుపులో పెట్టమని ఒకటి - వైద్యులు మందులు వ్రాసినా, ఇవ్వడం లేదీ నియంత - ఇవ్వాలని గద్దించమని ఒకటి—

పరీక్ష లివ్వడానికి అనుమతించ మంటే - వినదు ఈ విద్యా - విజ్ఞాన శత్రువు - యువతరాన్ని చూచి ఈర్ష్యపడే - కాలం చెల్లిన ప్రభుత్వ మని ఒకటి—

తండ్రి చనిపోయినా, విడుదల చేయనందుకు ఒకటి - ప్రతి ఏటా పెట్టుకొనే పితురుల శ్రాద్ధకర్మ చేసుకోడానికి విడుదల చేయ మని ఒకటి - ప్రతి రిట్‌తో కోర్టులకు పయనించే వాడు 'డిటెన్యూ' - దారి పొడవునా నియంతృత్వాన్ని దుయ్యబడుతూ—

లోనికి వార్తలు వస్తుండేవి; ఎన్నో వార్తలు - ఊహించినవి - కల్పించినవి - పుట్టించినవి - దీనికి 'అటా' సర్వీసు అని పేరు.

డిటెన్యూల నందరినీ విడుదల చేస్తా 'రట' !
రాజకీయ పార్టీల వారినే చేస్తా 'రట' !
నిషిద్ధ సంస్థల వారిని అసలే చేయ 'రట' !

పి. టి. ఐ., యు. ఎన్. ఐ., హిందూస్తాన్ సమాచార్ పోయి 'ఉత్త' సమాచార్ ప్రభుత్వ తాబేదారుగా రావడంతో కొత్త వార్తా సంస్థ 'అటా' ప్రారంభమైంది.

రాజధాని జైళ్లలో పత్రికలు నడిచాయి. ఒకటి 'తరుణ కిరణ్' రెండోది 'మసి'—ఇలా ఎన్నో.

పండుగలన్నీ జైళ్ళూ జరుపుకున్నాయి.

మహావ్యక్తుల వర్ధంతులు - జయంతులు జరిగాయి. కలిసి డిన్నర్లు జరిగాయి. పరస్పర చర్చలు జరిగాయి. అవగాహన పెరగ డానికి అవకాశాలు కలిగాయి.

అంతకు ముందు 'ఎడ ముఖం - పెడ ముఖం' కలవాళ్లు జైల్లో ఆప్తులైనారు. కనీసం వ్యక్తులు పరస్పరం ఆదరించుకోడం - అభిమా నించు కోడం మొదలైంది.

రాజమండ్రి జైల్లో పార్లమెంటు నడిచింది. పార్లమెంటులో పలు వురు పలువురి పాత్రలను ధరించారనే గాని - వారికి వారుగా కూడ సమర్థులే. రాజకీయ జీవనంలో మెలితిరిగిన అనుభవాలు గలవారే.

ఒక విచిత్రం. అన్ని పార్టీలకు ప్రాతినిధ్యం వహించటానికి వ్యక్తులు వప్పుకొన్నారట. కాని 'డాంగే' పాత్రకు ససేమిరా ఎవరూ ముందుకు రాలేదట !

నల్గొండ జైలులో డి. ఐ. ఆర్. లో నిర్బంధించ బడినవారి సహజీవనంలో క్రిమినల్సు దేశభక్తులుగా మారారు. విడుదల పిదప వారు కూడ గ్రామ గ్రామం తిరిగి ప్రజాస్వామ్యానికై ప్రచారం చేశారుట.

అనేక జైళ్ళలో కావ్యగానాలు జరిగాయి. శరత్పూర్ణిమ నాడు కోజాగర్తి ఉత్సవంలో 'వెన్నెల అమృతాల జల్లులు కురిసిన' వెచ్చ వెచ్చని పాలు త్రాగి ఉత్సాహపు వేడి పొందారు.

చర్చించు కున్నారు. కొన్నిట ఏకీభవించారు. కొన్నిట వేరు వేరుగా భావించారు. అయినా మొదటిసారి కలసి కూర్చున్నారు. మత

సంస్థ అని 'ఆర్. యస్. యస్.' ను అనడం మానారు - అవగాహన లభించిన చాల మంది తీవ్రులు.

ప్రతి హృదయంలో తపన ఉన్నదని గ్రహించారు అందరు.

జైళ్ళలో గ్రంథాలయాలున్నాయి. అవి ఎన్నేళ్ల పూర్వం గ్రంథాలో - తలా తోకలు తెగిన పుస్తకాలు. డిటెన్యూలు తమ రేషను లోంచి వంద రూపాయిల పుస్తకాలు బహుకరించారు విశాఖలో. వరద బాధితులకు కొన్ని జైళ్లనుండి పంపారు. జె. పి. డయాలిసిస్‌కు, కంచి దేవాలయ పునరుద్ధరణకు విశాఖ డిటెన్యూలు విరాళాలు తమ రేషను ల్లోంచి మిగిల్చి పంపారు.

వరంగల్, విశాఖ ఇంకా కొన్ని జైళ్లలో ఆటల పోటీలు - బహుమతుల పంపకం జరిగాయి. జైలు అధికారులకు డిటెన్యూలకు పోటీలు - తమాషా ఏమంటే జైలు అధికారులు, కాన్విక్టులు ఒకవైపు- డిటెన్యూలు ఒకవైపు. సరదాగా, దొంగలు - దొంగలు ఒకటే అని అధికారులను పరిహసిస్తుండే వారు.

జైళ్ళ నుండి గీతాలు, వ్యాసాలు, పుస్తకాలు వ్రాసి బైటికి పంపే వాళ్ళు. బైట దేశంలో ఆ కాలంలో అచ్చువేసి పంచిన పుస్తకాల్లో ఎన్నో జైళ్ళలో వ్రాసినవి ఉన్నాయి. 20 సూత్రాలమీద జనసంఘ మిత్రులు రాజమండ్రిలో వ్రాసి పంపిన "రాజకీయ గారడీ" ని అజ్ఞాత సాహిత్యంలో ఒకటిగా అచ్చువేసి ప్రజల కందించారు. బెంగుళూరు జైల్లో ఎల్. కె. అద్వాని వ్రాసిన 1) "ఇందిర కొచ్చిన ఇరకాటం", 2) "ఎవరా ఫాసిస్టులు - మీరా మేమా ?", 3) "హిట్లర్ అడుగు జాడల్లో ఇందిర" తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ అచ్చయి ప్రజల కందాయి.

'75 జూన్ 25 న ఎమర్జెన్సీ ప్రకటించడం తోటే నిర్బంధాల పాల్పడ్డ వారి ఇండ్ల గొడవ - మానసిక బాధ ఇంతా అంతా కాదు. ఆ తరువాత కూడా దాదాపు చివరిదాక డిటెన్యూలు వస్తూనే ఉన్నారు.

జమాయిత్ ఇస్లామీ సభ్యుడని పేరుపెట్టి ఒక వ్యక్తిని జైలుకు తెచ్చారు. అతడి మామ జమాయిత్ ఇస్లామీ కార్యకర్త. అతడి కొరకు వెళితే లేడు. సరే 'నీవే బయల్దేరు' అన్నారు. ఇతడు పిల్లల కోడి. భార్య చనిపోయింది. ఒక చేయి లేదు. పిల్లలు మామ దగ్గిర ఉండే వాళ్ళు. ఇత డిలా జైల్లో ఉండగానే ఆ మామకూడ చనిపోయాడు. ఉన్న చిన్న దుకాణం కా స్త మూత పడ్డది. పిల్లలకు దిక్కెవరు? 'అయ్యో! మాది చిన్న సంస్థ. ఆర్. యస్. యస్. వాళ్ళ నొకళ్ళనే పట్టుకుంటే "కాంగ్రెసు బాపతు సెక్యులరిజంను నల్లురూ విమర్శిస్తా రేమోనని మమ్మల్ని పట్టుకొచ్చా" రన్నాడు. మరొక మిత్రుడు - 'ముస్లింలీగ్ను', ఇత్తెహాదుల్ ముసల్మీన్' వారిని ఎందుకు నిషేధించ లేదు - అని అడిగాడు.

కేరళ నుండి తిరుపతి విశ్వవిద్యాలయంలో చదువుకోటానికి వచ్చిన విద్యార్థి ఉన్ని క్రిష్ణన్. ఆర్. యస్. యస్. కార్యకర్త అని తెచ్చి ముషీరాబాద్ జైలులో పడేశారు. ఎక్కడ కేరళ - ఎక్కడ హైద్రా బాద్ - అతని కుటుంబ సభ్యుల ఆత్మక్షోభ వర్ణించ గలమా?

లోపల నెలలు గడుస్తుంటే బైట కుటుంబాలు పడ్డ బాధను చెప్పడానికి భాష చాలదు.

"నాన్నా! కాన్వెంట్ ఫీజు ఎక్కువ. మామూలు బడికి పోతాను" అంటుంది ఒక కూతురు తన తండ్రితో - ఉత్తరంలో. అతడు అడ్వకేటు - అతని మనసు ఎలా ఉండి ఉండాలి?

"నీవు గనుక - రాజీనామాపెట్టి రాకపోతే నేను ఆత్మహత్యే చేసుకుంటాను'' - అని వ్రాస్తాడు ఇంటి బాధలు చూడలేని ఒక కొడుకు. తండ్రి అతణ్ణి సముదాయించడానికి ఎంత బాధపడి ఉండాలి!

పెంచి, పెళ్ళిచేసి, ఆదుకున్న పెత్తల్లి కుమారుడు - ఆత నొక్కడే తనకు అండ - చనిపోయాడు. దూరాన ఉన్న చెల్లెలు చావు బతుకుల్లో ఉన్నది. చేతిలో డబ్బులేదు. పోయి రావడానికి 500 రూపాయలు అవుతుంది. విల విల మన్న ఆ ప్రాణాలు ఎలా ఓర్మి వహించిందో !

రంగశాయి కర్నూలు జిల్లా ఆత్మకూరు వాడు. ముషీరాబాద్‌లో డిటెన్యూ. భార్య శ్యామల సంసారాన్ని ఈదలేక - పస్తులు పడుకో లేక - ఉత్తరం వ్రాసింది. "రాజీనామా చేసి బయటికి రండి-అప్పుడు ఆనందం. ఊరికే ఉత్తరాలువ్రాస్తే లాభం ఏమిటి. వస్తే రావాలి. లేక పోతే ఈ ఉత్తరాలు వ్రాయడం మానండి'' అన్నది. రంగశాయి శాంతగా ''రాజీనామా ఇవ్వను - కనుక రాలేను - అందుకని ఉత్త రాలు వ్రాయడం మానుతాను'' అని వ్రాశాడు.

పెరోల్ దొరకడమే కష్టం. దొరికినా డి. యస్. పి. రెడ్డి నిరాకరించారు. అలా ఎందరో !

ఇలా తెలుపుతూ పోతే, అదే ఒక మహా కావ్యమవుతుంది. మానవ జీవితంలో కష్టసుఖాల స్మృతులు బలాన్ని ఇస్తాయి. మన బలహీనతలు తెలుస్తాయి. మన శక్తి తెలుస్తుంది.

ఈ రెండేళ్ళలో జైళ్ళలో తొంభైపాళ్ళు ఆర్. యస్. యస్. వాళ్ళదే. కొందరిని ఆర్. యస్. యస్. ముద్రవేసి పట్టుకొచ్చారు.

మధిర అడ్వకేటు ఏటూరి సత్యనారాయణ - ఎవరో గిట్టనివాడు అతడి పేరు చెప్పాడు - అప్పుడప్పుడే సంఘ పరిచయం ఏర్పడ్డ వారు లోప లికి వచ్చారు. కొన్ని చోట్ల సి. పి. ఐ., కాంగ్రెసు వారు తమ పాత పగలు తీర్చుకోడానికి పేర్లు చెప్పి పట్టించి మీసాలో పంపారు. అలాంటి వాళ్లలో ములుగు నర్సయ్య - ఒకడు.

అయినా చివరిదాకా ఈ డిటెన్యూలు - ఎక్కడో ఒకరిద్దరు తప్ప - మహా మేరువుల్లా నిల్చున్నారు. 35,000 మందిలో వంద మంది తల వంచినా అదొక లెక్కా! అంతటి మనో స్థైర్యాన్ని ప్రద ర్శించిన డిటెన్యూలలో కూడ లోపాలు లేకపోలేదు.

గాంధీజీ సత్యాగ్రహులకు ఒక శిక్షణ నిచ్చారు. అలనాటి సత్యాగ్రహాలలో కూడా - సత్యాగ్రహాన్ని వ్రతంగా స్వీకరించినవారు ధైర్యంగా నిల్చున్నారు. కొందరు బెదిరారు. చెదిరిపోయిన వారు కొందరు.

ఈ మారు కూడా కొంద రలా చేసి ఉండవచ్చు. లక్షమందిని సత్యాగ్రహానికి పంపగలిగిన శక్తిగల సంస్థ ఆర్. యస్. యస్. మరి అన్ని పార్టీలు కలిసి అంత మందిని - అందులో సగాన్ని ఎందుకు పంపలేదు? ఇది విమర్శ కాదు. లోపం ఎక్కడున్నది? ఆలోచించ దగ్గ విషయం.

జైళ్ళలో కొన్ని వికారాలు కూడా వచ్చాయి. నా అనుభవం ఏమంటే - వికారాలు ఎక్కువ నాయకులలో వచ్చాయి. కార్యకర్త లలో రాలేదు. అటల్‌బిహారీ వాజ్‌పేయి ఒక మిత్రునికి వ్రాస్తూ ''భయభీతులైన వాళ్లలో - ఎక్కువ మంది శాసన సభ్యులు - పార్ల మెంటు సభ్యులు కనబడుతున్నారు. ఇదొక విచిత్రం. సాధారణ కార్యకర్త తన స్థానంలో అచంచలంగా నిల్చున్నాడు.'' అన్నారు.

తిండి దగ్గర - సౌకర్యాల దగ్గర కొంత ఇబ్బందినీ అనుభ వించినవారున్నారు. అయినా అవి క్షణికాలే. మొత్తంగా చూస్తే ఆదర్శం కోసం జైళ్లలో 80 మంది తమ అసువుల నర్పించారు. తల దించడానికి అంగీకరించలేదు. వారి కష్టాలు వృధా పోలేదు.

ఎన్నికల ఫలితాలు తెలిసినరోజు అదో అద్భుత దీపావళి! ఆనందం కట్టలొరిసి ప్రవహించింది.

రాత్రి 3 గంటలకు రేడియో ప్రకటించింది. అంతకు ముందే - బి. బి. సి. ప్రకటించింది. ఆవు-దూడ రాయబరేలీలో - అమేథీలో ఓడిపోయినాయని. ఆ క్షణాన చూడాలి నినాదాలు. జైలు దద్దరిలి పోయింది. పోలీసులు పరుగెత్తుకొని వచ్చారు. సాధారణ నేరాలకు జైలుశిక్ష అనుభవిస్తున్నవాళ్ళు కూడా ఏదో ఒక 'నరకాసుర వధ' అయినంత సంబర పడ్డారు.

21 మార్చి. ఎమర్జెన్సీని ఏ చేతులు విధించాయో ఆ చేతులే ఎత్తి వేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. డిటెన్యూలను విడుదల చేయ మని ఆజ్ఞలు వచ్చాయి - 22 వ తేదీన. ఉదయం 10-30 కు జైలు అధికారులు "సిద్ధం కండి - వెళ్ళిపోదురుగాని'' అన్నారు.

సర్దుకొన్నాం. అయినా వదలరే! కారణం అడిగితే "అయ్యా సాయంత్రం 3 గంటల దాక మీరు ఉండాలిట! ఊరేగింపులో మిమ్మ లను తీసికొని వెళ్తారట!'' అన్నారు. ప్రజల ప్రేమ అలా కొన్ని గంటలు డిటెన్యూలను జైల్లో ఇంకా ఉంచింది. ఇదొక ఆనంద గాథ!

మధ్యాహ్నం 2-30 ఐంది. బైట నినాదాలతో వాతావరణం దద్దరిల్లు తున్నది - ''జనతా జిందాబాద్''. లోపల కాన్విక్ట్సు అదే

నినాదం. వరంగల్ జైలుకు అడ్వకేటు మిత్రులు తమ వృత్తి దుస్తుల తోనే డిపెన్యూలను స్వాగతించడానికి 50 మందికి పైగా వచ్చారు. జనం వెల్లువలా పొంగింది. తలుపులు విరిగి కూలుతవా? జనాన్ని ఆపడం కష్టమైంది.

వేల కొలది జనం నినాదాలతో డిపెన్యూలను స్వేచ్ఛా భారతం లోకి - స్వతంత్ర వాయువుల్లోకి స్వాగతించుకున్నారు. అది వాళ్ళ విజయం. అది జన విజయం - దేశమంతటా ఇదే దృశ్యం - ఇదే ఆనందలహరి.

# 17

# జనవిజయం

'రాజశక్తికన్నా
జనశక్తి గొప్పది.'

ఎమర్జెన్సీ విధించడానికి ఇందిరా గాంధీ నిర్ణయించినప్పుడు ఆమెకు ఏయే దేశ విదేశ శక్తుల నుంచి ఏయే సలహాలు వచ్చాయో చరిత్రలో పరిశోధనాంశంగా మిగిలి పోతుంది.

ఎమర్జెన్సీ విధించగానే 'అధికార కేంద్రాలు' వేగంగా చేతులు మారాయి. కేంద్ర గృహమంత్రి బ్రహ్మానంద రెడ్డిని ప్రక్కకు నెట్టి ఉప మంత్రి ఓం మెహతా నేరుగా వ్యవహరించడం ప్రారంభించాడు. అంతకు ముందే ఇందిరాగాంధీకన్న వామపక్ష మంత్రాంగాన్ని బల పరుస్తూ వచ్చిన గుజ్రాల్‌ను దించి, ఆ స్థానంలో ఆస్థాన గాయకుడుగా - రేడియో సమాచార మంత్రిత్వ శాఖకు - వి. సి. శుక్లా నాయకత్వం వహించాడు. అందాకా హర్యానాను నిరంకుశంగా పాలించిన ముఖ్యమంత్రి బన్సీలాల్ కేంద్ర రక్షణమంత్రి ఐనాడు.

బన్సీలాల్ సంజయ్ గాంధీ 'మనిషి'. అధికార రాజకీయాలలో ఏ మీట నొక్కితే ఏ అంతస్తును చేరడం సాధ్యమో తెలిసిన వ్యక్తి.

అందుకే 'సంజయ్ గాంధీ' ప్రారంభించిన మారుతీ కారు ఫ్యాక్టరీకి స్థలదానంతో తన మహా ప్రయాణం ప్రారంభించాడు. 10 జూలై

1971 లో 445 ఎకరాల భూమిని స్వాధీనం చేసుకొని, సంజయ్ గాంధీకి అప్పచెప్పాడు.

ఈ భూమి మూడు గ్రామాల రైతులది. ఎకరం ముప్పైఐదు వేలకు అంతకుముందు క్రయ విక్రయం జరిగింది. అలాంటి భూమికి పదివేల చొప్పున పరిహారం చెల్లించబడింది. అదీగాక ఆ భూమి రక్షణ శాఖకు చెందిన ఆయుధాల గిడ్డంగికి, వాయుసేనకు చెందిన ఆశ్రయ స్థలానికి దగ్గరగా ఉన్నది. లోగా ఆ భూమి ఉపయోగార్హతలకు సంబంధించిన 'ఆంక్షల'ను రక్షణశాఖ విధించింది. వాటిని ఖాతరు చేయలేదు.

బన్సీలాల్ పత్రికా స్వాతంత్ర్యానికి మొదటినుండీ శత్రువే. 'ట్రిబ్యునల్' అనే ఇంగ్లీషు దిన పత్రిక అతని కోపానికి గురై చితికి పోయింది.

బన్సీలాల్ కుటుంబ నియంత్రణ పథకాన్ని సైనిక చర్య శైలిలో ప్రారంభించాడు. దీనికి ఒక్క పిప్లీ గ్రామ ఉదాహరణ చాలు. గ్రామంలో ఉన్న చాలా మందికి వయసును చూడకుండా - ఆపరేషన్లు చేశారు. చాలామంది ఈ కారణంగా మరణించారు. మళ్ళీ రెండు రోజులైన తర్వాత బి. డి. ఒ. కేసుల కొరకు వచ్చాడు. ప్రజలు కోపంతో ఉడికి పోతున్నారు.

చివరికి బి. డి. ఒ. ఒక చర్మకారుణ్ణి పట్టుకొని పోయినాడు. మరునాడు మళ్ళీ వచ్చాడు ఆ బి. డి. ఒ. ప్రజలు ఆపరేషన్లకు సుముఖంగా లేకపోయేసరికి దౌర్జన్యానికి దిగాడు. గ్రామ ప్రజలు - స్త్రీ పురుషు లందరూ - దౌర్జన్యాన్ని ఎదుర్కొన్నారు. ఆ ఘర్షణలో బి. డి. ఒ., మరి కొందరు గాయపడ్డారు.

మరునాడు పోలీసులు గ్రామం మీద దాడి చేయడానికి వస్తున్నారని తెలిసింది. పరిసరాల నుండి జనం వేల సంఖ్యలో పిప్లీకి చేరుకున్నారు. పోలీసులు కూడా వందల సంఖ్యలో వచ్చారు. గ్రామాన్ని చుట్టుముట్టి కాల్పులు మొదలు పెట్టారు. ముగ్గురు చనిపోయినారు. ఈ వార్త పరిసరాలకు ప్రాకడంతో ఒక లక్షదాకా జనం అక్కడికి చేరుకున్నారు. పోలీసులు వెనక్కు తగ్గక తప్పలేదు.

ఆ తరువాత పోలీసులు మళ్ళీ వచ్చి 'ఆపరేషన్ల'కు సిద్ధం కాక పోతే గ్రామాన్ని నేలమట్టం చేస్తామని బెదిరించారు. లక్షమంది జనం - బాధపడ్డా - ఎమర్జెన్సీలో - ఎదిరించ లేక - చివరకు నియంతృత్వానికి లొంగి పోయారు.

నియంతృత్వం పులి నెక్కిన రౌతు లాంటిది. అలా స్వారి చేస్తూనే ఉండాలి. దిగితే రౌతునే భక్షిస్తుంది పులి. నియంతృత్వాన్ని నిభాయించుకోడానికి ఇందిరా గాంధీ ముగ్గురిమీద ఆధారపడ్డది - పోలీసు రాజ్యాన్ని నెలకొల్పి, ప్రజలను 'అదుపు'లో ఉంచడానికి ఓం మెహతాను; రక్షణ దళాల వ్యవహారాన్ని అదుపున ఉంచడానికి బన్సీలాల్‌ను; నియంతృత్వం దేశానికి ఎంత అనుకూలమైనదో చాటి చెప్పడానికి, దానికి అవసరమైన యంత్రాగాన్ని సృష్టించి, నడిపించడానికి విద్యా చరణ శుక్లాను; ఈ ముగ్గురిని అనుసంధానం చేసి నడిపించేందుకు సంజయ్ గాంధీ - 'భారతాకాశంలో ఉదయిస్తున్న నవ్యభానుడు'- బాధ్యత స్వీకరించాడు.

ప్రజలనడుం విరుగగొట్టి పాదాక్రాంతం చేసుకోడానికి ప్రయత్నించడం ప్రపంచ నియంత లందరికి సహజ గుణం.

ఆ కార్యక్రమాన్ని సంజయ్ గాంధీ - ప్రధాని వారసుడు - ప్రారంభించాడు. ఇందిరా గాంధీ 20 సూత్రాలు ప్రకటించింది. కుమా

రుడు 4 సూత్రాలు ప్రకటించాడు. రెండూ కలిసి 420 (చార్‌సౌ బీస్) అయి అపహాస్యం పాలయేసరికి, నాలుగును అయిదుచేసి 25 సూత్రాల పథకం ప్రారంభమైంది.

ఆర్థిక ప్రగతికి ప్రణాళికా బద్ధంగా పనిచేయడం తప్పుకాదు. కాని ప్రచారం కొరకు ప్రకటించిన ఈ 25 సూత్రాలు ప్రచారంలోనే ఇంకిపోయి, 'ప్రగతి' నినాదపు తెరమరుగున సాగిన అత్యాచారాలు దేశాన్ని కదిలించివేశాయి.

'ఆర్థిక ప్రగతి'కి ప్రతిపక్షాలు అడ్డు నిల్చాయనే ప్రచారం ఇందిరా గాంధీ మాత్రమే చెప్పగల సత్యం. ప్రతిపక్షాలలో జె. పి., మురార్జీ, అటల్ జీ మున్నగు వారిని తనకంటే తక్కువ దేశభక్తులని, తనకంటే తక్కువగా ప్రజాస్వామ్యాన్ని, ప్రజల క్షేమాన్ని కోరు తున్నారని ఇందిరా గాంధీ భావించిందంటే అది భ్రమే. తన ప్రభు త్వాన్ని కాదన్న - తన లోపాలను ఎత్తిచూపిన - దేశానికి అవసర మైన మార్పును సూచించి ప్రజలను మేలుకొల్పుతూన్న ఏ రాజకీయ - రాజకీయేతర శక్తినైనా సహించి ఊరుకోరాదనే స్థాయికి దిగిందామె. తను, తన కొడుకు ప్రకటించిన 25 సూత్రాలతో పూర్వం జనసంఘ వగైరా సంస్థలు ఆర్థికంగా రావాలని సూచించిన మార్పులనే - దేశంలో సంఘ సంస్కర్తలు మొదటినుండీ కావాలని కోరిన మార్పునే -20 + 5 వెరసి 25 చేసి - ఇవి తన ప్రణాళికలోని తక్షణ వాంఛితాలుగా ప్రచారం సాగించింది. రేడియో, టెలివిజన్, పత్రికల ద్వారా ఈ ప్రచా రపు హోరెత్తిస్తూ - మరో వైపు ఈ ప్రగతిని ప్రతిపక్షా లడ్డగిస్తున్నా యని దుమారం సాగించింది. మరి ఆ ప్రగతి ఏ మేరకు సాధింప బడింది ? - ప్రశ్నించగల వాళ్ళందరూ జైళ్ళలో ఉన్నారు. ఈ వాస్త వాన్ని ప్రజలు గుర్తించడానికి ఎక్కువ ఆలస్యం పట్టలేదు. ఈ 20

సూత్రాల బండారాన్ని సుబ్రహ్మణ్యస్వామి వ్రాసిన 'అత్యవసర పరిస్థితిలో ఆర్థిక ప్రగతిని గురించిన వాస్తవాలు' అనే పుస్తకం బయట పెట్టింది.

దేశానికి ఢిల్లీ రాజధాని. ప్రపంచ దేశాల ప్రతినిధులకు కూడలి. ఢిల్లీలో ఏది జరిగినా అది వెంటనే ప్రపంచ ప్రజలందరికీ తెలిసే వీలున్నది. లోక సంఘర్ష సమితి మొదటి సత్యాగ్రహం ఢిల్లీలో కదలిక కల్గించింది. ప్రజలు సంఘర్ష సమితి సత్యాగ్రహాల పట్ల ఆసక్తి కనబరిచారు. వేల సంఖ్యలో చూచి ధైర్యం తెచ్చుకున్నారు.

ఆ ధైర్యాన్ని చెరచడం కొరకు సంజయ్ నాయకత్వాన – అతగాడి అనుచరి రుక్సానా సహయోగంతో – మొట్టమొదట 'జుగ్గీ – ఝోంప్డీ' కాలనీల మీద ఢిల్లీ ప్రభుత్వం దాడి చేసింది. ఈ కాలనీలు ప్రభుత్వం నిర్మించినవే ఆ కారణంగా చాలా కాలంగా కాంగ్రెసును బలపరుస్తూ వచ్చాయి. కాంగ్రెసుకు చందాలు ప్రోగుచేసి ఇస్తుండేవి. సంజయ్ ముఠాకు ఈ కాలనీలలోకి 'లోక సంఘర్ష సమితి' ప్రభావం ప్రాకిందేమోననే అనుమానం వచ్చింది. కనుక ఈ కాలనీ ప్రజలను అదుపున పెట్టడానికి, ''ఢిల్లీ నగర సౌందర్యాన్ని'' ఇనుమడింప చేయడానికనే నెపంతో, అమానుషంగా ఈ నివాసాలను బుల్‌డోజర్లతో నేలమట్టం చేశారు. ముందుగా సూచన లేదు. ప్రత్యామ్నాయంగా నివాస సౌకర్యం చూపలేదు. చివరికి చూపిన స్థలాలు చిత్తడి, నీరునిలచే చౌకబారు బురద భూములు. వేలకొలది ప్రజలు ఈ విధంగా నిరాశ్రయులవడమేకాక, తమ చిన్న చిన్న వృత్తి ఉద్యోగాలను కూడా కోల్పోయినారు. అనేకమంది ఈ దారుణచర్య కారణంగా మరణించారు. ఎదిరించిన వారిని పోలీసులు కాల్చి చంపారు. పోలీసులు ఈ చర్యలో ఎన్నో ఇండ్లు దోచుకున్నారు. పేద ప్రజల ఆస్తి పాస్తులను కొల్లగొట్టారు.

జుమ్మా మస్జిద్ ఇమాం అబ్దుల్లా బుఖారీ కాంగ్రెసును, ఇందిరా గాంధీని లక్ష్యపెట్టని మనిషి. సంజయ్ గాంధీ - అతని బృందానికి ఇమాంను 'అదుపున' పెట్టాలనిపించింది. జుమ్మా మస్జిద్‌లో కొన్ని వందల అంగళ్ళు ఉన్నాయి. వాటి కిరాయలు మసీదు ఆదాయంలో ముఖ్య భాగం. వాటిని అక్రమంగా కట్టబడినవనే నెపాన నేలమట్టం చేస్తే ఇమాం ఆదాయం సన్నగిల్లి, మనిషి అదుపులోకి వస్తాడని నిశ్చ యించుకొన్నారు. అధ్యక్షుడు ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ఈ పథకాన్ని నడవనివ్వక పోవచ్చు. కనుక విదేశాలకు పర్యటనకు వెళ్ళిన సమ యాన్ని ఎన్నుకొని, రహస్యంగా నోటీసు లేకుండా, క్షణాలలో ఖాళీ చేయమని ప్రకటిస్తూ ఢిల్లీ పాలక యంత్రాంగం పోలీసు బలగంతో వచ్చి నిల్చింది. 22 నవంబరు '75 న ఈ ఉదంతం జరిగింది. ఇమాం ఎంతగా విజ్ఞప్తి చేసినా వినకపోగా, 'అల్లరి పెడితే మీసాలో పెడతాం- మళ్ళీ విడిచి పెట్టేది లేదని' హెచ్చరించారు. అంతకు ముందొక సారి '75 లో ఆయనను మీసా క్రింద నిర్బంధించి కొన్ని నెల లుంచారు.

ఉదయం ఎనిమిది, ఎనిమిదిన్నరకు ప్రారంభమైన ఈ 'విధ్వంస' కాండలో, మసీదు ఆవరణలో భాగంగా వంద ఏండ్లనుండి ఉంటూ వచ్చిన దుకాణాలను, ఇంకా వందల ఇతర దుకాణాలను బుల్‌డోజర్లు నేలమట్టం చేశాయి. అంగళ్లలో నుంచి వస్తువులన్నీ వేరు స్థలాలకు మార్చుకొనేంత సమయం కూడా ఇవ్వలేదు. కొన్ని కోట్ల రూపాయల విలువచేసే ఆస్తి మట్టిపాలైంది. అలా ఆ దురంతం దాదాపు ఒక వారం నడిచి 400 దుకాణాలను నాశనం చేసింది. ఈ నష్టపడిన వారికి పరిహారం, ప్రత్యామ్నాయ స్థలాలు ఇవ్వడానికి నడిచిన అవినీతి కథ చెబుతూ పోతే అదొక 'సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి' కథ అవుతుంది. ప్రజలు భయంతో నోరు మెదపలేదు. నాయకులు బైట

లేరు. పార్టీలు నలిగిపోయి ఉన్నాయి. ఈ బాధితుల నాదుకునే దిక్కు లేకుండా పోయింది.

దీనితో నియంత బలగానికి మరింత ధైర్యం వచ్చింది. సదర్ బజారు, పశ్చిమ ఢిల్లీ ప్రాంతాలు జన సంఘానికి మొదటినుండీ కంచు కోటలు. ఇక్కడ జనసంఘానికి విరాళాలు, సమర్ధన లభించేవి. అలాగే కరోల్‌బాగ్ కూడా జనసంఘ బలం గలదే. ఈ వాడలలోగల దాదాపు 20,000 దుకాణాలను నిష్కారణంగా, నోటీసు లేకుండా, పూర్తి గానో, కొంత భాగమో కూల్చివేసింది ప్రభుత్వం. ఐ. యస్. ఏ. మార్కెటు, సబ్జీమండి, గఫార్ మార్కెట్ చరిత్రలో శిథిలాస్థికల్లా ఐపోయినాయి.

అక్కడి నుండి టర్క్‌మెన్ గేటుకు సాగింది ఈ విధ్వంసక యాత్ర. ఇక్కడ ప్రజలు కొద్దిగా ఎదురు తిరిగారు. పోలీసులు కాల్పులు జరిపి అణచివేత ప్రారంభించారు. టర్క్‌మెన్ గేటు కథ అలనాటి 'జలియన్‌వాలా బాగ్' కథను మించి పోయిందని చూచిన వాళ్లు ఆ తరువాత పత్రిక లన్నింటిలో వ్రాసిన విషయమే. ఇక్కడ ఆ తరువాత నెలకు పైగా కర్ఫ్యూ విధించారట.

ఢిల్లీలో ప్రతి పక్షాలకు – ముఖ్యంగా జనసంఘానికి అండగా నిలచిన వీధులన్నీ ఈ రాక్షసానికి బలి అయ్యాయి.

ఈ 'అణచివేత' అంతటితో ఆగలేదు. అది క్రమంగా 'ఏరి వేత' కు దిగింది. ఆర్. యస్. యస్.; జనసంఘ; విద్యార్థి పరిషత్ వగైరా సంస్థలతో సంబంధం ఉన్నదని తెలిసినా, అనుమానం కలిగినా ఉద్యోగాల నుండి గెంటివేశారు. ప్రతిపక్షాలను సమర్ధిస్తున్నట్లు వాసన తడితే చాలు – ఉద్యోగం నుండి ఊడబీకే వారు. సంజయ్ గాంధీకి

నచ్చనివాడు, సంజయ్ గాంధీకి నచ్చిన వాడికి నచ్చనివాడు ఉద్యోగంలో ఉండ వీల్లేదన్నారు.

ఒక ఢిల్లీ అడ్మినిస్ట్రేషనులో అమ్మకం పన్ను, పరిశ్రమలు, సివిల్ సప్లైల శాఖల్లో పనిచేసే 200 మంది ఉద్యోగులను - విద్యా శాఖలో పనిచేసే లెక్కించ వీలులేనంత మందిని - వారంతా ఆర్. యస్. యస్. సభ్యులనే నెపం మీద బర్తరఫ్ చేయడమో - సస్పెండు చేయడమో జరిగింది. వందల కొలది ఉపాధ్యాయులను ఇదే కారణంగా శిక్షించడానికి మారు మూలలకు బదిలీ చేశారు. అక్రమాలు చేస్తున్నారనే కారణం చూపి, రాజకీయ విద్వేషాలతో 300 మంది ఉద్యోగులను తొలగించారు. ఈ జాబితా దేశమంతటా కొన్ని వేలకు మించుతుంది. విశ్వవిద్యాలయాల్లో పనిచేసే ప్రాధ్యాపకు లెందరో ఈ అత్యాచారాలకు గురి అయినారు.

ఆంధ్రలో కూడా ఎందరో ఉద్యోగాలు కోల్పోయారు. పట్టభద్రుల నియోజక వర్గానికి ఆంధ్ర రాష్ట్రంలో జరిగిన ఎన్నికలలో నెల్లూరు నుండి వై. సి. రంగారెడ్డి, అనంతపురం నుండి డి. సూర్యప్రకాశ రెడ్డి నుంచున్నారు. ఇద్దరూ నిర్బంధంలోనున్న జనసంఘం సభ్యులే. వారిని విడిచిపెట్టలేదు. వారి తరఫున ప్రచారం చేసిన వారి నెందరినో ఎన్నో ఇబ్బందులకు ప్రభుత్వం గురి చేసింది - అనేకులను అరెస్టు చేసింది. అయినా సూర్యప్రకాశ్ రెడ్డి గెలుపొందారు. రంగారెడ్డి కొద్ది తేడాతో ఓడిపోయారు.

ఆంధ్ర సెనేటుకు నిర్బంధంలో ఉన్న పిళ్ళా రామారావు పోటీ చేశారు. ఆయన నామినేషన్ అక్రమంగా తిరస్కరించ బడింది. 40 మందిలో 19 మందిని విరమించు కొనేట్లు వత్తిడి చేశారు. మిగిలిన

సెనేట్‌ను కూడ రద్దు చేస్తూ ఎంపిక చేసుకున్న సభ్యులతో 'సర్కారీ సెనేట్'ను రూపొందించారు.

నిర్బంధ పదవీ విరమణ పేరిట 6,700 మందిని ఉద్యోగాల నుండి తొలిగించారు. మీసా, డి. ఐ. ఆర్. క్రింద సస్పెండు అయిన వారు ఉద్యోగాలు కోల్పోయిన వారు మరెందరో ఉన్నారు.

ప్రతి పక్షాల పలుకుబడి అత్యాచార యుగంలో కూడా నిరంతరాయంగా ఎక్కువ కావడం నియంత సహించలేదు. ఎమర్జెన్సీ వ్యతిరేక వాతావరణాన్ని రూపుమాపడానికి ప్రభుత్వం జరిపిన అక్రమాలు అన్నీ వెలుగులోకి రావడం అసాధ్యం. ప్రాంతాల వారీ చరిత్ర అచ్చుకు నోచుకున్న నాడు దేశం ఎంత భయానకమైన పరిస్థితుల్లోంచి బ్రతికి బయట పడ్డదో తెలుస్తుంది. షా కమీషన్ ముందు వెల్లువలై కారుతున్న కన్నీటి గాథలు రోజూ పత్రికలలో తిలకిస్తున్నవే గదా!

ఈ అత్యాచారాలకు, అధికార దుర్వినియోగానికి సంజయ్ - బన్సీ - యశ్‌పాల్ కపూర్ వగైరాలను 'చండాల్ చౌకడీ' (దుష్ట కూటమిగా) పేర్కొని వారే కారణమని, ఇందిరాగాంధీకి ఇవేమీ తెలియవని - తెలిసినా పూర్తిగా తెలియవని - ఈ నాటికీ వాదించే వాళ్ళు లేకపోలేదు. వాళ్లు అమాయకులైనా కావాలి. లేదా దుష్టబుద్ధులైనా కావాలి. అంతేకాదు ఎమర్జెన్సీని సమర్థించే కలుష బుద్ధులు - ప్రజాస్వామ్య శత్రువులు - నేటికీ అక్కడక్కడ కన్పిస్తుంటారు.

ఇందిరా గాంధీకూడ "అక్కడక్కడ ఉద్యోగుల అత్యాచారాలు శ్రుతిమించి చేసివుండవచ్చు" నాకు తెలియదు అన్నది. కానీ ఎమర్జెన్సీ కాలంలో ఎక్కడ ఏం జరిగినా ఆ విషయం ఆమెకు చేర్చబడుతునే ఉండేది. కానీ ఆ నాడు ఒక్కసారి - మాట వరుసకు - సానుభూతి

సూచకంగా నైనా జరిగిన అక్రమాలను ఖండించని మనిషి ఆ తర్వాత 'తెలియద'నడం మరో రాక్షసం. ఎందుకంటే ఆంధ్ర ప్రాంతంలో జరిగిన అత్యాచార వివరాలను పూర్తిగా తయారుచేసి, మొత్తం ఆంధ్ర ఎం. పి. లకు, ముఖ్య మంత్రికి, కేంద్ర గృహమంత్రికి, ప్రధానికి, రాష్ట్రపతికి '76 జనవరి చివరి వారంలో విజ్ఞాపన పత్రాలు పంపబడ్డాయి. వాటిని గురించి ఎక్కడా ప్రసక్తి చేయడంగానీ విచారణ జరిపించడంగానీ చెయ్యలేదు. పైగా నాకు తెలియదనడం ఎంత సాహసమో గ్రహించవచ్చు.

ఎమర్జెన్సీ ద్వారా - ఎమర్జెన్సీ గొడుగు నీడన వ్యాపించిన అక్రమాలు - దుర్మార్గాలు దేశ మంతటా హెచ్చుతగ్గులతో సమానంగానే కన్పిస్తాయి. కానీ ఆ అక్రమాలను ప్రజలకు తెలియజేసే యంత్రాంగం బలవత్తరంగా పనిచేసిన ప్రతిచోట ప్రజలు నియంతృత్వపు నగ్న స్వరూపాన్ని చూడగలిగారు. అందుకే ఇందిరా గాంధీ, ఆర్.యస్.యస్. గుసగుసల వలయాన్ని వ్యాపింప చేస్తున్నదన్నది. వాళ్ళు అపోహలు ప్రచారంచేసే నేర్పులో ప్రవీణులైనారని వాపోయింది. తన దుష్కృత్యాలను మాత్రం అంగీకరించ లేకపోయింది.

సంజయ్ గాంధీ ఎవరు ? అతగాడికి అంత ప్రతిష్ఠ లభించడానికి కారణం ఏమిటి ? అతని యోగ్యత లేమిటి ? సంజయ గాంధీని పురస్కరించుకొని 'ఛోటా సంజయ్‌లు', 'రాష్ట్ర యువనేతలు'-ముఖ్య మంత్రుల పుత్రు లెందరు జిగేల్ మని క్షణకాలం మెరిసిపోలేదు ! ఈ వారసత్వం-రాజరికపు ధోరణి - ప్రజా స్వామ్యానికి వ్యతిరేకం అని ఎవరూ అనలేక పోగా, మీ తాతను సేవించాం - మీ తల్లిని కొలిచాం - మీకూ సేవ చేసే అవకాశం ఇప్పించండని' సాగిల పడ్డవారు - ఈ చెప్పులు మోసిన అల్పులు కేంద్ర మంత్రులుగా - ముఖ్య మంత్రులుగా - మన దేశానికి

ఏలికలుగా ఉండిన చీకటి ఘడియల్లో నుంచి దేశం బయటపడ గల్గుతుందా అనే నిరాశను - నవంబరులో లోక సంఘర్ష సమితి తల పెట్టిన సత్యాగ్రహం-తర్వాత ప్రజలలో క్రమంగా వ్యాపించిన చైతన్యం పటాపంచలు చేసాయి.

నవంబరులో సాగిన సత్యాగ్రంలోను, అంతకు ముందు - ఆ తర్వాత ప్రభుత్వం ఎమర్జెన్సీని వ్యతిరేకించిన వారిని - వ్యతిరేకిస్తారని భావించిన వారిని పెట్టిన బాధలు హిట్లర్ చేసిన దురాగ్రాలకు తీసిపోవు.*

స్నేహలతారెడ్డి కథ, లారెన్స్ ఫెర్నాండజ్ గాథ, ఢిల్లీ విద్యార్థి పరిషత్ నాయకులు ఆర్. కె. భాటియా, హేమంతకుమార్ విష్ణోయి, ఢిల్లీ విశ్వవిద్యాలయ అధ్యాపక సంఘ అధ్యక్షుడు ఓంప్రకాశ్ కొహ్లి - ఇలా ఎందరినో - ప్రభుత్వం చిత్రహింసలకు గురి చేయటం - ఆ బాధలకు కొందరు మరణించటం - కొందరు జీవచ్ఛవాలై బతుకుతూండడం - అదొక హృదయాన్ని కదిలించే గాథా సహస్రి.

సత్యాగ్రహాలను పరిహసించి 'సత్యాగ్రహాల యుగం అంతరించింద'ని విమర్శించిన ఇందిరా గాంధీకి ఈ అక్రమాలు దారుణాలు చేయతగనివని తెలియదా?

ఇందిరా గాంధీ అక్రమంగా ప్రధానిగా కొనసాగుతున్నది. అక్రమంగా ఆమె ప్రధాని పదవిని కాంగ్రెస్ అగ్రనాయకులు సూటిగా - మౌనంగా ఉంటూ - సమర్థిస్తున్నారు. కనుక అధికారులు విజృంభిస్తే ఆశ్చర్య మేమున్నది!

---

*ఆంధ్రలో జరిగిన అత్యాచారాల వివరాలకు 'నవభారతి' ప్రచురణ 'అత్యాచారపర్వం' చదవండి.

అజ్ఞాత ఉద్యమం లో అసహనాన్ని ఎప్పటికప్పుడు - ప్రజలకు తెల్పుతూ - నియంత పోకడలను ప్రతి చెవికి, ప్రతి కంటికి అంద చేస్తుండేది. దేశంలో అగ్నిపర్వతం బ్రద్దలవ్వటానికి సిద్ధంగా ఉన్నది. విదేశాలలో అంతవరకు 'స్వేచ్ఛా మానవత్వపు విలువలు - మానవ హక్కులు' అని నినాదాలు చేసిన ఇందిరా గాంధి తిరస్కారానికి అప హాస్యానికి గురైంది.

సంజయ్‌ను తాను, తన తర్వాత ప్రధానిగా ఏర్పాటు చేద్దామను కొన్నది. ఆతణ్ణి 'కార్యాచరణ ప్రధానిగా' చేసింది. ముఖ్య మంత్రులు పోటీపడి 'ఏలిన వారి' కృపా కటాక్షం కొరకు వందిమాగధు లైనారు. కానీ అంతర్గతంగా కాంగ్రెస్ పెద్దల్లోను, ఆత్మాభిమానము వ్యక్తిత్వం గల మిగతా వారిలోను ఇందిరా గాంధీ, సంజయ్ గాంధీల వ్యవహార ధోరణిపట్ల అసహ్యం ప్రబలుతూ వచ్చింది. సంజయ్ ప్రవేశం కాంగ్రె స్‌లో ముసలం పుట్టినట్లైంది.

పరిస్థితి ముదరక ముందే - దేశంలో అహింసాయుతమైన సత్యా గ్రహ ఉద్యమం వల్ల వ్యాపించిన కదలికను వినియోగించుకొని, అతి వాదులు మళ్ళీ తలఎత్తితే దేశం అదుపులో ఉండదని భావించిందేమో - కారణమేమైనా ఉండవచ్చు - ఇందిరా గాంధీ ఎన్నికలు హఠాత్తుగా ప్రకటించింది.

ఎన్నికలు ప్రకటించకుండా ఎందుకు ప్రయత్నించ లేదు ?

ఈ ప్రశ్నకు సమాధానంగా ఢిల్లీలో ఉండి, పరిస్థితులను ప్రత్య క్షంగా గమనించి, గ్రహించి 'రామ్‌కుమార్ భ్రమర్' అనే పాత్రి కేయుడు తన 'దూసరీ ఆజాదీ' అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు :

"హేమవతి నందన్ బహుగుణ బొంబాయిలో జరిగిన ఒక బహిరంగ సభలో - తాను, జగ్జీవన్‌రామ్, నందినీ సత్పథీ మొదలగు

వాళ్ళు కాం|గెస్ నుండి రాజీనామా చేసిన రోజున - జనతా పార్టీ నాయకుడు ఎల్. కె. అద్వానీ తమను కలిసి "ఎన్నికలై పోయినాయి. ఒక విధంగా ఎన్నికల పరిణామం ఎలా ఉంటుందో ఎదురుగా కన్పిస్తూనే ఉన్నది. కానీ, ఇందిరా గాంధీ - చూస్తూ ఊరుకుంటుందని అనుకుంటున్నారా" - అని అడిగాడు. "దిగులు పడబోకండి అద్వానీజీ: ఇందిరాజీ ఏ గనిలోంచి పుట్టిందో అందులోంచే నేను పుట్టాను"- అని సమాధానం ఇచ్చానని బహుగుణ చెప్పాడు. అయితే అద్వానీకి కల్గిన అనుమానం (లేదా రహస్యంగా అతనికి తెల్సిన విషయం) తప్పు అనుకోవాలా ? ఇందిరా గాంధి ఈ ప్రయత్నమూ చేసింది-కానీ సాధించలేక పోయింది.

మెసాచ్యూసెట్స్‌లో ఉన్న 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ'లో పనిచేసి విరమణ పొందిన ప్రాధ్యాపకుడు, రాజకీయ సమీక్షకుడు అయిన రాబర్ట్ మైడోక్ ఈ రహస్యాన్ని వెలుగులోకి లాగాడు. ''ది నేషన్'' అనే విదేశీ పత్రికలో ప్రచురించిన ఒక వ్యాసంలో ఇలా వ్రాసాడు.

''ఇందిరా గాంధీ - ఆమె ప్రభుత్వమూ తుదిశ్వాస పీలుస్తూ రాజ్యాంగాన్ని రద్దు చేయడానికి - ఎన్నికలు రద్దుచేసి సైనిక శాసనం ప్రవేశ పెట్టడానికి ప్రయత్నాలు చేసింది." ఇందిరా గాంధీ చెయ్యాల్సిన ప్రయత్నాలన్నీ చేసింది. కానీ కొంతమంది ఈ నియంతృత్వం వల్ల తాము - తమ పార్టీ ఎంతగా నష్టపడ్డారో అంత కంటే అధికంగా నష్టపడటమనే పొరపాటు చెయ్యరాదన్న నిర్ణయంతో అడ్డుపడడాన - అది కుదరలేదు. వీరిలో మొదటి వ్యక్తి స్వర్గీయ రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్......"

రాబర్ట్‌కు ఈ విషయాలు ఏ మార్గాల వెంట లభించాయో వ్రాయలేదు. కానీ అతడు అనేక రహస్యాలు బయట పెట్టాడు. అతడు తన

వ్యాసంలో ''ఇందిరా గాంధీ రాష్ట్రపతి నుంచి నిరాశపొంది జనరల్ టి. యస్. రైనాతో మంతనాలు జరిపింది. అశాంతి నెపాన కొన్ని నియోజక వర్గాల్లో సైన్యాన్ని దింపాలని కోరింది. రైనా అలా చేయ టానికి ఇష్టపడక స్పష్టంగా నిరాకరించా రంటారు. అప్పుడు మంత్రి మండలి సైన్యాన్ని పంపించాలని ఆదేశం పంపింది. రైనా సేనలను అటూ ఇటూ కదిలించాడు గానీ దానివల్ల ఆమె ఆశించిన ఫలితం దక్కలేదు.

న్యాయశాఖ మంత్రి గోఖలేను - ఎన్నికలు రద్దు చేయటానికి ఏదైనా దారి ఉంటే వెదకమని పురమాయించింది. అతడు విధేయతతో న్యాయశాస్త్ర గ్రంథాలలో తలదూర్చాడు.

ఇందిరా గాంధీ తన నీడను చూచి తానే భయపడవలసి వచ్చిన పరిస్థితి ఏర్పడింది.

బన్సీలాల్ క్రమంగా బలపడుతూ వచ్చాడు. తన కొరకు ప్రత్యే కంగా ఒక రహస్యచార సంస్థని ఏర్పాటు చేసుకున్నాడు. ఆ చారసంస్థ ప్రధాని చర్యల మీద కూడా నిఘా వుంచింది. ప్రధాని ఇంటికి ఎవరు వచ్చినా వారి వివరం బన్సీలాల్‌కు చేరాలి.

ఈ చార సంస్థద్వారా ప్రత్యర్థులను చంపించడం - పీడించడం - వారి ఆస్తిపాస్తులను దోపిడీ చేయించడం జరుగుతుండేది.

ఈ సంస్థకు ఆధునిక పరికరాలతో కూడిన కార్లు, ఆయుధాలు వగైరాలు ఉండేవి. ఈ సంస్థ గృహ మంత్రిత్వశాఖ ఆధ్వర్యంలోని చార సంస్థల కార్యకలాపాలను కూడా కనిపెడుతూండేది. 'నవ భారత్ టైమ్స్' అనే పత్రిక 4 మే 1977 న బన్సీలాల్ ఈ చార సంస్థ ద్వారా చేయించిన ఘాతకాలను వర్ణించింది.

ఇందిరా గాంధీకి ఎవరిని విశ్వసించాలి-ఎవరిని విశ్వసించరాదు-అనే స్థితి ఏర్పడ్డది.

హిరణ్యాకశ్యపుడు ప్రహ్లాదుణ్ణి ఎంత హింసించినా తన దారికి త్రిప్పుకోలేక చివరికి ఆ ప్రహ్లాదుణ్ణే, 'ఏదీ నీ దేవుడు - వాణ్ణి కూడా చంపుతానన్నాడు. ప్రహ్లాదుడాదేవుడు సర్వవ్యాపి అన్నాట్ట. అపుడు ఈ స్తంభంలో గూడానా - అని కసిరి అడిగితే, ప్రహ్లాదుడు అవునన్నాడు. హిరణ్యకశ్యపుడు ఆ స్తంభం మీదే దెబ్బతీశాడు. ఆ స్తంభంలోంచి నృసింహుడవతరించి హిరణ్యాకశ్యపుణ్ణి హతమార్చాడు.

ప్రతి పక్షాలను ఇందిరా గాంధి 'ఏదీ మీ బలం' అని సవాలు చేసింది. ప్రజలే మా బలం అన్నాయి ప్రతిపక్షాలు. ప్రజ స్థాణువులా ఉన్నది. అలాంటి ప్రజపై ఇందిరాగాంధి విరుచుకుపడింది. ప్రజలలోంచి నృసింహ రూపాన్ని ధరించి ప్రజాస్వామ్య నృసింహుడు బైటపడి ఇందిర నియంతృత్వాన్ని హతమార్చాల్సి వచ్చింది.

హిరణ్యకశ్యపుణ్ణి అలాంటి ప్రశ్న వేయమన్నదెవరు ? ఇందిరా గాంధీని ఎన్నికలు ప్రకటించమన్నదెవరు ? ఇందిరా గాంధీకి 'ఇప్పుడు తప్పితే మరి లాభం లేదు. ఎన్నికలు పెట్టి 'గెలిచా'నని అనిపించుకొమ్మని రిసెర్చి అండ్ ఎనలిసిస్ వింగ్ సలహా ఇచ్చిందంటారు !

రష్యా కూడా త్వరగా ఎన్నికలు పెట్టి, గెలిచానని అనుపించుకొమ్మని సలహా ఇచ్చిందంటారు.

ఎమర్జెన్సీ ఉండగానే - ప్రజల ఆమోదం లభించిందని అనిపించుకొమ్మని ఆమె కూటమి చెప్పిందంటారు. పరిస్థితి ఆలస్యం చేస్తే మరీ విషమించవచ్చునని సలహా వచ్చిందని గూడా అంటుంటారు.

విదేశాలనుండి - ముఖ్యంగా భారత సహాయక దేశాలనుండి వత్తిడి వచ్చిందని కూడా అంటారు.

ఏది నిజమైనా – అన్నీ నిజమైనా కావచ్చు–ఇందిరాగాంధి ఎన్నికలు ప్రకటించింది.

ప్రతిపక్షాలు ముందుగా ఊగిసలాడినా చివరికి ఎన్నికలలో పోటీ చేయడానికే నిశ్చయించుకున్నాయి. అంతవరకు నాయకులందరూ నిర్బంధాలలో జైళ్ళలో ఉన్నవారే. ఐనా "మేము వెళితేచాలు – ప్రజలు మా కొరకు ఎదురు చూస్తూ కన్పించారు.'' – అంటాడు జగన్నాధరావ్ జోషి. 'జనతా జనార్ధనుడు చూపిన మహిమ' అంటాడాయన.

అందుకే కాబోలు ఆ క్షణాన జగజ్జీవనరాం, హేమవతీ నందన్ బహుగుణా బైటపడ్డారు. జగజ్జీవనరాం దేశ నాయకులలో ఒక గౌరవ స్థానం కల వ్యక్తి. ఆయనవల్ల కాంగ్రెసు లాభపడ్తూ వచ్చింది. వయోవృద్ధులైన కాంగ్రెసు అగ్రనాయకుల్లో ఆయన ప్రముఖుడు. అలాంటి వాణ్ణి – నిర్లక్ష్యం చేసి అవమానించడానికి నియంత వెనుదీయలేదు. హేమవతీ నందన బహుగుణ యుం. పి. రాజకీయాలలో చక్కని అనుచర వర్గం, బలగంగల వ్యక్తి.

కృపలానీ దేశంలో నీతికీ – నిర్భీకతకూ – సాక్షిగా జీవిస్తున్న గాంధీతత్వ వ్యాఖ్యాత. అధికార రాజకీయాలకు దూరంగా ఉంటున్న మనిషి. విజయలక్ష్మి పండిట్ కాంగ్రెసులో జీవితాన్ని గడిపిన నెహ్రూ కుటుంబ వ్యక్తి. చాగ్లా, తార్కుండే, పాల్కీవాలా, రాజమోహనగాంధీ–ఒకరేమిటి – ఒకే వెల్లువలా జనతా ధారను మహాప్రవాహంగా చేసారు.

ఆంధ్రలో సదాలక్ష్మి, కొండా లక్ష్మణ్ బాపూజీ, మూర్తిరాజు బి. జనార్థనరెడ్డి – తెగించి జనతా ప్రవాహంలో కలిసి ప్రవహించారు.

తమ సర్వ శక్తులనూ నియంతను ఓడించడానికి వినియోగించారు.

దాదాపు 20 నెలలు కలాల తడి ఆరిపోయిన చెడుకాలం. ఒక్క సారి కట్టలు తెగి పాత్రికేయులు పరవళ్ళు త్రొక్కారు. స్టేట్స్మన్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఆంధ్రప్రభ - ఇంకా ఎన్నో జనతా ప్రభంజనానికి సైదోళ్లుగా నిలిచాయి.

ఎమర్జెన్సీ పెట్టిన నాటి నుండి ప్రారంభమై ఎన్నికల సంరంభాన్ని ఆరంభించిన లగాయితు ఉధృతమై - ఇందిర పదే పదే చదివిన మంత్రం - చేసిన నామ జపం" జనతా పార్టీ అంటే జన సంఘం - జన సంఘం అంటే ఆర్. యస్. యస్. - ఆర్. యస్. యస్. మతోన్మాద, అర్ధ సైనిక, రహస్య సంస్థ - అల్ప సంఖ్యాక వర్గ శత్రువు - ఫాసిస్టు ముఠా - కనుక దానిని ఓడించాలి. దాని నోడించాలంటే జనతాను ఓడించాలి" - అని, క్లుప్తంగా చెప్పాలంటే ఆర్. యస్. యస్.ను ఓడించాలంటే తనను గెలిపించమని ఆమె కోరింది.

ఈ ప్రచారం ఇందిరా గాంధీ ఎమర్జెన్సీ పెట్టగానే ప్రారంభించింది. 13-7-75 న లండన్ పత్రిక సండే టైమ్స్‌కు ఇంటర్వ్యూ ఇస్తూ ప్రతిపక్షాలకు అంగబలం చేకూర్చిన ఆర్. యస్. యస్. క్రియాశీల సభ్యులు అంతకుముందే అజ్ఞాతంలోకి వెళ్ల నారంభించారు..." అన్నది. "దుష్ట సంస్థ ఆర్. యస్. యస్. అంగబలాన్ని ఆశ్రయించిన రాజకీయ పార్టీల కూటమి కేంద్ర ప్రభుత్వంలోకి వస్తే ప్రజాస్వామ్యమే కాదు, భారత సమైక్యతకే భంగం వాటిల్లుతుందని నార్మన్ కజిన్స్ ('సాటర్ డే రివ్యూ' సంపాదకుడు) తో 1-8-75 న మాట్లాడుతూ అన్నది. ప్రఖ్యాత శిశు చికిత్స నిపుణుడు డా॥ బెంజిమన్ స్పోకుకు ఆగస్టు '75 లో లేఖ వ్రాస్తూ - "చాలా కాలంగా జె. పి. నా ప్రభుత్వాన్ని, వ్యక్తిగతంగా నన్నూ విమర్శిస్తున్నాడు. అయినా ఆయన గతి విధానాన్ని, వాక్స్వాతంత్ర్యాన్ని అడ్డగించలేదు. కాని కొన్నాళ్లుగా ఆర్. యస్. యస్. తో చేతులు కలిపాడు" అని వాపోయింది.

కాంగ్రెస్ అధ్యక్షుడు బారువా హైదరాబాద్‌లో '76 జూన్‌లో మహ్మద్ యూనస్ షష్ఠిపూర్తి ఉత్సవాల సందర్భాన 'విప్లవ పుత్రి ఇందిరా గాంధీ రూపొందించిన 20 అంశాల కార్యక్రమాన్ని కీర్తిస్తూ, "మతోన్మాదం ద్వారా దేశాన్ని బలహీన పరచడానికి ఆర్.యస్.యస్.; జనసంఘ తదితర శక్తులు ప్రయత్నించాయి. అందుకే ప్రభుత్వం వాళ్ళను జైళ్లలో పడేసింది. జ్ఞానోదయం కలిగేవరకు వారు జైళ్ళ లోనే ఉండాలి" అని ప్రకటించాడు.

ఇందిరా గాంధీకి – ఆమె అంతరంగి భృత్యమండలికి జె. పి. ని చూచినా, ప్రతిపక్షాలను చూచినా ఆర్. యస్. యస్. మాత్రమే కన్పి స్తుండేది. ఆర్. యస్. యస్. 'బూచిని' చూపి మైనారిటీ ఓట్లను కొల్ల గొడదామనే నీచ రాజకీయాలకు పూనుకున్నది. అలా ముప్పై ఏండ్లు సమాజాన్ని బదాబదలు చేసి, అధిక సంఖ్యాకులు కాదన్నా, మైనారి టీలను రకరకాల లోభాలు – దురాశలు చూపి – కాంగ్రెస్ గెలుస్తూ వచ్చింది. అది లాభసాటి బేరం.

కానీ, జుమా మసీదు ఇమాం అబ్దుల్ బుఖారీ "ఆర్. యస్. యస్. ముస్లిం విరోధి కాదు – ఇన్నాళ్ళు మతకలహాలను రెచ్చగొట్టి చెరలాట లాడించింది కాంగ్రెసే" అని ప్రకటించాడు.

జె. పి. ఇందిరను డిక్టేటరన్నాడు.

ప్రతి పక్షాలు "ప్రజా స్వామ్యమా ? నియంతృత్వమా ? ఏదో తేల్చుకోం"డని అన్నాయి.

"వచ్చే ఎన్నికల్లో కాంగ్రెసుకు ఓటు ఇవ్వడ మంటే చేజేతులా ... ంచు కోవడమే. భయం – లోభం – మోహం – కులం–

మతం - అన్నీ వదలి జనతా పార్టీకే ఓటివ్వండి" - అని హైద్రాబాదులో '77 ఫిబ్రవరి చివరి వారంలో ప్రసంగిస్తూ జయప్రకాశ్ ప్రజలకు విజ్ఞప్తి చేశాడు.

ఆర్. యస్. యస్. కేంద్ర కార్యాచరణ దళంలో ఒకరైన బాపూరావ్‌జీ 24 జులై '77 'పాంచజన్య' హిందీ వార పత్రికలో ఒక వ్యాసంలో ఇందిరా గాంధీ చివరి ఘడియల్లో ఆర్. యస్. యస్. ను మచ్చిక తీసుకోడానికి ఎలా ప్రయత్నించిందో వివరించాడు.

వివిధ పక్షాలను కలపడానికి - ఎన్నికల్లో ఇందిరా గాంధీకి వ్యతిరేకంగా ప్రబలమైన ప్రజాభిప్రాయాన్ని నిర్మించడంలో ఆర్. యస్. యస్. బలగం చేసిన ప్రయత్నం ఎంత గొప్పదో ఆమెకు (ఇందిరకు) తెలుసు. ఇది వాస్తవం కూడా. అందుకని ఎన్నికలకు 20-25 రోజుల పూర్వం ఒక ఉన్నత అధికారి సంఘ నాయకులతో మాట్లాడాలని సందేశం పంపాడు. అప్పుడు సంఘాధికారులు ఎక్కడుంటుండే వారో అతనికి తెలీదు. కాని ఎక్కడ వార్త అందిస్తే, చేరుతుందో తెలుసు. కలవాలని నిశ్చయించుకున్న తర్వాత - అతనితో గంట-గంటన్నర సంభాషణలు జరిగాయి. మాటల వరుసలో అతడు పదే పదే ''సంఘ స్వయంసేవకులు ఇందిరా గాంధీని ఓడించ డానికి సర్వశక్తులతో గట్టిగా పూనుకున్నారు. వానిని ఉపసంహరించు కోవాలి. సంఘం అలాచేస్తే నిషేధం తొలగించ బడుతుందనీ, నిర్బంధంలో ఉన్న స్వయంసేవకులు విడుదల చేయబడుతారనీ మరి ఒప్పందం జరిగేటప్పుడు ఉభయులునూ ఇచ్చిపుచ్చుకోవడం అంటూ ఉంటుంది కదా ! అని ఆ అధికారి ప్రతిపాదించాడు.

సంఘ నాయకులైన బాలాసాహెబ్ వ్రాసిన ఉత్తరాలను కూడా దగ్గరికి రానివ్వలేదు కదా ! సంభాషణలు జరగాలని మేము మొదట

అనుకున్నాం. కాని మీ వ్యవహారమే వేరుగా ఉండేది. ఇప్పుడు మీరు చెప్పినట్లు చేయడం సాధ్యం కాదు. స్వయంసేవకులు ఈ విషయాన్ని ఎన్నికల్లోనే తేల్చుకో నిశ్చయించుకున్నారు. అందుకని వారు పూర్తి శక్తితో ఎన్నికల్లో పనిచేస్తున్న మాట వాస్తవమే. వైతొలగండని వారికి మేము చెప్ప'' మని ఆర్. యస్. యస్. ప్రముఖులు చెప్పారు.

ఆ అధికారి ఇంకా ఎన్నో విధాల చెప్పి చూచాడు. నిషేధం తొలగించేటపుడుగాని, స్వయం సేవకులను విడుదల చేసేటపుడు గాని, అవమాన కరమైన ఒక శబ్దంకూడ లేకుండా, వారి గౌరవానికి భంగం లేకుండా వారి సంసను వారు నడుపుకొనే అవకాశం ఉండేలా చేస్తామని హామీ ఇచ్చాడు. కాని లాభం లేకపోయింది. ఆ సంభాషణలు విఫలమైన మరునాటినుండి ఇందిరాగాంధీ ఆర్. యస్. యస్. ను తెగబడి దూషించ నారంభించింది. ఎన్నో అబద్ధాల నిందలను మోపింది. అంటే ఆర్. యస్. యస్. నాయకులు పంపిన సూటి జవాబు అమెకు చేరిందన్న మాట.

అప్పటి నుండి ఇందిరా గాంధీ ఎన్నికల నినాదం "ఇందిరా గాంధీయా ? ఆర్. యస్. యస్సా'' ?

ప్రతిపక్షాల నినాదం "ప్రజా స్వామ్యమా ? నియంతృత్వమా? "
ప్రజలు రెండు సంవత్సరాలుగా ఉభయులనూ చూచారు. తమలో తాము నిర్ణయించుకున్నారు.

ఇందిరా గాంధీ ఓడింది. ఆర్. యస్. యస్. పై ఆమె సాగించిన దాడిని ప్రజలు త్రిప్పికొట్టారు.

నియంత గాంధీ ఓడింది - ప్రతిపక్షాలు నిందించిన ప్రజా స్వామ్యం గెలిచింది. ప్రజలు నియంతృత్వాన్ని పడగొట్టారు. బాని సత్వపు సంకెళ్ళను ముక్కలుగా తెగకొట్టారు.

ఆర్. యస్. యస్. - ప్రజాస్వామ్యం; ఈ రెండూ విజయ దుందుభిని మ్రోగించాయి.

ఇది వాస్తవానికి గుర్తించవల్సిన సారాంశం.

అయితే ఆంధ్రలో జనతా ఎందుకు గెలవలేదు: ఎమర్జెన్సీకి పూర్వమే ఆంధ్రలో బలంగల ప్రతిపక్షం అంటూ లేదు. ప్రతిపక్షాలకు గ్రామ స్థాయి దాకా అంగబలం గల జిల్లాలు తక్కువ. అన్ని జిల్లాల్లో ఏ కొద్ది రూపమన్నా ఉన్నదంటే ఒక జన సంఘానికి ఉండేది. సంస్థా కాంగ్రెస్ పేరుకు ఉండేది. సోషలిస్టులు అక్కడక్కడ తుంపరలుగా ఉండేవారు. చాలా మంది పూర్వ సోషలిస్టులు కాంగ్రెస్‌లో కలిసారు. బి. యల్. డి. కూడ అక్కడక్కడ స్థావరాలను సంపాదించింది. మిగతా పార్టీలు లేనే లేవు.

అలాంటి చోట అజ్ఞాత ఉద్యమాన్ని నడిపే బాధ్యత ఒక్క ఆర్. యస్. యస్. మీదే పడింది. ఏ మేరకు వీరి వల్ల ప్రజలను చేరు కోడం సాధ్యమైందో ఆ మేరకు పూర్వ రంగం సిద్ధమైంది. ఎన్నికలు ప్రకటించిన తరువాత - ప్రజల కందుకే బలమైన ప్రతిపక్షం - కన్పించ లేదు. ఎమర్జెన్సీ కాలంలో చొరవ చేసుకొని తెగించి ముందుకు రానం దున - ఆ కాలంలో ప్రజా స్వామ్యానికి జరిగిన కీడును - సత్యాగ్రహీ

లను - అత్యాచారాలను - రాజ్యాంగ హత్యను-పౌర హక్కుల అపహరణను ప్రజలకు అందచేయలేక పోయినారు. మార్పు అవసరాన్ని గుర్తింప చేయలేకపోయినారు. కనుక తెలియని అప్పునికంటె తెలిసిన దుర్మార్గుడే నయమనుకున్న సామెత సార్థకమై, జనతాకు గుణపాఠమైంది.

మార్చి 20 న సాయంకాలం నుంచే ఎన్నికల ఫలితాల ప్రకటన ప్రారంభమైంది. వరంగల్‌లో ఎస్. బి. గిరి గెలుపును మొట్ట మొదట ప్రకటించారు. వరుసగా ఫలితాలు ప్రకటింప బడుతుంటే - అన్నీ ఆంధ్రవే-అన్నీ కాంగ్రెసుకే. కాని క్రమంగా ఇతర ప్రాంతాల ఫలితాలు మొదలైనాయి. జనతా ప్రతినిధుల గెలుపుల ప్రవాహం సాగింది. బి. బి. సి. ఎప్పుడో ఇందిర ఓడుతూన్నదని ప్రకటించిందట! కాని మన రేడియో ప్రకటించలేదు. ఆలస్యంగా ప్రకటించింది. ఎన్నికల్లో దారుణాలు జరిగాయని ఇందిరా గాంధీ తరఫున వకీలు వాదించాడట! తిరిగి పోలింగు జరగాలన్నాడట! ఫోన్ల మీద ఫోన్లు ఢిల్లీ - రాయబరేలీ మధ్య నడచాయట. రిటర్నింగ్ ఆఫీసర్ మల్హోత్రా గట్టివాడు. అతను కుంటి సాకులను లెక్క చెయ్యలేదు. ఇందిరా గాంధీ ఓడిందని ప్రకటించాడు. అమేథీలో సంజయ్ ఓడాడు. పాపం! అక్కడ సంజయ్ - ఇక్కడ ఈమె - అంగరక్షకులందరూ నేల కొరిగారు.

ఆ వార్తను బోర్డు మీద ఎక్కించిన యువకునిపై ఢిల్లీలో రూపాయిల వర్షం కురిసిందట! "ఆవు పాయె - దూడా పాయె - దేశానికి పట్టిన పీడా పాయె'' అని పాటలు - నినాదాలు - ఊరేగింపులు - బాణా సంచాలు - అదొక అద్భుతమైన ఆనంద కల్లోలం. దేశానికి

పట్టిన గ్రహణం విడిచింది. స్వేచ్ఛాభారతి పాద మంజీరాలు ఘల్లు మన్నాయి.

చరిత్రలో మరుపురాని దినం అది. వేల కొలదిగా జైళ్ళలో క్రమగ్గుతున్న భారత పౌరలకది ముక్తి దినం. ప్రజాస్వామ్యానికది పర్వ దినం. "స్వాతంత్ర్యం మా జన్మహక్కు - అది పొందేదాకా విశ్ర మించ''మని దేశం చేసిన ప్రతిజ్ఞ సాధించిన "జన విజయం."

# 18
# జాగ్తేరహో

'ప్రజలలో చైతన్యం
ప్రజాస్వామ్యానికి అంగరక్ష.'

భారతదేశం విశాలమైన దేశం.

హిమాలయం నుండి కన్యాకుమారి వరకు రకరకాల శీతోష్ణ స్థితులతో - ప్రతి రెండు మూడు వందలకు ఒక్కొక్క భాషగా - వేషంగా - విభిన్న అభిరుచులతో - పలు మతాలతో విలసిల్లే దేశం.

భూగర్భ సంపదలకు కొదువలేనిదీ దేశం. సహజ సంపదలకు ఇరుకాపుల మాగాణి ఈ దేశం.

తొలి మానవుని పదాల సవ్వడి వినిపించిన ఈ దేశం - నాటి నుండి గొంతెత్తి పలికిన మానవతా స్వరధార కమనీయమైన గమకాలతో — ఉదాత్త - అనుదాత్తాలతో సాగించిన జీవన సంగీతం — మన సంస్కృతి.

ఈ దేశం మానవుని బ్రతుకు బాటలో కనిపించిన ఆటుపోట్లే ఈ దేశ చరిత్ర. ఇక్కడి ప్రజ - స్వేచ్ఛ కొరకు, ఆత్మ స్వాతంత్ర్యం కొరకు సాగించిన ప్రయత్న ప్రవాహంలో మార్పులు — చేర్పులు కొల్లలుగా వచ్చి ఉండవచ్చు. కాని కాలంలా — దేశ చరిత్ర - సమాజ

సంస్కార ప్రవాహము - అనంతం. గంగలా సనాతనం - నిత్యం. ఎంత నీరు ప్రవహించిందో - పాత నీరు పోయి ఎంత నీరు తిరిగి వచ్చిందో — గంగ గంగే.

అలాంటి దేశంలో - మనిషికి సహజమైన విలువనిచ్చి, వ్యక్తిత్వాన్ని గుర్తించిన దేశంలో - ప్రజాస్వామ్యం, సర్వధర్మ సమభావం- సామూహిక జీవనం - ఆత్మానుశాసనం చతుస్సూత్ర ధర్మంగా కాల ఘడియల పడియల నీదుతూ సాగి వచ్చాయి.

ఇక్కడ రాజకీయాలు జీవనంలో కేవలం ఒక్క భాగమే. రాజనీతి సమాజ జీవనంలో ఒక అల్పమైన భాగం. సమాజ చైతన్యం రాజకీయాలకు దిశను చూపుతుంది. అదుపున ఉంచుతుంది. సమాజం క్రియాశీలమైతే - వ్యక్తి క్రియాశీల పౌరుడైతే ప్రభుత్వం కట్టు దప్పి నిరంకుశం కాదు. అదుపు తప్పదు. సమాజం - వ్యక్తి ఆలసిగా పడి ఉంటే ప్రజా స్వామ్యానికి, జీవన నైతికతకు గ్రహణం పడుతుంది. నియంతల ఆవిర్భావం జరుగుతుంది.

ఈ ప్రజా చైతన్యాన్ని - క్రియా శీల పౌరసత్వాన్ని, నెలకొల్పే పని జాతీయ కార్యం.

ఆ చైతన్యాన్ని నిలిపి ఉంచే బాధ్యత ప్రతి పౌరునిది. పౌరుల జాగృత సమిష్టి సంకల్పానిది. ఈ పని రాజకీయ పార్టీలు చేయలేవు. రాజకీయ పార్టీలు వ్యక్తి నిర్మాణానికి ప్రయత్నించినా కొన్ని బాధ కాలుంటాయి.

ఏ బాధా లేకుండా, పదవుల ప్రాకులాటను కోరకుండా - నిరంతరం ప్రజల్లో - ప్రతి ఈడుగల వ్యక్తిలో - ఈ జాతీయ భావాన్ని —

క్రియాశీల పౌర జీవనాన్ని ప్రచారం చేసి, అనుశాసన బద్ధ జీవనాన్ని నెలకొల్పే, స్వయం సమృద్ధమైన ఉద్యమం నడవాలి. అదొక శిక్షణనిచ్చే పథకంగా నడవాలి. ఇది ప్రజాస్వామ్య జీవన రచనలో అత్యవసరమైన భాగం.

ఈ భాగాన్నే ఆర్. యస్. యస్. నిర్వహిస్తున్నది. ఇది సమాజ సంఘటన శాస్త్రం మనస్సుకు సంబంధించింది. వ్యక్తిని మలచే ఆచరణ శాస్త్రం ఇది. ఈ పని ఆ శాస్త్రం విలువ తెలిసిన వ్యక్తులు నిర్వహించాలి. ఇందిరాగాంధీ ఓడినా – ఆమె వాడిన మాటలే వాడే హ్రస్వదృష్టి గలవారు – జాగ్రత్తగా గ్రహించవలసిన విషయమిది. గతించిన చరిత్ర నేర్పిన గుణపాఠం ఇది.

ప్రజలు స్వాతంత్ర్యాన్ని కోరుకున్నారు. బానిసత్వాన్ని తిరస్కరించారు. ప్రజాస్వామ్యాన్ని వరించారు. నిరంకుశత్వాన్ని నిరాకరించారు. ఈ సత్యాన్ని గుర్తించడం అవసరం.

ఈ గడిచిన రెండేళ్ళ ఆత్మ పరిశీలనకు అందరూ పూనుకుంటే బాగుండేది. కాని కొందరికి ఈ పద్ధతి నచ్చనట్లున్నది. వారిలో మార్పు కనబడటం లేదు. కేవలం జనతాపార్టీని – లేక ఫలానా జనతా మంత్రులనంటూ ప్రజలు స్వాగతించలేదు. జనతా అభ్యర్థులందరూ నూటికి నూరుపాళ్ళ 'సాధు పుంగవు'లని ప్రజలు భావించారనుకోడం భ్రమించడమే. ఆ పూర్వపు అలవాట్లను అనుభవపు గీటురాయిమీద పరిశీలించుకోవాలి.

ప్రజలు కోరింది – క్రియాశీల పౌరజీవనాన్ని – జాతీయ ప్రతిష్ఠను – ప్రజాస్వామ్యాన్ని – వ్యక్తి స్వేచ్ఛను – ఆ కోరిక సాధించడానికి ప్రజాశక్తికి 'జనతా' ఒక ఉపకరణం.

ఈ గెలుపు - ఈ జన విజయం - ఒక వ్యక్తిదిగాదు. ఒక వర్గానిది కాదు. వేరువేరుగా ఉన్నంతకాలం ఈ పార్టీలకు విలువ కన్పించలేదు. హెచ్చుతగ్గు లుండవచ్చు - కొంద రెక్కువ త్యాగంచేసి ఉండవచ్చు - మరికొందరు ఉదతాభక్తి చూపించి ఉండవచ్చు - కలసి నిలచినప్పుడే ప్రజలు అండన నిలిచారు.

జనతా ప్రభంజనం - నాయకులది కాదు - ప్రజలది. ప్రజలను ఆ దిశలో నడిపించిన అజ్ఞాత ఉద్యమ తపస్సుది. నాయకులు సంగీతంలో కొస నొక్కులు.

ఈ వాస్తవాన్ని దేశంలో ప్రముఖులు గుర్తించి నడిస్తే ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది. భవిష్యత్తుకు చక్కని దారి ఏర్పడుతుంది.

"గాంధీ పోతే ఎవరు? నెహ్రూపోతే ఎవరు? ఇందిర తర్వాత ఎవరు?" — ఈ నినాదాలు బూజుపట్టి, రూపం చెడిన మధ్యయుగపు మత్తు మాత్రలు. ఇవిపోయి మరో అలాంటి సూత్రం రాకూడదు. వ్యక్తి-ఎంత పెద్దవాడైనా శాశ్వతం కాదు. ప్రజలు శాశ్వితులు. ప్రజాస్వామ్యం శాశ్వతం - దేశం శాశ్వతం.

కనుక వ్యక్తులను ప్రజాస్వామ్య శక్తులుగా రూపొందించాలి. దానికి సాగిన ప్రయత్నాలను హర్షించాలి. అప్పుడే 'నియంత' బూదిలోంచి మరో 'నియంత' పుట్టని పరిస్థితిని దేశం నిర్మించుకోగల్గుతుంది.

'స్వభావో దురతి క్రమః' అంటారు - అలవాట్లు అంత తేలికగా పోయేవికావు. రూఢి వాదాలు - మూఢనమ్మకాలు - పాశ్చాత్యులు వదలి వెళ్ళిన ''ఎంగిలి భావాలు'' మనను ఒక కొలిక్కి చేర్చవు. మౌలికంగా మన చరిత్రను, మన సమాజాన్ని, మన బ్రతుకును లోతు

లంట అన్వేషించడానికి కృషి ప్రారంభం కావాలి. మన అవసరాలను మన కండ్లతో - మన బుద్ధులతో - మనకున్న వనరుల దృష్టిలో - మనదైన అవగాహనతో - గుర్తించవలసిన ఈ శుభోదయాన్ని అందరూ హృదయం తలుపులు తెరచి స్వాగతించాలి.

ప్రజలకు తర్కాలు సిద్ధాంతపు గారడీలు తెలియవు. సిద్ధాంతాలు వల్లించే తన సమీప వ్యక్తిని చూచి చాయిగా సిద్ధాంతాన్ని పోల్చు కుంటారు. ఆ సమీప వ్యక్తిని తీర్చిదిద్దే ప్రయత్నం ఎంత వేగంగా - ఎన్ని రంగాలలో సాగితే అంత శ్రేయస్సు దేశానికి. ఆ ప్రయత్నం పూర్వం ఋషులు చేశారంటారు. నేడు సమాజం చేయాలి. అధికార రాజకీయాల జోలిలేని స్వచ్ఛంద సేవాసంస్థలు చేయాలి. నిరంతరం చేయాలి. భేషజం లేకుండా చేయాలి. ఆ ప్రయత్నాన్ని స్వాగతించ డానికి తొలిగీతం - ఈ సాధించిన 'జనవిజయం'.

# అనుబంధం

1. కవులంటే
2. అజ్ఞాత పత్రికలు
3. వెలుగులు
4. ఇంటర్వ్యూలు
5. సత్యాగ్రహాల పటం



ఆంధ్రప్రదేశ్‌లో అజ్ఞాత ఉద్యమ సంక్షిప్త చరిత్ర

నియంతృత్వంపై ప్రజలు జరిపిన సంకుల సమరపు గాథ

—నవభారతి ప్రచురణ

# 1. కవులంటే

ప్రజాస్వామ్యానికి తిలోదకాలిచ్చిన తర్వాత మిగిలింది "నీ బాంచ"ననే మన సత్వమే.

ఎమర్జెన్సీని ప్రకటించిన తరువాత ప్రభుత్వ యంత్రాంగాన్ని వినియోగించి ఇందిరాగాంధీ వ్యక్తిత్వాన్ని, 'ఇమేజ్'ని పెంచడానికి - నియంత భక్తులు తీసుకోని నికృష్ట చర్య అంటూ లేదు. రకరకాల - "అశ్లీల సాహిత్యాన్ని" సృష్టించి ప్రతిపక్షాలను, సంస్థలను రాక్షసంగా చిత్రిస్తూ - భారత దేశంలో ఎవ్వడూ ఎలాగూ చూడనైనా చూడడు కనుక - 'పాకెట్సు' తయారుచేసి విదేశాలకు ఎగుమతి చేయించింది. ఒక్కొక్క ప్యాకెటు అలా పంపడానికి తొంభై రూపాయలు అయేదట పోస్టేజి మాత్రమే ! అంతేకాదు-భారతీయ భాషల అన్నిటిలో 'ఇందిరా ఇమేజి'ని, 'ఇరవై సూత్రాలను', 'ఇందిర కుటుంబాన్ని', 'కొడుకునూ' పొగిడే సాహిత్యాన్ని వ్రాయించుకుంది.

అందులో కవులను, కళాకారులను ఆకట్టుకోగల చోట ఆకట్టుకోడం, కొనగలిగిన చోట కొనడం, కొరడా ఝుళిపించి నడిపించగల చోట నడిపించడం !

జీవితానికి అర్థవంతమైన పాథేయం లేనివాళ్లు క్యూలో నిలబడి, అవసరమైతే ప్రక్కకు అడుగు వేసి తప్పుకుని, ముందుకు దూరి, 'ఒక్క సలాం'కు 'ఒక్క మొహిరీ' పొంది బైటపడాలని కోరడం మామూలే.

ఆ పద్ధతిలోనే ఆంధ్ర ప్రభుత్వం తెలుగు కవులకు 'దీక్ష' ఇచ్చింది.

ఆ దీక్షకు ప్రాకల్పం "ఇందిరా గాంధీ దేశ శ్రేయస్సు దృష్ట్యా అత్యవసర పరిస్థితి ప్రకటించి వంద రోజులైంది" - "20 సూత్రాలు ప్రకటించింది" అని.

తెలుగులో ప్రసిద్ధులైన అనేక మంది కవులు యీ చర్యలను సమర్థిస్తూ రాసి పంపిన కవితలు -

"వీరనారి మన ఇందిర
విజయ శంఖ మూదిందిరా !
ప్రజా స్వామ్యమును పడద్రోసే
వారిని అణచి వేసిందిరా !"

అని శపథం పట్టి 'దాశరథి' కంఠంలోంచి తొలిగా వెలువడ్డాయి.

ప్రజాస్వామ్యాన్ని పడద్రోసింది ఎవరు ?

జె. పి. యా, మురార్జీయా, అటల్ జీయా-ఇందిరా గాంధీయా ? ఎవరు పడద్రోసింది ? మన కవులు కీర్తిస్తున్న దెవరిని !

"ప్రగతి శక్తుల బలం పెరిగింది నేడు
విషమ శక్తుల నడుం విరిగింది నేడు"

అన్నది సి. నా. రే. సినీపాళి - వెనుకబడి - పోటీబడి.

"పూర్వ దిక్కున పూర్వ పుణ్యమే దిక్కుగా
హృదయేందిరదె వెలసె, హృదయ మర్పించరా"

అన్న భీమన్నకు తోడు దివాకర్లవారు కూడా కొన్ని పంక్తులు - 'పంచ రత్నాల'లా వ్రాయక తప్పలేదు.

బాపురెడ్డి 'అరాజకత్వ వర్షం వెలిసింది.
అలజడుల బురద బెడద తగ్గింది.
ఇరవై రంగుల ఇంద్ర ధనస్సు
ఈ దేశాన్ని పాలిస్తున్నది''

అని తప్పెట మ్రోగిస్తుంటే వినడానికి పరిమళా సోమేశ్వర్ గారికి 'పరీషా సమయం వచ్చింది - విజృంభించింది ఇందిరా ప్రియదర్శిని.'

ముని సుందరానికి నాజూకులు గిట్టుబాటుకాక పాపం 'ప్రతి కల్ని, ప్రజా వ్యతిరేకుల్ని బుట్టలో బంధించిన యీ దినం - నీకూ, నాకూ నేడు పర్వం' అన్నాడు. అతనికి చరిత్ర చెప్పింది 'సామాన్యుడు కోరేది హక్కులు' కాదని.

"బ్రేకుల్లేని బై గ్రిన్లతో జాతి జీవనాన్ని
కలుషితం చేస్తున్న కడు పెద్ద మనుషులు...
అందుకే యీ అత్యవసర పరిస్థితి''

అని 'ఇంత కూడూ, గుడ్డా, గూడూ' సంపాదించుకుని తరించాడు. సరసుడు - పాపం - ఆధునికుడు.

పి. యస్. ఆర్. ఆంజనేయశాస్త్రికి

'ఇదే ఇదే శాసనాసి' పాపం శమించుగాక !

గుత్తికొండ సుబ్బారావు విహారి & శాలివాహన & Co., జ్యోతిర్మయి, ఉసూనా, భద్రిరాజులు - ఈ బాటసారులు. ఇలాంటి వారు పాపం... ఇంకా ఎందరో !

ఇదీ వీరి సర్కారు గీతాల 'దీక్ష.'

'దీక్ష' అమూల్యం. ప్రభుత్వం ప్రజల రక్తమాంసాలు పిండి, కవిత ఒక్కొంటికి ఇంత చొప్పున చెల్లించిన 'సరుకు' అమూల్యమేమరి ! ఆ మాత్రం చేతికి తడి తగులకపోతే 'బీదల మీద, పేదల మీద' కవిత ఎలా వ్రాయడం మరి ! !

ఈ గ్రంథం "అన్యాయాలు - అక్రమాలపై - తెలుగు కవుల తిరుగుబాటు" అట !

మానవతా ! ఇక ఉరి పోసుకో !

లక్ష మంది జనం గాంధీ అడుగుజాడల్లో సత్యాగ్రహం చేసినా పలకని స్వరాలు - కదలని ఈ పాళీలు -

40 వేల మందిని రెండేళ్ళు మీసాలో బంధించి, వారి ఇల్లాండ్లూ పసిపాపలు, తలిదండ్రులూ - జలజల జార్చిన కన్నీరును తమ స్వార్థపు పాదుల నింపుకొని, కవితా సస్యాలు పండించుకొని విక్రయించుకో చూచే ఈ మా తెలుగునేల కవులను చూచి పోతన్నా! హాలికా ! తలదించుకో !

* * *

మరో పుస్తకం 'విజయేందిర'. చిత్రాలలో ఇందిరా గాంధీ. సమాచార పౌర సంబంధ శాఖ, హైదరాబాద్ వారు ప్రచురించింది. 'విద్యాగుప్త' హిందీలో పాడిన పాటకు వాౖదేవు పతంజలి తెలుగు దరువిది. వెల అమూల్యమే. 'భారతీమూర్తిగా నేడు విజయేందిర' అన్నాడు పాపం - 'ఇండియాయే ఇందిర - ఇందిరాయే ఇండియా' అంటూ నేల కొరిగిన బారువా సైదోడు ఈ భజన పాటలో.

* * *

ఇలాంటివి ఇంకా ఎన్ని కవితలు ! ఆ నాడు రేడియోలో కవి సమ్మేళనాలను వింటుంటే - డిటెన్యూలుగా వచ్చిన ఇంజనీరింగు విద్యార్థి

ఒకడన్నాడు "సార్ ! వీళ్ళ కవిత్వాన్ని పుట్టి చొప్పున అమ్ముతారా ? టన్నుల చొప్పునా ?" అని.

'ఓరి రివిజనిస్టూ ! నేటి కవిత్వం 'ప్రోగ్రెసివ్ గర్ల్'లా అలా పైసా చూపిస్తే అటు కేసి, ఎగేసి పరుగెడుతుందోయ్' అన్నాడు మరొకరు.

—మన కవుల సమాజ సమస్యల అవగాహన అలా ఉంది మరి!

* * * *

అందరూ దుర్గాబాయి భాగవత్ కాగల్గుతారా ! జ్ఞానపీఠ బహుమతి గ్రహీతలు ఖండేకర్, ఉమాశంకర్ జోషీలా ఎదురు తిరుగుతారా ! మహారాష్ట్రలో, మిగతా ప్రాంతాల్లో సాహిత్యవేత్తలు ఎదురు తిరిగారు. బిరుదులు త్రిప్పి కొట్టారు. బహిరంగ సభల్లో నియంతృత్వాన్ని నిరసిస్తూ ఉపన్యసించారు.

'సాధన' గుజరాతీ భాషలో నడిచే ఒక ఉత్తమశ్రేణి వార పత్రిక. 'ఆ పత్రికా సంపాదకుడైన విష్ణు పాండేకు ఉత్తమ సాహిత్య సృష్టికి ప్రభుత్వ బహుమానం ప్రకటించబడింది. మీసా క్రింద జైల్లో మ్రగ్గుతున్న ఆ సాహితీవేత్త బహుమానాన్ని త్రిప్పి కొడుతూ గవర్నరుకు వ్రాసిన లేఖలో— "నా సాహిత్యం గొప్పదే; నేను మాత్రం బందీ చేయదగ్గ దుర్మార్గుణ్ణి అన్న భావంగల ప్రభుత్వం నాకు బహుమానం అందచేయడం కేవలం హాస్యాస్పదమే. నాకీ బహుమానం అక్కరలేదు" అని వ్రాశాడు. (సమాచార్ 24 తే. 10-5-'76 అజ్ఞాత పత్రిక).

అలాగే కన్నడ సాహిత్యవేత్త శివరామ కారంత్ ఎమర్జెన్సీకి నిరసనగా తన పద్మవిభూషణను త్రిప్పి కొట్టాడు.

అజ్ఞాత కవులు - ఈ 'పల్లకీ బోయీల' రోదను హూంకారాలతో ఆపడానికి యత్నించారు. అజ్ఞాత పత్రికల్లో జైళ్ళనుండి, బయటి నుండి పంపిన ఎన్నో ఖండికలను ప్రచురించారు.

'చరిత్రలో కథలై నిల్చిన
కంస కళేబరాలు కదలుతున్న వేమిటా' - అని
కంగారు పడకు తమ్ముడూ
నియంతల పరంపరకు
తుది సమాధి మనమే కట్టాలి
పున్నమి వెన్నెలలో
అమృతులమై ఆడాలి -

—శరత్పూర్ణిమ నాడు, జైలులో.

"ఈ చెరసాలల్లో కన్పించే జనాలు
సగటున రెండు రకాలు -
ఒకళ్ళు సాదా మానవులు
పాపం ఉద్రేకాలకు ఆప్తులు -
ఈ ద్వితీయు లున్నారే - నిజంగా అద్వితీయులు -
అహంకారం పరిపాలించే మదమత్తుల
నియంతల - అణచ గలిగిన అగ్నిగర్భులు"

—15 ఆగస్టు 1975.

పాపమాబైటి పెద్ద చెరసాలలో
కిమ్మనలేక నిట్టూరుస్తున్న వాళ్ళకు -
మనిషి ముక్తికి సాగిన ఈ జాతరలో చేరక
గాంధీ ఇచ్చిన మహా యాత్రలో ఉద్యమించక

తింటూ - పడుకుంటూ - కుంటిగా
భయంతో బ్రతకలేక -
చావలేక - ప్రతి నిమిషం విలపిస్తూన్న
ఆశా పాపోప హతులకు
ఈ నా గీతం అంకితం.

—2 అక్టోబరు '76.

మహా యుగాల బీజాక్షరాలు -
ఏ కేదారం లోనైనా
ప్రసవ బాధపడందే అంకు రించవు -
నాటికి ఈ చెరసాలలు మాగాణీలు -
జాతి బ్రతుక్కి శ్రీ కవచాలు
మహా యుగాల బీజాక్షరాలు
వ్రాయ బడేది రక్తంతో - ఎముకల కలంతో
మహా యుగాల కవితా సస్యాలు పండేవి
హృత్తాపంతో - బలిదాన జలంతో.

—సంవత్సరాది '76.

*    *    *    *

స్వార్థాపరణం ప్రసవించిన త్యాగంలా
మెరికల్లాంటి వారు, ఛురికల్లాంటి వారు
దేశం నుదుట రక్తపు బొట్లు తీరుస్తున్నారు
ఎవరయ్యా వీళ్ళు!
రాణా - శివా - ఝాన్సీ ప్రాణాలు
విజయ ప్రకాశ కిరణాలు

మధుకర స్వరాలు
జేజేలు పల్కు తున్నారు
చెరసాలలు నిండు తున్నారు
భారత కీర్తి పతాకల్లా
ఎవరయ్యా వీళ్ళు !
వీర గంధాలలముకున్నారు
మాతృ గీతలు పలుకు తున్నారు.

* * * *

వాయువు స్పందించని చోట
శబ్దం ప్రసరించని చోట
దిగంచాల అంచులు కుట్టి
మృత్యువు తన వలయం పన్నినా
మహిషం నురుగులు గ్రక్కినా
యమ దండం పిడి విరిగినా
వాడని ముఖ రేఖల్లో
బ్రహ్మను బంధించిన వాళ్లు
ఎవరయ్యా వీళ్ళు !
అక్షరులు అవ్యయ మూర్తులు
క్షత గాత్రులు - భయ విజేతలు -
జనతా సత్యాగ్రహులు
జనతా మమతా నికేతనులు.

—నవంబరు 1975.

"నిద్రిస్తున్న జనత నిజంగా మేల్కొంటుంది !
నీ మత్తును వదిలిస్తుంది ! నిన్ను చిత్తు చేస్తుంది !!"
—వందే మాతరం నుండి.

*   *   *   *

కనిపించుటలేదు కన్య ఒకతి
వెయ్యేండ్ల తపంవల్ల పుట్టిందా పడతి
అల్లారు ఆ ముద్దుగుమ్మ నెత్తుకు పోయారు
గుండె బలం ఉన్న ఓ యువకుల్లారా !
ఆ కన్యను వెదకి రక్షించ గలిగారా
మీకు తగిన పారితోషకం ఉజ్వల భవిష్యత్తు
ఔతుంది మీ జీవితం ఒక ధృవతార
ఇంతకీ మర్చే పోయాను ఆ కన్య పేరు చెప్పడం
అదుగో ఆమె పేరే -
"భారత ప్రజాస్వామ్యం !"
—బంగారు లక్ష్మన్ 14-1-77 న జైలులో.

*   *   *   *

ఒక కార్యకర్త తనను ఆదర్శానికి అంకితం చేసుకుంటూ -

ఎవరు నేను ఎవరు నేను
ఎవరినో నే నెరుగలేను
అనాద్యంతము అఖిల విశ్వము
అందు అణుమాత్రమ్ము నేను
కల్పనాతీతమ్ము కాలము
స్వల్పమౌ రేణువను నేను

కడలి విసిరిన అగణితంబౌ
అలలలో చిరు అలను నేను
పుడమి తల్లిని పూజ చేసిన
పూలలో నొక పూవు నేను

—మంజీరా.

ఇందిర నుద్దేశించి భీమసేనరావు దేశపాండే :

"గాంధీకి బ్రాందీకి
దేవుడికీ దయ్యానికి
తేడాలేని కమ్మీలతో
చేయి కలిపి పొత్తు జేరి
గాంధీజీ సిద్ధాంతం
గంగపాలు జేస్తివాయె
ఎక్కడుంది సిద్ధాంతం ?
ఏమైందీ ఆదర్శం ?"

*   *   *   *

తరుణమందె సర్వశక్తి ధారపోయ వలెనురా
తల్లి ఋణము తీర్చువాడె తనయులందు ఘనుడురా
జీవితమును బలి పెట్టెడి త్యాగశీల భావనతో
ప్రజా స్వామ్య రక్షణకై కదలి ముందు సాగరా !"

—వడ్డి విజయ సారధి, విశాఖ.

*   *   *   *

దేశమంతా మార్జాల మయమే అయ్యింటే
రాజ్యం కుక్కలదే అయ్యిందేది

కాని - ఇక్కడ
మృగరాజు లున్నవి; కరిరాజులున్నవి.
అందుకే -
ఇంకా నా దేశం జీవించే ఉన్నది.

—కసిరెడ్డి వెంకటరెడ్డి, జీవకారుణ్యం కవితలో.

* * * *

"Don't fear the rulers might
Don't you see our morale's height
Her strength is from the barrel
Our strength is that of moral."

— డా॥ డి. విశ్వేశ్వరం, ది ఫైట్ పద్యంలో.

* * * *

ఇలా ఉద్యమాన్నుంచి స్ఫూర్తి పొంది, ఉద్యమానికి స్ఫూర్తి నిస్తూ వెలువడిన సాహిత్యం చాలా ఉంది. ఇవి మచ్చుకు మాత్రమే.

కాగా, ఇలా ప్రజాహితాన్ని గూర్చేదే సాహిత్యం గానీ, నిహిత స్వార్థానికి అమ్ముడు పోయేది మాత్రం కాదు.

'రేకులు విప్పని ప్రజాతంత్ర పుష్పాలను సౌరభాలు వెద జల్లుతూ విచ్చుకొనేలా చేయగల సీతాకోక చిలుకలుగా కవులు కాగల్గితే నిజంగా సమాజానికి మేలు చేసిన వారవుతారు.'

# ౨. అజ్ఞాత పత్రికలు

ఎమర్జెన్సీ ప్రకటించి - పత్రికలపై సెన్సారు ఆంక్షలు పెట్టడంతో లోక సంఘర్ష సమితి అజ్ఞాత పత్రికలను ప్రారంభించింది.

వార్తా సంస్థలను బలవంతాన కలిపి 'సమాచార్'గా చేయడంతో వార్తలనిచ్చే స్వచ్ఛంద సంస్థలు లేకుండా పోవడాన - దేశ విదేశ వార్తలను - సెన్సారు కోరలకు బలిఅయిన వాటిని - ఈ అజ్ఞాత పత్రికలు ప్రజల కందిస్తుండేవి.



అనాటి అజ్ఞాత పత్రికలలో కొన్ని

వీటి సామగ్రిని తయారుచేయడం ఒక యజ్ఞం. ప్రింటు చేయించో, సైక్లోస్టైలు చేసో సిద్ధంచేయడం మరో యజ్ఞం.

ఇహ - పంచడ మంటే ప్రమాదకరమే.

అయినా ఈ అజ్ఞాత పత్రికలు మహా మహా పెద్ద పత్రికలు చేయ లేని పనిచేసాయి.

నియంతకు వైతాళికులైన క్రింది తరగతి వారి పత్రికేయుల ప్రచారాల బండారాన్ని బైట పెడుతూ - ప్రజలకు కొత్త బాటలు చూపించాయి.

ఆ నాటి ఆ పత్రికల రూపం మరోసారి చూద్దామా ?

మరోసారి నాటి ఉద్రేకాన్ని అవేశింప చేసుకుందామా ?

## ప్ర క ట న

కావలెను :-యువకులు, ఉత్సాహవంతులు, క్రింది పనికి జీత భత్యములతో

అర్హత :- జాతీయ భావాలు

పని :-నిరంకుశత్వంతో పోరాటం

జీతం :-జైలు

పెన్షన్ :-స్వాతంత్ర్యం

ధైర్యం ఉన్నవారు తమకు దగ్గరలో నున్న లోక సంఘర్ష సమితి కార్యాలయంలో సంప్రదించండి.

---

ప్రింటరు, పబ్లిషర్, ఎడిటర్, రీడర్ :-సత్యాగ్రహి.
ముద్రణ :-ప్రజా ప్రెస్, ఆంధ్రప్రదేశ్.

---

(18-11-75 'ప్రజావాణి' అనే అజ్ఞాత పత్రిక తొలి సంచిక లోనిది.)

**ప్రజల బహుమానం - నియంత కారాగారం :**

గుంతకల్ విద్యార్థి శ్రీ కుమార్ కళాశాలలో జరిగిన "20 సూత్రాల పథకం - విద్యార్థుల పాత్ర" అనే వక్తృత్వ పోటీలో ప్రథమ స్థానం గెల్చుకున్నాడు. నిర్భయంగా అతను చెప్పిన అనేక సత్యాలకు బహుమానంగా మరుసటిరోజు నియంత అతనికి కారాగారం ప్రసాదించింది.

—ప్రజావాణి; 3.

* * * *

"జాతి కల్లోలంలో పడినపుడే
దేశ భక్తులు వికసించి పల్లవిస్తారు."

—ప్రజావాణి; 6.

**డ్రామాలో - డ్రామా !**

తణుకు - అది మహిళల కార్యక్రమము - గవర్నరు అధ్యక్షులు - కాలక్షేపంగా 20 సూత్రాల పథకం డ్రామా.

డ్రామాలో ఫాసిజాన్ని తీవ్రంగా విమర్శించిన ఒక పాత్ర, వెళ్ళిపోగానే ఇంకొక నటుడు ప్రవేశించి, ఇందిరా ఫాసిస్టులను గురించి విమర్శన నినాదాలు ప్రారంభించాడు. కరపత్రాలు వెదజల్లాడు. ప్రజలు ఏరుకోసాగారు. పోలీసులు కంగారుగా గవర్నరును (జాగ్రత్త కోసమట) బయటికి తీసుకువెళ్ళి సాగనంపేశారు. నటుడు ప్రసంగిస్తూనే ఉన్నాడు. S. I వచ్చి నటుడ్ని లాగి కొట్టాడు. పడిపోయి నట్లు నటించి ప్రజల సందులో దూసుకు పోయాడు మన సత్యమూర్తి.

—ప్రజావాణి; 6.

* * * *

విశాఖపట్నం నుంచి వెలువడిన పత్రిక 'స్వరాజ్య'. విశాఖ పట్నం, తూర్పు గోదావరి శ్రీకాకుళం జిల్లాలకు దీని ప్రతులు చేరేవి.

**బోండాలు - ఆపిలు పండ్లు అమ్మరాదు :**

ఇందిరాగాంధీ కేరళ పర్యటనలో ఆమె ఉపన్యాసం ఇచ్చే బహి రంగ సభల చుట్టు ప్రక్కల విసరడానికి వీలుగా ఉండే మిఠాయిలు, బోండాలు వగైరా తయారు చేయరాదని హోటళ్ళకు ఆజ్ఞలు జారీ అయ్యాయి. ఆపిలు పండ్లు, నారింజ పండ్లు కూడ అమ్ముకోవడానికి నిరాకరింపబడింది.

—స్వరాజ్య : 2/5.

* * * *

నెల్లూరు నుంచి వెలువడేది 'గర్జన'. నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం జిల్లాల ప్రజలకు అందించబడేది.

* * * *

—గర్జన : 2.

జబల్పూరులో కలెక్టరు ముఖ్యుల కంతా విందుచేశాడు. అంద రితోపాటు ఒక యువకుడు వారిలో ఉన్నాడు. ఉన్నతాధికారులు, మంత్రులు ఉన్నారా విందులో. ఉపన్యాసాలు కొనసాగుతున్న సమ యంలో ఆ యువకుడు చొక్కా విప్పేస్తున్నాడు. అందరి దృష్టి అతని వైపుకు మరలింది. ఆ యువకుడు లోపల తొడుక్కున్న మరో చొక్కామీద నినాదాలున్నాయి. చొక్కా లోపలనుండి కరపత్రాలుతీసి వెదజల్లాడు. 'వందే మాతరం', 'జె. పి. వర్ధిల్లాలి', 'ప్రజా స్వామ్యం వర్ధిల్లాలి', 'స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మా కివ్వండి', 'నియంతృత్వం

నశించాలి' అనే నినాదాలిచ్చాడు. విందులో ఆవేశం కల్గించ బడింది... ఆ యువకుని ఆవేశంవల్ల.

* * * *

నిజామాబాద్ నుంచి వెలువరించబడే 'జనవాణి' పత్రిక తన 4 వ సంచికలో ఇలా వ్రాసింది :

"ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రపంచ దేశాలకే మార్గ దర్శకం కావల్సిన మనం నగుబాటు కావడం సిగ్గుచేటు. మేధావుల్నీ, నిష్కళం కుల్నీ, తమ దమన నీతితో అణచివేసి అవినీతిపరులను, క్రూరులను, అసమర్థులను అందలాలెక్కిస్తున్న నేటి ఇందిరా ప్రభుత్వం, మన దేశాన్ని ఎక్కడికి కొంపోతుందో కనుగొండని 'సమస్త భారత ప్రజలకు హెచ్చరిక చేస్తున్నాం!' ఇప్పటి నిద్రమత్తును వీడి, నేటి మహోద్యమంలో భాగస్వాములు కండని సర్వజనాన్ని ఆహ్వానిస్తున్నాం."

* * * *

వరంగల్ నుంచి వెలువడుతుండేది 'సాధన' పత్రిక. వరంగల్, ఖమ్మం, కరీంనగర్ జిల్లాలకు చేరేది. —సాధన; 2.

**ప్రస్తుత పరిస్థితిపై చాగ్లా ఉవాచ :**

నేను నిరాశావాదిని కాను. నీవు ఎంతో కాలము స్వాతంత్ర్య పిపాసను అణచి వుంచలేవు. ప్రతి చీకటి రాత్రి తర్వాత ఆశ కల్గించే ఉదయం ఎప్పుడూ ఉంటుంది. ఎంతటి నియంతలైనా ప్రజల కోరికను అణచిపెట్టలేరు. ఒకనాడు కాకున్న ఒకనాడు ప్రజలు మేల్కొంటారు. భారతీయ సంస్కృతి నిరంకుశత్వాన్ని సహించలేదు. మన దేశం ఎన్నోసార్లు దౌర్జన్యాలను అనుభవించింది. అది ఇంకా ఇందిర,

ఆమె చెంచాలు చేసే దౌర్జన్యాలు కూడా సహించి నిలువగలుగుతుంది. చిట్టచివరికి ప్రజలే తమ క్షేమం కావాలో నిశ్చయించుకో వల్సింది. ఒక మానవుడు లేదా ఒక స్త్రీ ఆ వ్యక్తి ఎంత ప్రముఖమయినా తన ఇచ్ఛను ప్రజలమీద రుద్దలేదు. నేను ఎప్పుడూ ఈ మూడు ప్రశ్నలు నన్ను నేనే ప్రశ్నించుకొంటాను.

1. నేను నియంతృత్వంలోనా? ప్రజా స్వామ్యంలోనా జీవించేది?

2. భయ దౌర్జన్యాలతో నిండిన దేశంలోనా? లేక స్వాతంత్ర్య సమభావము, సౌభ్రాతృత్వము కలిగిన దేశంలోనా నేను జీవింప తలచేది?

3. మహాత్మా గాంధీ జన్మించిన దేశంలోనా నేను జీవించేది? -అక్కడ స్వాతంత్ర్యం పరిరక్షింప బడుతుంది. కాక గొత్తి దాటు మనుషులుగల సిగ్గులేని వాతావరణంలో నేను జీవిస్తున్నానా?

కొంత మంది పరిపాలకుల శక్తికంటె ప్రజాశక్తి చాలా గొప్పదని ఎవరూ మరిచిపోరాదు. వారు మనను అణచిపెట్టవచ్చు. మన లోపలి వాంఛ స్వాతంత్ర్యాన్ని, సమభావాన్ని, సౌభ్రాతృత్వాన్ని ప్రకటించే వాంఛను ఎవరూ అణచలేరు.

* * * *

'వందే మాతరం' విజయవాడ నుంచి వెలువడుతూ కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలను చేరేది.

''రాబోయే వర్షాకాలపు పార్లమెంటు సమావేశాలలో రాజ్యాంగములో తగు మార్పులు జరుగవచ్చు. స్వరణ్ సింగ్ కమిటీ సిఫార్సు

పేరుతో ఇందిరా గాంధీ రాజ్యాంగములో తనకు అవసరమయిన మార్పులను చేసే ఆలోచన చేస్తున్నది. ఈ తతంగం పూర్తి అయితే ఎన్నికలకు రంగము సిద్ధమైనట్లే. అక్టోబరు నుండి ఎప్పుడైనా ఎన్నికల తేదీ ప్రకటించే అవకాశా లున్నాయి. విడిగా పార్లమెంటు ఎన్నికలు జరిపే అవకాశాలు లేకపోలేదు.

— వందేమాతరం: 20.

(కొన్నాళ్ళ తరువాత సి. ఐ. డి. అధికారులను, పోలీసులను గాభరా పెట్టేందుకు వివిధ కేంద్రాలనుండి వివిధ పేర్లతో వెలువడే పత్రికలన్నీ 'వందే మాతరం' పేరుతోనే వెలువరించ బడినవి.)

* * * *

హైదరాబాదు పరిసర జిల్లాలకు (మెదక్, నల్గొండ, మహబూబ్ నగర్, అదిలాబాద్, నిజామాబాద్)గాను ప్రచురించబడిన పత్రిక "అంతర్వాణి."

—అంతర్వాణి - 4వ సంచికలో...

**మరొక భీష్ములు కాకండి!**

"ఆ నాడు భీష్ముడు తన కండ్లెదుట జరుగుచున్న అధర్మాన్ని ఖండించక నిశ్శబ్దంగా ఊరుకొన్నందువలననే ''కురుక్షేత్రం'' జరిగింది. దేశంలో ఏర్పడిన ఇంతటి క్లిష్టసమయంలో సత్యాన్ని పలకటానికి వెఱచి మీరు మరొక భీష్ములు కాకండి!''

—శ్రీ ఎన్. జి. గోరే, శ్రీ వినోబాకు వ్రాసిన లేఖలో.

* * * *

అనంతపురం నుంచి వెలువడే 'ఎక్స్-రే' అనంతపురం, కర్నూలు, కడప జిల్లాలను చేరేది. మొదటి సంచికలో సంపాదకులు ఇలా వ్రాశారు.

"మిమ్మల్ని ఈ విధంగా కలుసుకోవడం మా దురదృష్టం. అయితే ఈ విధంగానైనా కలుసుకొంటున్నాము. అది అదృష్టమే. ఇది ఎక్స్-రే.

నవభారత జాతీయ విధానంలో అంతర్గతమైన వ్యాధిని బహిర్గతం చేయడమే మా పని. జాతిని బాగుచేయవలసిన పని మీదే. కొన్ని జబ్బులు బయటకు కనబడవు. అప్పుడే వైద్యులు ఎక్స్రే ఉపయోగిస్తారు. నేడుకూడ అదే పరిస్థితి ఏర్పడింది. ఎమర్జెన్సీ పేరుతో తమపై రుద్దబడిన నేరాన్ని, నియంతృత్వాన్ని ప్రజలు తెలుసుకోడం లేదు. పైకి కనబడుతున్న ఒక విధమైన ప్రశాంతతను క్రమశిక్షణ అనే పేరుతో పిలుస్తున్నారు. ఇది తుఫాను ముందరి ప్రశాంతత (Calm before the storm). ఒక విధమైన భయం ప్రజా బాహుళ్యాన్ని ఆవరించింది. ఆ భయమే వారిని నిస్తేజులుగా చేసింది. ఎక్స్-రే వీలైనంత వరకు ఆ భయాన్ని పారద్రోలి దానిస్థానే మల్టి విటమిన్ లాగ పనిచేసే ధైర్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని, కర్తవ్య దీక్షను నింపడాన్కి ప్రయత్నిస్తుంది. ఆ పనిలో మీ అందరి సహకారముంటుందని ఆశిస్తున్నాము."

—ఎక్స్-రే : 1.

* * * *

దేశమంతటి సత్యాగ్రహ వార్తలను మన రాష్ట్ర మంతటికీ అందించేందుకు వెలువరించబడినది 'ఢిల్లీ నగారా'.

**కొత్త జైళ్ళా ? పిరమిడ్లా ?**

డెన్మార్క్ విలేఖరికి ఒకాయన పంపిన కథనం ప్రకారం (జనవరి'76) నియంత ఇందిర త్వరలోనే మరికొన్ని కొత్త జైళ్ళ

నిర్మాణానికి నిర్ణయం తీసుకోవచ్చుట. ఎమర్జెన్సీ నియంత్రిత్వానికి మరోపేరే అనే విషయాన్ని ఇప్పుడు గ్రామవాసులుకూడ గ్రహించారని, పట్టణాలతోపాటు పల్లెలనుంచి కూడ సత్యాగ్రహ సమరంలో పాల్గొనటానికి ముందు కొస్తున్నారని, వీరిని నిర్బంధించటానికి ఉన్న జైళ్లు చాలడంలేదు కాబట్టి, జెర్రిపోతు వేగంతో మరికొన్ని జైళ్ళను ఇందిర (సైనికుల సహాయంతో) నిర్మించగలదని ఈయన కథనం!

ఈజిప్టు రాజులు తమ పిరమిడ్లను తామే నిర్మించుకొనే వారట! ఇవీ అంతే కాదుగదా! అమంగళం...గాక!

—ఢిల్లీ నగారా : 10.

* * * *

**డాక్టర్ రాజన్ ధైర్యం :**

"అక్టోబరు 12 వ తేదీన 'కేరళ విద్యార్థి సంఘం' అత్యవసర పరిస్థితిని గురించి ఒక గోష్ఠి జరిపింది. దానికి కేంద్ర విద్యామంత్రి నూరుల్ హసన్ అధ్యక్షత వహించాడు. అందులో ఢిల్లీ విశ్వవిద్యాలయ మాజీ వైస్ ఛాన్సలర్ డా॥ కె. యస్. రాజన్ మాట్లాడుతూ ప్రభుత్వ దమన నీతిని, 20 సూత్రాల ప్రణాళిక పేరుతో జరుపుతున్న ప్రచారాన్ని తూలనాడి, ప్రజల అసలు ఆర్థిక అవసరాలను ఆ ప్రణాళిక తీర్చబోదని అన్నాడు." ఈ రోజు మనబోటి వారిమీద ఈ దమన కాండ ప్రయోగించటం లేదని తృప్తిపడి ఊరుకోరాదు. అతి నీచమైన స్వార్థ ప్రయోజనాల కొరకే యిది జరుగుచున్నదని గుర్తుంచుకోవాలి"- అని అన్నాడు. ఈ వార్త ఢిల్లీ చేరింది. "ఉక్కు విషయాల సంఘం"లో ఆయనకున్న డైరెక్టరు పదవి ఊడింది. మిగిలిన అనేక పదవులను కూడా ఊడపీకి జైలుకూడా విధించవచ్చు.

—ఢిల్లీ నగారా : 7.

* * * *

''పిరికితనం, అనుమానం, భయంగల వ్యక్తులతో ప్రపంచంలో ఏ పని కాదు. జాతిలో పరాక్రమం అవసరం."

'బాళాసాహెబ్ దేవరస్'

—ఢిల్లీ నగారా : 4.

*　　*　　*　　*

76 వ సంవత్సరంలో వివిధ వార్తలతో నడుపబడిన మరో పత్రిక ''సమాచార్.'' దానిలో...

**కిషోర్‌కుమార్ పాటలు వింటున్నారా ?**

కుటుంబ నియంత్రణకు నిధుల పేరున సంజయ్ గాంధీ నడిపిన ''గీతోంభరీ శ్యామ్'' అనే పాటల కార్యక్రమానికి ప్రసిద్ధ సినీ గాయకుడు కిషోర్‌కుమార్ రాలేదు. బెదిరింపులకు లొంగలేదు. ఇంకేముంది ? వెంటనే అతని పాటలను వినిపించరాదని 'ఆలిండియా (ఇందిరా) రేడియోకు' ఆజ్ఞ అయ్యింది. అతను పాల్గొన్న సినిమాలు ప్రదర్శించరాదని ఢిల్లీ సినిమా హాళ్ళకు తాఖీదు అందింది. ఢిల్లీ పౌరులకు పాత సినిమాలే గతి !

(సమాచార్ 3 - తే. 25-6-'76)

*　　*　　*　　*

'77 వ సంవత్సరంలో 'సమాచార్'కు రూపాంతరంగా పోలీసులను మభ్యపెట్టడానికే విడుదల చేయబడుతుండేది 'సమర సందేశ్' పత్రిక. ఎన్నికలు ప్రకటించగానే ఆ పత్రికలో వ్రాయబడిన అంశం...

**గెల్చింది ప్రజలే !**

.... సెన్సారువారి కార్యాలయం మూతపడినందున మా కార్యాలయం కూడ మూయబడే ఉంటుంది. ఈ 18 మాసాలు పాఠకులు మా కెంతో

సహకరించారు. వారి సహకారం వలననే పోరాటం కొనసాగింది. ప్రజల త్యాగాలు, పట్టుదల, పోరాటపు శక్తి...యుక్తులు నియంత గమనాన్ని ఆపి, దారి మరల్చి, కొద్దిగానయిన ప్రజాస్వామిక విధానాల వైపు నడచుకోవలసిన ఆగత్యం ప్రధానికి ఏర్పరిచాయి. ఇందుకు భారత ప్రజానీకాన్ని ఎంతో అభినందిస్తున్నాం. అభినందిస్తూ, ఇంకో విషయాన్ని గూడా వారికి గుర్తుచేస్తున్నాం. పయనించ వలిసిన దూరం ఇంకా చాలవుంది. గత 18 మాసాలలో కోల్పోయిన అనేక జాతీయ జీవన మూల్యాలను ఇంకా సాధించుకోవాలి. విడుదలయిన నాయకుల మార్గదర్శనంలో, స్వేచ్ఛా పత్రికా రంగపు సహకారంతో ప్రజలు పోరాటం సాగిస్తారని ఆశిస్తూ శలవు తీసుకొంటున్నాం.

—సమర సందేశ్ : 4.

వివిధ పత్రికల ద్వారా ఎప్పటివార్త లప్పుడు అందించటమే గాక ప్రజలకు నాటి పరిస్థితిని గురించి సరియైన అవగాహన కల్గచేయడానికి, ఉద్యమ కారులకు మార్గదర్శనం చేయడానికి వివిధ విషయాలపై పుస్తకాలు ప్రచురించబడి ప్రజలకు అందించ బడ్డాయి. అజ్ఞాత పుస్తకాలలో కొన్ని - ఆంధ్రప్రదేశ ప్రజలకు అందించ బడినవి - ఈ క్రిందివి.

1. 'ప్రజా స్వామ్యానికి సమాధి' - సుబ్రహ్మణ్యస్వామిచే వ్రాయబడిన అజ్ఞాత సాహిత్యంతో మొదటి పుస్తకం. ప్రజలపై ముంచుకువచ్చిన ప్రమాదాన్ని కాచుకొమ్మని హెచ్చరించింది.

2. 'హిట్లర్ అడుగు జాడల్లో ఇందిర'-నియంత లందరూ చివరకు పతనంకాక తప్పదు. ఈ చారిత్రక సత్యాన్ని విశ్వసించి కార్యాచరణకు నడుం కట్టండని ప్రజలకు ఊపునిచ్చి రెండు

ముద్రణలు చేయవలసి వచ్చిన పుస్తకం. రచయిత లాల్‌కృష్ణ అద్వానీ (జైలులో వ్రాయబడింది.)

3. 'ఇందిర కొచ్చిన ఇరకాటం'- Bugbear to Indira-జరుగుతున్నవి రాజ్యాంగ సవరణలు కాదు, మరో రాజ్యాంగం తయారవుతోందని హెచ్చరిస్తూ వ్రాసిన పుస్తకం. రచయిత : లాల్ కృష్ణ అద్వానీ (జైలునుంచి.)

4. తస్మాత్ జాగ్రత్త : నియంతృత్వం వలన అందరికీ నష్టమని జాగరూకులు కండని మేల్కొల్పు పాడినది. అజ్ఞాత రచయిత : సంజయ.

5. 'పచ్చి నియంతృత్వపై ప్రజాపోరాటం' - 'People's Struggle' - అజ్ఞాత ఉద్యమం ప్రారంభించి ఏడాది ముగిసినప్పటి సమీక్ష - రచయిత : 'సంజయ'.

6. 'రాజకీయ గారడీ' - 20 సూత్రాల బూటకం బయటపెట్టిన పుస్తకం - రాజమండ్రి జైలు ఉత్పత్తి.

7. 'ఎవరా ఫాసిస్టులు' - 'Anatomy of Fascism' - మన నియంత ఫాసిస్ట్ లక్షణాలను విశ్లేషించారిందులో, లాల్ కృష్ణ అద్వానీ జైలునుంచే.

8. ఇందిరకు జయప్రకాశ్ లేఖలు (ఇంగ్లీషు, తెలుగు).

9. 'Emergency 'X'-rayed' - వినోబా జరిపిన 'పవనార్' ఆచార్య సమ్మేళన వివరాల సంకలనం.

10. 'Death-Kneel of a Democratic Constitution' - రాజ్యాంగ సవరణలపై శాంతిభూషణ్ రచన.

11. 'A Decade of Economic Chaos' - 'ఆర్థిక విధ్వంసపు దశాబ్దం' - ఇందిర పాలనలో సామాన్య ప్రజల దోపిడీ జరిగిన తీరుకు విశ్లేషణ - రచయిత : రామకృష్ణ హెగ్డే.

12. 'కుట్ర జరిపింది ఎవరు'-అహ్మదాబాదులో చాగ్లా ప్రసంగం.

13. 'అవినీతికి మారుపేరు ఇందిర'* - ఇందిర పాలనలో పెద్ద ఎత్తున జరిగిన అవినీతి కలాపాలు.

14. 'Truth About Economic Progress Since Emergency' - రచయిత - ప్రొ॥ సుబ్రహ్మణ్యస్వామి.



*పై చిత్రాన్నే 'అవినీతికి మారుపేరు ఇందిర'కు ముఖచిత్రంగా ముద్రించటానికై బ్లాక్ తయారు చేయించబోయి ఎన్నో యాతనలు పడవలసి వచ్చింది - చూడుడు 130 పేజీ.

# 3. వెలుగులు

పోరాటంలో ఏపనిచేసే కార్యకర్తకైనా కొన్ని తప్పనిసరి ప్రేరకాలుండాలి.

ఆదర్శంపట్ల సందేహంలేని విశ్వాసం ఉండాలి.

పోరాటాన్ని కొనసాగించే నాయకత్వపు నిర్దేతృ శక్తిపట్ల గురి తప్పని నమ్మకముండాలి.

పోరాటంలో ముందుకు దూకగల చొరవ, కష్టాలను తృణీకరించి చూడగల స్థైర్యం ఉండాలి.

కలిసి పోరాడడానికి అవసరమైన సర్దుబాటు, పరస్పర సహనం, ఓర్మి, మంచిని మెచ్చుకోగల ఔదార్యం ఉండాలి.

నిప్పులో దూకవచ్చు. కాని ఒకొక్కప్పుడు చిన్నపాటి లోపాలను, ఇబ్బందిని సహించలేకపోవచ్చు - సర్దుకోలేక పోవచ్చు. అలాంటి సమయాలలో ఆదర్శం - సమర్పణ - మనిషిని తట్టి లేపడానికి ఆధారం కావాలి.

అంతేకాదు —

దీర్ఘకాల పోరాటంలో అనేక రంగాలలో పోరాడవలసి వస్తుంది.

1. అజ్ఞాతంగా ఉంటూ పోరాడాలి.

2. జైళ్ళలో ఉండి పోరాడాలి.

3. బైట ఉండే వ్యవహార చాతుర్యంతో అనుమానాలకు తావీయకుండా పోరాటాన్ని నిర్వహించాలి.

ఈ మూడు రంగాలలో ఈ మారు సాగిన పోరులో రకరకాల వికల్పాలతో ముందుకు సాగుతూన్నప్పుడు కార్యకర్తల మనో ధైర్యాన్ని నిలిపి ఉంచే సాహిత్యం బ్రహ్మాండంగా నిర్మాణమైంది.

"ఒకప్పుడు ఉత్సాహపు గుళికల నిచ్చి
ఒకప్పుడు ఉద్రేకపు వేడిపాలు త్రావించు
ఒకప్పుడు వివేకపు అంజనాన్ని దిద్ది
ఒకప్పుడు వివిధ వార్తలను వడ్డించు"—

—ఇలా ధైర్యాన్ని కలిగింప చేసేవి.

ఈ మహత్తర కృషిలో అత్యాయికస్థితి కాలంలో ప్రజలకు, కార్యకర్తలకు పెద్దలు ఇచ్చిన సందేశాలు, దేశభక్తి సాహిత్యానికి అమూల్యములైన కానుకలుగా చరిత్రలో నిలిచిపోతాయి.

వీటిలో కొన్ని లేఖలు.

కొన్ని కార్యకర్తలకు కరదీపికలు.

కొన్ని ప్రజలకు అందజేసిన ప్రబోధాలు.

అన్నీ మననం చేసుకో తగ్గవే - ఒక జాతికి పాథేయంలా ఇవ్వతగ్గవే.

* * * *

విశ్వేశ్వర తీర్థులు ఉడిపి పెజావర్ మఠాధీశులు. సన్యాసి - విరాగ జీవనులు - వాడవాడలా మానవత్వామృతాన్ని ప్రసాదిస్తూ 'ధర్మ ప్రేరణ'కు ప్రయాణిస్తున్న సాధుమూర్తి.

అత్యవసర పరిస్థితిలో ప్రజల బాధలకు కరిగిపోయి - ఇందిరా గాంధీకి రెండు లేఖలు వ్రాశారు. వ్యాస సంప్రదాయానికి వారసులుగా విశ్వేశ్వర తీర్థులు ఇచ్చిన సలహాను 'కౌరవ బలగం' ఉన్నదని అహంకరించిన నాటి ప్రధాని వింటుందా?

12 జులై '75 న వ్రాసిన ఉత్తరం నుండి...

..."అప్పుడప్పుడు ప్రజాస్వామ్యంలో కొరతగని సంఘటనలు తటస్థ మవుతాయి. కాని దానిని సాకుగా తీసుకొని, ప్రజాస్వామ్యాన్నే భంగం చేయడం తగదు. మీరు కాంగ్రెసుకు అధ్యక్ష స్థానంలో ఉన్న ప్పుడు 1957 లో కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గద్దెదించడానికి, ప్రజలు తిరుగుబాటును విజయవంతంగా నడిపారు. మీరు ఆ నాడు అనుసరించిన బాటనే ఈ నాడు ప్రతిపక్షాలు చేబడితే ప్రజాస్వామ్యానికి ఇది వ్యతిరేకమని ప్రతిపక్షాలపై నేరారోపణ చేయడం ఆశ్చర్యకరమైన విషయం కాదా"...

"ఇహ - నేను సన్యాసిని - భిక్షువును - యాచించడం నా ధర్మం. ప్రజలకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించమని, ప్రజాస్వామ్యాన్ని కాపాడమని మిమ్మల్ని యాచిస్తున్నాను."...

* * * *

'75 ఆగస్టులో వ్రాసిన రెండవ ఉత్తరం నుండి...

..."మన దేశంలో ప్రజాస్వామ్యం క్షేమంగా ఉన్నదని మీరు పదే పదే ప్రకటిస్తున్నారు. మీ ప్రకటన చూచి నవ్వాలో, ఏడవాలో ప్రజలకు తెలియడంలేదు. పార్లమెంటులో జరిగే వ్యవహారాల వివరాలు ప్రజలకు అందకుండా చేశారు. ప్రభుత్వ విధానాలను విమర్శించే హక్కు ఎవరికీ లేకుండా చేశారు. పైగా మీరు ఇతరులపై చేసే విమ

ర్యలకు పూర్తి ప్రచారం లభిస్తున్నది. జరిగిందేదో పోనియండి. ప్రజాస్వామ్య వికృతికి కనీసం ఇకనైనా దోహదం చేయకండి. మీకు ఉన్న స్వేచ్ఛను ప్రజలందరికీ ఇవ్వండి – ఇదే మా కోరిక.

ప్రభుత్వాన్ని వ్యతిరేకించే రాజ్యాంగ సమ్మతమైన అధికారాలను ఉపసంహరించడం అంటే రాజ్యాంగ వ్యతిరేకమైన, హింసా పూర్వక మైన మార్గాన్ని చేపట్టేటట్టు ప్రజలను ప్రోత్సహించడమే. వారిని ప్రతీ కారానికి పురిగొల్పడమే. బంగ్లాదేశ్ ఉదంతం మన కండ్లముందు మెదలుతూనే ఉన్నది. షేక్ ముజీబుర్ రహమాన్ పత్రికల గొంతు కలు నొక్కి, ఏకపక్ష నియంతృత్వాన్ని తన ప్రజల నెత్తిన రుద్దాడు. దాని దారుణ పరిణామాలను నేడు బంగ్లాదేశ్ అనుభవిస్తున్నది. దాని గుణపాఠం స్పష్టమే. ఒకసారి ఉత్తమ ప్రజాస్వామ్య విలువలను నాశనంచేస్తే, మళ్ళీ నెలకొల్పడం చాల కష్టం. మహాత్మాగాంధీ, పండిట్ నెహ్రూ, మిగతా ఎందరో మహా నాయకులు స్వరాజ్యాన్ని ప్రజాస్వామ్యాన్ని సాధించడానికి ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నారు. కాని తిరిగి నేడు వాటి పరిరక్షణకు ప్రజలు ఉద్యమించాల్సి ఉంటుందా ? ఆ ఆదర్శంకోసం తిరిగి లక్షల ప్రజలు త్యాగాలు చేయాల్సి ఉంటుందా ? మన దేశం మరో హంగరీ, జెకొస్లోవేకియా కావాలని మీరు కోరు తున్నారా ?"...

"ఈ లేఖ మీకు ఎంతో కోపాన్ని తెప్పించవచ్చు. కాని నేను నిష్పక్ష సన్యాసిని. మీ పట్ల, దేశంపట్ల మహా గౌరవము, అభిమానమూ ఉన్నవాణ్ణి. ఎంత నిష్ఠురమైన మాటలైనా నిజాలుగనుక – నేను తెలపా లనుకున్నాను. సంస్కృతంలో ఒక సుభాషితం ఉన్నది.

"సులభాః పురుషాః రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా, శ్రోతా చ దుర్లభాః''

* * * *

*    *    *    *

..."ఉన్నత స్థాయిలో ఉన్న నిపుణులందరూ దేశంలో అవినీతి మితిమీరిందని ఆరోపిస్తున్నారు...

*    *    *    *

అల్హాబాదు హైకోర్టు తీర్పు తెలిసిన మరుక్షణాన మీరు రాజీనామా ఇస్తే బాగుండేదని నేను భావిస్తున్నాను.........ప్రతిపక్షాల నాయకులు కోరారు కనుక మీరు రాజీనామా చేసి ఉండాల్సిందని నేననడంలేదు. ఎటువంటి పదవీ వ్యామోహం లేకుండా, అలిప్తమైన న్యాయదృష్టితో విషయాన్ని పరిశీలించగల దేశంలోని పరమ వృద్ధ రాజనీతి శాస్త్రజ్ఞులు, ప్రజా సేవకులూనైన డాక్టర్ హృదయనాథ్ కుంజ్రూ లాంటి పెద్దల సలహాను పాటించి అయినా రాజీనామా చేస్తే బాగుండేది...న్యాయ విచారణ లేకుండా నిర్బంధంలో ఉంచినందువల్ల మొరార్జీలాంటి నాయకులు తలదించుకోవడం పొరబాటు...ప్రజాస్వామ్యం పేరిట మీరు ప్రజాస్వామ్యాన్ని నిర్దాక్షిణ్యంగా రద్దు చేశారు..." అని వ్రాశారు. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటి నాయకుడు కోందడరావు 2-7-'75 న.

*    *    *    *

"...నీ రాజకీయ సమర్థకులను మినహాయించి, ఢిల్లీలోని సామాన్య పౌరులు, కమ్యూనిస్టు సమాజాలలో లాగా కాఫీ హోటల్సులోను, బస్టాపులలోను రాజకీయాలగురించి చర్చించలేక పోతున్నారు. ఏదైనా అభిప్రాయం చెప్పటానికి అటు ఇటు చూసుకొంటున్నారు. భయోత్పాత వాతావరణం, రాజకీయ అణచివేత తాండవిస్తున్నందున; రాజకీయ చైతన్యం ఉండికూడ నీతో ఏకీభవించేవారు ఎవరూ మాట్లాడటానికి సిద్ధం కావటంలేదు. రాత్రికి తలుపులు తట్టబడ్తవేమోనన్న భయమే కారణం"...

"9-8-'75 నుండి మాకు తటస్థమయ్యే బాధలను లెక్కించకుండా బహిరంగోపన్యాసాలు, బహిరంగ సమావేశాలు, పత్రికా స్వాతం త్ర్యం వగైరా విషయాలలో ప్రజల హక్కులను ప్రచారం చేస్తామని ఇందు మూలంగా ప్రకటిస్తున్నాము" - అని హెచ్చరించారు - భీమసేన్ సచార్, యస్. డి. శర్మ, విష్ణుదత్త, కృష్ణలాల్ వైద్య సేవక్ రామ్, డి. కె. శర్మ, కె. కె. సింహా.

* * * *

"...మహాత్ముని ప్రసవించిన ఈ దేశంలో స్వాతంత్ర్యేచ్ఛను, ఎవరూ శాశ్వతంగా అణచి ఉంచలేరు.

ఈ లేఖ కల్గించే పరిణామాలు నాకు తెలుసు. మీకు చికాకు కల్గుతుంది. నా నిర్బంధ కాలాన్ని మీరు పొడిగించవచ్చు. ఈ జైలు గదే నా సమాధి స్థలంగా పరిణమించినా, నా పథాన్నుండి చలించను"- అని మధు దండావతే బెంగుళూరు కేంద్ర కారాగారంనుండి వ్రాశాడు.

* * * *

"...ఎప్పుడూ నిన్ను నీవు ప్రపంచంలోని దుర్మార్గపు నియం తృత్వాలతోను, 'నీ దశాబ్ద ప్రగతి'ని ప్రపంచంలోని అత్యంత 'స్తబ్ద ఆర్థిక స్థితు'ల తోనూ పోల్చి చూచుకొంటూ, "చూడండి ! నేను వీళ్లంత దుర్మార్గురాలిని కానే" అని గర్వంగా చెప్పుకొనే దయనీయస్థితి నీ కెందుకు.

...లోక్ సభ గడువు పొడిగించ బడితే సభ్యత్వానికి రాజీనామా చేయాలన్న నా అభీష్టాన్ని ఇంతకు ముందే మీకు తెలియజేసినట్లుగా 18 మార్చి '76 నుంచి రాజీనామా చేస్తున్నాను" - అని నరసింఘర్ జైలునుండి మధు లిమాయె 18 మార్చి '76న వ్రాశాడు.

* * * *

"...భయంతోను, అధికార పిపాసతోను అభిప్రాయాలను ఏర్పరచుకొన్న వాళ్ళను కూడా - మంచితనం త్వరలో ప్రభావితం చేయగలదన్న విశ్వాసం నాకుంది. ఆదర్శాలకోసం జీవించి, బాధలు పడిన వాళ్ళనే మన ప్రజ గౌరవిస్తుంది - జ్ఞప్తిలో ఉంచుకొంటుందనేది మన చరిత్ర చెప్తున్న పాఠం. మీరు సందర్శించిన హల్దీ ఘాట్ దీన్ని ఋజువు పర్చింది. అక్బరు, మాన్‌సింగ్ వాళ్ళ రోజుల్లో అమిత అధికారాలున్న వాళ్ళు. కానీ ప్రజలు మహారాణా ప్రతాప్‌నే జ్ఞప్తియందుంచుకొన్నారు. కావున అధికారానికి అతుక్కు పోవడం జీవితానికి సర్వస్వం, అంతిమ లక్ష్యం కాకూడదు...'' అని 26-6-'78న చరణ్‌సింగ్ వ్రాశాడు.

* * * *

"...గొప్పలు చెప్పుకోబోకు! జాతిని గురించి నీకేకాదు పట్టింది. నీవు నిర్బంధించిన వాళ్ళలోకాని లేక జైళ్ళపాలు చేసిన వారిలో కాని చాలమంది ఈ జాతికోసం నీకన్న ఎక్కువ కృషిచేసిన వారున్నారు. వాళ్ళలో ప్రతివారు నీ అంతటి దేశభక్తులే. కాబట్టి దయచేసి జాతిని గురించి మాకు ఉపన్యాసాలు ఇచ్చి మా గాయాలపై కారం చల్లకు''...

...''నీ వెన్నుకున్న మార్గంలో అన్నీ ఇబ్బందులే. గొప్ప సాంప్రదాయాన్ని, మహత్తరమైన విలువలను, ప్రజాస్వామ్య ఆచరణను వారసత్వంగా పొందావు. వాటిని చిందర వందర చేసిపోకు. వాటి నన్నింటిని మళ్ళీ ఏకత్రితం చేయడానికి సుదీర్ఘకాలం పడుతుంది. ఇవి తిరిగి ఏకత్రితం కాగల్గుతాయి అనడంలో నాకు అనుమానం లేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో పోరాడి, వారి మెడలు వంచిన జాతి నిరంకుశత్వానికి ఎక్కువకాలం తలవంచదు. మనిషి అంతరాత్మను

అణచటానికి ప్రయత్నిస్తే కుదరదు. వ్యక్తి నియంతృత్వాన్ని నెల కొల్పటంలో దానిని అగాధంలో పూడ్చిపెట్టారు. కానీ అది సమాధి నుంచి లేచి వస్తుంది. రష్యాలోనే అది లేచి కూర్చుంటున్నది..."

"...ఆటలో బంతి నీవైపు ఉంది – ఏం చేస్తావో మరి...!!"

—చండీఘర్ జైలునుండి జయప్రకాశ్, 21 జులై '75న వ్రాసిన లేఖనుండి.

* * * *

మిత్రులారా :

"...ప్రస్తుత పరిస్థితిని గమనించినపుడు నే నేమన్నా కలగంటు న్నానా అనిపిస్తుంది. ఇంకా సరిగా చెప్పాలంటే ఇది ఒక పీడకలేమో ననిపిస్తుంది. అసలు నేను మేల్కొని ఉన్నానా లేక నిద్రిస్తున్నానా అనే సందేహంతో కళ్ళు నులుముకొని చూస్తే – ఇది కలకాదు, పీడకలా కాదు; ఇది ఒక నగ్న కఠోర సత్యం..."

"...అసలు కుట్రలు జరిపింది ప్రధాని ఇందిరే. ప్రతిపక్ష నాయకులను జైళ్ళకు పంపడానికి, పత్రికల నోళ్ళు కట్టివేయడానికి, ప్రజల స్వేచ్ఛను హరించడానికి, తన పదవిని నిలుపుకోవడానికి, ప్రధాని ఇందిరే పెద్ద కుట్ర పన్నింది – ఆమె కుట్ర ఫలితము ఎమ ర్జెన్సీ – ప్రజాస్వామ్య ముసుగులో నియంతృత్వము..."

"...యుగ యుగాల నాగరికత గలది మన దేశం. ప్రజా స్వామ్య వ్యవస్థకు అనుగుణంగా రాజ్యాంగాన్ని రూపొందించుకున్నదీ దేశం. ఈ దేశం శాశ్వతంగా నియంతృత్వపు చీకట్లలో ఉండదు. 'రాత్రి ఎంత చీకటిపడితే పగటి వెలుగు అంత దగ్గరలో నున్నదని' ఒక ఆంగ్ల సామెత..."

"...నేడు ఇందిరాగాంధీ ఆమె నియంతృత్వాన్ని కూడా మనం నిలిచే గెలుస్తాం. We will survive Mrs. Indira Gandhi and her dictatorship!"

—'75 అక్టోబరులో అహ్మదాబాద్‌లో ఛాగ్లా చేసిన ప్రసంగపు భాగాలు.

* * * *

"...మేము ప్రారంభించిన సత్యాగ్రహం దేశంలోని అన్ని ప్రాంతాలలోను కొనసాగుతున్నదని మీరు ఎరుగుదురు. గత 7 వారాల్లో 90,000 సత్యాగ్రహులు అరెస్టు అయ్యారు అన్న విషయం కూడా మీరు ఎరుగుదురు. షుమారు 3,000 స్థలాల్లో మా సత్యాగ్రహ దళాలు సత్యాగ్రహం చేశాయి. 500 సందర్భాలలో నివేదికలు మీరు అందుకున్నారు. ఏ సందర్భంలోనూ, ఏ ఒక్కరూ - ఏ విధమైన విధ్వంసక, అక్రమ ప్రవర్తనలకు పాల్పడలేదని అవి వెల్లడి చేస్తున్నాయి. ఎక్కడైనా మా సత్యాగ్రహులుగానీ, సత్యాగ్రహాలను తిలకించిన లక్షలాది సానుభూతి పరులు - పట్టణాల వారుగానీ, పల్లెల వారుగానీ- ఒక్క రాయి విసిరిన సంఘటన కూడా ఏ రాష్ట్రంలోనూ లేదు. అనేక చోట్ల పోలీసుల హింసను, వర్ణనాతీత బాధలను తట్టుకోవలసి వచ్చినప్పటికీ వాళ్ళు పూర్తిగా ప్రశాంతంగా, అహింసాయుతంగానే ఉన్నారు..."

"...కాని మాకు అందిన నివేదికల ప్రకారం సత్యాగ్రహుల పట్ల, నిర్బంధితులపట్ల అవమానకరంగానూ, అగౌరవంగానూ ప్రవర్తించారని తెలుస్తోంది. చాల చోట్ల తమంతటతామే శాంతియుతంగా అరెస్టు అయిన సత్యాగ్రహులను అమానుషంగా హింసించటం జరిగింది. శాంతియుత స్వయంసేవకులు ఎందరో సత్యాగ్రహం చేస్తున్నపుడు లాఠీఛార్జ్‌కు గురయ్యారు...".

"...ఈ విధమైన క్రూర చర్యలను, తీవ్రమైన అవమానాలను సామ్రాజ్యవాద రక్షక భటులు మాత్రమే చేస్తారు. సత్యాగ్రహుల వలు వలు ఒలిచి క్రొవ్వొత్తులతో కాల్చటం, లేదా మంచు దిమ్మలను శరీ రంపై ఉంచటం చేశారు; ముఖాలపై 'మలం' పులిమారు లేదా మూత్రం త్రాగమని ఒత్తిడి పెట్టారు. కాలుతున్న సిగిరెట్లు, కారంపొడి ఇంకా అనేక తీవ్రమైన విధానాలతో కూడిన మధ్య యుగాలకు సంబంధించిన చిత్రహింసలను చేశారు...".

"ఈ అమానుష చర్యలను నిలుప వల్సిందిగా, సూచనలు పంపవలసిందిగా కోరుతున్నాను...".

—అని 1976 జనవరి 9 న యల్. యస్. యస్. కార్యదర్శి రవీంద్రవర్మ జాబు వ్రాశారు.

*     *     *     *

*14 నవంబరు '75 న సత్యాగ్రహాలు ప్రారంభ మయ్యాయి. సత్యాగ్రహం చేయటానికి సంసిద్ధమైనవారి నుద్దేశించి ఆర్. యస్. యస్. నాయకులు యాదవరావ్ జోషి ఇలా వ్రాసారు.*

"ఓ సాహసవంతుడగు మిత్రమా!

నేటి సంఘటన నీ జీవితంలో సువర్ణాక్షరాలతో వ్రాయదగింది. నీ విప్పుడు రణరంగలోకి ప్రవేశిస్తున్నావు. పోరాటం ఆరంభమైంది. ఫిరంగులు మ్రోగుతున్నాయి. రణభేరి దశదిశల మారు మ్రోగుతూ వుంది.

విదేశ దాస్య శృంఖలాలను త్రెంచివేయుటకు పూర్వులెందరో తమ ప్రాణాలతో చెలగాటమాడారు. త్యాగ బలిదానాల ఉత్తమ ఆదర్శాన్ని అందించారు. వారి కుటుంబాలు కూకటివ్రేళ్ళతో పెల్లగింప

బడ్డాయి. తరతరాలు నాశనమైనాయి. 1947 లో సంప్రాప్తించిన స్వాతంత్ర్య శుభఘడియకు వారి బలిదానాలే కారణంగదూ!

"ఆంతరిక దాస్యాన్ని పారద్రోలి మరల ప్రజాస్వాతంత్ర్యాన్ని నెలకొల్పుటకు దేశమంతటా ప్రజా పోరాటమనే యజ్ఞ జ్వాలలు రగుల్కొంటున్నాయి. ఈ యజ్ఞజ్వాలలో దురాగతాలు, దౌర్జన్యాలు భస్మమై మరల దేశంలో న్యాయం, నీతి, స్వేచ్ఛాయుత జీవనాలతో నూతన శకం ఆరంభమవడం తథ్యం. కాని ఈ పోరాటం ఏదో ఒకరి తోనే సాధింపబడుతుందనే తలంపు మన మనస్సులోకి రారాదు. ఇదొక మహా సంగ్రామం. ఈ సంగ్రామంలో మొదటి రణరంగంగా నేటి ఉద్యమం ప్రారంభమైంది. ఇలాంటి ఉద్యమాలను ఎన్నిటినో నడుపవలసి రావచ్చు. ఆశ నిరాశల నెదుర్కొవలసి రావచ్చు. జయాపజయాలు రెంటికీ సంసిద్ధం కావాలి. మానావమానాలను సమంగా భావించాలి. కుటుంబాలు ఎన్నో సర్వనాశనం కావచ్చు. అయినా, పట్టుదలతో పోరాటాన్ని సాగించాలి. పరదాస్య విముక్తికై మన పూర్వులు చెల్లించిన మూల్యంకంటే ఎంతో ఎక్కువ మూల్యాన్ని స్వదేశీ దాస్యవిముక్తి కోసం చెల్లించవలసియుంటుంది. ధర చెల్లించకుండా వస్తువేదీ రాదనే విషయం అనుభవమేకదూ!

పూర్తి మూల్యానికి మనం సిద్ధంగా ఉన్నాం. అంతిమ విజయం మనదే.

"ఈ పోరాటంలో పాల్గొంటున్నందువల్ల నీవు అదృష్టవంతుడవు. జన్మజన్మాల సుకృతం వల్లనే నీవు ఈ పోరాటంలో దూక గల్గు తున్నావు."

..."ఇక వెనుకంజలేదు. కష్టాలు, బాధలను గురించి పరిత పించుటవలన ప్రయోజనం శూన్యం. దీక్షతో, అచంచల ఆత్మ విశ్వా

సంతో ముందడుగు వేయాలి. ముక్త కంఠంతో 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు'ని చాటుతూ ప్రపంచ మంతటా మార్మోగింప చేయాలి.''

*    *    *    *

*ఎమర్జెన్సీ విధించి సంవత్సరం నడిచిన తర్వాత ఒకసారి ఆర్. యస్. యస్. నాయకులు మాధవరావు మూలే కార్యకర్తలకు ఇచ్చిన సందేశం :*

''ఆదర్శాలకోసం పోరాడినప్పుడే జాతులు నిలబడతాయి. అలా కాక పాశవిక దమనకాండకు తలఒగ్గితే నామరూపాలులేకుండా పోతాయి. ఇది తెలిసి మనం జాతిలోని పోరాటపుశక్తిని రగులుతూ ఉండేటట్లు చూడటానికి చమటోడ్చి అహర్నిశలు పని చేశాం.

నియంతృత్వం తలఎత్తిన మరుక్షణంనుండి ఏదో ఒక ప్రదర్శన జరుగుతూ నిరంతరం దేశమంతటా నిరసన పెరిగి పెరిగి, 14 నవంబరు నాటి సత్యాగ్రహంతో అది తారాస్థాయినందుకొన్నది. ఈ సత్యాగ్రహం ప్రజలలో నిర్భయాన్ని, ప్రతిఘటనను, సావధానతను వ్యాపింపజేసింది. క్రమంగా దేశంలోని జాతీయ శక్తులన్నీ దగ్గరకు చేరనారంభించాయి. జనవరిలో జరిగిన ఆచార్య సమ్మేళనంతో మేధావి వర్గంకూడ మేల్కొన్నట్లు స్పష్టమవుతున్నది. మొత్తం ప్రపంచం ఆలోచించటం ప్రారంభించింది. దాంతో పోరాటానికి నైతికబలం చేకూరింది. ఇక రెండవ వైపు నియంత ప్రారంభించిన పైశాచిక దమనకాండ – ఆమె నైతిక స్థాయిని, ఆమె వల్లించే సిద్ధాంతాల బండారాన్ని బట్టబయలు చేసింది. మన జాతిని ఏ పాశవిక శక్తి కూడా త్రొక్కి పెట్టలేదన్న విషయం ఇంకొకసారి ఋజువు అయింది.

"....పోరాటం ప్రారంభ దశలో ఉన్నదనే విషయం మీకు కూడా తెలిసిందే. రాబోయే రోజులలో సుదీర్ఘమైన భీషణ పోరాటం

జరుగనున్నది. సంగ్రామపు మొదటి పోరాటంలో విజయం పొందాం. ఇది రాబోయే గడ్డు రోజులను ఎదుర్కోగలమన్న మన విశ్వాసాన్ని ప్రబలం చేసింది.

....''ఈ కార్యాన్ని మనం జీవనవ్రతంగా ఎన్నడో తీసుకొన్నాం. దీనికి నేడు మరల అంకితమవుదాం''....

..''తన భవిష్య రూపురేఖలను మనం తీర్చిదిద్దుతామని ఎంతో కాలంగా దేశం ఆశలు పెట్టుకొని ఉన్నది. అరువదికోట్ల జనభాగల ఈ జాతి స్వాభిమానంతో స్వతంత్రంగా ఉండబోతున్నదా లేక పశు ప్రాయంగా బానిసత్వాన్ని స్వీకరించబోతున్నదా – అనేది తేల్చవలసిన సమయం వచ్చింది. ఈ తరుణంలో ప్రముఖపాత్ర వహించటానికి మనలను ఎన్నుకోవటం ఆ భగవంతుని కృప.

ఈ గడ్డ సాంప్రదాయానుసారంగా చేపట్టిన ఈ పనిలో అంతిమ విజయం మనదే. ఈ దేశంలో దుష్టశక్తుల తలలు పైకి లేచినపుడల్లా వాటిని తెగనరికి మంచి నిలద్రొక్కుకుంటూ వచ్చింది.

ఈ పవిత్ర భూమిలో సత్యం, న్యాయం, మానవత్వమే ఎల్లప్పుడు విజయం సాధించాయి. త్యాగాలకు, బాధలకు ఓర్చి జాతిని గమ్యానికి చేర్చటానికి కటిబద్ధులవుదాం. విసుగు, విరామంలేకుండా ఏ అవరోధం వచ్చినా ఎదిరిస్తూ, అధిగమిస్తూ, విజయభేరి మ్రోగేవరకు కదం కదం కలిపి ముందు కేగుదాం పదండి.''

# 4. ఇంటర్వ్యూలు

అజ్ఞాత ఉద్యమం గురించి ఉద్యమ సారథ్యం వహించిన ప్రముఖులనుంచి మరికొన్ని విశేషాలను సేకరించటానికి అనేక మందిని కలవటానికి ప్రయత్నం జరిగింది.

సమయాభావం వల్ల కలవవీలైన కొద్ది మందితో తీసుకొన్న ఇంటర్వ్యూలలోని ముఖ్యాంశాలను మాత్రమే ఇచ్చట ఇవ్వడం జరిగింది. అందరినీ కలిసినట్లయితే మరెన్నో విశేషాలు తెలిసి ఉండేవి.

## తెన్నేటి విశ్వనాథంగారితో

[ఆంధ్ర రాష్ట్ర రాజకీయ నాయకులలో పెద్ద తెన్నేటి విశ్వనాథంగారు. ఎమర్జెన్సీలో లోక సంఘర్ష సమితి అధ్యక్షులుగా సత్యాగ్రహం చేశారు. ఆ తర్వాత అనేకమంది పెద్దలను కదిలించటానికి, ప్రజలను సమాయత్తం చేయటానికి రాష్ట్ర మంతటా పర్యటిస్తూ నెల్లూరులో అరెస్టయారు.]

ప్ర: ఇక్కడ ఆంధ్రాలో ఈ అండర్‌గ్రౌండ్ యాక్టివిటీ (అజ్ఞాత కార్యక్రమం)లో ఎక్కువ భాగస్వాములు ఎవరు ?

స: నామట్టుకు కన్పించేవాళ్లు హెచ్చు జనసంఘంవాళ్లే కనిపించేవాళ్ళు. తరువాత కొంచెం సోషలిస్టులు కన్పించేవారు. కొంచెం బి.యల్.డి. ఈ మూడు పార్టీల వాళ్ళూ ఉన్నారు. జన సంఘం వాళ్ళే ఎక్కువ చేశారు. నేను ఈ విషయం పబ్లిక్ మీటింగులో కూడా చెప్పాను.

మీ పార్టీ ఎంతవరకు పనిచేసింది ?

పార్టీ ఎప్పుడూ చేస్తూనే ఉన్నది.

ఎంత మంది అరెస్టయారండీ ?

అరెస్టయ్యారు కొంత మంది.

పేర్లు - అందులో వ్రాయడానికి.

పేర్లు నేను చెప్పలేను. కాని మూమెంటులో ఉన్నారు. వాళ్ళు తిరుగుతూ ఉండేవారు అటూ ఇటూను. అరెస్టు కాలేదు.

ప్ర : సత్యాగ్రహం ?

స : సత్యాగ్రహం ఎవరో ఒకళ్ళిద్దరు చేశారండి. సత్యాగ్రహం చేసినట్లు నాకు రిపోర్టులు వచ్చాయి.

## సోమయ్యగారితో

[ఆర్. యస్. యస్. ఆంధ్రప్రాంత ప్రచారక్ సోంపల్లి సోమయ్యగారు. అజ్ఞాతంగా... మొత్తం ప్రాంత పర్యటన చేస్తూ అజ్ఞాత ఉద్యమ వ్యవస్థను ఏర్పాటు చేశారు.]

ప్ర : ఇలాంటి తీవ్రచర్య ఇందిరాగాంధీ ఆర్. యస్. యస్. మీద తీసుకోవచ్చని మీరు ఊహించారా ?

స : ఇలాంటి ఎమర్జెన్సీ పెడుతుందని అనుకోలేదు. కాని అఘాయిత్యమేదో చేస్తుందనుకున్నాం. క్రిమినల్ లా సవరణ చట్టం ఆర్. యస్. యస్. ను ఉద్దేశించి చేసిందేనని అనవచ్చు. కాని

ఆర్. యస్. యస్. ఆ పరిధిలో చిక్కలేదు. కొందరు ఇందిరా అనుచరులు పనికట్టుకొని దుష్ప్రచారం ప్రారంభించారు. యం. పి. లు మెమోరాండం ఇచ్చారు. సంఘ వ్యతిరేక ఉద్యమం నడిపారు. సాంప్రదాయక విరోధి మండలులు, సుభద్రా జోషి లాంటివాళ్ళు, సి. పి. ఐ., కాంగ్రెస్‌లోని వామపక్షులు, బ్లిట్జు, కరెంటు, కమ్యూనిష్టు పేపర్లు, వారి సమర్థకులు మేన్‌స్ట్రీం, లింకు వగైరాలు - అందరిదీ ఒకే పాట. నిషేధానికి రంగాన్ని సిద్ధం చేసుకుంటూనే ఉన్నారు.

ప్ర : తొలి సత్యాగ్రహ పరిణామాన్ని మీరెలా ఊహించారు ?

స : స్తబ్ధతను పోగొట్టాలి. సమాజాన్ని ఆవరించిన భయాన్ని తొలగించాలి. సాహసం ప్రజలలో చావలేదనే దృశ్యాన్ని నిలబెట్టడానికి అది మొదటి అడుగు. ఆశించిన ఫలితానికి అవధి ఉన్నది. ఆ మేరకు కార్యకర్తలలో, సమాజంలో, ఉత్సాహవంతులైన ఇతర వ్యక్తుల్లోనూ కదలిక-ధైర్యం-పెద్ద ఎత్తుగడకు సంసిద్ధత ఏర్పడ్డాయి. ఒక విధంగా సీమితమైన ఉద్దేశ్యం నెరవేరింది. (In a way the limited object is achieved).

ప్ర : నవంబరు 1975 లో ప్రారంభమైన సత్యాగ్రహాల తర్వాత ఎన్నికలలోపు ఒక స్తబ్ధత కన్పించింది కదా ? ఎన్నికలు జరిగి యుండని తీరులో కార్యక్రమాలు ఎలా ఉండేవి ?

స : అసలు స్తబ్ధత అంటూ ఉద్యమంలో ఎప్పుడూ రాలేదు. ఒక వ్యూహాన్ని సక్రమంగా నిర్వహించిన తర్వాత - రెండో అడుగు వేసే ముందు సహజంగా ఓర్మి కనిపిస్తుంది. మరో తీవ్రమైన రెండవ దశ పోరాటానికి ప్రయత్నించ వలసిన కాల ఖండమది. ఎన్నికలు ప్రకటించకపోతే ప్రభుత్వానికి ప్రజా సహకారం బొత్తిగా లేకుండా చేసే

సహాయ నిరాకరణం, ఇతర కార్యక్రమాలు ఆలోచించి - ఆ ఊహలకు కార్యక్రమాన్ని కనుగొనడానికి ప్రయత్నం జరిగింది. ఉద్యమం గ్రామాలకు ప్రాకింది. ఈ ఉద్యమం ప్రజల్లో ఎంత కదలిక కల్గిందనే విషయాన్ని ఉద్యమ కార్యకర్తలు ఊహించినంత వాస్తవంగా ప్రభుత్వం గాని, ఇందిరా బృందంగాని గ్రహించలేదు.

ప్ర: ఇతర పార్టీలతో కలిసి ఆర్. యస్. యస్. వాళ్ళు సమావేశాలేమైనా జరిపారా?

స: ఒక సమావేశాన్ని వుయ్యూరులో వడ్డే శోభనాద్రీశ్వరరావు ఇంట్లో జరిగింది. కమ్యూనిస్టు నాయకుడు యం. వి. రామమూర్తి, జనసంఘ నాయకులు గోపాల్‌రావ్‌ఠాకూర్, గొట్టిపాటి మురళీమోహన్, తుమ్మల చౌదరి, సుంకర సత్యనారాయణ, వేణుగోపాలరెడ్డి, శోభనాద్రీశ్వరరావు, యలమంచలి శివాజీ, డా॥ సీతారామస్వామి, డా॥ యం. డి. రామారావు వగైరా వచ్చారు. రెండోది 42వ సవరణను గురించి డా॥ వేణుగోపాలరావుగారింట్లో జరిగింది. నీలం సంజీవరెడ్డి, యం. వి. సుబ్బరాజు, పి. వేణుగోపాల్‌రెడ్డి, గణపతిరావు బ్రహ్మపుర్‌కర్, వి. రామారావు, పి. వి. చలపతిరావు ఇంకా కొందరు హాజరైనారు.

ప్ర: మిగతా పక్షాలవారి క్రియాశీల సహకారం అజ్ఞాత ఉద్యమానికి ఏ మేరకు లభించింది?

స: మనసులో ప్రతివ్యక్తీ తీవ్రంగా బాధపడుతుండేవాడు. చేయాలనే తపన ఉండేది. ఒక విధంగా జాతీయ శక్తుల సమాన అవగాహన ప్రత్యక్షంగా కన్పించిన కాలం అది. అయితే ఎవరి శక్తిమేరకు వారు సహకరించారు. సంస్థాబలం, క్రమశిక్షణ, సంఘానికి ఎక్కువగా

ఉండడాన మన ప్రాంతంలో భారం దాదాపు, చెప్పాలంటే పూర్తిగా ఆర్. యస్. యస్. పైన పడింది. అది సహజం కూడాను.

ప్ర : సంఘ సభ్యుల మనస్థితి ఎలా కన్పించింది మీకు ?

స : చాలా తృప్తికరంగా కనిపించింది. సంఘ శిక్షణ ఎంత ఉపయోగకరమైందో కన్పించింది. స్వయంసేవకులే కాదు - వారి కుటుంబాలు, బంధువులు కూడా చాలా స్థైర్యాన్ని కనబరిచారు. అజ్ఞాత ఉద్యమం సాగడానికి వీరి ధైర్య సాహసాలే కారణం. పోలీసులకు దొరక్కుండా కేంద్రం నాయకుల నుండి, స్థానిక కార్యకర్తదాకా నిర్భయంగా తిరగడానికి వీరి కుటుంబాలు ప్రదర్శించిన ధైర్యమే బలాన్ని ఇచ్చింది. నిధులివ్వడంలో మధ్య తరగతి కుటుంబీకులు చూపిన త్యాగం ప్రశంసనీయమైంది. అజ్ఞాత ఉద్యమానికి సామాన్యుడు అండగా వెన్నెముకగా నిలవగలిగాడంటే ఆ మేరకు స్వయం సేవకుల మనోధైర్యమే కారణం.

## మాధవరావు మూలేగారితో

[మాధవరావు మూలే ఆర్. యస్. యస్. ప్రధాన కార్యదర్శి. చివరిదాకా అరెస్టు కాకుండా - అజ్ఞాత ఉద్యమాన్ని మోరోపంత్ పింగళే అనే మరో కేంద్ర నాయకుల సహకారంతో నిర్వహించారు. ఆ 20 నెలలలో వారు తోటి సోదరులకు పంపిన లేఖలు ఎంతో ఉత్సాహాన్ని ఇస్తాయి. వారిని ఢిల్లీలో 20-10-1977 న కలిసినప్పుడు సేకరించిన వివరాలు - ఆర్. యస్. యస్. ప్రధాన కార్యదర్శిగా ఆయన భావాలు మననం చేసుకోతగ్గవి.]

ప్ర : సంఘాన్ని అత్యవసర పరిస్థితిలో నిషేధించకుండా ఉంటే మీ వైఖరి ఎలా ఉండేది ?

స : సంఘం ఎన్నడూ తన కొరకు ఆలోచించలేదు. ఆర్. యస్. యస్. ఒక జాతీయ సంఘటన అవడాన, సమాజపు మేలును, దేశహితాన్ని దృష్టిలో ఉంచుకునే ఆలోచిస్తుంది. దేశానికి - ఈతిబాధలైనా - దురాక్రమణలైనా - ఆపద ఏర్పడ్డపుడు ఆర్. యస్. యస్. ముందుకురికి సహకరిస్తుంది. అలా సహకరించింది.

అత్యవసర పరిస్థితి జాతిపై విరుచుకుపడిన ఆపద. ఆ తరువాత జరిగిన సంఘటనలు ఈ విషయాన్ని ఋజువు చేశాయి. కనుక నిషేధం రాకపోయినా దేశానికి పట్టిన బాధను తొలగించడానికి అంతే శక్తితోపాటు ఇతోధిక కృషి చేస్తుంది—

ప్ర : సంఘ నాయకులు బాలాసాహెబ్ గారికి 'సంధి' చేసుకోవాలని మనసులో పడిందని, లొంగుబాటు భాషను ఉపయోగించారని కొందరు అంటారు...

స : అదికాదు. ఆయన ప్రభుత్వానికి రెండు ఉత్తరాలు వ్రాశారు. ఆ రెంటిలోను ఇందిరా గాంధీ ఆరోపణలు నిరాధారమైనవని చూపించారు. జారిపోవడం-లొంగిపోవడం ఆ ఉత్తరాల్లో ఎక్కడాలేదు. సంఘ నిత్య వ్యవహారంలో ప్రయోగించే భాషాధోరణి అది. సంఘటన శాస్త్రంలో పరుషత్వం (కటుత్వం) పనికిరాదు. అదొక శైలి. కనుకనే మొరటుతనం - అసభ్యత మాకు నచ్చదు. ఆ ఉత్తరాల భాష కొందరికి సౌమ్యంగా కన్పించి ఉండవచ్చు. గత నిషేధ సమయంలో కూడా శ్రీ గురూజీ మాజీ ప్రభుత్వానికి వ్రాసిన ఉత్తరాలలో ఈ సభ్యతనే - శైలినే పాటించారు. అది వ్యవహార మర్యాద.

ప్ర : 'జనతా విజయం' ఎంత శాతం సంఘతత్వ భూమికకు విజయంగా మీరు భావిస్తున్నారు ?

స : మౌలికంగా మనదేశ స్వభావానికి, మన ప్రజల మన స్తత్వానికి, ప్రజా స్వామ్యమే తగిన పద్ధతి. ఈ దేశానికి ప్రజాస్వామ్య విధానమే ఉత్తమమైన విధానమని సంఘం విశ్వసిస్తున్నది. మన సంస్కృతీ మూల్యాలలో వ్యక్తికి మహనీయమైన స్థానం ఇచ్చారు. అలాంటి 'వ్యక్తి'కి సంబంధించిన అన్నివిధాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించడమంటే - మన సాంస్కృతికమైన విలువలపై దాడిచేయడమన్న మాటే. అలాంటి స్థితిని మార్చి మళ్ళీ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడమంటే - ఆ మేరకు ఒక మౌలికమైన విషయంలో లభించిన విజయం అన్నమాట. కనుక ఈ విజయాన్ని సంఘతత్వ భూమికకు లభించిన నూటికి నూరుపాళ్ళ విజయంగా భావించవచ్చు—

## డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో

[డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో పనిచేస్తున్నారు. నాటి నుండి ఆర్. యస్. యస్. సభ్యులు. 'హిందుస్తాన్ సమాచార్' వార్తా సంస్థలో కొన్నాళ్ళు ప్రాంత వ్యవస్థను చూచారు. కొన్ని సంవత్సరాలు ఆర్. యస్. యస్. ప్రచారకులుగా పనిచేశారు.

ప్రస్తుతం ప్రాంత కార్యవాహ (కార్యదర్శి) గా పని చేస్తున్నారు. ఎమర్జెన్సీ కాలంలో పూర్తిగా విశాఖ సెంట్రల్ జైల్లో గడిపారు. జైలులో జీవితాన్ని గురించి వారి వ్యాఖ్య చదవ తగ్గది.]

ప్ర : జైల్లో నిర్బంధితుల మనోధైర్యాన్ని గురించి చెబుతారా ?

స : పూర్తికాలం జైల్లో ఉన్నవాళ్ళు ఎక్కువభాగం సంఘ స్వయంసేవకులే. ఎమర్జెన్సీ వగైరా ప్రస్తుత ఉద్యమానికి సంబంధించి నిర్బంధితులై చివరివరకు జైళ్ళలో ఉన్నవాళ్ళు ఆర్. యస్. యస్. సభ్యులే. జైలు బైటికి వచ్చిం తర్వాత మిగతా జైళ్ళలో పూర్తికాలం గడిపిన ప్రముఖ మిత్రులను కలిసి తెలుసుకున్న విషయాలు కూడా నా విశాఖ అనుభవాన్నే బలపరచాయి.

వార్తల పూర్తి అవగాహన ప్రత్యక్షంగాలేని కారణాన, బైట జరుగుతూన్న కార్యక్రమ స్వరూప స్వభావాలు గ్రహించలేని కొందరు 'తీవ్ర చర్య'లు జరిపి, త్వరలో ఈ అధ్యాయాన్ని ముగింప చేయాలని భావించారు. ఇవి మనస్తత్వాల పరిణామంగా కన్పించిన వికల్పాలు (exceptions). మిగతావారు జైలు జీవితాన్ని హుందాగా, ప్రయోజన కరంగా గడిపారు. యువకులు-పెద్దలు సహజీవనం గడపడాన ఎన్నో కొత్త కొత్త విషయాలను అధ్యయనం చేయడం - వివిధ తత్వాల పరామర్శద్వారా తమ మార్గాన్ని పరిశీలించుకోడం-జీవితంలో ఆదర్శ వాదానికి, లొంగుబాటులేని ధీన లక్షణాన్ని అలవరచుకోడం - చాలా గొప్ప విషయంగానే నాకు కన్పించింది. ఇదిగాక వివిధ ధోరణుల జనం ఒక చోట కలిసినప్పుడు సహజంగా భ్రమలు తొలగడానికి అవకాశం ఏర్పడుతుంది. అలానే జరిగింది. జైల్లో తెన్నేటి, గౌతు లచ్చన్న ప్రభృతులు-రాజకీయ నాయకులు - విశ్వవిద్యాలయంలో వివిధ శాఖల్లో పని చేస్తున్న విద్యా విజ్ఞానవేత్తలు - న్యాయవాదులు - వ్యవహార జ్ఞానంగల అనుభవ శాలురు - అందరూ ఒకేచోట దాదాపు 19 నెలలు కలిసి ఉండడాన - ఒక విధంగా 'సంఘటన' శాస్త్రంలో ప్రథమావశ్యకంగా భావించబడే 'కలయిక' యొక్క అవసరం - ప్రయోజనం ప్రత్యక్షంగా

కన్పించాయి. ఆర్. యస్. యస్. పై పెంచుకున్న అనేక భ్రమలు తొలగడానికి కూడా ఈ 'సహవాసం' తోడ్పడ్డది.

మరి యువకు లున్నారుకదా ! ఆనందానికి అవధులుండవు. ఒక డిటెన్యూ జైలు ఆవరణలో స్వంత డబ్బుతో మామిడి అంట్లు తెప్పించి నాటాడు. ఆ అంట్లను పోషించడం - అతని కొక పెద్ద సంసారం.

జైల్లో కూడా వనభోజనాలు చేసాం. మహాపురుషుల జయింతు లన్నీ జరిగాయి. జైలు అధికారులు వ్యక్తిగత సమస్యలకు పరిష్కారం వెతుక్కోడం కొరకు వస్తుండేవాళ్ళు.

ప్ర : ఎప్పుడైనా విసుగనిపించిందా ?

స : విసుగనే ప్రశ్నలేదు. విషయం - విస్తృతి - తెలిసిన వాళ్ళందరు. నిషేధానికిముందే స్ట్రాటజీ స్వరూపం ఏర్పడిఉన్నది. 30 ఏండ్ల ఈ కాలంలో స్వయంసేవకులు ఎప్పుడూ let down చేయ రేదు. కర్తవ్యాన్నుంచి వెనుకంజ వేయలేదు. కొందరు ఈ స్తబ్ధతను తొలగించడానికొక 'Bang' అవసరం అంటుండేవారు. ఆ అవడం 'త్వరలో తేలిపోవాలి' అనే ఆదుర్దావల్ల అంతే. జైలు అధికారులు 'ఏమిటీ ఈ నిశ్చింత ? ఇది మొదటిసారి మా అనుభవంలో' అంటూండే వారు. "It is a game. We are fair. They are foul." (ఇదొక ఆట. మాది న్యాయపక్షం-వారిదన్యాయపక్షం) అని అంటుండే వాణ్ణి.

ప్ర : లోన జీవితం ఎలా ఉండేదంటారు ?

స : ఆనందంగా ఉండేది. మీరు 'నిగమ' ఎప్పుడైనా త్రాగరా ? అదో స్పెషల్ డ్రింకు. జైలులో కనుగొన్నది-మరేమీకాదు. నిమ్మకాయ-

గంజి - మజ్జిగ కలిసిన రసాయనమన్నమాట. అట్లాగే జనతాగెలుపు రోజున 'జనతా హల్వా' తయారై - జైలులో అందరికీ పంచాం. జీవితం అనేది జైల్లో అయినా బైట అయినా మనం తీసుకునే ధోరణి పట్టి ఉంటుంది కదండీ ! స్వయంసేవకులు ఈ పరీక్షలో అద్భుతంగానే నెగ్గారు.

## భావురావ్ దేవరస్‌గారితో

[భావూరావ్ దేవరస్ యు. పి., బీహార్, ఒరిస్సా, బెంగాల్ ప్రాంతాలకు ఆర్. యస్. యస్. ప్రచారకులుగా ఉంటుండేవారు. ప్రస్తుతం వారు సహ-సర్‌కార్యవాహ (Joint General Secretary) గా పనిచేస్తున్నారు.

వారితో రచయిత 17-10-77 న హైదరాబాదులో జరిపిన ఈ క్రింది సంభాషణ అత్యయిక పరిస్థితి పూర్వాపరాలను గురించిన భూమికను స్పష్టంగా తెలుపుతుంది.]

ప్ర : ఇందిరాగాంధీ సంఘాన్ని సైద్ధాంతికంగా వ్యతిరేకించిందా? లేక వ్యక్తిగతమైన కారణాలతోనా ?

స : సైద్ధాంతికంగా కాదు. అది చాలా స్పష్టమైన విషయం. పదవిలో ఉండాలని అనుకున్నదామె. ఈ దేశానికి నియంత కాదలచుకున్నది. బహుశా తన తరువాత తన కుమారుడు - అని కూడా భావించి ఉండవచ్చు. అందుకే సంఘవ్యతిరేక మనండి - ఆమె తీసు

కున్న ఏ చర్య అయినా అనంది - ఈ విషయాన్ని ఈ దృష్టిలోనే చూడాలి.

ఆమెకు కొన్ని అపోహలు కూడా ఉండవచ్చు. మనకామెతో సంబంధాలు లేకపోవడంతో, ఆర్గనైజరు - మదర్‌లాండు లాంటి పత్రికల్లో కన్పించే ధోరణే సంఘ అధికార ధోరణి అని అనుకోని అపోహలు పెంచుకొని ఉండవచ్చు. ఏది కారణమైనా సంఘంపట్ల ఈ వ్యతిరేక ధోరణికి అధికార రాజకీయాలే కారణం అనేది మాత్రం స్పష్టం.

ప్ర : సంఘం ఎలా ఆమెకు అడ్డు పడుతుందని భావించింది ?

స : అధికారం కావాలనుకున్న నియంత వ్యతిరేకాన్ని, విమర్శను ఎలాంటిదైనా సహించదు. మరి ఆమె విధానాల విషయంలో ఎన్నో సంఘం ఇష్టపడనివి ఉండవచ్చు. మనం ఆమె చర్యలను విమర్శించాం. పోగా జనసంఘం ఒక ప్రత్యేకమైన రాజకీయ పార్టీ ఐనా, చాలామంది స్వయంసేవకులు జనసంఘాన్ని సమర్థించడాన సంఘంలాంటి బలంగల సంస్థ తాను పదవిలో ఉండడానికి అడ్డుపడుతుందని భావించిందేమో ! అందుకని సంఘాన్ని అణగ ద్రొక్కాలని అనుకున్నదేమో. జనతాపార్టీ అంటే జనసంఘ, జనసంఘ అంటే ఆర్. యస్. యస్. అనే భ్రమ ఈనాడు కూడా ఉన్నది కదా ! అలాగే ఆనాడు కూడా సంఘాన్ని దగ్గరగా పరిశీలించని వాళ్ళు, సంఘాన్ని గురించి తెలుసుకోలేక - సంఘవ్యక్తులు కొందరు జనసంఘంలో చురుకుగా పనిచేయడాన సంఘ - జన సంఘాలను వేరుగా చూడకలేపోయినారు. రెండూ ఒకటేనని భావించేవాళ్ళు. పోగా జె. పి. ఉద్యమంలో సంఘం అధికారికంగా పాల్గొనలేదు. కాని బీహారులో ప్రతి సామాన్యునికి, సాధారణ పౌరునికి జె. పి. ఉద్యమంపట్ల సానుభూతి ఉండేది. సాధారణంగా ప్రజలు జె. పి. వెంట నడిచారు. చాలామంది స్వయంసేవకులు జె. పి.

ఉద్యమంలో చాలా చురుకుగా పనిచేస్తున్నారని ఆమెకు సమాచారం అంది ఉండవచ్చు. జె. పి. ఉద్యమాన్ని, అలాంటి ఉద్యమాలను అణచాలంటే సంఘాన్ని అణచివేయాలని భావించి ఉండవచ్చు.

ప్ర: అంటే బీహారులో జె. పి. ప్రారంభించిన ఉద్యమంలో చాలా ఎక్కువమంది స్వయంసేవకులు వ్యక్తిగతంగా పాల్గొన్నా రంటారా ?

స: జె. పి. ఉద్యమంపట్ల బీహారులో సామాన్య మానవునికి సానుభూతి ఉన్నదన్నాను కదా! బీహారులో అవినీతికి అంతగా పాల్పడ్డ ఏదైనా దిగజారిన ప్రభుత్వం ఏర్పడ్డదంటే - అది గఫూర్ మంత్రివర్గం అని చెప్పాలి. ప్రజలు అవినీతితో, కాంగ్రెసు ప్రభుత్వంతో విసిగిపోయినారు. స్వయంసేవకులు కూడా సామాన్యులే కనుక వారికి జె. పి. ఉద్యమంపట్ల సానుభూతి ఏర్పడ్డది. ఆ ఉద్యమంలో జనసంఘం, విద్యార్థి పరిషత్ వగైరాలు సంఘర్ష సమితిలో భాగస్వాములు. కనుక సంఘం కూడా జె. పి. ఉద్యమంలో క్రియాశీల పాత్రను నిర్వహిస్తున్నదని ఇందిరా గాంధీ భావించింది.

ప్ర: ఎమర్జెన్సీ విధించిన వెంటనే సంఘాన్ని నిషేధించక పోవడానికి కారణ మేమిటి ?

స: చెప్పడం కష్టం. ముందు ముఖ్యులందరినీ అరెస్టు చేద్దాం- రాజకీయ పార్టీలను నిషేధించకుండా ముఖ్యులందరినీ అరెస్టు చేసినట్లు- అరెస్టు చేసి, సంఘాన్ని నిషేధించకుండా వేచి చూద్దా మనుకున్నది కాబోలు. సరసంఘచాలక్ గారిని మరి కొందరు కార్యకర్తలను దొరికినంత మట్టుకు వెంటనే నిర్బంధంలోకి తీసుకున్నారు కదా !

సంఘ నాయకులను నిర్బంధిస్తే రియాక్షను వస్తుంది - వస్తే అణచడానికి ఒక నెపం దొరుకుతుందని కూడా అనుకొని ఉండవచ్చు. వాళ్ళు చేసిన ప్రచారపు తతంగం కూడా అలాగే సాగింది. కార్యాలయాల్లో మారణాయుధాలు దొరికాయని దుష్ప్రచారం జరిగింది కదా! అలాంటి దుష్ప్రచారానికి ఇదే కారణం కావచ్చు. కాని స్వయంసేవకులు నిగ్రహానికి అలవడ్డవాళ్ళు. నిర్ణయాలను తు. చ. తప్పకుండా పాటిస్తారు. అందుకనే నిషేధం విధించిన లగాయతు ఎమర్జెన్సీ తొలగిపోయేవరకు స్వయంసేవకులకు సరియైన మార్గదర్శనమే లభించింది. అల్లరి చిల్లరి హింసా, దౌర్జన్యంవల్ల దేశంలో మార్పు రాదు - అని మనం స్పష్టంగా చెప్పుతుండే వాళ్ళం. స్వయంసేవకులు కూడా సూచనలననుసరించి, చాలా నిగ్రహంతో పనిచేశారు. తాత్కాలిక ఉద్రేకానికి లోనై కాని, రోషం పుట్టికాని ఒక్క పొరపాటు చర్యనైనా స్వయంసేవకులు చేయలేదు.

ప్ర: ఇందిరా గాంధీ 1975 జులై 22న లోక్‌సభలో ప్రసంగిస్తూ "ప్రజలు ఎమర్జెన్సీని పూర్తిగా స్వాగతించారు" అన్నది. ఇది నిజమా?

స: అప్పుడు పత్రికలన్నిటిమీద సెన్సారు ఉన్నది. అలాంటప్పుడు ఆమె ఈ విధంగా భావించడానికి ఆధార మేమిటో చెప్పడం చాలా కష్టం. మా కందిన రిపోర్టు ఏమంటే, ప్రభుత్వపు ఏజన్సీలు మొట్టమొదట సరియైన రిపోర్టులు సక్రమంగా ఆమెకు అందీయడానికి ప్రయత్నించాయి. కాని ఇలాంటి రిపోర్టులు వస్తే ఇందిరాజీ ఇష్టపడరని అప్రసన్నత ఏర్పడుతుందని వాళ్ళకు చెప్పారు. అప్పటినుండి ఆమెకు ఇష్టం కలిగే విధంగా రిపోర్టులు పంపడం ప్రారంభమైంది.

ప్ర : 'అత్యవసర పరిస్థితి' కాలంలో ఆర్. యస్. యస్. పాత్ర (Performance) మీ అంచనా ప్రకారం తృప్తికరమని భావిస్తున్నారా ?

స : అలా అని ఖచ్చితంగా చెప్పలేం. తృప్తి పూర్తిగా కలుగక పోయినా, నాడు దేశంలో వ్యాపించిన వాతావరణాన్ని - భయం ఆవరించిన స్థితిని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే, ఆర్. యస్. యస్. ప్రమాదకరమైన, ఎన్నో కష్టాలకు కారణమైన కార్యక్రమాన్ని నిర్వహించిందని చెప్పక తప్పదు. ఒక సంస్థగా - సంఘటనగా - ఏ సంస్థ ఐనా అత్యుత్తమంగా సంఘర్షలో పాల్గొని, తన పూర్తి శక్తిని, వినియోగించి ఉంటే అది ఆర్. యస్. యస్. అని మాత్రం చెప్పక తప్పదు.



ఆంధ్రప్రదేశ్‌లోని
సత్యాగ్రహ కేం
అదిలాబాద్
కరీంనగర్
నిజాంబాద్
మెదక్
వరంగల్
ఖమ్మం
హై॥
నల్గొండ
కృష్ణా
ప.గో
తూ.గో
విశాఖ
గుంటూరు
మహబూబ్‌నగర్
కర్నూలు
ప్రకాశం
అనంతపురం
కడప
నెల్లూరు
చిత్తూరు

# "తొలి గా"

"నిరంతర జాగరణే స్వాతంత్ర్యానికి రక్ష" అని అంటారు. దీనికి నిదర్శనంగా గడచిన రెండేళ్ళ భారత చరిత్ర ప్రపంచ చరిత్రలో నిలిచిపోతుంది.

ప్రజాస్వామ్య విధానాన్నే ఆయుధంగా ఉపయోగించుకొని, ప్రజాస్వామ్య వ్యవస్థను హత్య చేయడానికి ప్రయత్నించాడు జర్మన్ నియంత హిట్లరు. అతని అడుగుజాడల్లో ఇందిరాగాంధీ ప్రారంభించిన ఎత్తుగడలను భారతప్రజ ఎదిరించింది. అదీ అహింసాత్మకంగా ఎదిరించి, చరిత్ర పునరావృతం కావడానికి వీలులేనంత గొప్పగా వమ్ము చేసింది. ప్రపంచ ప్రజాస్వామ్యాలకే కాక, ఇనుప తెరల మరుగున, నియంతల ఉక్కు పాదాలక్రింద నలుగుతూ, మూల్గుతూ, నిరాశతో అలమటిస్తున్న జాతులకు కూడా ఒక దివ్యమైన హెచ్చరికను, వ్యూహాన్ని ఈ ప్రజా పోరాటం కానుకగా ఇచ్చింది. అహింసాయుత పోరాటానికి ఈ గత రెండేళ్ళ చరిత్ర ఒక క్రొత్త అధ్యాయాన్ని, ఒక క్రొత్త మలుపునూ కూడా ఇచ్చింది.

ఈ పోరాటపు చరిత్రను – దీని తీరు తెన్నులను గురించి పరిశీలించే టప్పుడు కొన్ని వాస్తవాలను స్మరించుకోవాలి.

"కొద్దిమంది మనవాళ్ళు ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకున్నంత మాత్రాన స్వరాజ్యం లభించినట్లు కాదు. అధికార దుర్వినియోగం జరిగినప్పుడు ఎదిరించగల శక్తి సామర్థ్యాలను ప్రజలందరూ పొందగలిగి నప్పుడే అసలైన స్వరాజ్యం లభించినట్లు" అని గాంధీజీ అన్నారు.

## ఆంధ్రప్రదేశ్‌లో 14-11-1975 నుండి 26-1-1976

1. శ్రీకాకుళం
2. విజయనగరం
3. విశాఖపట్నం
4. గవరపాలెం
5. చోడవరం
6. అనకాపల్లి
7. కాకినాడ
8. రాజమండ్రి
9. మండపేట
10. అమలాపురం
11. నరసాపూర్
12. భీమవరం
13. తణుకు
14. నిడదవోలు
15. కొవ్వూరు
16. జంగారెడ్డిగూడెం
17. ఏలూరు
18. గుడివాడ
19. మచిలీపట్నం
20. విజయవాడ
21. విస్సన్నపేట
22. జగ్గయ్యపేట
23. గురజాల
24. వినుకొండ
25. నరసారావుపేట
26. సత్తెనపల్లి
27. మంగళగిరి
28. గుంటూరు
29. తెనాలి
30. పొన్నూరు
31. బాపట్ల
32. ఒంగోలు
33. కందుకూరు
34. గిద్దలూరు
35. కావలి
36. కోవూరు
37. నెల్లూరు
38. కోట
39 కాళహస్తి
40. నాగలాపురం
41. తిరుపతి
42. రాయచోటి
43. కడప
44. ప్రొద్దుటూరు
45. హిందుపురం
46. పెనుకొండ
47. అనంతపూర్
48. గుంతకల్
49. పత్తికొండ
50. ఆదోని
51. కర్నూలు
52. నందికొట్కూర్
53. ఆత్మకూరు
54. గద్వాల్
55. ఆత్మకూర్
56. ఊట్కూర్
57. నారాయణపేట
58. మహబూబ్‌నగర్
59. వనపర్తి
60. నాగర్ కర్నూల్
61. కల్వకుర్తి
62. మిర్యాలగూడ
63. నల్గొండ

## 26-1-1976 వరకు జరిగిన సత్యాగ్రహముల కేంద్రములు

43. కడప
44. ప్రొద్దుటూరు
45. హిందుపురం
46. పెనుకొండ
47. అనంతపూర్
48. గుంతకల్
49. పత్తికొండ
50. ఆదోని
51. కర్నూలు
52. నందికొట్కూర్
53. ఆత్మకూరు
54. గద్వాల్
55. ఆత్మకూర్
56. ఊట్కూర్
57. నారాయణపేట
58. మహబూబ్‌నగర్
59. వనపర్తి
60. నాగర్ కర్నూల్
61. కల్వకుర్తి
62. మిర్యాలగూడ
63. నల్గొండ
64. భువనగిరి
65. సూర్యాపేట
66. కోదాడ
67. గరిడేపల్లి
68. మధిర
69. ఖమ్మం
70. కొత్తగూడెం
71. ఇల్లెందు
72. మహబూబాబాద్
73. నరసంపేట
74. ములుగు
75. పరకాల
76. వరంగల్
77. ఘనపూర్
78. హనుమకొండ
79. హుజూరాబాద్
80. కరీంనగర్
81. పెద్దపల్లి
82. జగిత్యాల్
83. కోరట్ల
84. మెట్‌పల్లి
85. మంచిర్యాల
86. కాగజ్‌నగర్
87. ఆసిఫాబాద్
88. ఆదిలాబాద్
89. భైంసా
90. నిర్మల్
91. ఆర్మూర్
92. నిజామాబాద్
93. బోధన్
94. శక్కర్‌నగర్
95. మెదక్
96. సిద్ధిపేట
97. సంగారెడ్డి
98. కంది
99. శంకర్‌పల్లి
100. వికారాబాద్
101. తాండూర్
102. పరిగి
103. చేవెళ్ళ
104. హైదరాబాద్.

1978 సంక్రాంతి

ముఖచిత్రం : గోపి

ముద్రణ :
శివాజీ ప్రెస్
గంజ్ బజార్, సికింద్రాబాదు.

ముఖచిత్ర ముద్రణ :
భారత ముద్రణాలయం
రామమందిరం వీధి, విజయవాడ - 2.

మూల్యం : రూ. 11-00.

ప్రతులకు :
'నవభారతి'
29-2-7, బకింగ్‌హాంపేట,
విజయవాడ - 520 002.

ప్రచురణ :
'నవభారతి'
3-4-852, బరకత్‌పురా,
హైదరాబాద్ - 500 027.

# మా మాట

సమగ్ర ప్రజా చైతన్యం - ఏ జాతి ఐనా సవ్యంగా నడవటానికి అత్యవసరం. ప్రజాస్వామ్యంలాంటి ఉదాత్త భావనలను, అలాంటి ఉన్నత జీవన మూల్యాలను కలకాలం నిలుపవలసిన బాధ్యత ప్రభువులది కాదు - ప్రజలదే. వారిలో దానికి కావలసిన తయారీ లేకుంటే - కొద్దిమంది వ్యక్తుల స్వార్థ యాప్సితాలకు దేశం బలై పోతుంది.

అదృష్టవశాత్తు నేటి మన దేశీయులు ఇలాంటిదే ఐన నియంతృత్వశక్తిని-తల ఎత్తనీయనటువంటి సత్తా చూపకపోయినా, ఎదురించి పోరాడి - పడగొట్టగల స్థాయికి మాత్రం ఎదిగారు. నియంతృత్వానికి వ్యతిరేకంగా ప్రజ పోరాటం జరిపి విజయం సాధించింది.

ఆ జనవిజయపు పూర్వాపరాలను సమీక్షింపచేస్తూ మొన్నటి ద్వితీయ సంగ్రామ చరిత్రను మీ ముందుంచే ప్రయత్నమే ఈ పుస్తకం. ప్రజాస్వామ్యంపట్ల, రాజకీయాలపట్ల, దేశంపట్ల సరియైన అవగాహన కల్గించేందుకు నవభారతి చేసిన కృషి ఇది.

ఈ పుస్తకాన్ని రచించిన శ్రీ భండారు సదాశివరావుగారికి, ముఖచిత్రం వేసి యిచ్చిన శ్రీ గోపిగారికి - ఇంకా ప్రచురణలో వివిధ దశలలో సహకరించినవారికి - అందరికీ కృతజ్ఞతాభివందనలు.

జన జాగరణ చేసేందుకు సంకల్పించిన సంస్థ నవభారతి. విశిష్టమైన సాహిత్య ప్రచురణకు కంకణం కట్టుకొంది. మా ఈ ప్రయత్నానికి చేయూత నిస్తారని విశ్వసిస్తూ...

మీ

'న వ భా ర తి'